# మహాతపస్వి

## (భగవాన్ శ్రీ వాసిష్ఠ గణపతిముని చరిత్ర)

రచన

మైత్రావరుణ

ప్రకాశకులు :

**అ॥ విమలాదేవి**

వాసిష్ఠ అధ్యయన కేంద్రము

12-8-4, రాజేశ్వరీ నిలయము పూల్‌బాగ్ రోడ్

విజయనగరము - **535 002.**

# మ హా త ప స్వి

# MAHA TAPASWI

ప్రథమ ముద్రణ
నవంబరు, 1999.

ప్రతులు : వెయ్యి.

వెల : **Rs. 80-00**

ప్రతులకు :

హిమాంసు బుక్ డిపో
ఎ. జి. రోడ్
విజయనగరము

హిమాంసు బుక్ డిపో
ఆశీళ్ళ మెట్ట జంక్షన్
*(Near R. T. C. Complex)*
విశాఖపట్నం - 3.

**అ॥ విమలాదేవి**
12-8-4 రాజేశ్వరీ నిలయము
పూల్‌బాగ్ రోడ్
విజయనగరము - **535 002.**

ముద్రణ :
శ్రీ శారదా పవర్ ప్రింటింగ్ వర్క్స్,
భట్నవిల్లి, చిన్నవీధి,
[illegible] మండలం, తూ॥గో॥జిల్లా.

ఈ గ్రంధము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది.



అంకితం

శ్రీ.శ్రీ.శ్రీ పద్మావతీ వెంకటేశ్వరుల చరణ సన్నిధికి

ఓం శ్రీ రమణ గణపతయే నమః

"వ్యాకరణ విద్యాప్రవీణ" "సాహిత్య విద్యాప్రవీణ," "భాషా ప్రవీణ",
"వ్యాకరణాలంకారచక్రవర్తి", "సాహిత్య విశారద"

**ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మ,**
ఎమ్. ఎ; పి.ఒ.ఎల్.
(విశ్రాంతి సంస్కృతాచార్యుడు, ఆంధ్ర విశ్వకళాపరిషత్)

# అభినందనము – ఆశీర్వాదము

"లోకే మహాంతో విలసంతి సంతః వసంతవల్లోకహితం చరంతః" అని ఆది శంకరులు అన్నారు. ఋతువులలో వసంతం ఆనందదాయకం – హితకరం. అందువల్లనే "ఋతూనాం కుసుమాకరం"–(ఋతువుల్లో వసంతం నేను) అని శ్రీకృష్ణ పరమాత్మ తన వైభవాన్ని చాటి చెప్పేరు. వసంతం వలె లోకహితాన్నే జీవితపరమార్థంగా ఎంచుకుని తమ మనోవాక్కాయములతో సదా లోకులకు ఆనందాన్ని పంచిఇచ్చే మహానుభావులు దివ్యజ్యోతులై వెలుగుతూ ఉంటారు– అని, శ్రీ శంకరుల తాత్పర్యం. శ్రీరామకృష్ణాద్యవతారముల వలెనే మహానుభావుల అవతారాలుకూడా భగవత్సంకల్పాలే– ధర్మవ్యతిక్రమాన్ని సర్దుబాటు చేసి, సమాజ శ్రేయస్సుకోసం ఆవిర్భవించునవే!

అటువంటి మహానుభావుల్లో శ్రీ నాయన ఒకరు. తలిదండ్రులు చేసిన "నామకరణం" గణపతి. శాస్త్రాలను ఆపోశనం పట్టినందువల్ల ఆయన గణపతిశాస్త్రి అయ్యేరు. తపస్సువల్ల "ముని" కాగలిగేరు. గోత్రాన్ని బట్టి "వాసిష్ఠుడుగా వన్నెకెక్కినారు. ఉద్దండకవి పండితులు సమర్పించిన "కావ్యకంఠః" అనే అసామాన్య

నైన బిరుదం వల్ల ఆయనే "కావ్యకంఠులు"గా ప్రఖ్యాతు లయ్యేరు. చిట్టచివరకు కరుణామయులైన అరుణాచలయోగి యొక్క అమందానందోత్సాహ పరిపూర్ణమైన "నాయనా!" అన్న పిలుపు కారణంగా ఆ మహానుభావుడే "నాయన"గా బంధువుల - భక్తుల - భవ్యమిత్రుల - భాగవతుల వాక్కులలో, నాటికి నేటికిన్ని నాట్యమాడుతున్నారు. ఇంతకూ వారియింటిపేరు "అయల సోమ యాజుల" వారు. కాగా "నాయన" అంటే "అయల సోమయాజుల గణపతిశాస్త్రి" గారని పర్యవసానం. "భవతు"

శ్రీ గణపతిశాస్త్రి వామదేవుని వంటి మహర్షి, వాల్మీకి వంటి మహాసూత్రకర్త, ఆదిశంకరుల వంటి ఆత్మవేది, విశ్వామిత్రుని వంటి మహాతపస్వి. ప్రకృతచరితానికి ఆయనే కథానాయకుడు. ఈరచనకు ఈ శీర్షికను ఉంచడం ఆయన కీర్తికి "జయపతాకం" అనవచ్చు. అన్నివిధాల అని సార్థకం: నాయన పుట్టుక దివ్యం- వాణి దివ్యం - చేతలు దివ్యం - అనుభూతి దివ్యం - ఆచరణం దివ్యం - వారి సర్వస్వమున్ను దివ్యమే: అయినా వారి జీవిత సారమంతా తపస్సే! మహా తపస్సే! అందువల్ల వారే మహా తపస్వి! ఈ పేరుతోనే ఈ కృతిలో నాయనగారి ముఖ్యచరిత మంతా సాగింది. మహాత్ముల దివ్యభవ్య చరితములు అనంతంగా వెల్లి విరుస్తాయి. అన్నింటిని కూడగట్టడం అసాధ్యమే: అయినా ఔచిత్యాన్ని అనుసరించి, యథాసంభవంగాను, యథాశక్తిగాను, యథాన్యాయం గాను, యథాకాలం గాను, యథారసం గాను గ్రంథకర్త ఇందులో విషయాలను వింగడించేరు. అది వారి నైపుణ్యమనే చెప్పక తప్పదు. ఇందులో అక్కడక్కడ నేను మెరుగులు పెట్టేను.

ఎవరీ గ్రంథకర్త ? పైవారేమీ కాదు. సాక్షాత్తుగా నాయన గారి మనుమడు–పౌత్రుడు–శ్రీ మహాదేవశాస్త్రిగారి కుమారుడు, శ్రీ అయల సోమయాజుల వెంకటరమణగారు (శ్రీ ఎ. వి. రమణ). వీరు వృత్తిని బట్టి ప్రభుత్వోద్యోగి–ప్రవృత్తిని బట్టి శ్రీ రమణ నాయనల అంతరంగ ప్రవృత్తి గలవారు. సంతతానుధ్యానం వలన, నిరతాభ్యాసంవల్లను తాతగారి తత్త్వాన్ని, "కరతలామలకం"గా చేసుకున్నవారు. "తాతగారి వైభవాన్ని మనుమడు గ్రంథ రూపంలో విశాలంగా సంతరించాలన్నది"కూడా భగవత్సంకల్పం అయి ఉండాలి! లేక తాతగారి అనుగ్రహం అయిఉండాలి. ఇదే విచిత్రం ! లేకపోతే ఈ విధంగా క్షుణ్ణంగా రచనను కొనసాగించడం చాలా కష్టం. ఎందుచేతనంటే శ్రీ రమణగారికి సంస్కృతాంధ్రాలలో పాండిత్యం అంతగా లేదు. అంతంతమాత్రమే! అయినా సంస్కారం గొప్పగా ఉంది. చక్కటి శైలి వరించింది. శిష్టవ్యావహారిక భాషలో అన్ని అంశాలను ఏర్చి, కూర్చి, చక్కని కథాపుష్పమాలికను తయారు చేసి తాతగారి కీర్తికాయ కంఠానికి ఉపహారంగా సమర్పించేరు. ధన్యులయినారు ! "అస్తు"

శ్రీ ఎ. వి. రమణగారు నాకిదివరకు శ్రుతపరిచితులు. ఈ మధ్యనే సాక్షాత్ పరిచితులు. ఆంతరంగిక పరిచితులు కూడా అయినారు. నాయన తత్త్వాన్ని అధ్యయనం చేసి, ఆరాధించేవారిలో నేనొకడను కావడం ముఖ్యకారణం. వీరు ఏ ప్రాంతంలో ఉన్నా, ఏ ఊరిలో ఉన్నా శ్రీ రమణనాయనల వైభవాన్ని బహు భంగులలో ప్రచారం చేయడానికి బద్ధకంకణులై ఎనలేని సేవను చేస్తున్నారు. ఇది వీరి శ్రద్ధాభక్తులకు నిదర్శనం. ఆంధ్రదేశంలోను, ఇతర ప్రాంతాలలోను, "శ్రీ రమణ సత్సంగం" అన్నది వీరి వ్యవస్థయే. ఈవిధంగా చేస్తూ శ్రీ రమణ నాయనల తపఃఫలంగా వీరు ప్రకాశిస్తున్నారు. వీరి కృషి బహుధా ప్రశంసనీయం.

ఇదివరకే ముచ్చటించేను గదా ! ఈ గ్రంథంలో చరిత్రాంశాలు ఎన్నో ఉన్నా శ్రీనాయనగారి మహాతపోవిలాసం ముఖ్యంగా చోటు చేసుకుంది. "నాఽస్తి అసాధ్యం నామ తపసామ్॥ (తపస్సుచే సాధ్యం కానిది లేదు-ఉండదు) అన్నది యథార్థమని, ప్రత్యక్షోదాహరణ పూర్వకంగా ఈ రచన నిరూపించింది. శ్రద్ధాభక్తులున్నవారిని ఇది ప్రోత్సహిస్తుంది - ఉత్తేజ పరుస్తుంది-సన్మార్గం చూపిస్తుంది-శ్రేయస్సును సంపాదిస్తుంది.

కాగా "మహాతపస్వి" కర్తను, శ్రీ ఎ. వి. రమణగారిని మనసార అభినందించి, "తమ తాతగారి దివ్యవైభవాన్ని ఆబాలగోపాలానికి అందించే శక్తియుక్తులను భగవానుడు వీరికి ప్రసాదించుగాక !" అని సర్వదా సర్వథా ఆశంసిస్తూ ఉంటాను.

"శుభం భవతు"

సీతమ్మ ధార,
విశాఖపట్నం-13.

అప్పల్ల సోమేశ్వరశర్మ,
11-12-1998.

ఆచార్య వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి,
ఎం.ఏ.పిహెచ్.డి. (తెలుగు), ఎం.ఏ.పిహెచ్.డి. (సంస్కృతం)
తెలుగు శాఖ ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.
"శారదా పీఠం" 46-15-35, మండావారి పేట.
విశాఖపట్నం - 530 036.
ఫోన్ : 541003.

శ్రీ శివాయ గురవే నమః

# -: నీరాజనం :-

"స జాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్" అని ఆర్యోక్తి. ఎవని జన్మ చేత తన వంశానికి ఔన్నత్యం కల్గుతుందో అతడు జన్మించినట్లు - అని భావం. ఆతని జన్మ సార్థకం అని తాత్పర్యం. శ్రీ గణపతిముని జన్మము ఆవిధంగా సార్థకమైనది.

శ్రీ అయల సోమయాజుల నృసింహశాస్త్రిగారు శ్రీ గణపతి ముని పితృపాదులు. శ్రీమతి నరసమాంబ మాతృదేవత. విజయ నగరం జిల్లాకు చెందిన కలువరాయి అనే గ్రామం గణపతిముని తాత ముత్తాతల స్వస్థలం.

బహుధాన్య సంవత్సర కార్తిక బహుళ భానువాసరం (అంటే 17-11-1887వ తేదీ) సూర్యోదయాది 20 ఘడియలకు కుంభ లగ్నంలో మఖానక్షత్ర ప్రథమ చరణంలో విజయనగరానికి సమీపంగా ఉండే లోగిస అనే గ్రామంలో మాతామహుల యింట శ్రీ గణపతిముని జన్మించేరు. జన్మించారు అనడంకంటె అవతరించారు అనడం సముచితం. అనుపమమైన తపశ్శక్తి, అనల్పమైన మేధా సంపత్తి, అపూర్వమైన సాహిత్య సంపద-అనేవి గణపతిముని అవ తార పురుషుడు అనే విషయాన్ని విశదపరుస్తాయి. గణపతిగా

కొందరికి ఆయన దర్శనం ఇవ్వడమే గాకుండా గణపతి అవతారంగా పెద్దలచే పరిగణింపబడినాడు.

శ్రీ నృసింహశాస్త్రిగారి 'నవాక్షర గణపతి' జపదీక్షా ఫలంగాను, శ్రీమతి నరసమాంబ పొందిన శ్రీకాకుళం దగ్గర ఉన్న అరసవల్లిలోని సూర్య దేవత అనుగ్రహ ఫలంగాను శ్రీ గణపతిముని జన్మించారు, కాబట్టి వారికి సూర్యగణపతి అని మొట్టమొదట నామకరణం చేయబడింది.

సూర్యగణపతి జీవితసర్వస్వంలో ఎక్కువభాగం వివిధక్షేత్రాలలోతపస్సు చేసి మంత్రసిద్ధి జపసిద్ధిపొందడంలోనేగడిచిపోయింది. 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' అనే శ్రుతివాక్యానికి శ్రీ గణపతిముని జీవితం లక్ష్యమనదగ్గది. మునిగా ఎక్కువకాలం గడపడంచేత గణపతిముని అనే నామకరణం ఏర్పడింది. లోక వ్యవహార ప్రసిద్ధి కూడా గణపతిముని అనే.

గణపతిముని అరుణాచలం వెళ్ళి రమణమహర్షిని దర్శించిన సందర్భములో అంటే ప్రప్రథమ దర్శన సమయంలో రమణ మహర్షి గణపతిమునిని 'నాయన' అని సంబోధించారట. అప్పటి నుండి గణపతిమునికి నాయన అనే పేరుకూడా స్థిరపడింది. 'నాయన' అనే పేరుతోనే వారి జీవిత చరిత్ర ఇతఃపూర్వం కూడా రచింపబడింది. అరుణాచలంలో తపస్సు చేసుకొంటున్న రమణ మహర్షిని లోకానికి పరిచయంచేసి వారిమాహాత్మ్యాన్ని చాటిచెప్పిన మహాపురుషుడు గణపతిముని ని జగద్విదితం.

గణపతిముని జీవిత సర్వస్వంలో వారు నవద్వీపంలో విద్వజ్జన ప్రశంసలందుకొని విద్వద్విజయాన్ని సాధించిన ఘట్టం సువర్ణాక్షరాలతో లిఖింపదగ్గది. అది ఆంధ్రదేశం సర్వమూ

గర్వింపదగ్గది. వివిధ శాస్త్రాలలో నిష్ణాతులైన మహామహుల నెదుర్కొని తమ ప్రౌఢకవితాప్రదర్శనచేత గణపతిముని జగజ్జేయమానంగా కీర్తిపతాకని ఎగురవేసిన ఆ సన్నివేశం నిత్యమూ స్మరింపదగ్గది. ఆ విద్వత్సభలో శ్రీ గణపతిముని సద్యఃస్ఫురణతో అపూర్వకల్పనాసనాథంగా సమస్యలని పూరించినవిధం సంస్కృత సాహిత్యలోకంలో చిరస్థాయిగా నిలుస్తుంది. ముచ్చటగా మూడు సమస్యలని ఎలా వారు పూరించారో పరిశీలిద్దాం.

(i) "స్తనవస్త్రం పరిత్యజ్య వధూః శ్వశురమిచ్ఛతి" అనేది ఒక సమస్య. పయ్యెదని విడిచిపెట్టి కోడలు మామగారిని కోరుతోంది-అని భావం. ఈ సమస్యని మధురభావ బంధురంగా ఔచిత్య పరిపుష్టంగా గణపతిముని ఇలా ఆశువుగా పూరించారు.

హిడింబా భీమదయితా నిదాఘే ఘర్మపీడితా
స్తన వస్త్రం పరిత్యజ్య వధూః శ్వశురమిచ్ఛతి ॥

భీముని భార్య అయిన హిడింబ వేసవిని తాపంచే పీడితురాలై పయ్యెదను విడిచిపెట్టి మామగారైన వాయుదేవుని అభిలషిస్తోంది అని భావం. వేసవిలో తాపానికి తట్టుకోలేక స్త్రీలు పమిటను తొలగించి గాలికై ఏదురుచూడడం లోకసహజం. ఈ విషయాన్ని ఆధారంగా చేసుకొని ఔచితీశోభితంగా సమస్యను గణపతిముని పూరించడం సర్వజన సమభినంద్యం.

(ii) "గౌరీ పతివక్త్రం న పశ్యతి" అనేది మరొక సమస్య. పార్వతి పతి ముఖాన్ని చూడదు-అని భావం దానికి గణపతిముని పూరణం ఇలా ఉంది.

చతుర్థ్యాం భాద్రశుక్లస్య చంద్రదర్శన శంకయా
వత్సరస్యైకదా గౌరీ పతివక్త్రం న పశ్యతి ॥

భాద్రపద శుక్ల చతుర్థినాడు అంటే వినాయక చవితినాడు చంద్రుని చూడవలసి వస్తుందనే భయంతో సంవత్సరానికి ఒక దినం పార్వతి భర్తృముఖం చూడదు అని భావం. సమర్థనం హృద్యంగా ఉంది.

(iii) "పిపీలికా చుంబతి చంద్రమండలమ్"–అన్నది మరొక సమస్య. దీన్ని గణపతిముని ఈ విధంగా పూరించారు.

సతీవియోగేన విషణ్ణ చేతసః
ప్రభోః శయానస్య హిమాలయేగిరౌ
శివస్య చూడాకలితం సుధాశయా
పిపీలికా చుంబతి చంద్రమండలమ్ ॥

సతిదేవి వియోగంచేత ఖిన్నమనస్కుడైన పరమశివుడు హిమాలయ పర్వతమందు పవ్వళింపగా ఆతని జటామండలంలో అలంకారంగా ఉండే చంద్రమండలాన్ని అమృతమందలి ఆశచే ఒక చీమ చుంబించింది అని భావం.

ఈ విధంగా నవద్వీపంలో గణపతిముని అపూర్వ కవితా వైభవాన్ని ప్రదర్శించి పండితుల ప్రశంసలందుకొని పండిత సుత్రాముడైన అంబికాదత్తునిచే నూనూగు మీసాల నూత్న యౌవనంలో "కావ్యకంఠ" అనే బిరుదాన్ని పొందారు. అప్పటినుండి "కావ్యకంఠ గణపతిముని" లోకవ్యవహారంలో ప్రసిద్ధిని సంతరించుకొన్నారు.

వివిధ దివ్యక్షేత్రాలలో తపస్సిద్ధి పొందిన కావ్యకంఠ గణపతిముని కొన్ని వేదమంత్రాలని దర్శించిన పుణ్యపురుషుడు ప్రాచీన మంత్రద్రష్టలతో సమస్థానాన్ని అలంకరించిన మహ

త్ముడు. ఉమాసహస్రం, విశ్వమీమాంస, రేణుకా గీతం వంటి గ్రంథాలని ఎన్నింటినో సంస్కృతంలో రచించిన మహాకవి అతడు. ప్రౌఢంగా గంభీరంగా మహర్షి ప్రోక్తంగా కావ్యరచన చేసి విద్వత్ప్రశంసలందు కొన్న అకవితల్లజుడు భారత దేశానికి స్వాతంత్ర్యం రావాలని పరదేశీయుల పాలననుండి ముక్తి లభించాలని తమ తపస్సులో కొంత భాగాన్ని ధారపోసిన దేశభక్తి దురంధరుడు.

శ్రీ గణపతిముని పుట్టినప్పటినుండి అవతార పరిసమాప్తి పర్యంతం ఎన్నెన్నో అద్భుతాలు ప్రదర్శిస్తునే ఉండేవారు. వారి జీవితంలో ప్రతి ఘట్టమూ అద్భుతావహంగానే ఉంటుంది. వారి దేహం నుండి జీవుడు ఊర్ధ్వమార్గంగా పయనిస్తూ కపాలభేదం చేసి ఉత్క్రమించడం అత్యపూర్వం, మహాతపస్వి, మహాయోగీశ్వరుడు- వంటి వారికి మాత్రమే ఆవిధంగా జీవోత్క్రమణ సాధ్యమౌతుంది. ఇటువంటి మహాపురుషుడు "నభూతో నభవిష్యతి" అనడం అత్యుక్తి కాజాలదు.

'పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి' అని శాస్త్రోక్తి. కావ్యకంఠగణపతిముని పుణ్యశ్లోకుడు. అతని చరిత్ర నిత్యము సంస్మరింపదగ్గది. ఆ గణపతి మునీంద్రుల పౌత్రుడు శ్రీ అయలసోమయాజుల వెంకటరమణగారు తాతగారి అంశతో జన్మించినవారు. ఆధ్యాత్మికంగా జీవితాన్ని సార్థకం చేసుకొంటూ 'మైత్రావరుణ' అనే మారుపేరుతో గణపతిముని చరిత్రను రచించించడం అస్మదాదులకు పరమహర్షదాయకం. తమ గ్రంథానికి వారు "మహాతపస్వి" అని నామకరణం చేయడం సార్థకం. నిత్యమూ తపస్సమాధినిష్ఠుడైన గణపతిమునియొక్క దివ్యచరిత్రకి 'తపస్వి' అనే పేరు అత్యంత సముచితం.

ఈ గ్రంథం మూడు భాగాలలో రచింపబడింది. గణపతిముని గ్రంథాలని అన్నింటిని సమగ్రంగా అధ్యయనం చేసిన శ్రీ రమణ గారు గణపతిముని రచనలలోని కొన్ని భాగాలని ఉదాహరిస్తూ కథని వివరిసూ సమన్వయిస్తూ ఒక నవలని రచిస్తున్నట్లు ఈ గ్రంథాన్ని రచించడం శ్రీ రమణగారి ప్రత్యేకత. "నాఽమూలం లిఖ్యతే కించిత్ నాఽనపేక్షిత ముచ్యతే"–అన్న మల్లినాథ సూరి వాక్యాన్ని ఈ గ్రంథం తలపింపజేస్తోంది. భాషాభేషజాన్ని ప్రదర్శించక విషయాన్ని సరళంగా మృదు మధురమైన భాషలో సర్వజన సుగమంగా వివరిస్తూ ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ రమణగారు కృతకృత్యులు. 'తపస్వి' అనే ఈ గ్రంథం పాఠకుని ఉత్కంఠని పెంచుతూ తుదిదాక చదివిస్తుందనడం అతిశయోక్తి గాదు. ఋషి కల్పుడైన ఒక మహాపురుషుని అపూర్వ చరిత్రని లోకానికందించి శ్రీ వేంకటరమణగారు అటు పితౄణాన్నీ ఇటు ఋషి ఋణాన్నీ తీర్చుకొన్నారని తలుస్తాను. పాఠకలోకం గ్రంథాన్ని చదివి తరించును గాక !

శుభం భూయాత్.

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి,
16-4-1999.

ఓం గం గణపతయేనమః

ఓం శ్రీ మాత్రే నమః

ఓం శ్రీ గురుభ్యో నమః

# అభినందన చందనమ్

భగవంతుని సంకల్పమే సృష్టికి ఆది. కల్పాంతమందు సృష్టింపబడినదంతయు లయమగుటయే అంతము. అట్టి ఆద్యంతములకు అతీతుడై వీటిలో అంతర్యామిగా నున్నవాడు పరమేశ్వరుడు. ఈ సృష్టికి అంతర్యామికి సంబంధమేమిటని భావించి, శోధించి, ధ్యానించి, పరమ సత్యమును దర్శించడమే – తపస్సు. ఆ తపస్సాధకులు మహా తపోధనులు.

"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్"

అను గీతాచార్య ప్రమాణ వచనానుసారముగా, లోకోద్ధరణ కొరకు కొందరు మహనీయులు ప్రతియుగంలోను ప్రాదుర్భవిస్తూ ఉంటారు. ఆ కోవకు చెందిన దైవాంశ సంభూతులలో 'నాయన' (భగవాన్ కావ్యకంఠ గణపతిముని) గారు ఒకరు. అట్టి మహిమాన్వితులు సామాన్య మానవులుగా సంభవించినప్పటికి, వారి జన్మ కర్మ అసామాన్యంగానే ఉంటుంది. అటువంటి వారి స్వరూపమును స్వభావమును, పరమార్థమును తాము మొదట ఆకళించుకొని, వారి చరిత్రను వింగటించి, జగత్తుకు అందించడానికి కొందరు సత్పురుషులు సంకల్పిస్తారు. ఆ సత్పురుషులలో శ్రీ రమణగారు ఒకరు. వారి లేఖిని నుండి జాలువారిన అద్భుత గ్రంథము "మహాతపస్వి".

మొట్టమొదట "వాశిష్ఠ వైభవమ్", అను పేరుతో నాయన శిష్యులు శ్రీ కపాలీశాస్త్రిగారు నాయన చరిత్రను సంస్కృతంలో

రచించి, లోకానికందించారు. తదుపరి ఆ చరిత్రను ఇంకా విపులీకరించి "నాయన" అను నామంతో నాయన చరిత్రను తెలుగులో రచించి ఆంధ్రావని కందించేరు నాయన ప్రియతమ శిష్యులు, ప్రాతః స్మరణీయులు శ్రీ గుంటూరు లక్ష్మీకాంతంగారు. పిమ్మట నాయన శతజయంత్యుత్సవ సందర్భంగా "గణపతిముని" అను ముఖశీర్షికతో నాయన చరిత్రను రచించారు నాయన ఆశీస్సులందుకున్న పుణ్యపురుషులు సరస్వతిపుత్ర శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారు. తర్వాత "కావ్యకంఠ" అను పేరుతో "కావ్యేషు నాటకం రమ్యమ్" కాబట్టి నాటక రూపంలో నాయన చరిత్రను రమ్యంగా రచించి మనకందించారు బహుముఖ ప్రజ్ఞాశాలి మహాకవి, మంత్రశాస్త్ర కళానిధి, సాహితీ వాచస్పతి డా. శ్రీ ప్రసాదరాయ కులపతిగారు. ఇప్పుడు నాయనగారి పౌత్రులు శ్రీ రమణగారు "మధుర మధురం నవ్యకావ్యం కరోమి" అను రీతిని, స్వమతి వైభవంతో వినూత్న పద్ధతిలో, విలక్షణ రీతిలో "మహితపస్వి" అన్న పేరుతో నాయన చరిత్రను మైత్రావరుణ అను కలంపేరుతో మనకందిస్తున్నారు. ఎందుకు ? 'పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి' కాబట్టి. అంతకుముందు శ్రీ రమణగారి సోదరి శ్రీమతి పప్పు విశాలాక్షిగారు సహజ కవయిత్రి వాసిష్ఠ విజయం అను రమ్యమైన పద్యకావ్యాన్ని రచించి లోకానికందించారు.

శ్రీ రమణగారి రచనలో ఒక విశేషముంది. నాయనగారి కుటుంబ సభ్యులుగా శ్రీ రమణగారికి, ఇతరులకు తెలియని నాయన జీవితరహస్యాలు, అనుభవాలు, అనేక సంఘటనలు శ్రీ మహాదేవ శాస్త్రిగారి నుండి గ్రహించే సదవకాశం కల్గింది. నాయనలో అంకురించిన సాంఘిక దృష్టికి దారితీసిన సంఘటన, నవద్వీప విజయమునకు నాంధి. తారామన్త్రసిద్ధి, భువనేశ్వరీ మధుకటాక్షము, అరుణాచలేశ్వర దర్శనము, శ్రీ మౌనస్వామి రమణ మహర్షుల

దర్శన భాగ్యము, ఉమా సహస్ర మహాకావ్య నిర్మాణము, శ్రీమహాదేవన్‌గారి బాల్యము-లౌల్యము, గజారోహణ ఘట్టము, కదలని రథం కదిలినవైనం, చూతగుహయందు నాయన అహంమూలాన్వేషణలో ఏకాగ్రచిత్తంతో లీనమై ఉండగా అపీతకుచాంబ శ్వేత వర్ణంతో, శ్వేతవస్త్రంతో ముచ్చట గొలిపే ముత్యాల కిరీటంతో, పరిశుద్ధ మానసమును బోలిన పారిజాత సుమహారంతో మందహాసద్యుతితో నాయన ముందు సాక్షాత్కరించిన దృశ్యం, ఛందోదర్శనం, కపాల భేధనసిద్ధి-ఇలా ఎన్నో విషయాలు విశ్లేషించి. అందంగా, మధురస నిష్యందంగా, పఠిత హృదయ సంస్పందంగా ఈ 'మహాతపస్వి' రసవత్తర రచన మనకందించారు మైత్రావరణగారు. అలాగే శ్రీ సూర్యగణపతి మునీంద్రులు ఉదయించేముందు అహర్ముఖంగా వెలుగొందిన శ్రీ నరసింహశాస్త్రి (నాయన తండ్రి) గారి అనుభూతిని అనగా కాశీక్షేత్రములో ఢుంఢి గణపతి దర్శనమును అద్భుతంగా విశదపరిచారు రమణగారు. మధురాతి మధురమైన గణపతి కవితా మాధుర్యానికి అంబయొక్క అమృత శక్తిని నాయన నరసమాంబ స్తన్య దుగ్ధముద్వారా పొందేరని రమణగారు చెప్పిన వైనం రమణీయమ్, అద్భుతమ్, సుందరమ్. ఈవిధంగా అనేక అద్భుత విషయాలు ఆవిష్కరిస్తూ 'మహాతపస్వి' రచన ఆమూలచూడం రసాత్మకంగా సాగింది. ప్రతి శీర్షికకు ముందు సందర్భోచితంగా నాయన రచనలలోని పద్యాలను ఉదహరించడం రచనకొక ఇంద్రధనస్సులాంటి అందాన్ని చేకూర్చింది. ఇలా ఏకోణంలోంచి దర్శించినా "మహాతపస్వి" గ్రంథం రంగు రంగుల రంగవల్లి వలె గోచరిస్తుంది. భాషాసారళ్యం, భావగాంభీర్యం సంతరించుకున్న సారసతరమైన సంకలనం "మహాతపస్వి" గ్రంథము.

ఇట్టి మహోత్కృష్టమైన గ్రంథమును మనకందించిన మైత్రావరుణగారు బహుధా శ్లాఘనీయులు, ఒక మహామనీషి జీవితకథ

వ్రాయడం అసిధారావ్రతం. అందు ప్రశంసనీయంగా కృత కృత్యులై చరితార్థులయారు శ్రీ రమణగారు. శ్రీ రమణగారూ !

"వేధోవిలోచన జ్యోత్స్నా శ్రుతిధమ్మిల్ల మల్లికా ।
దేవతా కాఽపి తే భూయాత్ రసనారంగ నర్తకీ ॥

ఇదే నా అభినందన !

శ్రీ రమణగారికి శ్రీ రమణ గణపతులు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక ! అని నా ఆశంసనము.

క్షన్తవ్యాః శబ్దదోషాః

నాయన భక్తుడు,
పూడిపెద్ది లక్ష్మణమూర్తి,
విశాఖపట్నం - 11.
ది. 14-12-1998

ఇంద్రో విశ్వస్య రాజతి.

# ఆశీర్వాదము

సాక్షాత్ గజముఖం మౌనిమ్
కావ్యకంఠ విశారదామ్
వాసిష్ఠ గణపతిం వందే
బ్రహ్మ విజ్ఞాన భాస్కరమ్.

——

వ్యాసవాల్మీకుల వాగ్వైభవంబును
కాళిదాసుని మించు కావ్యపటిమ
ఆది శంకరు మించు నద్వైత తత్వంబు
కాచి జల్లెడ పట్టు ఘనయశస్వి
ధరణి రక్షణకుతా జేసిన తపమును
మహికిన్ వదలిన మహాతపస్వి
వాక్కుల కందని వాసిష్ఠ గణపతి
నరసాంబ నోచిన నోముపంట
దేవతాళిన్ జనదూతయై మెప్పించు
కావ్యకంఠునికి గారాబు పట్టి
మహదేవశాస్త్రికిన్ మధ్య తనయుండు
వేంకట రమణయై వరలువాడు

శ్రీ మహాతపస్విశ్వీయ చరిత్రను
తెలుగునన్ దెలిపిన ధీవరుండు
అతని, కాగణపతి, ఆయురారోగ్యముల్
సిరియు, సంపదలను, యిచ్చుగాక !

శ్రీమతి వప్పు విశాలాక్షిబాస్కర్,
విశ్రాంత ఉపాధ్యాయిని,
విజయనగరం.
16-12-1998.

# కృతజ్ఞతలు

ఈ గ్రంథమును ముద్రించుటలో ఆర్థిక, హార్థిక సహకారమందించిన ఈ దిగువ సాహితీప్రియులకు నాయన భక్తులకు మరియు అజ్ఞాత ప్రోత్సాహకులకు మా కృతజ్ఞతలు తెలియజేయుచున్నాము.

సర్వశ్రీ

| | | |
|---|---|---|
| 1. | దుప్పూరి వేంకట ప్రభాకర నరసరాజుగారు (U.S.A.) (S/o) శ్రీ దుప్పూరి కృష్ణమూర్తిగారు, హైదరాబాదు | రూ. 5001-00 |
| 2. | విశ్వనాథ కొండలరావుగారు, ఈస్టుపాయింట్ కోలని, విశాఖపట్నము. | 1500-00 |
| 3. | విశ్వనాథ సూర్యనారాయణగారు (Retd. M.R.O.) అక్కయ్యపాలెం, విశాఖపట్నము | 1116-00 |
| 4. | శ్రీ కావ్యకంఠ పీఠము, విశాఖపట్నము | 1116-00 |
| 5. | ఎస్. వి. ఆర్. మూర్తి, సిండికేట్ బ్యాంకు, కలకత్తా | 1116-00 |
| 6. | కె. శంకరరావుగారు, (A.D. Telecom), విశాఖ | 1116-00 |
| 7. | అల్లేని జగన్నాథంగారు, విజయనగరం | 1001-00 |
| 8. | విశ్వనాథ రామమూర్తిగారు, విశాఖపట్నము | 1000-00 |
| 9. | శ్రీమతి బి. శశికుమారిగారు, టెలికాం, విజయనగరము | 1000-00 |
| 10. | ఆర్యసోమయాజులు శ్రీనివాసరావుగారు, అలహాబాద్ బ్యాంకు, సూరత్, (గుజరాత్) | 1000-00 |
| 11. | విశ్వనాద మహాదేవుడుగారు, (Retd. A.O.) విశాఖపట్నము | 501-00 |
| 12. | పరిపల్లి రామారావుగారు, (Retd. C.T.O.) అక్కయ్యపాలెం, విశాఖపట్నము | 501-00 |
| 13. | విశ్వనాథ సూర్యనారాయణగారు, (Retd. C T.O.) అక్కయ్యపాలెం, విశాఖపట్నము | 501-00 |
| 14. | పూడిపెద్ది లక్ష్మణమూర్తిగారు, శ్రీహరిపురం, విశాఖపట్నము | 500-00 |
| 15. | అయలసోమయాజుల భీమశాస్త్రిగారు నరసింహ నగర్, విశాఖపట్నం | 500.00 |
| 16. | అయలసోమయాజుల సుధగారు, బలివాడ, ఇందిరా నగర్, బెంగుళూరు. | 500-00 |
| 17. | టి. వి. రమణమూర్తి, (Retd. A.O. Telecom) విజయనగరము | 500-00 |

— ప్రకాశకులు.

# వినతి

అకార వదనం వంద్యాం
కవీనాం ఆదిమం కవిం ।
వందే గణపతిం దేవం
నరవేష ధరం గురుం ॥

అరుణాచలములో కొన్ని సంవత్సరాలబాటు మౌనస్వామిగా నున్న ఒక యోగిని జూచి అతడు నవీన కాలంలో అవతరించిన 'మహర్షి'గా గుర్తెరికి 'భగవాన్ శ్రీ రమణ మహర్షి' అనే పేరుతో లోకానికి పరిచయం చేసారు నాయన. అంతేగాకుండా అతను తన గురువని, వారిది జన్మాంతర భాంధవ్యం అని కూడా తెలియజేసారు. ఒక జ్ఞానిని గుర్తించగల శక్తి మరియొం జ్ఞానికి మాత్రమే ఉంటుందన్న సత్యానికి ఇదినిదర్శనము. పొందేది 'ఆత్మసిద్ధి' అయినప్పటికి అనుభవ దశలో వ్యక్తికి వ్యక్తికీ తేడావుంటుంది. భగవంతుడు, ఋషి, ముని, కవి, సంఘసంస్కర్త దేశభక్తుడు అయిన గణపతి మునీంద్రులు జ్ఞానంతోపాటు, సాహిత్య సరస్వతిని క్రాంతి దర్శకత్వాన్ని ఈశ్వరానుగ్రహంగా పొందారు.

సాధారణంగా కోరికలతో సాగే తపస్సు నిజమైన తపస్సు కాదని, భగవంతుని రూప దర్శనాలు లీలలుగా నెంచవలెనని, రూపాతీతస్థితియందు తన్నుతాను తెలుసుకునేటంతవఱకు తపస్సు సాగించవలయునన్న సత్యాన్ని అతని జీవితం మనకి తెలియజేస్తుంది. అంతర్విజ్ఞానము బహుగొప్పది, బ్రహ్మగ్రంధియనే తాళము విప్పి అంతర్విద్యాలయమును తెఱచుటకు తపస్సు ఆవశ్యకము అంటారు వారు. అరవై సంవత్సరాలు చదువుకున్న వానికన్న అరు సంవత్సరాలు తపస్సు చేసిన సాధకుడు గొప్ప జ్ఞాని యవుతాడు. కావున విద్యలో తపస్సు అంతర్భాగము కావలెను అనునది వారి మతము.

తన తపస్సు మోక్షంగురించి కాదని, దేశహితం, భారతీయులు శ్రేయస్సుకని వారు ప్రకటించారు అంతేగాకుండా భారత యుద్ధంలో చక్రం పట్టని శ్రీకృష్ణునిలా, తన అసాధారణ తపస్సు ద్వారా అలనాటి స్వాతంత్ర్య వీరులయందు అంతర్లీన పరాశక్తిని జాగృతం గావించారు. ఇక సంఘ సంస్కరణ విషయంలో అతని భావాలు బహుదొడ్డవి.

ఇటువంటి బహుముఖ ప్రజ్ఞాశాలి జీవన చరిత్ర ఏ అంశానికదే ఒక బృహత్ గ్రంథం అవుతుంది. కొంత తాత్త్విక భావం, పరిశోధన లేనిదే వారి చరిత్ర వ్రాయుట కష్టము. ఒకవేళ అలా ఏదైనా వ్రాస్తే అది ప్రయత్నం అవుతుంది గాని పరిపూర్ణం కాజాలదు. అందుచేత వారి జీవితాన్ని అత్యంత ప్రభావితం చేసిన 'తపస్సు-సాహిత్యం' ఈ రెండింటికి ప్రాధాన్యత ఇచ్చి ఈ చరిత్రను వ్రాసాను.

ఈ రచనకు స్ఫూర్తి నిచ్చిన మహనీయులు డా॥ కె. సుబ్రహ్మణ్యంగారు. హైదరాబాదులో CIFL లో ఆంగ్ల శాఖలో ముఖ్యమైన పదవిని అలంకరించి హిందూ పత్రికలో "Between You and Me, Know Your English" అనే శీర్షికల ద్వారా చిరపరిచితులు. శ్రీ మహర్షి చరణారవింద సేవలో తరించి, ఎందరినో తరింపజేసి ఈ మధ్యనే కీర్తిశేషులయ్యారు. మా ఇద్దరి మధ్యన ఒకరోజు జరిగిన ఈ దిగువ సంభాషణ ఈ రచనకి ఊతనిచ్చింది.

డా॥ కె. సు :- నాయన చరిత్ర సమగ్రంగా వ్రాయబడలేదు. ఆ ప్రయత్నం నీవెందుకు చేయరాదు ?

రచయిత : (ఆశ్చర్యంగా) నేను తాతగారిని చూడలేదు, ఎలా వ్రాయగలను ?

డా॥ కె. సు : (కొంతసేపాగి, నావంక జూచి) రామాయణం వ్రాసిన వాళ్ళందరు రాముణ్ణి చూసారా ?

నాయనపై ఆతనికి గల భక్తిభావం నన్ను కదల్చివేసింది. శరణాగతి ద్వారా రచన సాగించమనే సూచన అందుగానవచ్చింది. శ్రీ రమణ గణపతులపై భారముంచి రచనకి శ్రీకారం చుట్టాను.

నేను వ్రాసిన ప్రతీ అధ్యాయాన్ని "శ్రీరమణ జ్యోతి" యనే మాస పత్రికలో ముద్రించి నన్ను ప్రోత్సహించారు హైదరాబాదు శ్రీ రమణ సత్సంగ భక్తులు. స్ఫూర్తి ప్రధాతకి, సత్సంగ వాసులకు నా నమస్సుమాంజలులు.

నాయన చరిత్రను చక్కగా వ్రాయాలనే కోర్కె నా తండ్రి గారైన కీ॥శే॥ వాసిష్ఠ మహాదేవశాస్త్రిగారి ఉండేది. అప్పట్లో ప్రచురితమైన "నాయన" చరిత్ర అతనికి తృప్తి నీయలేదు. అందులో లోపాలున్నాయని అనేవారతను. తన తండ్రి చరిత్ర అతని సాహిత్యంలో అంతర్లీనమై ఉందని, సాధన-శోధన ద్వారా దానిని గ్రహించ వచ్చని వారంటూ ఉండేవారు. అనేక సందర్భాలలో అతను చెప్పిన విశేషాలు ఈ రచనకి నాకు ఉపకరించాయి. వారే నాలో సృజనాత్మక శక్తిగా ఈ రచనని చేయించారన్నది నా నమ్మకము. ఈ యజ్ఞంలో అనుక్షణము నాకు సంస్కారాన్ని అందించిన పితృపాదులకు, శ్రీ రమణ గణపతులకు పుష్పాంజలి ఘటిస్తున్నాను.

పండితులు, పరమ పూజ్యులు, నిరాడంబరులు వ్యాకరణాలంకార చక్రవర్తి, విద్యాప్రవీణ, సాహిత్య విశారద అయిన ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మగారు ఈ గ్రంథాన్ని ఎ.తో ఆదరణతో పూర్తిగా చదివి, అక్కడక్కడ మెరుగులు పెట్టి నన్ను ఆశీర్వ

దించారు. వారికి పాదాభివందనములు. నాకు ప్రోత్సాహ మందించిన పండితులు శ్రీ ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, పూడిపెద్ది లక్ష్మణమూర్తులకు, నా సోదరి కవియిత్రి పప్పు విశాలాక్షి గార్లకు నా కృతజ్ఞతా పూర్వక నమస్కారము లర్పించుకుంటున్నాను.

ఇటువంటి రచనకి కావలసినది విషయవస్తు సేకరణ. ఇందు నా అన్నగారైన సూర్యగణపతి (పురంధర్), సోదరి పప్పు ఇందిర, తమ్ముడు శ్రీధర్ నాకు సహకరించారు. సంస్కృతంలో మొట్టమొదటిసారిగా ముద్రించబడిన "వాసిష్ఠ వైభవమ్", ఇంట్లో ఉన్నటువంటి వ్రాత ప్రతులు, నాయిన సాహిత్యం పరిచురితమైన చరిత్ర గ్రంథాలు, వ్యాసములు ఇత్యాదులు నాకు ఉపకరించాయి. ఇవన్నీ నాకు నమకూర్చి అందించిన కుటుంబ సభ్యులలో జ్యేష్ఠులకు వందనాలు, పిన్నలకు ఆశీస్సులు.

ఈ గ్రంథమును కాపీ చేయుటకు, ముద్రించుటకు ఆర్థిక, హార్థిక సహకారము లందించిన ఈ దిగువ వారలకు కృతజ్ఞత లర్పించుకొనుచున్నాను.

(ఎ) తిరుమల తిరుపతి దేవస్థానమువారు (ఇరుబది వేల రూపాయలు సహాయం అందించేరు.)

(బి) విరాళము లిచ్చి సహకరించిన నాయన భక్తులు.

(సి) శ్రీ కె. శంకరరావుగారు,
Assistant Director, Telecom, Visakhapatnam.

(డి) శ్రీమతి బి. శశికుమారిగారు, విజయనగరము.

(ఇ) శ్రీ తెన్నేటి సన్యాసిరావుగారు, విజయనగరము.

(ఎఫ్) పుస్తకమును ముద్రించిన శ్రీ శారదా పవర్ ప్రింటింగ్ వర్క్సు, భట్నవిల్లి, యాజమాన్య మరియు కార్మిక వర్గము వారు.

(జి) శ్రీ ఎ. బి. కె. రమేష్‌గారు, మరియు హిమాంసు బుక్ డిపో, యాజమాన్య సభ్యులు.

ఇంకనూ అజ్ఞాతంగా సహకరించిన అనేక విజ్ఞులకు నా ధన్యవాదములు.

పండితులకు, పామరులకు, సాధకులకు, శోధకులకు ఈ గ్రంథము ఆదరణీయమైన,అది శ్రీ రమణ గణపతుల అనుగ్రహంగా భావిస్తాను.

రచనా ప్రవాహంలో శబ్దాది దోషములను విస్మరించి, సారమును గ్రహించి నన్ను ఆశీర్వదించమని వేడుకుంటున్నాను.

ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు.

ఇట్లు,
బుధజన విధేయుడు,
అ॥ వెంకటరమణ,
(మైత్రావరుణ)
15-11-1999.

12-8-4 రాజేశ్వరీ నిలయము
పూల్‌బాగ్ రోడ్
విజయనగరము-535 002.

## మూడవ భాగము

# మహా తపస్వి

## (శ్రీ వాసిష్ఠ గణపతిముని చరిత్ర)

### 1. తపస్సు

"ప్రకృతి – పురుషుడు – ఇవి శక్తీశ్వర స్వరూపములు. అందు ప్రకృతి యీ సుందర శోభిత బ్రహ్మాండము. పురుషుడు అందు ప్రకాశించు అంతర్లీన విజ్ఞానము. శక్తి జగన్మాత. పురుషుడు ఈశ్వరుడు. పృథివి, వాయువు, తేజము, ఆకాశము, నీరు, సూర్యుడు, చంద్రుడు, జీవుడు, అనే ఎనిమిది రూపములందు వీరు బ్రహ్మాండ రూపమును దాల్చియున్నారు" – మహర్షులచే ప్రతిపాదింపబడిన ప్రమాణ వాక్యములివి. ఈ వాక్యముల వెనుక వారి యొక్క శోధన – సాధన దాగియున్నది. అదియే తపస్సు.

నిజానికి "తపస్సు" ప్రతి మనిషికీ జీవన లక్ష్యం అయినప్పటికీ తాపములందు తగుల్కొను వారే అనేకులై ఉన్నారు. అనంత తపస్సీమయైన యీ సువిశాల జగతిలో మానవులే కాదు; దానవులు దేవతలుకూడ సత్యాన్వేషణకై "తపస్సు"నే సాధనముగా చేబట్టినట్లు చరిత్రలందు గలదు.

దేవాతాత్మకుడైన హిమవంతుని కుమార్తె పార్వతి. దక్షయజ్ఞము నందు తండ్రిచే అవమానింపబడి అగ్నికి ఆహుతియైన సతీదేవి యొక్క తదుపరి యవతారమిది. భర్తయైన ఈశ్వరుని సన్నిధికై ఈమె "తపస్సు" ప్రారంభించగా అందాలబొమ్మ కందిపోతుందేమోనని తల్లి మేనక "ఉమా" అని వారిస్తుందట ! 'ఉ' అనగా అమ్మాయీ "మా" యన (తపము) వద్దుసుమా యని

యర్థము. ఆ విధముగా ఆమె పేరు "ఉమ" యైనది. శ్రీ కాళిదాసు విరచిత కుమారసంభవము నందు ఆ మహాకవి జగన్మాతయొక్క "ఉమ" నామ వివరణ సందర్భోచితంగా వివరించిన వైనమిది. తత్స మాన కవితాసంపన్నుడు, బహుళ తపశ్శాలి, భువనేశ్వరీ వర ప్రసాది యైన గణపతిముని ఈ నామానికి మరికొంత ఉదాత్తమైన భావాన్ని కల్పించారు. ఆ శ్లోకం ఇలా ఉంది.

శ్లో॥ భవత్యసావతో భవాన్యనాదిరన్త వర్జితా
జగన్తి మాతి నిత్యమేరసౌతదభ్యుదా య్యుమా।
రసాత్మికోచ్యతేఖిలై రసౌతతః శివోచ్యతే
పరైవ మీశితుశ్చితి స్త్రిధా బుధైరు దీర్యతే ॥

తా॥ ఎల్లప్పుడు ఉండేటువంటి శక్తిగావున "భవాని"
అనియు, అందరూ కోరెడి ఆనంద రస స్వరూపిణి గాన
"శివ", ఈశుని గొలిచెడి పరిమాణ శక్తి గాన
"ఉమ" అని మూడు విధములుగ పరాశక్తి
నామములను పండితులు చెప్పియున్నారు.

ఇందు ఈశుని పరిణామశక్తి "ఉమ" అని తెలుపబడినది. ఈ సృష్టిని పరిమితము జేయునది అనే భావంకూడ ఇందులో ఉంది. మూలపురుషుడైన ఈశుని జేరుటయే ఆమె నైజముగాన, "తపమువద్దు" అనే విరుద్ధభావం ఆమె నామమై యొప్పుట బహుశా ఈ కవికి నచ్చలేదేమో ! ఏది ఏమైనప్పటికి ఒక విశిష్ట రూపకల్పన "ఉమ" నామమునకు ఈ కవి కల్పించారని పండితులు కొనియాడారు. తాపసికులు తమ మాటలయందు భావములందుకూడ మూలమును (ఆత్మదృష్టిని) వదలరు. అదియే నిజమైన తపోదృష్టి.

భగవాన్ శ్రీ రమణ మహర్షి తన చేతిపై పుట్టిన గాయమునకు ఒకసారి డాక్టరు "స్పిరిట్" రాయగా "చాలా చల్లగా ఉన్నదే, ఇది ఏమిటి?" అని అడిగారట. డాక్టరు అది "స్పిరిట్" అని చెప్పగానే వారు నవ్వుతూ అందరికీ "Spirit touch" ఇస్తే బాగుంటుందన్నారు. చూడండి. ఎక్కడినుండి ఎచట కెళ్ళిందో వారి భావన ! తపోదృష్టికిది మరియొక ఉదాహరణము.

పార్వతీ పరమేశ్వరుల పరస్పర సమాగమునకు మూలమైన "తపస్సు", హరిహరాదుల ఆత్మనిష్ఠకు సాధనమని "శివాయ విష్ణు రూపాయ, శివ రూపయ విష్ణవే" అనే శ్లోకభావము తెల్పుచున్నది.

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యమ్ అని ఏడు లోకాలను వర్ణిస్తూ మన పెద్దలు తపస్సుని ఒక లోకంగా నిర్వచించారు. అనగా ఇది అనంతమైన అనిర్వచనీయమైన సాధన అని యర్థం. ఈ సృష్టి ఈశుని తపః ఫలము అంటుంది వేదం. కావుననే ఈ సృష్టిలోని జీవులన్నీ సుఖానికై తపిస్తూ ఉంటాయి. ప్రపంచంపై జూపే తపన యాతన అవుతే ఈశుని పదసన్నిధికై జూపేది తపస్సు అవుతుంది.

తపస్సనేది ఒకానొక అన్వేషణ. మనలో ఒకానొక శక్తి దృష్టి రూపాన్ని దాల్చి చూచుటకు, మాటలాడుటకు, అలోచించుటకు, కదలుటకు దోహదపడుచున్నది. గాఢ నిద్రయందు ఈ అవస్థలు గానరావు. మనలో ఆలోచన లెన్ని ఉన్నాయో మనకి తెలియవు. ఆలోచన వచ్చిన తరువాతనే అది మనకి తెలుస్తున్నది. నిద్రలోను, మెలకువలోను, కలలోను, ఈ అవస్థలకు అతీతంగా ఉండే ఈశక్తిని "ఎరుక" "Chnscious energy" అనే పేర్లతో పెద్దలు వివరిస్తు

న్నారు. ఈ శక్తియొక్క నిజస్వరూప విచారణకూడ "తపస్సే" అగును.

మన పురాణములందు సురలు-అసురులు తపస్సు చేసినట్లు గలదు. వారి తపస్సు వెనక కోరిక గలదు. అది లోక హితముకై గావచ్చును లేదా కీడుకై గానవచ్చును, వారి తపస్సు ఫలించుచున్నది. ఫలితముగా ప్రజలు వారి కోరికలయొక్క మంచి-చెడూ ప్రభావములపై సతమత మవుచున్నారు. ఇలాంటి కథలు ఎన్నో మనం విని యున్నాము. దీనినిబట్టి తపము ద్వారా అంతర్గత శక్తి బలము పొందుతున్నది అనునది తథ్యము. వేదాంతము నందు తపస్సు మనస్సుని నిర్మలము చేయునని, ఈశుని (ఆత్మ) వైపు లాగునని చెప్పబడి యున్నది. మరి "మంచి-చెడూ" తులాభారంపై తూగే ఈ తపస్సు నిజమైన తపస్సేనా? అనేది ప్రశ. లోతుగా ఆలోచిస్తే ఇది యాతన అవుతుంది గాని తపము కానేరదు.

తపముద్వారా కలుగునది సిద్ధి దూర శ్రవణము, స్వర్ణ సిద్ధి ఇత్యాదులు ఈ వర్గానికి చెందుతాయి. ఒకానొక సాధువు పదునాల్గు సంవత్సరాలు తపస్సు చేసి తన శరీరము నుండి సుగంధ వాసనలు తెప్పించాడు. అతడు తనవిజయాన్ని సగర్వంగా శ్రీ రామకృష్ణ పరమహంసుల వారికి చెబితే "అయ్యో! ఇన్నేళ్ళూ ఈ చిన్న విషయానికై సమయం వృథా చేశావా" అన్నారుట.

"నీకు తిండికి లోటులేదు. బట్టకి లోటులేదు. ఉద్యోగం ఉంది. ఇంతకు మించిన సిద్ధి ఏమి కావలయును?" అన్నారు శ్రీ రమణ భగవాన్. కావున నిజమైన తపస్సు ఇటువంటి సిద్ధులకు అతీతమైనది.

అనంతమైన ఈ తపస్సీమలో సాధారణంగా కోరికలతో సాధనను ముగించిన వారే ఎక్కువ. వీరు తెగిపోయిన గాలి పటముల వంటి వారు. తపము ద్వారా పరమాత్మ యొక్క ఏదియో ఒక రూప దర్శనము పొంది అంతటితో తృప్తి చెందిన వారు గలరు. ఏలయన తపస్సునకు మూల సాధనమైన మనస్సు ప్రతి క్షణం సాధకుని భ్రమలో ముంచివేస్తూ ఉంటుంది. తాను కన్నదే సర్వస్వం అని అనిపింప జేస్తుంది. కావుననే మనోనైజం గురించి శ్రీ భగవాన్ ఇలా అన్నారు.

"ఊర్ సుత్రిశంబిడాదు ఉనై క్కండడంగిడ
ఉరుదియాయ్ ఇరుప్పాయ్ అరుణాచలా"

— అక్షరమణమాల

తెలుగు అనువాదము :—

మాయలు నేర్చిన మదిరా
నీయండను నుండి యదియు నిన్నేమార్చున్
వేయుము బలమగు పీఠము
నాయెద నీయందు నణగ నరుణ గిరీశా।

నిజానికి మనో నాశనం చెందిన తరువాత నిలచేదే "తపస్సు".

మనో నిశ్చలత మనో నాశనానికి మొదటి మెట్టు. అందు లకు ఏకాంతమును కోరుకుంటారు సాధకులు. కొందరు శరీరానికి కఠినశిక్ష విధిస్తారు. ఒంటి కాలిపై తపస్సు, తల క్రిందుల తపస్సు చెట్టు కొమ్మలకు వ్రేలాడుట ఇత్యాదులు ఈ కోవకు చెందినవే. నిజానికి మనో నిశ్చలతకు అలవాటు పడితే సుఖాసనం చాలు.

అడవులు, పొదలు, కొండలు, గుహలు ఇవి సాధారణంగా తపస్సుకి అనువైన స్థానాలు. స్థిర చిత్తునకు ఇవికూడ అవసరం లేదు అన్నారు శ్రీ గణపతిముని.

తపశ్శక్తికి పెరుగుదల, తరుగుదల ఉన్నాయి. రాజర్షి విశ్వామిత్రుని జీవితం ఇందులకు నిదర్శనము. కోరికల వలలో తగులుకొని ఎన్నో సార్లు తపశ్శక్తిని ధార పోశాడతను. వసిష్ఠుని వలె బ్రహ్మర్షి కావడానికి అతను పడిన తాపత్రియం ఇంతా అంతా కాదు.

నవీన కాలంలో గృహస్థాశ్రమ జీవితాన్ని స్వీకరించి, సమాజం మధ్యన తాను ఉంటూ తపము సులభ తరము, అందరునూ చేయవచ్చును అది ప్రతి మానవుని యొక్క జీవనధ్యేయం వ్యక్తిత్వ ఉన్నతికి, కళా సముపార్జనకు, దేశ రక్షణకు, సమాజ సేవకు 'తపము' ఆవశ్యకము అని తెలియ జేసిన మహా తపస్వి శ్రీ వాసిష్ఠ గణపతిముని. ఎప్పుడో ఋషి కాలము నాటికి అంకితమై, నవీనులకు అగమ్య గోచరంగా తోచే ఈ పవిత్ర సాధనమును సులభతరముగ ఆచరించ వచ్చునని తపస్సున కొక నిర్దిష్ట స్వరూపమిచ్చి, ఆది నుండి అంతము వరకు తపోమార్గము యొక్క పోకడ తెలియజేసి. తాను దానికి అర్పితుడై, తపము యొక్క పరాకాష్ఠ ఇది యని తెలుపుటకు మహదాచార్యుడైన భగవాన్ శ్రీ రమణ మహర్షిని పరిచయం చేసి, మంత్ర, తంత్ర ద్వైతాద్వైతములందు ఏకభావము జూపిన అవతార పురుషుడితడు.

శంకరులు, కాళిదాసాదులతో సరిసమానమైన కవిత్వ ధారతో, ఆధ్యాత్మిక, సాహిత్య రంగములందు విప్లవాత్మక చైతన్యము దెచ్చి, చరకుని వైద్య విజ్ఞానము, పారాశర్యుని జ్యోతి

షము, వరాహ మిహిరుని ఖగోళ శాస్త్రము ఇత్యాదులను పురిషిట బట్టి, ఋషికులములలో మిన్నయై, నవీనులలో నవీనుడై, అంచంచల దేశభక్తుడై సమస్త దేవతా సాక్షాత్కారమును పొంది, కపాల భేద సిద్ధిని పొంది, తపోదీక్షను అనవరతము సాగించి, నిగర్వియై, శ్రీ రమణాంతే వాసియై నమ్రతకు, సాధుశీలతకు ప్రతిరూపమై, బహుళ ప్రజ్ఞావంతుడని అనిపించుకొన్న ఈ మహా తపస్వి జీవితము "తపస్సు" అను పదమునకు నిర్వచనమై సాధకులకు మార్గదర్శకమై యొప్పు చున్నది.

## 2. హిరణ్యగర్భుడు

శ్లో॥ నభోంతరే ప్రచక్షతే హిరణ్మయాంగ మీశ్వరమ్
దినేశ బింబ పూరుషం హిరణ్య గర్భ మాఖ్యయా ।
విరాజమాన మక్షరం విరాజ మన్తరే నృణామ్
సవిత్రి ! తత్త్వ వేదినామియంతు నామకల్పనా ॥

తా॥ సవిత్రీ ! ఆకాశ మధ్యమున హిరణ్మయ శరీరుడగు
పురుషుని ఈశ్వరుడనియు, దినకరుని యందు
బింబితుడై ప్రకాశించు వానిని హిరణ్య గర్భుడనియు,
మనుష్యుల యందు విరాజిల్లు పురుషుని "విరాట్టు"
అనియు తత్వవేదులు నామ కల్పన చేసియున్నారు.

—ఉమాసహస్రము

• • • •

దేశమునందు ధర్మమునకు విఘాతము కలిగినప్పుడు, ప్రజలు దారి తప్పినప్పుడు, అధర్మము విచ్చలవిడిగా తాండవం చేసినప్పుడు, హిరణ్యగర్భుని కిరణకాంతి యొకటి భూమికి వచ్చి

నదై "అవతార" రూపము దాల్చునని పెద్దలందురు. "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అను శ్రీకృష్ణులవారి వచన సారాంశము ఇదియే అయి ఉండును.

పరిపూర్ణ, ఆవేశ, అంశ కళావతారములని, ఋషి, ముని, ప్రచారక, దూత, కుమార అవతారములని ఇవి పలువర్గములు. ఒక మహావ్యక్తి అవతరించు ముందు వారి యవతార సూచన ముందుగానే తెలియు సంఘటనలు అనేకములు గలవు. శ్రీ గణపతిముని విషయంలో కూడ ఇటువంటి విశేషములు ముందుగానే కనిపించాయి.

ఆంధ్ర సీమలో శ్రీకాకుళ నగరమునకు రెండు కిలోమీటర్ల దూరమున గల "అరసవల్లి" అగ్రహారము పవిత్ర సూర్య నారాయణ క్షేత్రముగా ప్రసిద్ధిగాంచి యున్నది. క్రీ. శ. 7-8 శతాబ్దములలో తూర్పు కళింగుల కాలమున నిర్మింపబడ్డ ప్రాచీన సూర్యదేవుని ఆలయము ఇచట గలదు. స్వామి వారి విగ్రహము నల్లరాతితో చేయబడినదై, సుందరమై, బహు శక్తిమంతమై చిత్కళల ప్రకాశించు చుండెను. ఉత్తర, దక్షిణాయనము లందు బాల భానుని ఉషోదయ కిరణాలు. గర్భగుడి ప్రవేశించి, ఒకే విధముగ స్వామివారి కిరీటము చుంబించుట ఆలయ నిర్మాణము నందలి విశేషమును చాటుచున్నది. కోవెల చిన్నదైనప్పటికి స్వామి వారి మహిమలు అతి ఘనమైనవి గాన అనేక మంది భక్తులు ఇచటకు వస్తూ ఉంటారు.

ఈశ్వర నామ సంవత్సర మాఘ పౌర్ణమీ దివసమునాడు (Feb–1878) అచటకు 50 మైళ్ళ దూరమున గల కలువరాయి అగ్రహారము నుండి ఒక విప్ర కుటుంబము తన కుమారుని పుట్టు జుత్తులు తీయించి మొక్కు చెల్లించుటకై అచటకు వచ్చినారు.

ఆ కాలమున రవాణా సౌకర్యములు తక్కువగా ఉన్నందువల్ల, చుట్టుప్రక్కల ప్రయాణములకు రెండెడ్ల బండ్లు శరణ్యమై ఉండెడివి. ప్రయాణములుకూడ తరచు వెన్నెల రాత్రుల యందు గాని, పగటిపూట గాని చేసెడివారు.

కలువరాయి అగ్రహార నివాసియైన ఆ విప్రుని పేరు అయ్యలసోమయాజుల నరసింహశాస్త్రి. భార్య నరసమాంబ. కుమారుడు నాలుగు ఏండ్లవాడు, భీమశాస్త్రి. విప్రుని వయస్సు 30 సంవత్సరాలుండును. అతడు ద్వాదశ మంత్రోపదేశమును పొంది, నిరంతరము జపమాచరించు మంత్రద్రష్ట. భూకామందుడు, గ్రామాధికారి, జ్యోతిష, వైద్య శాస్త్రము లందు పరిచయము గలవాడు. శ్రీ విద్యోపాసకుడు. దేశ స్వాతంత్ర్య కాంక్ష గలవాడు. మరియు సంస్కారి. భార్య అతి భక్తురాలు, సంస్కారవతి, అన్నపూర్ణ. కుమారుడు జబ్బుపడి సూర్యదేవునకు మ్రొక్కగా బ్రతికినాడు. కావున పుట్టు జుత్తులు తీయించి, మ్రొక్కు తీర్చుటకు వారు అరసవల్లి వచ్చిరి.

కుమారుని పుట్టు జుత్తులు తీయించి కోనేటి యందు స్నాన పాన, జప, తపాదులు తీర్చుకుని వారు ఆలయము ప్రవేశించినారు. అది యేమి దైవలీలయో ! ఆదిత్యుని దర్శించిన నర్సమాంబ దృష్టి అంతర్ముఖము కాగా, పారవశ్యము చెంది, బాహ్య దృష్టి నశించి, ఆదిత్యుని చరణార్పిత మనస్కురాలైనది. ఆమె స్థితిని గమనించిన నృసింహశాస్త్రి, ఆమె ధ్యానమునకు భంగమురాకుండునట్లు, ఆమె కరములను పట్టుకొని, సునిశితముగ ఆలయ ప్రదక్షణము గావించినాడు.

ఆ రాత్రి వారచటనే నిదురించిరి. ఉషోదయ సమయమైనది. నరసమాంబ బాహ్య దృష్టి వచ్చినదై భర్తను జూచి "స్వామీ

ఏదియో దివ్యానుభూతి నన్ను కాదల్చివై చుచున్నది. ఆదిత్యుని మూర్తి నుండి ఒక దేవత అగ్నికలశతో నాదగ్గఱకు వచ్చి, కలశ నాచేతికిచ్చి అంతర్ధానమైనది. ఇది కలయో: నిజమో: చెప్పలేను. సూర్యదేవుని దర్శించినది మొదలు నాలో ఏదో చైతన్యము, అనందము, ఆవేశము కలుగుచునే యున్నవి: ఇది యంతయు ఆ ప్రభువు యొక్క అనుగ్రహమా ? లేక ఆగ్రహమా ?" అని ప్రశ్నించినది.

ఉపాసనా పరుడైన నృసింహశాస్త్రి ఒక్కసారి ఆలయ శిఖరాన్ని చూశాడు. ఆదిత్యుని యందు ఈశ్వరుని యంశ హిరణ్మయ గర్భ రూపములో నుండును. అందలి తేజః కిరణమే "అగ్ని కలశ"యై యుండును. అందించిన దేవత "హిరణ్మయి"- ఇట్లు తలచి భార్యను జూచి చిరునగవుతో "భయపడుకుము, ప్రభువు నీయందు అనుగ్రహ పాత్రుడై యున్నాడు. నీకు సూర్య తేజముగల కుమారుడు పుట్టగలడు" అనెను.

భక్తి, ఆనందము, పారవశ్యము ఇవి తోడు కాగా వారు ఆ మర్నాడు సాయం సమయమునకు ఇల్లు చేరుకున్నారు.

భర్త చెప్పినట్లుగానే నరసమాంబ గర్భమునందు హిరణ్య గర్భుని తేజోంశము రూపము దాల్చుచుండెను.

—×—

# 3. అక్షర స్వరూపము

శ్లో॥ భగవతి : నిజౌ సాక్షాత్ పుత్రౌ బృహస్పతి పావకౌ
గణపతి గుహావేతౌ వేషాంతర వ్యవహారతః।
భరతధరణీ ఖండే హేతోః కృత సంభవౌ
కల కల యుతే కాలే దేవి : వ్యథాః కథయ ద్రుతమ్॥

తా॥ భగవతీ : దేవీ : నీ నిజపుత్రులగు బృహస్పతి, అగ్నులు, గణపతి (గణపతిముని,) గుహ (రమణమహర్షి) అవతారము లందు భారత భూఖండమున కోలాహల యుతమైన ఈ కాలమునందు ఏల జన్మింపజేసితివో దయయుంచి చెప్పుము.

– ఉమాసహస్రము

• • • •

నరసమాంబకు ఏడు నెలలు నిండినవి. ఆమె పుట్టినిల్లు గజపతి నగరమునకు సమీపమున గల లోగీస అగ్రహారము. పురిటికై భార్యను పుట్టింట దిగబెట్టి, ఇంటి కార్య భారము సోదరుడైన ప్రకాశ శాస్త్రికి వప్పజెప్పి, కార్తిక మాసము నందు విశ్వేశ్వర దర్శనముతో పాటు గంగా స్నానము శుభప్రదమని ఎంచి, నృసింహశాస్త్రి కాశీ బయలుదేరెను.

వారణాసీ పురము నందు గంగా నదీ సమీపమున బస నేర్పరుచుకొని, నిత్యమూ అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము గావించుకొనుచు ధ్యాన నిష్ఠుడై, సమయము వెళ్ళబుచ్చుచుండెను. ఈశ్వర పద చింతనమును మించిన తపము మరి యొకటి లేదు కదా : ఇదియే భక్తి : ఇదియే ధ్యానము : ఇదియే తపస్సు :

నిజానికి అందరి యందును ప్రవహించే అనుగ్రహ ప్రవాహ ధారయే భక్తి. ఇదియే కార్యసిద్ధికి హేతువు. ఎల్లప్పుడు "నాది" అనే విభక్తి దృష్టి కలిగి ప్రతి మానవుడు ఐహిక విషయ

వాంఛల యందు మనస్సును లగ్నం చేసి తనయందు ప్రవహించే శ్రద్ధా, భక్తులను ఐహిక కార్య సాధన యందు ఖర్చు చేయు చున్నాడు. నిరంతరము నాది యని పాకులాడే యీ "నేను" ఎవరు? అన్న విచారమునకు దృష్టి మరల్చిన 'విభక్తి' నశించి 'భక్తి' ఏర్పడును. అది జ్ఞాన ప్రాప్తికి దోహదము చేసి ముక్తి హేతువగును.

నృసింహశాస్త్రి వివేకి, ధ్యాన నిష్ఠా గరిష్ఠుడు, జీవితము యొక్క విలువను తెలిసినవాడు. ఈశ్వరానుగ్రహ ప్రాప్తికి తన జీవితమును అంకితము చేసినవాడు. అరసవల్లీ క్షేత్రమందు హిరణ్య గర్భుని అనుగ్రహ ప్రాప్తికి యాతని పరదీక్షా నిష్ఠయే కారణమైనది.

ఆ రోజు బహుధాన్య సంవత్సర కార్తిక బహుళ అష్టమీ భానువారము. విశ్వేశ్వర సన్నిధి యందు గల డుండి గణపతి విగ్రహము ముందు కూర్చుని నృసింహశాస్త్రి "నవాక్షర గణపతి" మంత్ర జపదీక్షయందుండెను. అప్పటికి సూర్యోదయమై 20 ఘడియలు దాటినది. గణపతి చరణయుగ్మముపై దృష్టిని నిల్పిన శాస్త్రికి ఆ ప్రభువు చరణ కమలములనుండి ఒక శిశువు తనవైపు ప్రాకుచూ వచ్చి తొడపై కూర్చుని అంతర్ధానమైనట్లు గోచరించెను. మంత్ర సిద్ధి యైనదని తెలిసిన నృసింహశాస్త్రి ధ్యానము నుండి భౌతికమునకు వచ్చినవాడై సంతోషజనక హృదయముతో, కంటి వెంట నీరు ధారయై ప్రవహింప యీ యీశ్వర తనయుని స్తుతించుచు సాయం సమయమునకు తన బస చేరుకొనెను.

ఈ అద్భుత దృశ్యము పుత్రోదయ సూచకమై యుండ వచ్చునని యెంచి అంతటితో కాశీ యాత్ర ముగించినవాడై మర్నాడు స్వగ్రామమునకు ప్రయాణమయ్యెను.

కలువరాయి చేరగానే తనకు పుత్రుడు జన్మించినాడన్న శుభవార్త తెలిసి, భార్యాపుత్రులను జూచుటకై లోగిస అగ్రహారము చేరుకొనెను. ఆశ్చర్యము! తనకు కాశీ యందు కలిగిన అద్భుత దృశ్య సమయమునందే ఇచట మగశిశువు జన్మించినాడు.

ఈ విధముగా బహుధాన్య సంవత్సర కార్తిక బహుళ భానువారము (17–11–1878) నాడు, సూర్యోదయాది 20 ఘడియలకు, కుంభ లగ్నము నందు మఖా నక్షత్ర ప్రథమ చరణము నందు లోకోద్ధారకునకు జన్మ నిచ్చిన వారై ఆ పుణ్య దంపతులు తరించిరి.

అటు సూర్య భగవానుడు, ఇటు గణపతి యిరువురి అనుగ్రహ స్వరూపముగాన ఆ బాలకునకు "సూర్య గణపతి" యని నామకరణము చేసిరి.

బ్రహ్మణస్పతి, బృహస్పతి యని పేరు కలిగిన ఈశకుమారుడైన వినాయకుని కవియని, క్రాంత దర్శకుడని గణపతి సూక్తము నందు వివరింప బడినది. ఆది గురువైన వ్యాసమహర్షి యొక్క లేఖకుడై వేద సారమును జగతి కందించిన అక్షర స్వరూప మితడు. అతడే మరల తన సహజ కవితల ద్వారా విశేష సంపదతో జగదాచార్యుడైన భగవాన్ శ్రీ రమణ మహర్షిని లోకమునకు పరిచయము చేసి, యాతని తత్త్వదర్శన ప్రచార కారణార్థియై "శ్రీ రమణ గీతా" లేఖకునిగ "గణపతిముని" రూపమున యవతరించె ననుటకు యిది నిదర్శనము.

శ్లో॥ యద్దీపాద్రమణాఖ్యా ద్వ్యాప్తం గాణపతేషు ।
వాణీ భిత్తిషు ధత్తే గీతా చిత్ర విలాసమ్ ॥
ఆలంబేన విహీనం, వ్యోమాభం పరిపూర్ణమ్ ।
నిశ్శబ్ధం గురు రూపం తద్బ్రహ్మ స్ఫురతాన్మే ॥

[ఏయ్యది రమణుడను దీపము నుండి వెలువడి, గణపతి వాక్కులనెడి గోడలయందు 'గీత' యనెడి చిత్ర రూపమును ధరించు చున్నదో అట్టి నిరాలంబము, ఆకాశ సదృశము, పరిపూర్ణము, నిశ్శబ్దము అయిన గురురూపము నాకు స్ఫురించుగాక]
— గురు గీతము, గణపతి ముని

## 4. వంశ వృక్షము

శ్లో॥ ఏతామాహుర విద్యాం, బీజం సంసార వృక్ష రాజస్య ।
సర్వరస ఫల యుతస్య ప్రారబ్ధ జలేన దోహదినః॥

[జనన మరణ రూపమగు పరివర్తనము సంసారము. ఈ వృక్షమునకు భేద దృష్టి (అవిద్య) బీజము కాగా ప్రారబ్ధము అనెడి జలము పెంచుచున్నది. శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానకములనునవి ఫలరసములై యున్నవి].
— ఉమాసహస్రము

❋ ❋ ❋ ❋

తమిళనాడులోని కుంభకోణము అను నగర సమీపము నందు "వలంగైమాన్" అను అగ్రహారము కలదు. ఈ గ్రామము నకు చెందిన కొన్ని వడమ బ్రాహ్మణ కుటుంబములు కొన్ని వందల సంవత్సరములకు పూర్వము ఆంధ్రసీమకు వలస వచ్చిన

వారై, గోదావరి నదీ ప్రాంతమైన అమలాపుర సమీప గ్రామము లందు స్థిర నివాస మేర్పరుచు కొనిరి. ద్రావిడ దేశము నుండి వచ్చిన వారు కనుక వీరికి ద్రవిడ బ్రాహ్మణులని, ద్రావిడులని పేరు వచ్చినది.

అందు వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య త్ర్యార్షేయ ప్రవరాన్వితులు, కౌండిన్యస గోత్రులు అయిన "అయ్యల సోమ యాజుల" ఇంటి పేరు గలవారు ప్రసిద్ధులు. అయ్యల సోమయా జుల విస్సన్నగారు ఈ శాఖవారికి మూలపురుషుడు. వీరు వృత్తి చేత "నవాబు" బిరుదమును సంపాదించిరి. వీరి కుమారులలో ఒక రైన ఎల్లన్న వారి కూటస్థులు తూర్పునకు వలస వచ్చిన వారలై ప్రస్తుత విజయనగరము జిల్లా బొబ్బిలి, సీతానగరము, పార్వతీ పురము, పాలకొండ తాలూకాలలోని అగ్రహారము లందు స్థిర నివాసులైరి.

కావ్య సంస్కారము, జ్యోతిషము, సాహిత్యము, వైద్యము ఇత్యాదులయందు పేరుగాంచిన ఈ శాఖీయుల సంక్షిప్త వంశ వృక్ష పట్టిక యిది :

ఎల్లన్న
(విస్సన్నగారి కుమారుడు)

జగన్నాథశాస్త్రి
(2వ కుమారుడు)

సోమావధాని
[నందబలగలో వృత్తిని సంపాదించిరి. ఋగ్వేద, యజుర్వేద ములను అధ్యయనము చేసిరి.]

భీమశాస్త్రి

జగన్నాథశాస్త్రి
[భీమశాస్త్రి 5వ కుమారుడు కావ్య సంస్కారి. పౌరాణికుడు గంటి సర్వప్పశాస్త్రి కుమార్తెను పెండ్లియాడి తత్సంబంధముచే "కలువరాయి" వచ్చెను.]

భీమశాస్త్రి
[సాహిత్య, జ్యోతిష, వైద్య విద్వాంసుడు]

నృసింహశాస్త్రి (5వ సంతానము) | ప్రకాశశాస్త్రి (7వ సంతానము)

భీమశాస్త్రి | గణపతిశాస్త్రి (మహాతపస్వి) | అన్నపూర్ణ | శివరామశాస్త్రి (ప్రకాశశాస్త్రి దత్తుడు)

మహాదేవుడు
భార్య రాజేశ్వరి

వజ్రేశ్వరి
భర్త గంటి సోమయాజులు

ఇందిర | విశాలాక్షి | పురంధర్ | వెంకటరమణ (రచయిత) | శ్రీధర్

భామతి | కన్నతల్లి | కపర్ధి | ధరణి

శ్రీ విద్యోపాసన, శ్రీ చక్రపూజ వీరియింట గలదు. జగన్నాథ శాస్త్రి గారి మాధిపత్యము సంపాదించుటచే తరువాతి వారు గూడ ఆ వృత్తిని స్వీకరించిరి.

"సూర్య గణపతి" తరువాత, అన్నపూర్ణ యను కుమార్తెయు శివరామ శాస్త్రి యను కుమారుడును నరసమాంబకు కలిగిరి. అందు శివరామశాస్త్రి పినతండ్రియైన ప్రకాశశాస్త్రికి దత్తుడయ్యెను. ఇతడు గణపతికి సోదరుడేగాక తపస్సఖుడై అతనితో అనేక పుణ్య ప్రదేశములు తిరిగి యుండెను.

## 5. చికిత్స

శ్లో॥ యోగినో బోధయంతి మాం । యోగేన నియతవ్రతాః ।
సర్వార్పకస్య దేహే సా । స్వయమేవ సముల్లసేత్ ॥

(అమ్మా పరమేశ్వరీ! సర్వార్పణ జేసి నిన్ను ఆశ్రయించిన వారలై యోగముచే నీ ప్రబోధమును గాంచుచూ నీయందే నియత వ్రతులై యుండు యోగులయందు నీవు స్వయముగ భాసింతువు)

– ప్రచండ చండీ త్రిశతి

❀ ❀ ❀ ❀

కారణ జన్ములు కవచ, కిరీటాదులతో కనిపించరు. వారు అతి సామాన్యులై అందరిలో మెలుగుతూ ఉంటారు. ఒకానొక నిర్దిష్ట సమయమునందు మాత్రమే వారి విశేషజ్ఞత నలుగురికి తెలుస్తుంది. పదిహేడు సంవత్సరముల వఱకు భగవాన్ శ్రీ రమణ మహర్షి మామూలు 'వెంకటార్మన్' మాత్రమే. అతనిలో ఆకస్మికముగా కలిగిన మార్పునకు ఏది కారణము యనిన ఎవ్వరు చెప్పగలరు ? అది భగవత్ సంకల్పము. యోగులలో కొందరు సిద్ధులుందురు. మౌనులుందురు. విచిత్రచేష్టలు చేయువారుందురు.

వారు నిరంతర యోగమునందు ఉందురా? లేదా అనునది వారికే తెలియును. సామాన్యులకు ఇటువంటివి తెలియవు. కావుననే 'జ్ఞానిని' జ్ఞానియే తెలుసుకొనగలడు అని అంటారు పెద్దలు.

సూర్యగణపతి ఆరు ఏండ్ల వరకు బాగుగానే పెరిగినాడు. శైశవ దశ చక్కగానే వెళ్ళిపోయినది. ఆతనిలో ఉన్న లోప మంతా ఒక్కటే. అతను మాటలాడడు, అందరు చెప్పినవీ అర్థం అవుతాయి. కాని 'అమ్మా' అనరా అంటే అనడు. ఆటలయందు పాటలయందు ఆసక్తి లేదు. తిండి మీద ధ్యాస ఉండదు. అన్ని పనులూ బలవంతాన చేయించడమే! ఎప్పుడూ కండ్లు మూసుకుని ఉంటాడు. అప్పుడప్పుడు తెలివి తప్పేవాడు. తరచు ఒంట్లో వెచ్చదనం కానవచ్చేది. ఎంతో ముద్దుగా పెరిగిన చిన్నారి అవస్థ తల్లిదండ్రులకు నిరాశ కలిగించింది.

బాలుడు రోగి యని బంధువులు, గ్రామస్థులు అనేవారు. మూగ యని మూర్ఛరోగ మున్నదని అందరూ అంటూ ఉంటే తల్లి మనస్సు క్షోభించింది. నృసింహ శాస్త్రికి పాలుపోలేదు. బాలునియందు ఎట్టి అనారోగ్య లక్షణములు గానరావు. చివరికి నాడీ శుద్ధికై వైద్యశాస్త్రమునందు చెప్పబడిన చికిత్స ప్రారంభించెను. పసుపు కొమ్మును వేడిచేసి కుడి కణతపై, అమృతనాడిపైన చుఱక వేయసాగెను.

ఈ విధముగా కొన్ని రోజులు చేయగానే, అంతర్గత శక్తి పెల్లుబికిందో యేమో బాలుని యందు ఆశ్చర్య జనకమైన చైతన్యం వచ్చింది. "అమ్మా"! అని నోట పలికాడు. ఆ దంపతుల ఆనందానికి మేరలేదు. అతని యందలి వాణి అతి స్వచ్ఛమై, సరళమై, పలుకులు గుత్తులు గుత్తులుగా సాహిత్య శైలిలో రాతొడగెను. ఆ బాలుని భావ ప్రకటన, మాటల సరళి యతడు బాల

కుడా లేక పండితుడా యను విస్మయము కలిగించుచుండెను. సరస్వతి బాలకుని నాలుకపై తాండవించెను. అది మూర్ఖుడైన యింతటి చైతన్యము ఒక్కసారి వచ్చునా! తన వైద్యమే ఈ చైతన్యమునకు కారణమా యని తండ్రి విస్మయము చెందెను. అందరునూ సంతసించిరి.

తదనంతర కాలములో నృసింహశాస్త్రి శ్రీ రమణ భగవాన్ దర్శనము చేసికొనెను. వారి దర్శన భాగ్యమున నతనికి ఏమి తెలిసినదో గాని తాను గణపతికి బాల్యమునందు చేసిన చికిత్స హార పాటని యెంచెనట. అతని మనోవేదనను, సోదరి శ్రీమతి పప్పు విశాలాక్షి "వాసిష్ట విజయము" అను గ్రంథమునందు ఇలా తెలియజేసియున్నారు.

అ మౌన మా దీక్ష అది మూగ తనమని
వైద్యంబు జేసితి హా! కుమార
మంజు భాషణములు మనసార వీక్షింప
నతికాంక్ష నందితి హా! కుమార
అవతార తత్త్వంబు నతి ప్రేమ వీక్షింప
నట్టి చురక వేస్తి హా! కుమార
నిశ్చలం బైనట్టి నీలీల దెలియక
నజ్ఞాని నైతిని హా! కుమార

రామ కృష్ణుల వోలె పారాడవనుచు
జిత్తచాంచల్య మొందంగ చింతవలన
సాటి బాలుల వలె నిన్ను సాక దలచి
తప్పు జేసితి నేమి నా తనయ నీకు

యోగులు బాలోన్మత్త పిశాచములవలె నుందురట. గణపతి యొక్క యోగ భంగము గావించెనని యతను విచారించెను కాబోలు !

ఏది ఏమైనప్పటికి ఈశ్వర లీలను కాదనే వారెవరు ? ఎలా జరుగవలసి యున్నదో అలా జరిగినది. బాలకుడు అతి చైతన్యవంతుడు "బాల కోకిల" అయినాడు.

## 6. విద్యాభ్యాసము

"సత్యమితి, సత్యవాచా రాథీతర ః
తప ఇతి తపోనిత్య ః పౌరుశిష్టి ః
స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్య ః"

[రథీతర పుత్రుడగు సత్య వచస్సు అనెడి మహర్షి సత్యము గొప్పదనెను. పురుశిష్ట పుత్రుడగు తపోనిత్యుడను మహర్షి తపము గొప్పదనెను. ముద్గల పుత్రుడగు నాకుడను మహర్షి స్వాధ్యాయ ప్రవచనములే గొప్పవనెను.]

* * * *

స్వాధ్యాయము అనగా చదువుట. ప్రవచనము యన నింకొకరికి చెప్పుట. గురు శిష్య బంధమునకు ఇది మూలము. నిజానికి చదువు విద్యార్థి దశకు మాత్రమే అంకితము కాలేదు. వేదములు చదువుతూ ఒక మహర్షి వేదాధ్యయనమునకు మరి యొక్క జన్మను కూడా కోరుకొన్నాడట. కావున విద్యయనేది ఒక సుదీర్ఘమైన సాధన. ప్రఖ్యాత రాజకీయవేత్త, స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రజ్ఞావంతుడు అయిన C. D దేశ్‌ముఖ్ ఒకసారి అన్న మాటలివి. "సంస్కృత మహాకవుల పరంపరలో శ్రీ గణపతి మునీంద్రులు కడపటివారు. "ఈ మాట ముమ్మాటికి నిజమే. మన వేద సంస్కృతీ

దర్శన భాగ్యం సంస్కృత భాషాధ్యయనం వలన కలుగుతుంది. కావున దానిని దేవ భాష అని అన్నారు. విదేశీయుల పరిపాలన, అనేక నూతన మత ప్రచారకుల తాకిడి ఇత్యాదులకు గురియై వేద సంస్కృతితో పాటు సంస్కృత భాషకూడ జనావళికి దూర మయింది. ఆంగ్లేయుల పాలనలో ఆంగ్లము విద్యాబోధన యందు వచ్చుటచే క్రమ క్రమముగా పాశ్చాత్య నాగరికత భారతీయుల జీవితంలో ప్రవేశించసాగింది. అటువంటి సమయంలో కూడ గణ పతి ముని వంటి మహా కవిని, దేశ ప్రజలు చూడగలిగారంటే ఆ ఘనత యాతని తండ్రి నృసింహ శాస్త్రికి దక్కుతుంది.

కారణం నృసింహ శాస్త్రికి గురుకులాధ్యయనము నందు గల ప్రీతి, సంస్కృత ఆంధ్రభాషలయందుగల అభిమానము. ముందు గా ఉపనయనము చేసి మంత్రదీక్ష నిచ్చి విద్యార్థిని గురుకులము పంపుట యాచారము. అచట స్వాధ్యాయ ప్రవచనములతో పాటు తపస్సుకూడ విద్యయందంతర్భాగమై యుండును. ''తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ, దమశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ ''అనే వేదమంత్రములు ఇందులకు తార్కాణము.

శ్రీ గణపతి మునీంద్రులు భాషనభ్యసించుటకు ''తపస్సు''ను ఒక ఉపాయముగా చెప్పియున్నారు. 1927 వ సంవత్సరమున ఫిబ్రవరి 16, 17, 18 తారీఖులలో జరుపబడిన శ్రీ కృష్ణ దేవ రాయ భాషా నిలయ రజతోత్సవములలో వీరిచ్చిన అధ్యక్ష ఉప న్యాసము నందు ''తపస్సు'' విద్యార్థికి ఏవిధముగా తోడ్పడు తుందో చెప్పియున్నారు. సంగ్రహముగా వారు తెలియ జేసిన సూచన యిది.

"భాష నభ్యసించుటకు రెండు ఉపాయములు గలవు. ఒకటి పూర్ణముగా చదువుకొనుట, ఇంకొకటి తపస్సు చేయుట. సంస్కృతము నందుగాని, యాంధ్రము నందుగాని మహాకవులందరును తపశ్శక్తి చేతనే గొప్పగొప్ప ప్రబంధములను వ్రాసినారని మనకు తెలియుచున్నది. తపోబలము వలన మూలాధారము నందలి పరావాక్కు శక్తి గలదై ఉపాసకుల ననుగ్రహించును. పరావాక్కు అనుగ్రహించిన వానియొక్క వాణి నిరంకుశమై సర్వతోముఖముగ బ్రసరించును. సాధారణముగ జదువుట గుఱించి నాకు మంచి యభిప్రాయమున్నను, తపస్సునే యధికముగ నమ్ముచున్నాను. అనేక సంవత్సరములు చదివిన వానికంటె కొన్ని మాసములు తపస్సు చేసిన వాడే అధిక వాక్ఛక్తి సంపన్నుడై యున్నాడు. బయటి గ్రంథాలయము లన్నింటి కంటెను తపో మూలాధార గ్రంథాలయము గొప్పది. ఆ మూలాధార గ్రంథాలయమునకు "బ్రహ్మ గ్రంధి"యనెడు బీగము వేయబడియున్నది. దానిని తెరచుటకు ఉపాయము తపస్సే కనుక ఒక్కొక్క విద్యార్థియు, ఒక్కొక్క గ్రంథావలోకియు, ఒక్కొక్క కవియు ప్రతి దినమూ జప రూపకమగు తపస్సు చేసి ఆ గ్రంధిని తెరచుటకు ప్రయత్నించు చుండవలెను. అప్పుడు ప్రపంచము నంతటిని ఇముడ్చుకొనిన తన లోపలి గ్రంథాలయము తెరువబడును"

శాస్త్రజ్ఞానముతో పాటు నైతిక విలువలను కూడ అభ్యసించిన నాడే విద్యార్థి పరిపూర్ణుడగును. గురుకుల పాఠశాల విద్యా బోధన యిది.

దూరదృష్టి గల నృసింహ శాస్త్రి ముందుగా సూర్యగణపతికి ఉపనయనము గావించి, గాయత్రీ మంత్రముతో బాటు ద్వాదశ

మంత్రములందు దీక్ష నిచ్చినవాడై తాను అతనికి ఉపాసనా గురువయ్యెను.

పూర్వకాలము వలె గురుకుల పాఠశాలలు లేనందున సోదరుడైన ప్రకాశశాస్త్రి వద్ద సంస్కృతాంధ్రములు నేర్చుకొనుటకై బాలకుని పంపుచుండెను. గణపతి ఏకసంథాగ్రాహి. ఒకసారి చదివిన పాఠమును మరల చూడకనే వప్పచెప్పుచుండెను. కావున ఎనిమిదవ ఏడు రాకమునుపే అమరము, బాలరామాయణము, శివసహస్రము ఇత్యాది ప్రాథమిక గ్రంథములను చదివి ముగించెను.

తండ్రివద్ద జ్యోతిషము నేర్చుకొనుచూ, పంచాంగ గణనమునందు నూతన పద్ధతిని కనిపెట్టి తన తొమ్మిదవ ఏట పంచాంగమును స్వయముగా వ్రాసెను.

భవిష్యత్తును జెప్పుట గణపతికి దైవదత్తముగా వచ్చినవిద్య. ప్రశ్నఫలము బాలుడు చెప్పినట్లుగా జరుగుచుండెను. ఇది అందరికీ విస్మయ కారణమై ఉండెను. చుట్టుప్రక్కల నుండి ప్రజలు తండోప తండలుగా వారి వారి సమస్యల తోరణములతో గణపతి వద్దకు వచ్చి, బాలుని సమాధానముతో తృప్తి చెంది వెళ్ళుచుండెడివారు. ఈ విధముగా బాలగణపతి కీర్తి నలుమూలలా వ్యాపించెను.

క్రీడల యందు కూడ అతడు నాయకుడే. ముఖ్యముగా చదరంగము, పేట్లపేక, ఈత పోట్లలో గణపతి సామర్ధ్యము అధికము. పేక ఒకసారి కలిపిన తరువాత ఎవరి వద్ద ఏముక్క కలదో వారికి కరతలామలకము.

పది ఏండ్లు నిండులోపల శ్రీపతి వ్యాకరణ, తర్క గ్రంథాదులను చదివి ప్రౌఢ అయ్యెను. స్వయముగా సంస్కృతమునందు శ్లోకములు వ్రాయ నారంభించెను. ఈ విధముగా గణపతి యొక్క అతిశీఘ్ర పురోభివృద్ధి గాంచి గురువులైన ప్రకాశ శాస్త్రి, వెంకట శాస్త్రి, వెంకటేశ్వర ఘనపాఠి బాలుని పరీక్షింపగోరి భారతము నందలి పాండవ ధార్తరాష్ట్రల జన్మమునకు చెందిన వృత్తాంతమును ఘటికాద్వయ కాలమునందు అనగా 48 నిముషముల లోపల శ్లోక రూపమున వ్రాయుమనిరి.

గణపతియు నిముషమునకు ఒక శ్లోకము చొప్పున 34 నిముషములలో "పాండవ ధార్తరాష్ట్ర సంభవము'' అను పేరట ఒక ఖండ కావ్యమును వ్రాసి ముగించెను. కొన్ని శ్లోకములు :

## మంగళ శ్లోకము

శ్లో॥ జగద్గురూనహం వందే బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్ ।
వాణీలక్ష్మీ శివానాథాన్ సృష్టి స్థిత్యంత కారిణః ॥

## కావ్యము

1\. యశోభిర్దిగిభ శ్రేణీ దంతకాంతి మలిమ్లుచైః ।
మండితః పాండురిత్యాసీ ద్భారతో భారతే నృప॥

2. తస్య సర్వాంగమజ్ఞస్య ప్రజ్ఞయైవ విలోచనీ ।
ధృతరాష్ట్ర ఇతి భ్రాతా జ్యేష్ఠః శ్రేష్ఠనుతేర భూత్ ॥

గురువులు బాల గణపతి పాండిత్య ప్రజ్ఞకు విస్మయము చెందిరి. గణపతి "సుకన్యా చరితము" అనే ఖండ కావ్యమును గూడ బాల్యమునందే వ్రాసి తండ్రిని సంతోషింప జేసెను.

## 7. మేలు కొలుపు

శ్లో॥ గణపతయే స్తనఘటయోః పదకమలే సప్తలోక భక్తేభ్యః।
అధరపుటే త్రిపురజితే దదాసి పీయూష మంబః త్వమ్ ॥

[అమ్మా: నీవు పుత్రుడగు గణపతికి చనుబాలద్వారా అమృతమును, సప్తలోకము లందలి భక్తులకు చరణారవిందముల నుండి అమృతమును (మకరందము) త్రిపురములను జయించిన కాంతుడగు హరునకు అధరపుటములందలి అమృతమును (రసరూపమును) ఇచ్చుచున్నావు].

– ఉమా సహస్రము

* * * *

మృతమునకు వ్యతిరేకమైనది అమృతము. జ్ఞానము అమృత తుల్యము: ఏలయన దానికి మరణములేదు. అందుండి ప్రకటింపబడేవి కళలు. కావున అవికూడ అమృతతుల్యములే. ఒక కళ యందలి రసానుభూతిని మకరందము అని అందురు. "చిత్" శక్తి స్వరూపమైన పరమేశ్వరి యొక్క జ్ఞాన శక్తి సాధకుల మనోబుద్ధుల ద్వారా ప్రకటితమై వారియందు కళావికాసనము కలిగించు

చుండును. శ్రోతలు కళారాధకులై మకరంద రసానుభూతిని చెందుచుందురు.

పరమేశ్వరీ చిద్విలాసమైన అమృత రసము సుతునకు చను బాలు ద్వారాను, భక్తులకు చరణారవింద సేవమూలముననూ, భర్తయైన ఈశునకు అధరపుటముల నుండియు అనుభూతమగునని ఈ శ్లోకమునందు తెల్పబడినది. గణపతి తాను పార్వతీదేవి యొక్క ఔరస పుత్రుడు గావున ఆమె చనుబాలు ద్వారా జ్ఞాన మును పొందుచున్నానని తెలియజేయుచున్నాడు.

శ్రీ యాళి పట్టణమునకు చెందిన శివపాద హృదయర్ భగవతియార్ అను దంపతులకు "ఆళుడై పిళ్ళయార్" అనే కుమారుడు పుట్టాడు. కుమారునకు మూడు ఏండ్లు వయస్సు ఉండగా తండ్రి వాని నెత్తుకొని తిరుత్తోణియప్పర్ అను కోవెల ప్రాకారంలో గల కొలనులో స్నానముచేయుటకై వెళ్ళియుండెను. ఒడ్డున బిడ్డను దింపి అఘమర్షణ మంత్రం జపిస్తూ తండ్రి కొలనులో మునిగి స్నానం చేస్తూ ఉంటే, తండ్రి కనిపించనందున బిడ్డ తపిస్తూ "అమ్మా, అప్పా" అని భోరున ఏడవడం ప్రారంభిం చాడు. అప్పుడు వృషభ వాహనా రూఢులై పార్వతీపరమేశ్వరులు అటు వెళ్ళుతున్నారట. బాలుని ఏడుపు విని శివుడు అంబికను "నీ చనుబాలు ఈయుము" అన్నాడట. ఆమె అటులనే పాలు ఇచ్చింది. ఆ జ్ఞాన పయస్సుని త్రాగిన బాలకుడు వెంటనే మధు రాతి మధురమైన కవిత్వం ప్రారంభించాడట. అతడే ద్రవిడ శిశువు అని చెప్పబడే జ్ఞాన సంబంధర్

ఇలా ఉంటుంది జగన్మాత కరుణ, దైవాంశమునందు జనిం చిన గణపతిని కూడ ఆమె అటులనే అనుగ్రహించింది. బాల్యము

సుండి మధుర కవిత్వ ధారతో ప్రకాశించిన సూర్యగణపతియు అంబయొక్క అమృత శక్తిని నరసమాంబా స్తన్య దుగ్ధము ద్వారా పొందినాడు. ఏనాడైతే సూర్యతేజం తన గర్భమందు పడిందో ఆనాటినుండి అతిభక్తి జ్ఞానమూర్తిగ ప్రకాశించిందా మాతృమూర్తి. అందరిచే 'గణపతి' యని పిలువబడే యా ముద్దుల పట్టి ఆమెకు సాక్షాత్తు సూర్యనారాయణమూర్తి. దేవతా కర్తవ్య నిర్వహణకై పుట్టిన యా బాలుని యామె దైవ సంపత్తిగానే జూచుచు తనయునిపై భౌతిక ప్రేమకన్న ఆధ్యాత్మిక ప్రేమనే అధికంగా పెంచుకున్నదా పుణ్యమూర్తి.

కారణ జన్ములను కార్యోన్ముఖులను జేయుట దైవ నిర్ణయ ముపై ఉంటుంది. భవబంధముల మధ్య వారిని కట్టి యుంచుట సాధ్యము కాదు. శుద్ధోదన చక్రవర్తి కుమారుడైన సిద్ధార్థుని అంతః పుర వాసమునకు పరిమితము చేయ తండ్రి యత్నించగా, ఒక్క విహార యాత్రే అ కుమారుని కండ్లు తెరపించి విరాగిని చేయలేదా! అటులనే గృహమే స్వర్గసీమగా, చిలుక పలుకులు పలికే సూర్య గణపతికి కూడ "మేలుకొలుపు" కలిగించే సమయ మాసన్న మైనది.

సర్వధారి సంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమీ(12-10-1888) దివస మది. ఇంటియందలి లోపసారాలో కూర్చుని భోజనమునకై విస్తర్లు కుట్టుచుండెను నరసమాంబ. గణపతియు అచటనే పుస్త కము చదువుతూ కూర్చుని యుండెను. నరసమాంబ నిండు గర్భ వతి, పురిటి రోజులు దగ్గర పడ్డవి. ఆరోజు ఆమెయందు బడలిక, ఆయాసము, నీరసము అధికముగా నుండెను. సహజముగ నెమ్మ దస్తురాలు గావున ఆమె తన యవస్థను ఎవ్వరికీ చెప్పలేదు.

పురుడు వచ్చునను అనుమానంతో ఆమె కుమారుని జూచి "సూర్యం" అని పిలచినది.

పుస్తకమునందే లగ్నమై యున్న గణపతి అమ్మ పిలుపును విన్నప్పటికీ దృష్టి మరల్చక "ఏమమ్మా" అన్నాడు.

"ఈరోజు పురుడు వస్తే మంచిదేనా నాయనా ?"

అమ్మ అలాఎందులకై అడుగుచున్నదో సుతుడు ఆలోచించ లేదు. పుస్తకమునందే దృష్టినుంచి బహుకాకతాళీయంగా "పురుడు వస్తే కవల పిల్లలు పుడతారు. తల్లీ, పిల్లలు చనిపోతారు" అన్నాడు.

అచటనే కూర్చుని అంతా వింటున్న వర్రికాశశాస్త్రికి పిడుగు పడినట్లనిపించింది. నరసమాంబ ఎందుకలా అడిగినదో అతనికి తెలుసును. వివేచన లేకుండా ప్రశ్నఫలము కర్కశంగా చెప్పిన గణపతిని యతడు మందలించాడు. బాలుని కండ్లలో నీళ్ళు తిరిగాయి.

అయితే భక్తియే ఉత్కృష్టమని తలచెడి యా మాతృ మూర్తికి పరమేశ్వరుని కౌశలము తెలుసును. కావున ఆమె చలించ లేదు. తనయుడు తనకి ముక్తి హేతువని గ్రహించి, అశ్రుపూరిత నయనాలతో పరమానంద భరితురాలై, కుమారుని కౌగలించుకొని ఓదార్చింది.

బాలవాక్కు బ్రహ్మవాక్కయినది. ఆ సాయంత్రము ఆమె కవల పిల్లలకు జన్మనిచ్చి, పిల్లలతోపాటు స్వర్గస్తురాలయినది. మరుక్షణం ఆనందదాయకమైన ఆయింట శోకదేవత తాండవించినది.

ఇల్లంతా జనసందోహమైనది. 'హా! హా!' కారాలు ఏడుపులు మధ్య గణపతిని మందలించారు కొందరు.

అయితే గణపతి దృష్టి ఇహమందు లేదు. బంధువుల మందలింపులు అతని చెవికెక్కనేలేదు. మనస్సు అంతర్ముఖమైనది. అమ్మ ఇక లేదే అనే శోకంకన్నా, మరణమింత ఘోరమైనదా? మరణించువాడెవడు? మూడునాళ్ళ ముచ్చటయగు జీవితమందు సాధించవలసినదేది? అనే ప్రశ్నల పరంపరలో సత్యాన్వేషకుడైనాడు. పూతచరితురాలైన నరసమాంబ కుమారునకు కర్తవ్యము బోధించునదై యాతని తొలి ఆధ్యాత్మిక గురువైనది.

మధుర రాగము లాలపించిన మోహన వీణ మూగవోయింది. నిశ్శబ్దం సర్వత్రా వ్యాపించింది.

## 8. హితోపదేశము

శ్లో॥ బ్రహ్మాండే యావదస్తీహ హృదితావచ్చ విద్యతే ।
వ్యష్టేరనుభవో యావాంస్తతో, మనసి నాధికమ్ ॥

[బ్రహ్మాండమున ఎంత కలదో అంతయు హృదయమున కలదు. వ్యక్తి యొక్క అనుభవమెంతో అంతే మనసున కలదు. కావున ప్రజ్ఞతో జూచినవాడు సర్వమును తెలియ గలడు].

— విశ్వ మీమాంస, గణపతిముని.

* * *

'జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యమేల' అంటారు పెద్దలు. జగమెరుగుట యనగా ప్రపంచమంతా తిరుగుటకాదు. తన్ను తాను దెలసికొనుట. హృదయమునందు ఈ ప్రపంచ మంతయు కలదు. కావున నిజమైన సాధకునకు హృదయనిష్ట అవసరము. అదియే ప్రజ్ఞ అనబడును. మనస్సును హృదయమునందు నిలుపుటద్వారా ఇది సాధ్యమగును. మనస్సు పరిమితమైన కాంతి. వ్యక్తి యొక్క అనుభవమునకు మించి తెలిపే శక్తి దానికి లేదు. కావున హృదయ నిష్ఠ చిరంతనమైననాడే క్రాంత దర్శకత్వము కలుగును. అటువంటి క్రాంత దర్శకుడే నిజమైన కవి. కేవలము భూత, భవిష్యత్ వర్తమానములందు వాక్కును దగులనీయక పరమేశ్వరీ చరణ సేవకుడై, ఆమె భజనమునకు వాణిని పరిమితము చేసిన నాడు వాక్కు శ్లాఘనీయమైన వైభవము నొందును. అమ్మ మరణానంతరము గణపతి గ్రహించిన సత్యమిది.

శ్లో॥ మమతు విమలా హృద్యా విద్యా మహేశ్వరీ యా భవ
న్మనసిచ పరా చిత్రా శక్తి శ్చిరన్తని యా భవత్ ।
వచసిచ మహద్ భాగ్యం శ్లాఘ్యం యదీడ్యతమే భవత్
తదయి గలితం మత్తో విత్త త్రయం భవతో భువి. ॥

అమ్మా! మహేశ్వరీ! ఈడ్యతమా! నాకు (పూర్వము) విమలమగు హృదయ విద్య ఉండెడిది. చిరంతనీయమగు అద్భుతశక్తి యుండెడిది. వాక్కునందు శ్లాఘనీయమగు వైభవ ముండెడిది. ఇపుడు ఈ భూలోకమున జన్మించిన నాటినుండి ఈ విత్తత్రియం జారిపోయినది.

— ఉమాసహస్రము

అమ్మ గతించి రెండు నెలలైనప్పటికి పరమేశ్వరీ శరణార్థి యైన గణపతి తన మౌనమును వీడకుండెను. చదువుల యందు గాని, ఆటల యందుగాని యతడు ఆసక్తి జూపలేదు. ఏకాంత మును కోరుకొనుచుండెను. ఏదియో కర్తవ్యమును అన్వేషించు వానివలె అతడు కనుపించుచుండెను. తల్లి మరణించుటచే బాలుడు దుఃఖించు చున్నాడని మొదట అందరూ అనుకున్నారు. ఎక్కు వగా మందలించినందువల్ల అలిగినాడని కొందరన్నారు. గణపతిని అధికముగ మందలించినది ప్రకాశశాస్త్రి. అతడు బాలుని సమీపించి శతవిధముల నచ్చజెప్పెను. నిజముగ అలిగిన గదా ఓదార్పు! గురువు చెప్పినదంతయు గణపతి వినెను. వినయము, గౌరవము మందహాసము అన్నియు ప్రకటితమగుతుండెను. కాని ససేమిరా మాటలాడకుండెను.

అటు భార్యావియోగముచే నృసింహశాస్త్రి క్రుంగియుండెను. అతని వయస్సు 43 సం॥లు. నడిమివయస్సున భార్య గతించినది. ఒక ప్రక్క చినిగిన విస్తారైన సంసారము, మరియొక వంక చిత్ర స్వభావముగల తనయుడు. వివేకముతో, శాంతచిత్తుడై ధైర్యము వదలక పరిస్థితుల నెదుర్కొనుచుండెను.

ఏడు సంవత్సరముల వరకు గణపతికి గల తూష్ణీకస్థితి ఈ విధముగనే యుండినది. పూర్వము పసివాడు. ఇప్పుడు కించిత్ వివేకము గలదు. కావున మెల్లగ మృదు వచనములతో బాలుని పీడించుచున్న సమస్య ఏదియో నెరుంగవలెను. ఇట్లు తలచినవాడై నృసింహశాస్త్రి ఒకరోజు మధ్యాహ్నము భోజనములయిన తరువాత గణపతిని సమీపించి హితోపదేశము చేయసాగెను.

నృ : నాన్నా! చనిపోయిన తల్లి తిరిగిరాదు. రెండు మాసములుగా వ్యాకులము చెందుచున్నావు. ఎన్నాళ్ళని యిటులుందువు? లెమ్ము : గురువులు నీకై వేచియున్నారు. చదువుపై దృష్టి మరల్చుము.

గణపతి వంచిన తలయెత్తి వినయ పూర్వకముగ తండ్రిని జూచెను.

నృ : అందరూ నిన్ను తిట్టినందుకు అలుగుతున్నావా? అమ్మ మరణమునకు నీవు కారణమెట్లగుదువు? జరుగవలసినదిజరిగినది. అందు నీదోషములేదు. లెమ్ము. వెనుకటివలె దిరుగాడుము. నీవు కళకళలాడిన నా దుఃఖము కూడ ఉపశమించును.

తండ్రికి ఏమని సమాధానం చెప్పాలో గణపతికే తెలియలేదు. తనకు గావలసినదేదో తనకే తెలియదు. తండ్రి పరిస్థితి తెలియని వాడు కాదు. మాటలాడుటకు మనస్కరించక మౌనమునందే తండ్రి మాటలను వినుచున్నాడు. పుత్రుని మొండితనము తండ్రికి కోపకారణమైనది.

నృ : (తీవ్రస్వరముతో) మహర్షులు, తపోధనులు మౌనము వహింతురు. అది తపస్సు, యోగము. నీవు అటులలేవు. నీకు భౌతిక దృష్టి గలదు. ఇది మొండితనమగును. ఇది అవివేకుల లక్షణము.

"తపస్సు" - తండ్రి ముఖమునుండి వెలువడిన సందేశమిది. తాను తపస్సు చేయవలయును. సత్యశోధనకు ఇదియే సరియైన మార్గము. తన కర్తవ్యము ఏదియో ఇప్పుడు తెలిసినది. హృదయమునందే పరమేశ్వరికి నమస్కరించినవాడై, సంతోషముతో మౌన త్యాగము చేసినవాడై తండ్రితో యిట్లనెను.

గణ : నాన్నగారూ! నాకు "తపస్సు" చేయవలయునని యున్నది.
అనుగ్రహింపుడు.
గణపతి అలా అనగానే ధృవునిగాథ జ్ఞప్తికివచ్చింది తండ్రికి.

* * * *

ఉత్తాన పాదుడను మహారాజునకు సునీతి, సురుచి, అని ఇరువురు భార్యలు గలరు. అందు ధ్రువుడు సునీతిపుత్రుడు. ఒకనాడు సురుచి కుమారుడైన ఉత్తముని తొడపై కూర్చొన బెట్టుకొని తండ్రి లాలించుచుండగా, ధ్రువునకు కూడ తండ్రి తొడపై గూర్చొన యభిలాష కలిగెను. అంతట పినతల్లి సురుచి పరుష బాషణ ... అతో మందలించెను.

తే॥ తండ్రి తొడనెక్క వేడుక దగిలెనేని
బూని నా గర్భమున నాడె పుట్టకన్య
గర్భమున బుట్టి కోరిన గలదె నేడు,
జనకు తొడ నెక్కు భాగ్యంబు సవతి కొడుక

క॥ అదిగాన నీ వధోక్షజు
పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
యుదరమున బుట్ట జేయును,
వదలక యట్లయిన ముదము వఱలెడి నీకున్

\- భాగవతము

పినతల్లి పరుష వచనములచే గాయపడిన ధృవుడు రోషము చెందినవాడై ఘోర తపంబు జేసియైన తండ్రి తొడనెక్కవలయునని దీక్షబూని అడవులకేగెను. మార్గ మధ్యమున నారదుడు కని

పించి విషయ మెరింగినవాడై తపమొక పవిత్ర యజ్ఞమనియు, క్షణికమైన కోరికలకు అది వినియోగింప వలదనియు, బాలురకు మానావమానములు లేవనియు, సత్పురుషులు వానికతీతులనియు చెప్పి జూచెను. అయినప్పటికీ క్షత్రియపౌరుషము ను వీడని ధ్రువుడు తన పట్టు వదలక, నారదుని మార్గము జూపుమనెను. అంత ఆముని పుంగవుడు మంత్రోపదేశము జేసి బాలుని ఆశీర్వదించెను.

ధ్రువుడు ఆరుమాసములబాటు ఘోర తపస్సు జేయగా వాసు దేవుడు సంతోషించి ప్రత్యక్షమయ్యెను. వాసుదేవునకు దండ ప్రణా మంబు లాచరించి, కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయింప స్తుతి క్రియాకరణ సమర్థుండుగాని పసిబాలుని యవస్థజూచి, యాతని తలంపెరింగి నారాయణుడు వేదమయంబైన తన శంఖంబును యా బాలుని కపాలభాగంబునకు తాకించెను. అంతట దివ్యవాణీ ప్రేరితుడై ధ్రువుడు విష్ణువుని స్తుతించినవాడై వరములను పొందెను.

వాసుదేవుని శంఖము యొక్క స్పర్శతో జ్ఞాననేత్రము విప్పా రిన ధ్రువుడు అల్పమైనకోరికకై ఆరుమాసములు ఘోరతపస్సును వృథాజేసితినని ఆ తరువాత తెలిసినవాడై :-

ఆనాడు నారదుని హితోపదేశమును వినక, క్షణిక క్రోధ ముతో ఆయుర్విహీనుండైన రోగికిం బ్రయోగించు నౌషధంబు బోలి నిరర్థకంబులై నశ్వరంబులైన యీ కామితంబులు గోరితి నని విచారించెను.

మ॥ ధనహీనుండు నృపాలు జేరి మిగులున్ ధాటిన్ ఫలీకారమి
 మ్మని యర్థించినరీతి ముక్తి ఫలదుండై నట్టి పంకజలో

చనుడే చాల ప్రసన్నుడైన నతనిన్ సాంసారికం బర్ధింగో
రిన నావంటి మూఢ మానసులు ధాత్రిన్ గల్గిరే యెవ్వరున్

– భాగవతము

*   *   *   *

తపస్సనే పవిత్ర యజ్ఞమునకు ఎంతయో పరిపక్వమానసుడై సాధకుండుండవలయును. క్షణిక వైరాగ్యములు ద్వారా చేసిన తపస్సు సత్ఫలితములు కలుగజేయదు. అందులకు విద్య యవసరము. ఐదేండ్ల బాలకుడై ధ్రువుని యొక్క విచారమిదియే కదా! గణపతియు బాలకుడే. ముందు అతడు సాహితీ తపస్వి కావలయును. ఆ సాహిత్యము లోకోద్ధరణకు ఉపయోగ పడవలయును. బాలకునియందు తపోబీజము నాటుట యందలి పరమార్ధమిదియే ఆయి యుండవచ్చును.

గణపతి మనస్సెరింగిన నృసింహశాస్త్రి విద్యయందు ముందుగా పరిపూర్ణుడవు కమ్మని తద్వారా వివేకమును పెంచుకొని ఉచితరీతిని తపంబాచరించ వచ్చునని యాతనికి నచ్చ జెప్పెను. గణపతియు అందుల కంగీకరించి మౌనత్యాగముచేసి చదువుల యందు శ్రద్ధజూపసాగెను.

## 9. వివాహము

శ్లో॥ శ్రీఖండ చర్చామివకల్పయన్తో ముహుః కపోలేషు సఖీజనస్య।
శ్రీ కంఠ కాంతా హసితాంకురాణాం శ్రీ మన్తి కుర్వన్తు
జగన్తి భాసః॥

[సఖీజనుల చెక్కిళ్ళ యందు సదా గంధపు పూత పూయునట్లు దోపు శివకామినీ మందహాస వీచికల తళుకు వెలుగులు జగములను శ్రీమంతములుగా నొనర్చుగాత]

– ఉమా సహస్రము

**ఈశుని**కై తపస్సు చేసి విజయము సాధించి, నవయౌవన సుందరాంగియై, కళ్యాణ శోభలతో కళకళలాడే పార్వతీదేవి ముఖారవింద మందహాస ధురిని ఆమె కళ్యాణ ప్రస్తావన సందర్భంగా వర్ణిస్తూ వ్రాసిన శ్లోక రాజమిది. లలితము, మనోహరము, నిర్మలము, శ్రావ్యము మరియు కమనీయము అగు ఈ శ్లోకమునందు మృదు మధుర శృంగార రసమును మేళవించి పరమేశ్వరి నగవులను చందన లేపనముతో సరిపోల్చుట యిందలి విశేషము. ఆహ్లాదము, శుభ్రత, శోభ ఇవి చందన లేపనమందలి అంతర్లీన ధర్మములు. కామారియైన పరమ శివుని యాకర్షించు ధర్మములివి. చందనము అంతర్గత తాపాన్ని ఉపశమింప చేస్తుందట. వాసనా రహితుడైన విశ్వపతి యందు పార్వతీ పాణిగ్రహణ వాంఛకు ఆమె నగవులే కారణమనుచు చందన లేపనమునకు ఉపమేయముగా వర్ణించుట కవితా చమత్కారమగును.

ఆమె నగవు మొలకల తళుకులు సఖియల చెక్కిళ్ళపై గంధపు పూత పూయునట్లున్నవి యనుట యుత్ప్రేక్ష యగును. జయ, విజయ అనువారు ఆమె సఖీమణులని శివ పురాణము నందు గలదు. పార్వతియొక్క మందహాస వీచికలు జయ విజయ పతాకములను భావము గూడ ఇందు కనిపించుచున్నది. జగములను ఈ జయ, విజయ ప్రభలతో శ్రీమంతములుగా నొనర్చుమనునది కవి యొక్క ప్రార్థన.

తన కళ్యాణ వైభవమును ఇంతటి మనోహరంగా ప్రస్తావించే కావ్యదృష్టి భవితవ్యంలో గృహస్థాశ్రమ జీవనంద్వారానే అలవడుతుందన్న తలంపేమో, "తపస్సు, తపస్సు" అని పాకులాడే సుతునకు చక్కని కన్నియను జోడుచేసి గణపతిని కళ్యాణ చక్రవర్తిని చేసినదాజగజ్జననీ.

*   *   *   *

బొబ్బిలితాలూకాలో కలువరాయి గ్రామమునకు సమీపములోనే "బొమ్మికపాడు" యను పేరట అగ్రహారము గలదు. అందు కర్రిభూషణశర్మయను శ్రోత్రియుడు వసించుచుండెను. అతని ఏకైక కుమార్తె విశాలాక్షి. చక్కని తలకట్టు, నిడువాటి వాల్జడ, పేరుకు తగ్గట్లు విశాల నేత్రములు, పసిమిఛాయ, కుదురగు అంగ సౌష్ఠవముగల యా బాలిక బహు సౌందర్యవతి. జాతకమునందు ఆమె ఋషిపత్ని యగునని కలదట. కావున అటువంటి వరునకై భూషణము నలువైపులా గాలించుచుండెను. అదే సమయమునందు గణపతి యొక్క ప్రజ్ఞా పాటవములు యాతని చెవి సోకినవి. ఆ బాలకుడు తగిన వరుడు కావచ్చునని యెంచి అతడు కలువరాయి గ్రామమునకు మంచి రోజు చూసుకొని బయలుదేరినాడు.

పిల్లనిచ్చుటకై వచ్చిన భూషణమును నృసింహశాస్త్రి ఉచిత రీతిని యాదరించెను. వారిరువురును విశాలాక్షి గణపతుల జాతకములను పరిశీలించిరి. ఉభయుల జాతకములు పొందికగా యుండుటచే వారి వివాహమునకు ఇరువురును సమ్మతించిరి.

తండ్రి తన వివాహమును దలపెట్టెనను వార్త దెలిసి "తపస్సు"పై దృష్టిగల గణపతి తండ్రిని సమీపించి యిట్లు ప్రశ్నించెను.

గణ :- నాన్నగారూ ! నాకు వివాహము జేయదలచితిరా ?

నృ :- (సంతోషముతో పుత్రుని జూచి) అవును.

గణ :- తపము సలుపుటకు వివాహము ఆటంకము కాజాలదా?

నృ :- కాజాలదు. ఋషికుల ధర్మమునందు తపమునకై వివాహము నిషేధింపబడలేదు. మన ప్రాచీన ఋషులు వివాహితులే. వారు తపస్సు కూడ చేసి యున్నారు. అదియునుగాక నీకు జాతకము నందు సన్యాస యోగము లేదు. కావున పెండ్లియాడి, ఋషికుల ధర్మమును పాలింపుము.

జాతక శాస్త్రమునందు గణపతికి విశేష పరిచయము గలదు. తనకు సన్యాస యోగము లేదను మాట వాస్తవమే. కావున యతడు నిర్ణయమును తండ్రికే వదలి వేసెను.

బాలికకు ఎనిమిది ఏండ్లు రాగానే పెండ్లి జరిపించు రోజులవి. "అష్ట వర్షా భవేత్ కన్యా...." అను మంత్రము అలనాటి యా ఆచారమును సూచించుచున్నది. అవిధముగనే పెద్దలచే నిర్ణయింపబడిన శుభ ముహూర్తము నందు 12 సం॥లు వయస్సుగల గణపతికి 8 సం॥ల బాలికైన విశాలాక్షి నిచ్చి కడు వైభవముగా వివాహము గావించిరి.

[తదుపరి కాలములోగూడ గణపతిముని తన శిష్యులెవ్వరికిని సన్యాసమును ప్రోత్సహించలేదు. వివాహము వద్దని తపము చేసెదనని పట్టుపట్టిన యతని కుమారుని కూడ పెండ్లి చేసుకొనుమని వారు నచ్చజెప్పిరి. ఆరోజులలో దివ్య జ్ఞాన సమాజము వారు

శ్రీకృష్ణునివంటి వేద పురుషునిగ ఒకబాలుని మంత్ర, తంత్ర యోగ దీక్షాదులతో తరిఫీదు ఈయవలయునని ఎంచి గణపతిముని కుమారుడయిన మహాదేవుని ఎంపికచేసి వారికియ్యవలనగా వారు నిరాకరించిరి.

భార్యా వియోగానంతరము గూడ అందరు ఎదురు చూసినట్లు అతను సన్యసించలేదు. తాపసికులు ఆధ్యాత్మిక సీమకే పరిమితము గాకుండా, దేశ క్షేమము, ప్రజాసేవ, దేశము యొక్క ఆర్ధిక సాంఘిక వ్యవస్థలయందు గూడ దృష్టినుంచవలయునన్నది యాతని యభిమతము. వాత్స్యాయన మహర్షి వలెనే అతను వ్రాసిన కామ సూత్రములు, గృహస్థ జీవన ధర్మములను సూచించు 'సదాచార బోధిని' ఇత్యాధి గ్రంధములను గమనించిన అతని సమాజ సేవా దృష్టి విస్తృతమైనదని తెలియుచున్నది.]

## 10. సాహితీ వైభవము

శ్లో॥ వందామహే మహాదేవం యస్యవందారవో జనాః।
నవిందతి పునర్మాతుః కుచ కుంభ పయోరసమ్॥

[ఎవరికి నమస్కరించి జనులు తల్లి పాలను త్రాగుటకు మరల జన్మించరో అట్టి మహాదేవునకు నా నమస్కారములు]

—గణపతిముని (బాల్యరచన)

.... .... .... ....

సాహితీ తపస్సీమలో విద్యాభ్యాస మొక సాధనా ప్రక్రియ మాత్రమే. ఇందు సంపూర్ణ ఫలము నొందు సాధకులు బహు

తక్కువ. కేవలము శాస్త్ర పరిచయము తోడను, డిగ్రీ పొందుట వలనను విద్య పరిపూర్ణము కాజాలదు. విద్యార్థి సాహితీ ప్రపంచ మందు జీవించవలెనంటే శాస్త్ర మూలాన్వేషణ యందు అతని చొరవ నల్లేరుపై బండివలె నుండవలెను. తనకంటూ ఒక శైలి, విమర్శనాత్మక దృష్టి. స్వతంత్ర భావన, గమనము, భాషపై అధికారము మొదలగునవి పరిపూర్ణుడయిన విద్యార్థి యందు కన పడే లక్షణములు.

పధ్నాల్గు సంవత్సరముల వయస్సు నిండక మునుపే పంచ కావ్యములను ముగించిన గణపతి చంపూ రామాయణము, శాకుం తలము, ఉత్తరరామ చరిత్రము, కువలయానందము, చంద్రా లోకము, ప్రతాపరుద్రీయము ఇత్యాది శ్రేష్ఠమైన గ్రంథములను చదివి ముగించినవాడై, సంస్కృత భాషపై అధికారమును సంపా దించి, తనదంటూ ఒక ప్రత్యేక శైలిని అలవరుచుకొని పండిత ప్రశంసల నొందెను.

దేశకాల పరిస్థితుల ననుసరించి కవితాదృష్టి మారవలయు నను యభిప్రాయము యీబాలకునకు బాల్యము నుండి గలదు. సాహిత్యము సమాజ వికాసమునకు దోహదము చేయునది కావల యుననియు, కేవలము ఛందోబద్ధమైన పరిమితులందు పయనించు చూ భాంధసవాద ప్రవృత్తమై యుండరాదనియు యతడుతలంచు చుండెను. ఇటువంటి అభిప్రాయముతోనే తన 14 వ॥ ఏట కవితా ప్రపంచమునందు యీ బాలకుడు చేసిన సవాల్ యిది :–

శ్లో॥ ఇహ కేషాంచి దేషాచేన్న సంతోషాయ కాక్షతిః।
కిమానందాయ కాకానాం బాలకోకిల కాకలీ॥

[నా యీ వాణి కొందరల్పజ్ఞులకు సంతోష మీయునిచో నా కేమి నష్టమున్నది? కాకులకు ఆనందమగునని బాలకోకిల ధ్వని చేయునా]

ఎవరో తప్పుపట్టారని గణపతి పలికిన వాక్కులు కావివి. ఇందు అతని స్వతంత్ర దృక్పథం విప్లవాత్మక దృష్టి కానవస్తున్నవి. పురాణేతిహాసాలలో గల అనౌచిత్యాన్ని బాహాటంగా చెప్ప గలిగిన ధైర్యం ఈ మహాకవికి కలిగిందంటే బాల్యము నుండి అతనికి గల స్వతంత్ర భావన, సమాజ సేవాదృష్టి అని చెప్పక తప్పదు. అంతేకాదు భారతీయుల సంస్కృతి సంరక్షణ వేదభాష యైన సంస్కృతమును రాజభాష గావించుట ద్వారా జరుగునని తన యభిప్రాయమును కాంగ్రెసు మహాసభలయందు గాంధీమహాత్మునితో విన్నవించగా అతను కొందరికే తెలిసిన యీ భాషను ఎటుల రాజభాష గావించగలమని ప్రశ్నించెనట. అందుకు గణపతి సంస్కృత భాషను సంస్కరింప బూని, దానిని సులభతరం జేసి అందరికి అందుబాటులో నుండునట్లు "లాలిభాష" యను పేరట వ్రాసి అందరిని ఆశ్చర్య చకితులను చేసెను. ఇది యతని సాహసమునకు నిదర్శనము.

కాళిదాసు విరచితమైన "మేఘసందేశ" మును తెలియని వారుండరు. గణపతి అదేశైలిలో "భృంగ సందేశము" అను కావ్యమును తన భార్య యొక్క నిడుబాటి వాల్జడను దూతగ జేసి వ్రాసెను. కాని యేమని దలచెనో ఆ కావ్యమును తానే చించి పారవైచెను.

మహాకవి కాళిదాసు, ఆది శంకరులు – వీరి ప్రభావం గణపతి రచనలలో కానవస్తుంది. కమనీయమైన కావ్యాలను అందజేయ

టమేగాక గంభీరమైన ఆధ్యాత్మిక జీవనాన్ని ఇతడు ఆదిశంకరుల మార్గంలోనే ఆచరించాడని చెప్పక తప్పదు. ఈ ఇరువురు మహా పురుషులు గణపతికి అత్యంత ప్రియులనుటకు ఈదిగువ శ్లోకములు నిదర్శనములు.

శ్లో॥ కృపావలోకో నగకన్యకాయాః
కరోతుమే నిర్మల మంతరంగమ్ ।
యేనాంకితః శంకర ఏకతత్త్వం
విశ్వం లులోకే జగతే జగౌచ ॥

[ఏకృపావలోకనమున, అంకితుడగు శంకరుడు సమస్తమును ఏకతత్త్వముగా కనుగొని తనదర్శనమును లోకమున కుపదేశించెనో ఆ నగకన్యకా కృపావలోకనము నా యంతరంగమును నిర్మల మొనర్చుగాత]

శ్లో॥ కాలీకటాక్షో వచనాని మహ్యం
దదాతు మోచామద మోచనాని ।
యత్ పాత పూతం రఘువంశకారం
నరాకృతిం ప్రాహు రజస్య నారీమ్ ॥

[ఏ కటాక్ష పాతముచేత - పవిత్రుడగు రఘువంశకారుని (కాళిదాసుని) నరాకృతియగు సరస్వతియే యని పండితులు చెప్పుదురో, ఆ కాళీ కటాక్షము - మోచామదమోచనములగు వచనములను నా కొసగుగాక]

- ఉమాసహస్రము

14-18 ఏండ్ల మధ్యన బొబ్బిలి సంస్థాన పాఠశాలలో వార భోజనములు చేస్తూ గణపతి చదువుకొన్నవాడై వ్యాకరణ సిద్ధాంత కౌముదిని ముగించెను. తన తాతగారి ఊరైన లోగీస అగ్రహారము నందు శ్రేష్ఠమైన పండితుని వద్ద వ్యాకరణాలంకార శాస్త్రములను చదివెను. వాల్మీకి వ్యాస ప్రోక్త పురాణ ఇతిహాసములను పఠించి వాటిని బోధజేయు ప్రజ్ఞనలవరుచుకొనెను.

ఇటులుండ యుక్తవయస్కురాలైన భార్య కాపురమునకు వచ్చినది. ఆమెయు గణపతి ఆశయములను గమనించి అనుకూల వతియై, అన్ని కార్యములందును చేదోడు వాదోడుగా నుండెను. ఆమె కార్యకుశలత, కలుపుగోలుతనము, నడవడిని జూచి మామ గారైన నృశింహశాస్త్రియు, గణపతియు, కుటుంబీకులను చాలా సంతోషించిరి.

## 11. విఫల యత్నము

శ్లో॥ విఘ్నాని యన్మహాంతిదంచ మనశ్చలం యత్
సౌఖ్యం నకించదపి యద్యదుపర్య సౌఖ్యమ్ ।
త్వా మాశ్రితస్యచ మమాఖిల లోకరాజ్ఞి
మత్తః పరో జగతికో మనుజేషు కల్కి ॥

[అమ్మా! సకలలోకరాజ్ఞీ! నిన్నాశ్రయించియు విఘ్నముల నందు చున్నాను. మనస్సు చలించుచున్నది. కాన నాకంటె పాప జన్ము డెవ్వ డుండును?]

— ఉమాశతకము

(గణపతిముని)

ఈ విధముగా పరమేశ్వరిని ప్రార్థించిన వాడై తన దీన స్థితికి తనలోతానే నవ్వుకున్నాడు గణపతి. 'దూసి' నుండి టెక్కలి గ్రామం చేరుకున్నాడు. ప్రయాణ బడలిక వలన, నీరసం ఎక్కువ యింది. మరియొక ప్రక్కన ఆకలి. 'అమ్మా భోజనం పెట్టగలరా!' అని అన్నార్థియై ఓ యింటి గుమ్మముందు నిల్చాడు. పాపం! అలసి పోయిన బాలుని జూచి జాలిచెందిందా యిల్లాలు. కాని ఇంట్లో అందరి భోజనాలు అయిపోయాయి. కొద్దిగా పొడి మెతుకులు మాత్రం మిగిలి ఉన్నాయి. బాలుడే కదా! ఫర్వాలేదు పెట్ట వచ్చు నని దలచి గణపతిని ఇంట్లోకి పిలిచి, పీటవైచి ఆదరంతో పొడి మెతుకులనే వడ్డించింది. ఆకలితో ఉన్న గణపతికి అదియే పంచభక్ష్య పరమాన్నంలా అనిపించింది.తృప్తితో భోజనం చేసి ఆ యింటి అరుగుపై మేను వాల్చాడు. మనస్సు గతంలోకి వెళ్ళింది.

*     *     *     *

గణపతి యిల్లువదలి రెండునెలలు దాటినది. తపస్సుకని భార్య శ్రావణ మాసపు నోములకై పుట్టింటికి వెళ్ళిన తరుణంలో, మిత్రుడు వేంకటేశ్వర శాస్త్రితోను, సోదరుడు భీమశాస్త్రితోను, మిత్రుని సలహాపై రాజమహేంద్రవరం చేరుకున్నాడు. పట్నంలో నాలుగు రోజులున్నారో లేదో, తపస్సు చేయుడం తన వల్లకాదని సోదరుడు భీమశాస్త్రి జారుకున్నాడు.

ఇక మిగిలినవాడు వెంకటేశ్వరశాస్త్రి. తపస్సుకి కావలసిన ఏకాంతమైన జాగా వారికక్కడ కానరాలేదు. పట్టణం మరియు పుణ్యస్థలం కావడంతో జన సందోహం ఎక్కువగా ఉంది. కాబట్టి

వారు కోనసీమ చేరుకుని అచట పేరమ్మ అగ్రహారం సమీపంలో గల కౌశికి నది యొడ్డున సుమారు 45 రోజులు "మహా గణపతి• శివపంచాక్షరి" జపధ్యానముతో తపస్సు చేశారు. క్రమంగా భోజనానికి ఇబ్బంది కలిగింది. చేతిలో రూకలు కూడా లేవు. ధ్యాన సమయములో మనస్సుకి ఏకాగ్రత కుదరడంలేదు. ఇలాంటి సమయంలో వేంకటేశ్వరశాస్త్రి రూకలు పంపుమని ఇంటికి ఉత్తరం వ్రాసాడు. ఫలితంగా ఇంటికి తిరిగి రమ్మని జవాబు వచ్చింది. ఉన్న డబ్బులతో 'సిగడాం' వరకు టిక్కట్టు కొనుక్కొని వారు రైలుప్రయాణం చేశారు. రైలు దిగగానే గణపతి బుద్ధి మారిపోయినది. "నేను కాశీకి పోయెదను. నీవు ఇంటికి మరలుము." అని మిత్రునితో చెప్పి కాలినడకన రామచంద్రపురం అగ్రహారం చేరుకున్నాడు. అరోజు క్షీరాబ్ధి ద్వాదశి గావున యతనికి మంచి భోజనంతో పాటు రెండు అణాలు దక్షిణకూడ లభించింది. ఆడబ్బులతో రైలెక్కి దూసి చేరుకున్నాడు. అచట తన పాండిత్యంతో ఒక శ్రోత్రియుని మెప్పించి యాతడిచ్చిన దక్షిణ పుచ్చుకొని దారిఖర్చులకని దాచుకొని టెక్కలి చేరుకున్నాడు.

* * * *

ఆలోచనా ప్రపంచంలోనుండి మెల్లగా నిదురలోకి జారాడు గణపతి. రాత్రి 7 గం॥లు అయింది. ఇంటి యజమానియైన రామదాసు పంతులు భోజనం ముగించుకొని లాంతరు చేత బట్టుకుని అరుగుపైకి వచ్చినవాడై లాంతరు వెలుతురులో గణపతిని దగ్గరగా చూశాడు. ఆ వెల్తురుకి గణపతికి తెలివి వచ్చింది. "ఏమబ్బాయ్ భోజనం చేస్తావా" అని అడిగాడు రామదాసు. సాయంత్రం 5 గం॥లకు పొడిమెతుకుల్ని తిన్న గణపతి తనకి ఆకలి లేదన్నాడు.

ఈలోపల మరో ఇద్దరు కాశీ ప్రయాణీకులు అచటికి వచ్చారు. గణపతి కూడ కాశీ యాత్రికుడే యని తెలిసి, సంతోషించి, ఆరాత్రి అచటనే గడపనెంచి వారు కూడ అరుగుపై తమ మూటల్ని దించారు. కాలక్షేపానికని పంచకు తగల్చిన లాంతరు వెలుగులోనే పేకాట వేశారు. గణపతియు ఆడసాగాడు.

ఆ యింటి రెండవ అరుగుపై కొందరు పెద్దలు, ఒక జ్యోతిష్కుడు కూర్చుని యున్నారు. రామదాసు కొన్ని జాతకములను అతని ముందుంచాడు. వృద్ధ జ్యోతిష్కుడు జాతకములను పరీక్ష చేస్తూ ఫలితములను చెప్పసాగెను. పేకాట ఆడుతున్న గణపతికి వృద్ధ జ్యోతిష్కుని ఫలితముల వివరణ తప్పుగా దోచినది. వెంటనే బాల్య కుతూహలముతో "యీతనికి జ్యోతిషము చెప్పుట రాదు!" అనెను. ఒక్కసారి అందరూ నివ్వెరబోయారు. వృద్ధునకు కోపం వచ్చినది. "నీకు జాతకములు చూడ వచ్చినచో చూచి చెప్పుము." యని గణపతికి జాతక చక్రములనిచ్చెను. అద్భుతముగను మరియు అవలీలగను గణపతి జాతక ఫలములను చెప్పుసరికి వారందరు ఆశ్చర్యము చెందిరి. ఇంతటి పండిత బాలకునకు పొడి యన్నము పెట్టితిమే యని రామదాసు కుటుంబీకులు విచారించిరి గణపతిని టెక్కలియందు నాల్గు రోజులపాటు ఉండుమని వారు వేడిరి. యాత్రా సఖులు తోడు దొరకడంవల్ల గణపతి ఇచ్ఛగించ లేదు.

మర్నాడు వేకువ జామున యాత్రికులు ముగ్గురు ప్రయాణమునకు సిద్ధులైరి. రామదాసు, వృద్ధ జ్యోతిష్కుడును కూడ అచటకు వచ్చిరి. రామదాసు జ్యోతిష్కునితో ఏదియో రహస్యముగ చెప్పెను. ఆ వృద్ధుడు యాత్రికులను 'నందిగ్రామము'

వరకు అనుసరించినవాడై యచట ధర్మశాలయందు వారికి భోజన సదుపాయములను కల్పించెను.

వారణాసి అచ్యుత రామశాస్త్రి యను పండితుడు నంది గ్రామము నందు వసించుచుండెను. వృద్ధుడు గణపతిని అతనికి పరిచయము చేసెను. గతరాత్రి స్వప్నమందు ఒక ఏనుగు నరాకృతి దాల్చి ధర్మశాల జొచ్చుట, మర్నాడు గణపతి యను నామధేయముగల బాలుడు తనకు పరిచయము గావింపబడుట దైవకృతముగా అచ్యుత రామశాస్త్రి ఎంచి గణపతియొక్క ప్రజ్ఞ వృద్ధుని ద్వారా తెలిసికొని సంతోషించి యా బాలకుని నంది గ్రామము యొక్క జమీందారు. సజ్జనుడు, మిత్రుడుఅయిన కృష్ణమనాయుని యింటికి తీసుకుని వెళ్ళి యాతనికి పరిచయము గావించెను.

కృష్ణమనాయుడు సకల ఐశ్వర్యములు కలిగి ఉన్నవాడై నప్పటికి రోగగ్రస్తుడై ఉండెను. అతనికి ఇద్దరు భార్యలు గలరు. మొదటి భార్యకు సంతానము కలుగని కారణముగ మరియొక వనితను పెండ్లియాడెను. ఆమెకు కూడ సంతానము కలుగలేదు. మరియొక ప్రక్క దుర్మతి పీడించు చుండుటచే ఆయింట సంతోషము లేకుండెను. అతడు గణపతిని అతి ప్రేమతో ఆదరించి త జాతక పత్రమును అతనికిచ్చి ఫలితమును చెప్పుమని వేడెను గణపతియు జాతకమును పరీక్షించి "ఈ రోగమిప్పుడు అధికము మిమ్ము బాధ పెట్టుచుండినను, మరి మూడు మాసములలో త పోవును. అది మీకు నూతన జన్మమగును. ద్వితీయ భార్యద్వార కుమార్తె పుట్టగలదు. మీకు దత్తపుత్రుడుండును." అని చెప్పెన కృష్ణమనాయకునికి గణపతి వాక్కులు అమృతతుల్యములైన అతని బెంగ పటాపంచలయినది. తన రోగము కుదురువరకు ఉ

టనే యుండి తన్ను అనుగ్రహింపుమని గణపతిని వేడుకొనెను. అతని యవస్థకు జాలిచెందిన గణపతి అందులకంగీకరించెను.

కృష్ణమనాయుని సత్కారములతోడను, సాహిత్య చర్చల యందు పాల్గొనుచు, చతురంగాది క్రీడా వినోదములందు గూడ తన నేర్పరితనము చూపించి గణపతి యందరిని మెప్పించు చుండెను. పలుగురితో ఒకేసారి చదరంగమాడుట, పద్యములను ముందునుంచి వెనుకకు, వెనుకనుండి ముందుకు వల్లె వేసినట్లు చెప్పుట, పుస్తకమును ఎగురవైచి అది క్రిందపడు సమయము లోపల తెరువబడిన పుటలలో పంక్తుల ననాయాసముగ చదువుట ఇట్లు బహు విధములగు చాతుర్యములను గణపతి చూపుచుండగా కృష్ణమనాయుని గృహము సరస్వతీ నిలయమై మూడు మాస ములు మూడురోజులవలె సంతోషముగ గడచిపోయినవి. నాయు డును సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యెను.

"బాబూ దైవదత్తమైన విద్యమీయందున్నది. మీరాకవలన నేను ధన్యుడనైతిని. ఇంత చిన్న వయస్సులో మీకు కాశీ యాత్ర ఏల? ఇంటికి పోయి చక్కగా గృహస్థ జీవితమును గడుపుడు. మీ తండ్రిగార్కి కబురు పంపియున్నాను రేపటికి వారు వచ్చెదరు. కొంత వయస్సు వచ్చిన పిదప మీరు తపోయాత్ర సాగించండి. మీ యాత్రలకు తోడ్పడుటకై ఏడాదికి ఏబది రూప్యముల చొప్పున ప్రతి సంవత్సరము నేను ఇచ్చెదను. ఈ భక్తుని సహా యము స్వీకరించండి. మీకు ఎప్పుడు ఏవిధమైన సహాయము కావ లయునన్నను నేను చేసెదను. నన్ను మన్నించి మీరు ఇంటికి వెళ్ళగోరెదను." కృష్ణమనాయుడు గణపతిని ఈవిధముగా అభ్య ర్థించెను.

మర్నాడు తండ్రి నృసింహశాస్త్రి రావడంతో తండ్రీ కొడుకులిద్దరూ గృహోన్ముఖులైరి.

## 12. భద్రకుడు

శ్లో॥ భద్రతర మూర్తిం భద్రతమ కీర్తిమ్ ।
రుద్ర తనయంతం గాయత మహాన్తమ్ ॥

[దివ్యమైన రూపము గలవాడును, శుభ్రమగు కీర్తి గలవాడును, రుద్రుని తనయుడును అగు గణపతి యొక్క మహిమలను గానము చేయుడు]

— గణపతి గీతం

(గణపతిముని)

• • * •

"నేనీ కార్యం చేయదలచుకున్నాను. ఎలా చేయిస్తావో భారం నీది" అని ప్రతి కార్యాన్ని ఫలితం ఆశించకుండా రామార్పణం చేసేవారట శ్రీ గాంధీజీ. స్వార్థ చింతన లేని వారియందలి సంకల్పములు ఇలాగే ఉంటాయి. వారియందు ప్రకటింపబడేది ఈశ్వర సంకల్పముగా నెరుంగవలెను. సాధారణంగా తపస్సు మోక్షసాధనకై చేస్తారు తాపసికులు. తనకు మోక్షం వద్దన్నారు గణపతి ముని.

శ్లో॥ సర్వద జనోయం వాంఛతి న ముక్తిం ॥
దేశ కుశలాయ ప్రార్థయతి శక్తిమ్ ॥

జనకళ్యాణానికని, దేశ క్షేమానికని ముక్తి వద్దుశక్తి నిమ్ము అని స్తుతించారతను. బాల్యము నుండియు అతని ప్రవృత్తి ఇలాగే ఉండేది. తపస్సొక సాధనగా భావించి కర్తృత్వభావం లేకుండా చేశారాయన.

మొదటి ప్రయత్నం విఫలమయినప్పటికి నిరుత్సాహం చెందలేదు గణపతి. అయితే తపస్సు చేయాలనే కోరిక అధికం కాజొచ్చింది. తనయుని నిరుత్సాహపరచడం తండ్రికి ఇష్టం లేదు. అవేశంతో అడవులకు, నదీతీరములకు వెళ్ళుట ద్వారా కార్య సాఫల్యం జరుగదు. కావున సుతునకు ఉచిత మార్గాన్ని చూపా డతను.

"నాయనా! తపమొక పవిత్ర యజ్ఞము. అందులకు తగు సమయము రావలెను. దైవానుగ్రహము కావలయును. క్షణికమైన ఉద్రేకము తోడను, ఆవేశము తోడను ఆచరించు కార్యము కాదది. కావున శాంత చిత్తుడవు కమ్ము. నీ జన్మకు కారకులైన సూర్య గణపతులపై భారము వేయుము. మన పూర్వీకులు శ్రీ విద్యోపా సకులు. ఇంటియందు నిత్య శ్రీ చక్ర పూజా విధానమున నేను పూజ చేయుట నీకు తెలియును. నీకు కూడ దీక్ష నిచ్చెదను. నాతో బాటు పూజలయందు పాల్గొనుము. "మహా గణపతి" మంత్రమును నిత్యము జపించుము. అపుడు నీకు మార్గము గోచరమగును." యని గణపతికి తండ్రి హితబోధ చేసినాడు. గణపతియు అందు లకు అంగీకరించినవాడై దీక్షతో పరమేశ్వరి పూజ నారంభించెను. గణపతి ముని జీవితమును అత్యంత ప్రభావితము చేసినది యీ శ్రీ విద్యయే.

* * *

శ్రీ విద్యకు ఆత్మవిద్య, చంద్రవిద్య అను పేర్లు కూడా గలవు. ఇందు శక్తిని పరమాత్మగా, జగన్మాతగా ఉపాసన చేసెదరు. ఈ ఉపాసన కౌల, మిశ్రమ, సమయమని, మూడు విధములు, సనత్కుమార, వసిష్ఠ శుక మహర్షులు 'సమయ' మతమును పాటించిరి. 'సమయ' అనగా 'బ్రహ్మము నాతో ఉన్నాడు' అని అర్థము. ఇది ద్వైత భావమునకు భిన్నము కాదు. కుండలినీ శక్తిని జాగరితము చేసి మూలాధార చక్రము నుండి లేపి షట్చక్ర భేదనము చేయించి సహస్రార కమలమునకు చేర్పించుట ఉపాసన క్రియ యగునని శ్రీ శంకరులు "సౌందర్యలహరి" యందు సూచించి యున్నారు. గణపతి మునికి కపాల భేద సిద్ధి ఈ విధముగనే జరిగినది. ఈ ఉపాసనలో శక్తి చాలకత్వము ఎటులుండునో శ్రీ గణపతి ముని వివరించియున్నారు. కొన్ని శ్లోకములను గమనింతము.

శ్లో॥ ఆధారే ధృత మూలం హార్దాబ్జే కృతవాసం ।
శీర్షాబ్జాయ వహద్యత్ పశ్చాత్ ఇంద్రియ శక్త్యై ॥

[మూలాధారమున ధృతమై యుండి, హృత్కమలమునందు ప్రవేశించి వాసము చేయుచూ, ఆ తరువాత శీర్ష కమలమునకు జేరి తదుపరి ఇంద్రియములకు పాకెడి శక్తి స్వరూప మేదియో అట్టి ప్రణవ స్వరూపము శ్రీ రమణ నామమున నాయందు స్ఫురించుగాక]

శ్లో॥ యాతా యాత విహారై రాధారేషుచ శీర్షే ।
సంచారం విదదానం కించా శేష విసారి ॥

[ఆరు ఆధార చక్రములందును యాతా యాత విహారము చేయుచూ సర్వమూ వ్యాపించు శక్తి స్వరూప మేదియో-అది శ్రీ రమణ నామమున నాయందు స్ఫురించుగాక].

– గురు గీతము

శ్లో॥ అవతరణం ధ్యాతంచే దారోహణ మద్భుతం భవేచ్ఛక్తేః ।
యస్మిన్నిదం శరీరం భవతి మహావైద్యుతాగ్ని యన్త్రమివ ॥

[ఆకాశము నుండి శిరోమార్గమున శరీరమునందు ప్రవేశించుచున్న శక్తి యొక్క అవతరణమును ఎవడు అనుభవ పూర్వకముగ తెలుసికొనుచుండెనో వాని మూలాధారము నుండి ఈ శక్తి మిక్కిలి వడిగా నారోహించుచుండును. (మీది కెక్కుచుండును.) అట్లు ఆరోహించునపుడు భౌతికమగు శరీరము మహా వైద్యుతాగ్ని యంత్రమువలె నాశ్చర్యకర మగుచుండును ]

— ఉమాసహస్రము

* * * *

అంతట దేవీ నవరాత్రి ఉత్సవములు (1897) సమీపించాయి. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి పున్నమి వరకు విశేష పూజలు నృసింహ శాస్త్రి యింట ప్రారంభమైనాయి. గ్రామ ప్రజలందరూ వచ్చి తీర్థ ప్రసాదములు పుచ్చుకొనేవారు. పూజాపీఠమునందు లేత • గులాబీ రంగు స్ఫటిక శ్రీ చక్రముండేది. అదియే దేవీ స్వరూపము. ఆ చక్రమునకే పూజలు జరుగుతూ ఉండేవి. ఆ దినములలో నిర్మల చిత్తముతో. దీక్షా పరతంత్రుడై

• ఈ లేత గులాబీ రంగు శ్రీ చక్రమును శ్రీ విద్యా విధానమున గణపతి ముని తరువాత యతని కుమారుడు మహాదేవశాస్త్రి యాతని భార్య రాజేశ్వరి పూజ చేయుచుండిరి. 1953 వ॥ సం॥లో అది ఒక ప్రక్కన భిన్నమయినందున పూజ చేయరాదని పెద్దలు చెప్పడంతో సుంకి అగ్రహారమువద్ద నాగావళినది యందు ఆచక్రమును ఉచిత సత్కారములతో వదలి వేయడమైనది.

పూజలు జరిపించు గణపతి ముఖవర్చస్సు వర్ణనాతీతము. పూజా సమయము నందు గణపతికి భౌతిక దృష్టి యుండెడిదికాదు.

పౌర్ణమి నాడు పూజ ముగించే సరికి జాముర్రాత్రయినది. విశ్రాంతికై గణపతి శయ్యపై మేను వాల్చాడు.

* * * *

"గణపతీ"

ఎవరో అతివాత్సల్యంగా పిలిచినట్లనిపించింది. గణపతి కండ్లు విప్పి చుట్టుపక్కల చూచాడు. పూజా పీఠము నుండి ఒక దివ్యమైన ఆకృతి వెలువడి అతని ముందు నిలబడినది. శాంత గంభీర వదనము, తెల్లటి పొడవైన గడ్డము గల్గి ఆజానుబాహుడై ఋషి పుంగవునివలె కనబడిన యాదివ్యపురుషునకు నమస్కరించి స్వామీ మీ పరిచయ మెయ్యది యని గణపతి యడిగినాడు.

పు : నేను భద్రకుడను.

గణ : (కొంచెము సేపు యాలోచించి యా భద్రతపమూర్తిని తేరబార జూచి) అనగా పార్వతీ నందనుడగు గణపతియా మీరు !

పు : అవును.

గణ : ప్రభూ ! మీ దర్శనము వలన ధన్యుడనైతిని. నన్ను అనుగ్రహింపుడు.

పు : బ్రహ్మగిరి ముఖద్వారమగు నాసికా క్షేత్రమునందు తపము చేయుము. ఈశుని వరము నొందెదవు.

గణపతి యానందమునకు మేర లేదు. ఆ దివ్యపురుషుని మనసార స్తుతించి వందన మాచరించి నాడు. భద్రికుడును గణపతిని యాశీర్వదించి యంతర్ధాన మయ్యెను.

* * * *

తెల్లవారినది. సంతోషముతో లేచి గణపతి తన స్వప్న వృత్తాంతమును తండ్రికిని భార్యకును తెలియజేసెను. వారును ఆనందించిరి. తన ఇరువదియవ జన్మదినమునకు మర్నాడు అనగా 18-11-1897 నాడు గణపతి తపస్సుకై నాసికా క్షేత్రమునకు ప్రయాణమైనాడు.

## 13. నాసికా ప్రక్షాళనము - శివుని వరప్రాప్తి

శ్లో॥ నిజ విషయపరం విత్తం శివచరణ పరం చిత్తం ।
ఇహ జగతిసతాం యేషాం జయతి చరితమే తేషామ్ ॥

[ఆత్మ విషయకమైన విత్తము, శివ చరణాసక్తమైన చిత్తము గల సజ్జనులు శ్లాఘింపదగినవారు.]

_ శివ శతకము

(గణపతి ముని)

* * * *

మహారాష్ట్రము నందలి పవిత్ర పుణ్యక్షేత్రము 'నాసిక' అది బ్రహ్మగిరి పర్వత ప్రాంతమునందు నొప్పునదై పురాణ ప్రసిద్ధమై యున్నది. రామాయణ కాలము నందు 'పంచవటము)

నందు సీతా రామ లక్ష్మణులు పర్ణశాల నిర్మించుకుని వసించు చుండగా అచటకు విచ్చేసిన రావణుని సోదరియగు శూర్పణఖ లక్ష్మణుని యాగ్రహమునకు గురియైనది. అతడు ఆమె నాసికను ఖండించెను. ఖండింపబడిన ముక్కు ఈ ప్రాంతమున పడినందు వల్ల ఈపురమునకు "నాసిక" యను పేరు వచ్చినదని కొందరం దురు. ఇచట నవచూతి యను ప్రదేశమునందు ప్రసిద్ధమైన లక్ష్మణాలయముగలదు.

నాసికకు 25 కి. మీ దూరమున త్ర్యంబకమను ఈశ్వర క్షేత్రమున్నది. ఇందు వెలసిన ఈశ్వర లింగమును జ్యోతిర్లింగ ముగా హిందువులు పూజింతురు. సమీపమునందు పెద్ద తటాకము గలదు. దానిని 'కుశావర్తన' మని యందురు. బ్రహ్మగిరి గోదావరి నది యొక్క జన్మస్థలము. ద్యులోకమునుండి గౌతమ మహర్షి తపము వలన అవతరించిన దక్షిణ గంగ యిది. ఈ పవిత్ర నదీమతల్లి యిచట మందగమనయై ప్రవహింపగా ఈ స్థలము పలువురు తాపసికులకు తపోనిలయమై ఆశ్రయ మిచ్చుచున్నది.

బ్రహ్మరంధ్రమే బ్రహ్మగిరి యనియు, త్రిపుటీ స్థలమే త్ర్యంబక మనియు, సహస్రారము కుశావర్తన మనియు తాత్త్వి కులు తత్త్వార్థ భాషణ చేయుదురు.

నాసిక చేరిన గణపతి పురమునందు మారీజ్వరము (అమ్మ వారు) అధికముగా ఉండుటచే తోటి ప్రయాణీకులతో బాటు ఆచట 'బాటూరి మొగ' అను ప్రదేశమున గల 'మారీజ్వర పరీక్షాశిబిరము' నందు బంధింపబడెను. వైద్యుడు వచ్చి యాత్రికులను పరీక్షించి టీకా యిచ్చిన గాని వారు పురమునందు ప్రవేశింపజాలరు. ఆ శిబిర మండపాధికారి పాండిత్య ప్రియుడని గణపతి గ్రహించి

యతని పరిచయము చేసికొని సాహిత్య సల్లాపము చేసెను. అతడును గణపతి కవి యని నెఱింగి యనురాగము ప్రకటించినాడు. అంత చీకటి పడినది. అప్పుడే ఉదయించిన నెలబాలుని వెండి కిరణాలు అలసి పోయిన ప్రకృతి కాంత హృదయంలో అమృత జల్లులను కురిపించు చుండగా, పగలంతా మండపంలో జిక్కుకుని అలసి పోయిన గణపతి వెలుపలకి వచ్చి ఆ రమణీయ దృశ్యమును జూచి హృదయానంద మొందినాడు ఆకాశము నందలి అమృతాంశు కిరణుని చూడగానే కాళిదాసు విరచితమైన 'రఘువంశము' నందలి అజమహారాజు యొక్క స్వయంవర ప్రయాణ ఘట్టము అతనికి జ్ఞప్తికి వచ్చినది. మధురమైన కంఠంతో ఒక శ్లోకాన్ని ఇలా చదివాడు.

శ్లో॥ నిద్రావశేన భవతాప్య నవేక్షమాణా
పర్యుత్సుకత్వ మబలా నిశి ఖండితేవ ।
లక్ష్మీ ర్వినోదయతి యేన దిగంత లంబీ
సోపిత్వ దానన రుచిం విజహాతి చంద్రః ॥

అజమహారాజు స్వయంవరమునకై వెళ్తూ ఉండగా మార్గ మధ్యమందు చీకటిపడెను. రాత్రి యగుటచే అతను గుడారమందు నిద్రించెను. అది వెన్నెల రాత్రి. వేకువను అతనిని లేపుటకు వందిమాగదులు పాడిన శ్లోకమిది.

[తా॥ రాజుల ముఖము, చంద్రుడు పద్మమున్ను లక్ష్మికి నివాసములు ప్రకృతం - రాజు లక్ష్మిని అలక్ష్యం చేసెను. (నిద్ర అనే మరొక నాయికకు వశుడయ్యెను) కాన లక్ష్మి కోపగించి, చంద్రుని చేరెను. కొంత ఊరట పొందెను. కాని చంద్రుడు కూడ అస్తమించుచుండెను. అందువల్ల రాజా! మరల నీముఖపద్మమునే

ఆమె ఆశ్రయించును. ఆమెను అనుగ్రహింపుము. (కోపగించి, ఇల్లు విడిచిన లక్ష్మిని మరల ఇంటికి చేరనిమ్ము). నాయికా నాయకులకు సంబంధించిన సరసమైన వ్యంగ్యార్థం ఇచట ఉంది!]

కవిరాజు ముఖమునుండి కమనీయంగా వెలువడిన యీ శ్లోకాన్ని మండపాధికారి విన్నాడు. అతనికి కవి భావం అర్థమయింది. అయినప్పటికి కొంటెగా 'పరపురుషుని యింటికి వెళ్ళిన లక్ష్మిని మరల రాజు ఎలా స్వీకరించ గలిగా?"డని యడగినాడు. "చంద్రుడు ఆమెకు పరపురుషుడెలా అవుతాడు. అమృతసాగరమందు జనియించిన లక్ష్మికి అమృతాంశుడగు చంద్రుడు సోదరుడు కదా ! సోదరుని యింటికి వెళ్ళుట దోషము కానేరదు" అని గణపతి ప్రత్యుత్తర మీయగా అధికారి సంతోషించి "అయ్యా కవిరాజ వర్యా ! మీ కవితాలక్ష్మిని గూడ పుట్టింటికి బంపి విశ్రమింపుడు తెల్లవారగానే మిమ్ము విడుదల చేసెద" మనెను.

మర్నాడు గణపతి పురము ప్రవేశించినవాడై తగిన తపఃస్థలము దొరకక కాలినడకన త్ర్యంబకం చేరుకున్నాడు. అచట మందగమనయగు గోదావరీ నదియందు స్నానం చేసి, ఆలయము ప్రవేశించి ఈశ్వర దర్శనము చేసికొని అచటనే కొంతసేపు ధ్యాననిమగ్నుడై యుండెను. సాయంసమయమునకు అతడు కుశావర్తనము చేరుకొనెను. ఆ రాత్రి ఒక పేద బ్రాహ్మణుని యింట గడిపెను. మర్నాడు ఉదయాన పండితులను ప్రీతితో ఆదరించే ఒక వైద్యుని యింటికి గణపతిని తీసుకుని వెళ్ళి యా బ్రాహ్మణుడు వైద్యునకు గణపతిని పరిచయము చేసెను. వైద్యుడు గణపతిని శ్రద్ధతో సత్కరించి అచటగల నీలాంబికా ఆలయమును చూపించి అది తపస్సునకు అనువగు స్థలమని జెప్పెను. అంతే

గాకుండా రోజూ స్నానమునకు వేడినీళ్ళు, రుచికరమైన భోజనము కల్పించినాడు. గణపతి పగటిపూట ఆలయమునందు ధ్యానము చేయుచు రాత్రులందు వైద్యుని యింట విశ్రమించుచుండెను.

ఈ విధముగా వారము దినములు గడచినవి. గణపతి తపస్వియేగాక మహా పండితుడను విషయము వైద్యుడు గ్రహించెను. ఒక రోజు రామభావుడను ధనికుడు అతని యింటికి వచ్చియుండెను. అతడు పండిత పోషకుడు మరియు సాహితీ ప్రియుడు. గణపతి ప్రజ్ఞను వైద్యుని ద్వారా విని ప్రత్యక్షముగ యాతని ప్రతిభ చూడ నెంచెను. వైద్యుని బలవంతముచే గణపతి యారాత్రి అష్టావధానము చేయుట కంగీకరించెను. ఆ వార్తను విని అనేక మంది పండితులు, ప్రజ యచట గుమిగూడిరి. తపోదీక్షతో నీరసించియున్ననూ గణపతి తొలిసారిగా 'అష్టావధానము' చేసినవాడై అందరికీ విస్మయమును కలిగించినాడు. రామభావునకు గణపతి యందు భక్తిశ్రద్ధలతోపాటు ప్రీతి అధికమైనది. నాసికయందు తగిన తపఃస్థలము చూపించెదనని జెప్పి గణపతిని తనతో నాసికకు తీసికొనిబోయెను.

నాసిక చేరిన తరువాత తన వాగ్దానమును మరచిన వాడై రామభావు ప్రతినిత్యము పండితులను రావించుచూ, కవిత్వ గోష్ఠి సాహితీ ప్రసంగములతో కాలము వెళ్ళబుచ్చుచుండెను. రామభావు వైఖరిని గమనించిన గణపతి తనకుతానే తపఃస్థలము వెదుకుకొనుట మంచిదని యెంచి ఒక రోజు పురమంతయు వెదికి ఊరు దాటినవాడై యచట లక్ష్మణాలయమును గాంచి యాకర్షితుడై యందు ప్రవేశించెను. అంతట అకస్మాత్తుగా వెనుక దాగియున్న ఆలయ పూజారి గణపతిపై కలియబడి, జుత్తు పట్టుకొని మరాఠీ

భాషలో "దొంగ దొంగ" యని యుఱచుచు కఠినముగా తిట్లు తిడుతూ గణపతిని కొట్టనారంభించెను. తాను దొంగను కాదని గణపతి యెంత మొఱపెట్టినను యాతను వినే పరిస్థితిలో లేడు. అతడు గణపతిని జుత్తుతో లాగుచూ గ్రామాధికారికడకు నీడ్చుకొని పోవుచుండెను.

త్రోవలో అందరూ వింతగ జూచువారేగాని పూజారిని నివారించువాడు లేకపోయిరి. అప్పుడు ఆ త్రోవన బోవుచుండిన సాధు పురుషుడు వారలను జూచెను. అతడు రామభావు యింట గణపతిని యిదివరలో జూచి యుండెను. కావున వెంటనే గణపతిని గుర్తుబట్టి, పూజారిని వారించి శాంతపరచి విషయమేమిటి యని యడిగినాడు.

"నేను దేవాలయ సామగ్రిని తోపువలయునని బయట పెట్టి నీళ్ళు తోడి దెచ్చుటకై నూతివద్దకు వెళ్లితిని. నేను జలముతో తిరిగి వచ్చే సరికి కొంత సామగ్రి మాయమైనది. మిగిలిన సామగ్రికై యా దొంగ మరల వచ్చునని నేను తలుపు వెనకాల దాగియుంటిని. నేను అనుకున్నట్లె ఇతడు వచ్చినాడు. ఇతడే దొంగ" యని మరల గణపతిని బాదనారంభించెను. అతడు దొంగ కాదని సాదు పురుషుడు చెప్పినను పూజారి వినిపించుకోలేదు. మూర్ఖులు యిట్లే ప్రవర్తింతురు గదా! పూజారి దెబ్బలకు ఒళ్ళు వాచిన గణపతి దేహ బాధను తట్టుకొనలేకపోయెను. అతని యందు క్రోధాగ్ని జ్వాల రగిలినది.

శ్లో॥ ధ్వస్త ప్రధ్వస్త మను జాక్షత విక్షత విగ్రహా।
కీర్ణ ప్రకీర్ణ పర్యస్తా నాసికేయం భవిష్యతి॥

అని శపించెను.

[తా॥ భ్రష్టులగు మనుజులతోడను, విరిగిన విగ్రహముల తోడను, బహువిధ వినాశము పొందిన బాటల తోడను నాసిక యుండుగాక!]

గణపతి నుండి వెలువడిన యీ శాపముతో పూజారి గడ గడ వణకినాడు. అప్పటికి గాని తన తప్పిదమేమిటో యతనికి తెలియలేదు. వెంటనే గణపతి కాళ్ళపై బడి క్షమాపణ వేడినాడు. కరుణామూర్తియైన గణపతి పూజారినుపశమింపజేసి, సాధు పురుషుని వద్ద శలవు తీసుకొని 'నవచూత' మార్గమునందు నడచుచూ కొంత దూరమునందు పాడుపడిన ఆలయమును జూచి అందు ప్రవేశించి "శివ పంచాక్షరీ" మంత్ర జపముతో తపస్సు ప్రారంభించెను.

అనుకోకుండా గణపతినుండి వెడలిన శాప వాక్కులు నాసికా ప్రక్షాళనకై తోడ్పడు ఈశ్వర సంకల్పమా యనునట్లు ఒక్కసారి పురమందు మారీజ్వరము విజృంభించి కొంత జననాశనము గావించినది. అకస్మాత్తుగా నాసికయందు మాత్రము పెను తుఫాను చెలరేగి పెద్ద పెద్ద చెట్లు, కొన్ని యిండ్లు కూలినవి. బాటలన్నియు తుఫాను వర్షమునకు పాడయినవి. ఈ విధముగా ప్రకృతియందు ఒక్కసారి భీభత్సము జనించి తరువాత వాతావరణమునందు ప్రశాంతత నెలకొన్నది. మారీజ్వర నివారణమునందు విసిగి వేసారిన అధికారులు ఈ అనుకోని విపరీతముతో వ్యాధి ఉపశమించుట గాంచి శాంతి చెందిరి.

తరువాత విషయ మెరింగిన రామభావు తన తప్పిదమును దెలిసికొని గణపతికై వెతుకుచూ ఆలయమందు ఆ తపోధనుని గాంచి క్షమాపణ వేడికొనెను. గణపతికి తపోభంగము గాకుండా

రక్షణ కలిగించి, రాత్రులందు పాలు ఆహారముగా నిచ్చుచు యతనికి సేవజేసెను. గణపతి నలుబది దినములపాటు సుదీర్ఘముగ తపస్సు చేసెను. అతని తపస్సు ఫలించినది. మహాదేవుడు దిగంబర రూపమున సాక్షాత్కరించినాడు.

శ్లో॥ కిం యాగై్త్రరతిదారుణేన తపసా కింవాకి మర్త్యైర్చనై ః
కిం స్నానేన సుపర్వ పుణ్య సరితోనానావిధై ః కింవ్రతై ః।
కామారే! కరుణానిధే! పశుపతే! భూతేశ! గౌరీపతే
శంభో! శంకర! చంద్రచూడ। జగతాం నాథేతి
నామావళీ ః॥

హే ! కామారే ! కరుణానిధే ! పశుపతే! భూతేశ ! గౌరీపతే ! శంభో! శంకర! చంద్రచూడ! జగతాం నాథ! నీ నామములను జపించువారికి ఇతరములగు తపస్సులు, అర్చనలు, స్నానాదులు ః వ్రతములు ఏల? గంగానదీ తీర్థ సేవనమేల? అన్ని ఫలములును నీ నామ సంకీర్తనము ద్వారా కలుగును గదా! యని గణపతి శివుని చరణములపై సాష్టాంగ నమస్కారము చేసినాడు.

"గణపతీ! ఇంటికి వెడలుము. నీకు కుమారుడు గలుగు"నని చెప్పి ఈశుడు గణపతిని తాకి తన తేజోంశమును గణపతియందు విడచెను.

శివుని యాజ్ఞను శిరసావహించి, గణపతి తన తపమును ముగించిన వాడై గృహోన్ముఖుడయ్యెను.

# 14. నందా భగవతీదేవి

శ్లో॥ బృందారకారాధిత పాదపద్మాం
నందామిమా మిందు సమాన వక్త్రామ్
ఆ లోక్య వింధ్యాచల వాసినీం నా
నాలోచయేత్ సంసృతితో భయాని ॥

తా॥ బృందారకులచేత ఆరాధింపబడు పాద పద్మములు గలదియు, ఇందు సుందర ముఖియు, వింధ్య పర్వత వాసినియు, భగవతియునగు ఈ నందా దేవిని సందర్శించిన నరుడు సంసారము వలన భయము నెరుగడు.]

—ఉమాసహస్రము

• • •

"నాన్నగారూ! అకారణంగా నన్ను బాధితుడిని జేసి, శాప వచనములు పల్కించి, దర్శనమిచ్చి ఇంటికి పొమ్మన్నాడే : ఈశ్వరుడు! ఏమిటో యీ యనుభవము!" అన్నాడు గణపతి తన తండ్రితో. అతనికి తన తొలి తపోయాత్ర పెద్దగా తృప్తి కలిగించ లేదు. అయితే తపము చేయాలన్న దృఢమైన విశ్వాసము అతనిలో అధికమయినది.

"ప్రారబ్ధరీత్యా కొన్ని యనుభవములు శరీరమునకు తప్పవు. సంపూర్ణమైన చిత్తశుద్ధి కలిగినగాని తపము పరిపూర్ణము కాజాలదు. సాధకుని యందు కొన్ని విషయ వాంఛలు తెలిసో తెలియకో యుండ వచ్చును. లేదా ఈశుని మాయా ప్రభావము సాధకునిపై కొంతకాల ముండవచ్చును, తపస్సులో కొన్ని శోధనలు తప్పవు. కావున ఈశ్వరలీలను నిర్వచించుట మానవ

సాధ్యము కాదు. నీవు పరిపక్వత పొందుటకు దీనిని ప్రథమ సోపానముగా భావించుము. మరల పూజా, జప, చింతనాదులందు మనస్సును లగ్నము చేయుము. సమయము జూసుకొని మరియొక సారి తపోయాత్ర గావించ వచ్చును" అని నృసింహ శాస్త్రి సుతునకు అనుమాన నివృత్తి జేసెను.

సుమారుగా ఐదు నెలలు గతించినవి. గణపతి తన నిత్య జప, తపః పూజాదులు జేయుచూ, శాస్త్ర గ్రంథావలోకనము గావించుచూ కాలము గడుపు చుండెను. అంత భార్య విశాలాక్షమ్మ గర్భవతి అయినది. ఆమెకు ౭వ॥ నెల రాగానే పుట్టింటికి పంపే ప్రయత్నంలో తండ్రి యుండెను. కాశీయాత్రకు ఈ సమయము మంచి దని యెంచిన వాడై గణపతి తండ్రికి తన యభిప్రాయమును జెప్పెను. తండ్రియు అందులకనుమతించెను. ఒక శుభ సమయమున గణపతి కాశీ యాత్రకు బయలుదేరినాడు.

ముందుగా త్రివేణీ సంగమమగు "ప్రయాగ" చేరుకొనెను. అచట తీర్థ స్నానమాచరించి పురవిశేషములను జూచుచూ ముగ్ధుడయ్యెను. సాయం సమయమునకు గంగానది ఒడ్డున గల శంఖ మాధవాలయము జేరుకొనెను. ఆ ప్రదేశము నిర్జనముగా ఉండుటచే ప్రశాంతముగా నుండెను. అచట తపముజేయ సంకల్పించి, తన బట్టల మూటను ప్రక్కన బెట్టి, గావంచా పరచుకొని దానిపై గూర్చుని ధ్యాన నిమగ్నుడయ్యెను. ఉషోదయ కాలము వరకూ ధ్యానమందే యుండిన గణపతి, తెల్లవారగనే కండ్లు విప్పినాడు. ప్రక్కన తన బట్టల మూట కనబడలేదు. అందు ఒక కంబళీ రెండు, మూడు పంచెలు, శాలువ కొంత ధనము ఒక చెంబు ఉండెడివి. చెంబు మాత్రము అక్కడే ఉండెను. తక్కిన వన్నియు

తస్కరింప బడినవి. గణపతి చింతించలేదు. ఇదియును మంచికే యని తలచినాడు. కాలకృత్యములు నెరవేర్చి తాను కట్టుకున్న పంచయందు చిక్కిన కొంతచిల్లర డబ్బులుండటంతో, ఆపైకముతో అటుకులు కొని ఆరగించాడు. ఈ విధముగ దశరాత్రము లచట తపస్సు చేసినాడు. కాని మనస్సు కుదుటబడలేదు. గంగానదీ తీరమున తాపసికులుండెదరు, అనుభవజ్ఞులైన వారిని గలసిన తపోవిధానముదెలియునని యెంచి అటువంటి మహనీయునికై ఆనదీ తీరమున వెదుక నారంభించెను. అటుల తిరిగి తిరిగి ఆకలి, నీరసము అధికముకాగా నదీ తీరమునందు సొమ్మసిల్లి పడి పోయెను.

కొంత సమయమునకు తెలివివచ్చి గణపతి కండ్లు విప్పెను. ఒక జటాధారియైన సాధువు ప్రేమతో విసురుచుండెను. గణపతికి తెలివిరాగానే యాతడు ప్రేమతో శిరమును నిమురుతూ, రొట్టె పాలు తెప్పించి తినుమని యిచ్చినాడు. తానొక యాశ్రమమున యుంటినని గణపతి కప్పుడు తెలసినది. అమృత ప్రాయమైన ఆహారమును ఆరగించి కండ్లతోనే తన కృతజ్ఞతను ఆ యోగికి తెలిపినాడు.

గణపతి కొంత తేరుకున్న తరువాత ఆ సాధువు యాతని వృత్తాంతమును అడిగి తెలిసికొనెను. ఆతనియందలి తపోవాంఛ నెరిగిన సాధువు ఒక బ్రహ్మచారిని పిలిచి, "హంస తీర్థము" అను తపఃస్థలమును గణపతికి చూపించుమని జెప్పి, ఒక శాలువను వస్త్రమును గణపతికిచ్చి, తగు ఆహారవసతి కూడా కలిగించెను. అయితే గణపతి ఎక్కువకాలము అచట నుండలేదు. ఆశ్రమవాసు లందరూ కాశీకి పయనమగుటచే తానుగూడ వారి ననుసరించెను.

మార్గ మధ్యమున వింధ్యాచల ప్రాంతమును చేరగానే అచట దేవీ దర్శనమును గోరి గణపతి ఆశ్రమ వాసుల వద్ద శలవు తీసి కొనెను. వింధ్యా చలమును సుప్రసిద్ధ దేవీ క్షేత్రముగా హిందువులు పరిగణింతురు. అచట "నందా భగవతీ" రూపమున జగన్మాత క్షేత్రపాలికయై విరాజిల్లు చున్నది. ఆలయము చేరుకున్న గణపతి భగవతీ దర్శనములో తన్మయుడైనాడు. సుందరమైన విగ్రహమునందు ప్రభావితమైన భగవతి చిరునగవులు తనయునకు స్వాగతం పలికాయి.

శ్లో॥ పాదం దదాసి మనసే కిము? పాపి నోమే
పారిప్లవాయ భువనాదిక వాసనాయః
దూరే సతావదచలేంద్రకుమారిః కామో
దేవీః ప్రణామమురరీ కురుతావతాలం॥

[అమ్మా! నగాధిరాజతనయా! నీవు నామనసునందు నీ పాదమును సదా వుంచుతున్నావు. నేను చపలుడను అనేక భువన వాసనలతో నిండినవాడను. కాని నాకు కామము దూరమై యున్నది. కాన నీఇష్టమైన తీరున వినియోగించు కొనుటకు నీకు అర్పణ మగు చున్నాను. నా నమస్కారమును స్వీకరింపుము. అంత మాత్రమున నితడు ధన్యుడగును.]

అంబికకు సాష్టాంగ నమస్కారము చేసినాడు గణపతి. Surrender (సమర్పణ) అంటే ఇదే! ఇటువంటి సాధకుని ఏ దేవి అనుగ్రహించకుండా వుండగలదు!

ఇట్లు దేవీ చరణ సమర్పితుడై ధ్యాన నిమగ్నుడయ్యాడు గణపతి. తపోబలము వలన యతని శరీరము 3 అడుగులు లేచి

నది. తపస్సాధనములో నూతన యనుభవమిది. మరి యతనికి భీతి కలిగినదేమో తెలియదు. తెలివి రాగానే భగవతి నిలా ప్రార్థించాడు.

శ్లో॥ అవంధ్య వింధ్య భూమి భృత్తటాలయా దయావతీ ।
విచార ధౌత చేతసా మియం భయం వ్యపోహతు ॥

[కోర్కెల నిచ్చుచూ వింధ్యాచలమును నిలయముగా జేసి కొని దయావతియై యున్న దేవి మనస్సును విమర్శచే నిర్మల మొనర్చుకొను వారికి భయమును తొలగించుగాక!]

విమర్శయే తపస్సు. సాధకుడు విమర్శ ద్వారా చిత్తమును నిర్మలము జేసికొను చుండును. రాగము, క్రోధము, భయము అను నవి మనస్సు యొక్క ఉద్రేక లక్షణములు. ముఖ్యముగా అహంకార మమకారములు భయహేతువులు. ఇవి తొలగి అంతయు ఆత్మ స్వరూపమే అను దివ్యానుభూతి కలుగ వలయును. అందులకు సాధకుడు ఉపాయముచే భయము నరికట్ట వలయును. గణపతి యొక్క ప్రార్థనా సారాంశమిది. అందు అతనికి సాఫల్యం లభించింది.

మర్నాడు మరల దేవీ దర్శనము చేసికొని ప్రయాణము సాగించి వ్యాసకాశీ మీదుగా వారాణసి చేరుకున్నాడు గణపతి.

— —

# 15. దుర్గా మందిర యోగి

శ్లో॥ వారాణసీ శుభ్రగిరేరనూనం
క్షేత్రం పవిత్రం భువన త్రయేపి ।
అద్దే ప్రజానాం విధృతాన్న పాత్రా
గౌరీ స్వయం యత్ర విశాల నేత్రా ॥

తా॥ వారాణసీ యను పవిత్ర క్షేత్రము శుభ్రగిరి యగు కైలాసము కంటె తక్కువది కాదు. అది మూడులోకములందు గూడ పవిత్రమైనది. అచట విశాలనేత్ర యగు గౌరీదేవి ప్రజలను పోషించుటకు స్వయముగా అన్నముతో నిండిన పాత్రను ధరించి అన్నపూర్ణయై విరాజిల్లు చున్నది.]

— ఉమాసహస్రము

* * * *

దైవానుగ్రహమనేది మానవులకు మాత్రమే పరిమితంకాలేదు. సమస్త జీవకోటికి. నదులకు, ప్రదేశములకు పర్వతములకు గూడ అనుగ్రహ శక్తి వ్యాప్తి చెంది యున్నది. మనుజులలో ఋషి, ముని యోగుల వలెనే ప్రాంతములు కూడ యోగ తత్త్వమును ప్రకటించు చుండును. ఎన్నియో పుట్టుకలు, మరణములు, భూకంపములు, తుఫానులు, యుద్ధములు, ప్రయోగములు, మరియు పరిశోధనలు ఇత్యాదులు తనయందు జరుగుతున్నప్పటికీ ఈ విశాల జగత్తు క్షమ దమాదులతో తన సహజ దివ్యత్వాన్ని ప్రకటిస్తూ యోగి పుంగవుని వోలె ఎటులున్నదో అటులనే కొన్ని నదీ తటాక ప్రదేశములు, పర్వత ప్రాంతములు యీ భారత భూమియందు ద్వివ్యత్వాన్ని ప్రకటిస్తూ జ్ఞానులకు, యోగులకు ఆధార భూత

ములై యొప్పుచున్నవి. "హిమాలయో నామ నగాధి రాజః" అని హిమాలయ పర్వత శ్రేణిని రాజపురుషునిగాను, దేవతాత్ముడనియు మహాకవి కాళిదాసు వర్ణించియుండుట అందరికీ తెలిసినదే. పవిత్రమై, గంగానదీ తీరమై యొప్పు కాశీ నగరము గూడ ఎందరో యోగి పుంగవులకు జ్ఞానమును ప్రసాదించిన మహా పుణ్యక్షేత్రము.

దర్శనాదభ్ర సదసి జననాత్కమలాలయే ।
కాశ్యాంతు మరణాన్ముక్తిః స్మరణాదరుణాచలే ॥

అని ఒక కవి వర్యుడు వ్రాసి యున్నాడు. అనగా చిదంబర దర్శనము, తిరువారూరు నందు జననము, కాశీయందు మరణము, అరుణాచల స్మరణము ముక్తి దాయక మని ఆ కవి యొక్క దృష్టి. మనస్సు ఆత్మయందు లగ్నమగుటయే మరణమని, ఆత్మ ప్రకాశమే కాశి యనియు భగవాన్ శ్రీ రమణ మహర్షి చెప్పి యున్నారు.

అటువంటి పుణ్యప్రదేశమునకు అక్టోబరు 1898 నాటికి చేరుకున్నాడు గణపతి. అతని మేనమామ అయినటువంటి ఆర్య సోమయాజుల భవానీ శంకరము అచటనే యుండుట చేత భోజనమునకు వసతికి ఇబ్బంది లేకపోయింది. ముందుగా గంగానదీ స్నాన మాచరించి విశ్వేశ్వరుని సన్నిధికని బయలు దేరినాడు. ఆలయమునందు అతనికి ముందుగా స్వాగతము పలికినటువంటి దైవము ఢుండి గణపతి.

శ్లో॥ ఏకాదశానాం ప్రవరం సుతానాం
రుద్రస్య మంత్రాధి పతిం నమామి ।

శాస్త్రాణి సర్వాణ్యపి యస్యకేలాః
సూర్యాస సాధ్యం తిమిరం హరంతి॥

రుద్రునియొక్క పదునొకండుగురు కొడుకులలో శ్రేష్ఠుడు ఎల్లమంత్రములకును అధిపతి, సూర్యునకు సాధ్యముకాని తిమిరమును సమస్త శాస్త్ర బోధ జ్వాలచే పోగొట్టువాడు అయిన హేరంబా! నీకు నమస్కారము అని డుండి గణపతికి సాష్టాంగ నమస్కారము చేసెను.

తాను పుట్టక మునుపు తనతండ్రికి కలిగిన యనుభవము అతనికి జ్ఞప్తికి వచ్చినది. తనకి తపఃప్రేరణము కలిగించిన భద్రక స్వరూపము కూడ యతడే. ఆ పార్వతీ నందనుని అపార కరుణ కతని కండ్లు చెమ్మగిల్లాయి. భక్తి యావేశముల మధ్య గొంతుక గద్గదమైనది. గమ్యముగానరాని నాకు గమ్యము జూపుము తండ్రీ యనుచు....

కార్యం నమే కిమపి తత్ఖలు నిర్జరాణాం
రూపం నమే కిమపి తత్త్వ కోపి వేషః।
ఇష్టంను కష్ట మథ కస్య కరీంద్ర వక్త్ర
శిష్టంతు మే కిమపి నామ నరాంగ సంగే॥

ప్రభూ! ఇది (ఈ నరవేషము) నీ యింకొక వేషమైతే తగిన నాట్యమారంభించు. మౌనము వలదు. నీకు నాకు మధ్య నున్న తెరను నీ గణములు తొలగింతురు గాక! ఎందుకాలస్యము? అను గ్రహింపుము - అని వేడుకొనెను. తరువాత అన్నపూర్ణా విశ్వేశ్వరుల దర్శనము జేసికొని విడిదికి చేరుకున్నాము.

తొలినాటి దర్శనముతోనే అతని యందు ఆనందము తాండ వించినది. చిత్తము ప్రశాంతమైనది. నిత్యం గంగానదీ స్నాన మాచరించి, ఆలయమందు అయ్యను అమ్మను దర్శనం చేసికొని తన తండ్రి వలెనే ఢుండి గణపతి ముందు గూర్చొని "నవాక్షర గణపతి" మంత్ర ధ్యానము చేయుచుండెను. ఈవిధముగా రెండు నెలలు గడచినవి. ఒక రోజు సాయంత్రము జపము ముగించుకొని ఇంటికి వెడలుచుండగా త్రోవయందు పండిత సమూహమును జూచి నాడు. వారి మాటలను బట్టి ఎచటనో విద్వత్ సభలు జరుగు చున్న వని, వారచటకే వెళ్ళుచున్నారని తెలిసినది. వెంటనే వారలను గలసి తన పరిచయము జేసికొని వివరములడిగెను.

విదేహరాష్ట్రమునందు దర్భాంగ సంస్థాన పాఠశాలయందు ప్రధానోపాధ్యాయుడు, కాశీ వాస్తవ్యుడు, విద్వాన్ శిరోమణి అయిన శివకుమార పండితుడు పురమునందున్నాడని, వారి యింట పండిత సభలు జరుగుచున్నవని తెలిసినది. శివకుమారుడు ఆంధ్ర దేశపండితుడైన బాలశాస్త్రికి శిష్యుడు. అతనికి పండితలోకమునందు విశేష కీర్తి గలదు. అటువంటి మహానుభావుని దర్శనము శుభప్రద మని యెంచి గణపతియు వారితో పండిత సభకు వెళ్ళెను. అచట తోటి పండితులవద్ద తన పాండిత్య ప్రతిభను జూపి వారలను ముగ్ధు లను జేసెను. బాలుడైన ఆ మహాకవియందు ఉజ్జ్వలమైన భవి ష్యత్తు ఉన్నదని యెంచి శివకుమారుడు నవద్వీప పరిషత్ పరీక్ష లకు గణపతిని బంపుట యుచితమని యెంచి యిట్లనెను.

శివ : గణపతిశాస్త్రిగారూ, వంగదేశము నందలి నవద్వీపమునందు త్వరలో అఖిలభారత సంస్కృత పరిషత్ పరీక్షలు జరు గును మీవంటి కవివర్యులు అందు పాల్గొనిన మీ విద్య రాణించగలదు.

గణ : ఆచార్యా! మీసూచనకు కృతజ్ఞుడను. అందు ప్రవేశము లభించుటయే దుర్లభమని వినియున్నాను. మీరుపకరించిన నేను అచటకు వెళ్ళగలిగెదను.

శివ : మీరు చింతించ వలదు. మీకు అచట ప్రవేశము కలుగు ఉపాయము గలదు. నేను అచట కార్యదర్శికి లేఖ వ్రాసి యిచ్చెదను. మీరు వారిని గలసి పత్రమును జూపించిన వారు తప్పక మీకు సహాయము జేసెదరు.

ఆచార్య వరుని ఉదారతకు గణపతి మిక్కిలి సంతోషించెను. అతని వద్ద పరిచయ పత్రమును పుచ్చుకుని తన వేడ్కోలును డుండి గణపతి మన్నించినాడు, ఇదియును యాతని చిద్విలాసమే యని యెంచి శివకుమారునికి నమస్కరించి శలవు తీసికొని విడిదిని జేరెను.

మర్నాడు గణపతి ఆలయమునకు వెళ్ళలేదు. ఇంటివద్దనే పూజాదులను ముగించుకొని గ్రంథ పఠనము చేయుచుండెను. అంత ఒక సాధువు "గణపతీ గణపతీ!" యని పిలుచుచూ ఇంటి లోనికి వచ్చెను. వస్తూనే నీవు వచ్చావని భవానీ శంకరము చెప్పగా విన్నాను. నిన్ను చూచి పోదామని వచ్చాను. నేను నీకు చిర పరిచితుడనే. నన్ను గుర్తుపట్టావా?" యని యడిగెను.

గణపతికి ఆయన ఎవరో తెలియదు. ఎక్కడా చూచినట్లు గూడ జ్ఞాపకము లేదు. కావున "మీరెవరో గ్రహింపలేకున్నాను" అనెను.

సాధు : నా పేరు సోమయాజుల సూర్యనారాయణ. నన్ను ఇచట దుర్గామందిర యోగి యని యందురు. దుర్గా మందిరం రామనగరంలో ఉంది. అక్కడే నేను ఎప్పుడూ ఉంటూవుంటాను.

గణ : మీ స్వ గ్రామము ?

సాధు : మీ ఊరికి దగ్గఱలోనే, నీకు తెలియదుగాని నీవు పుట్టక ముందు మీ నాన్న అమ్మ నాదగ్గఱకి వచ్చారు.

గణ : మరి నేను మీకు చిరపరిచితుడను ఎలాగయ్యాను ?

సాధు : నీ క్షేమాన్ని కోరేవాణ్ణి నేను. కావున నీవు నాకు దగ్గఱి వాడవు. భద్రికుని నీవు ఎరుగుదువు కదా ?

గణ : అవును అతను కలలో కనిపించిన నా దైవము మీకెలా తెలియును (ఆశ్చర్యము ప్రకటించెను).

సాధు : అతడు భద్రకుడైన నేను సుకేతుడను. ఇపుడు పదు నాల్గురు భువనమున కార్యాచరణమునకై జన్మించి యున్నారు. అందు నీవొకడవు.

ఆ యోగి మాటలు ఆసక్తికరముగా నున్నాయి. ఇతనెవరో భూత, భవిష్యత్తులను చెప్ప గలరని యెంచి గణపతి తనకార్య మేమిటి ? యని వారి నడిగెను.

"నీవు సహజ తపస్వియై వున్నావు. "స్థూల శిరస్సు" అను మహాపురుషుని ద్వారా నీకు తపస్సిద్ధి యగును. జగన్మాత కరుణచే ముందుగా సాహితీసీమయందు సిద్ధి కలుగును.

ఈ విధంగా తన భవితవ్యమును చెప్పుచున్న ఆ యోగ పురుషుని వాగ్ధాటికి. తేజస్సుకు ముగ్ధుడై గణపతి "మీ దర్శన భాగ్యము వలన నేను ధన్యుడనైతిని. నా తండ్రికి లేఖద్వారా మీ వృత్తాంతము తెలియ జేసెదను" అనెను. "మంచిదే నేను కూడా

అందు రెండు పంక్తులను మీ నాన్నగార్కి వ్రాసెదను" యని యోగి జవాబిచ్చెను. వెంటనే గణపతి లేఖను వ్రాసి యోగికీయగా అతడు_

"మీకుమారుడు తపస్సు చేయుగాక." గృహకార్యములందు మీరు అతనిని నిర్భంధింపవద్దు."

సోమయాజుల సూర్యనారాయణ

అని తానుకూడ వ్రాసి లేఖను కవరునందుంచి తానే స్వయముగ విలాసమును ఆంగ్లమున వ్రాసి "నేనీ కవరును పోస్టు చేసెదను" యని ఆ కవరును తనతో తీసుకొని పోయెను.

మర్నాడు సాయంత్రము మరల ఆ యోగిని చూడనెంచి గణపతి రామనగరము నందలి దుర్గా మందిరమున కేగెను. అచట యోగి కనిపించలేదు. చుట్టుప్రక్కల వారిని విచారించగా అటు వంటి యోగి ఆ మందిరమున నివసించుట లేదని వారు చెప్పిరి. గణపతి విస్మయమును చెందెను! ఆదుర్గామందిర యోగి యెవరు?

## 16. మధు కటాక్షప్రాప్తి

శ్లో॥ గోపాలినీ వేష భృతం భజస్వ
లీలా సఖీంతాం భువనేశ్వరస్య ।
ఇష్టం హృదిస్థం తవహస్తగంస్యాత్
కష్టంచ సంసార భవం నభూయః ॥

**తా॥** గోపాలినీ వేషము ధరించునదియు, భువనేశ్వరునకు లీలా సఖియు అగు భువనేశ్వరీ దేవిని భజింపుము. నీ హృదయమందున్న యభీష్టము ఫలించును. జనన మరణ భ్రమ రూపమగు

సంసారమునుండి యుద్భవించునదియగు కష్టము మరల నీకు కలుగదు.]

— ఉమాసహస్రము

* * * *

దేవీ పరంగా చెప్పబడిన ఉపాసనా విద్యలు పది. వాటిని "దశ మహా విద్యలు" అని అంటారు. శ్రీ గణపతి ముని ఈ విద్యలను సూత్ర కావ్యములో వ్రాసి వివరించి యున్నారు. ఇవి కాళి, తార, సుందరి, భువనేశ్వరి, భైరవి, ప్రచండ చండి, ధూమావతి, బగళాముఖి, మాతంగి మరియు కమలాత్మిక అని దేవియొక్క పేర్లతో పిలువబడు చున్నవి. పరదేవత యొక్క మూలస్వరూపం ఒకటే అయినప్పటికి అనేక రూపాలలో ఆమెను ఆరాధించి, ఉపాసించి సాధకులు ఫలితమును పొందుచుందురు.

ఈ దశమహా విద్యలలో భువనేశ్వరీ విద్య నాల్గవది. భువనేశ్వరి అన్న నామంలోనే ఆమె అఖిల జగన్మాత యని సృష్టికి అధికారిణియని తెలియుచున్నది. ఏవిధముగా హృదయము అనే ఆకాశమునుండి మనలో ఆలోచనలు లేస్తున్నాయో అలాగే "పరమాకాశము" నందున ఆలోచనా పూర్వకమైన ఈ సృష్టి "మాయ" కావున భువనేశ్వరి యనగా పరమాకాశము, మాయ అనే అర్థములు కూడా గలవు. ఈ రూపంలో పరాదేవత అభీష్ట సిద్ధి ప్రదాత్రి. ఉపాసకులు ఈ జగన్మాతను "హ్రీం" అను బీజాక్షరముతోగాని, ప్రణవముతో కలిపి "ఓం హ్రీం ఓం" అని గాని ఉపాసించెదరు.

"జగన్మాత కరుణచే ముందుగా సాహితీ తపస్సు ఫలించును" అని దుర్గామందిర యోగి చెప్పిన మాటలు గణపతి చెవులయందు మారు మ్రోగుచుండెను. సుప్రసిద్ధమైన దేవీ క్షేత్ర మందు తపస్సు జేయవలెనని సంకల్పించెను. వెంటనే మేన

మామకు తన యభీష్టమును జెప్పి కాశీనుండి బయలుదేరి తిరుగు ప్రయాణంలో మార్గ మధ్యమున ఉత్కళ దేశమునందుగల భువనేశ్వర గ్రామమును చేరుకొనెను.

గణపతి కాలమునాటికి గ్రామమై యొప్పిన భువనేశ్వరము ఇప్పుడు ఒరిస్సా రాజధాని. ఈ పట్టణమును The City of Temples అని అందురు. ఇచట సుమారు ఐదువందలకు పైగా ఈశ్వరాలయములు గలవని చరిత్రకారులందురు. భూత పతియైన రుద్రుడు ఇచట ఇంత విస్తారముగ వ్యాప్తి చెంది యుండుటచే ఇది బహుగొప్పదగు తపోభూమి యనియు, మహాస్మశానమనియు గణపతిముని తఱచు చెప్పుచుండేవారు. ఇచట ఉత్కళ శిల్పకళా విభూషితమై యొప్పు లింగరాజస్వామి ఆలయమున్నది. ఈ ఆలయమునందు ఈశ్వరుని గుడికి ఎడమ భాగమున భువనేశ్వరీమాత ఆలయము గలదు. మొదటి రెండు రోజులు గణపతి క్షేత్ర దర్శనము గావించి, మూడవ దినమున ఆరు అరటి పండ్లు కొనుక్కొని తన గావంచా యందు భద్రపరచి, భువనేశ్వరీమాత సమీపమున పద్మాసనమున గూర్చుండి తపస్సు ప్రారంభించెను.

ప్రతి దినమూ మధ్యాహ్నము పదునొకండు గంటలకు కనులు విప్పి తనవద్దనున్న అరటిపండు ఒకటి భుజించి, తొక్కను ఎదుట పడవైచి మరల ధ్యానమునందు నిమగ్నుడగుచుండెను. ఈ విధముగా ఆరు దినములు గడచినవి. ఏడవ దినము యథాప్రకారము 11 గం॥లకు అతడు కన్నులు విప్పెను. తినుటకు అరటిపండు లేదు. ఎదుట తొక్కలు కనిపించినవి. అందు ఒకటి తీసుకొని ఆరగించి మరల ధ్యాన నిమగ్నుడయ్యెను.

గౌరీశంకర పండా అను ఆలయ అర్చకుడు గణపతిని ఈ ఏడు దినములుగా గమనించుచుండెను. గణపతి యొక్క కఠోర

దీక్షకు అతడు ఆశ్చర్యము చెందెను. ఆ యువతాపసిని సేవించుట ధర్మమని యెంచి ఎనిమిదవ రోజు గణపతి కండ్లు విప్పు సమయమునకు ఒక గ్లాసుతో పాలు ఎదురుగ ఉంచెను. గణపతి సరిగ్గా 11 గం॥లకు కనులు విప్పి ఎదుట పాలగ్లాసును జూచి అందు పాలు త్రాగి మరల ధ్యానమునందు మునిగెను. ఈవిధముగా ఇరువది దినములు గడచినవి. ఇరుబది ఒకటవరోజు రాత్రి భువనేశ్వరీమాత గణపతినను గ్రహించినది. ఆ దయామయి నిండు నగుమోముతో ఒక మధుపాత్రను చేత ధరించి గణపతి ముందు సాక్షాత్కరించి యాతని నోటియందు కొన్ని మధు (తేనె) బిందువులను చిలికినది.

ఆమె ముఖము చంద్రబింబము. నగవులు చల్లని వెన్నెల యొక్క అమృత ప్రవాహ మూలములు. హృదయము దయా నిలయము. కనులు కరుణతో కూడిన ఆశ్రిత రక్షణా శిబిరములు. అనంత ప్రవాహమైన యా రసామృత ప్రేమ ఝరియందు గణపతి తడసి, తడసి, ఆనందించినాడు.

కొంత సేపటికి గణపతికి భౌతిక దృష్టి వచ్చినది. అతని పెదవులయందు అమృత తత్త్వముతో గూడిన తేనెయొక్క తీపి దనము పోలేదు. ఇది స్వప్నము కాదు. భగవతి సాక్షాత్కరించినది. అతని యానందమునకు మేర లేదు.

ఆమె చిరునగవుల మోహన రూపము ఆతని హృదయము నందు చిరస్థాయిగా నిలచి పోయినది. భువనేశ్వరి ఈ కవిరాజు యొక్క పూజ్యమాతగా పలుగ్రంథములందు స్తుతింపబడినది. తనకు కలిగిన మధుకటాక్ష ప్రాప్తిని "ఉమాసహస్రము" నందలి మొదటి శ్లోకమున "సుధార్ద్రయా హసిత చంద్రికయా" అను పదజాలంతో వర్ణించాడతడు. ఆ శ్లోకమిది.

శ్లో॥ అఖిలజగన్మాతోమా : తమసా తాపేనచ ఆకులానస్మాన్ ।
అనుగృహాణత్వనుకంపా సుధార్ద్రయా హసితచంద్రికయా॥

[తా॥ అఖిలజగన్మాతా! ఉమా! తమస్సు చేతను తాపము చేతను బాధింపబడుచున్న మమ్ములను నీ దయామృత స్రావముచే శీతలమగు నీ వెన్నెలవంటి చిరునగవులతో అనుగ్రహింపుము.]

మహాకవి కాళిదాసు, తెనాలిరామలింగ కవి వంటి మహా పురుషులకు కలిగిన యనుభవము ఈ కాలమున మరల గణపతి మునికి కలిగినది.

## 17. పుత్రోదయము

ఆ॥ నన్నుగన్న తండ్రి నా పాలి దైవము
నా తపః ఫలంబు నా కుమార
నాదు చిన్ని వడుగ నాకుల దీపిక
రాగదయ్య భాగ్యరాశి వగుచు

— భాగవతము

* * *

ఆశ్రమములు — సంఘం — ఈ ప్రస్తావన వచ్చినప్పుడు భగవాన్ శ్రీ రమణ మహర్షి చెప్పిన విషయములు ఇవి :—

"నాలుగు ఆశ్రమములున్నవి. జీవితంలోని వృత్తి వ్యాపారములు నిర్ణయించు వర్గములున్నవి. అది సామాజిక నియమము. సామాన్యులకు సోపానములుగ ఉద్దేశించబడినది. పక్వదశను పొందినవాడు చక్కగా ఉన్నతిని చెందినవాడు యీ నియమములను పాటించవలసిన పనిలేదు. చిన్నా-పెద్దా, స్త్రీ, పురుషుడు,

బ్రాహ్మణుడు, బ్రాహ్మణేతరుడు ఎవరయినా సరే ! పరిపక్వము చెందిన నాడు – అతడుగానీ, ఆమెగాని సోపానముల మీద కాకుండా గమ్యానికి చేరవచ్చు.

జీవితంలో ప్రాపంచిక వ్యవహారములు నిర్వహించుట కొరకు మొదటి మూడు ఆశ్రమములున్నవి. "గతయే లోక కార్యాణామ్" ఆదర్శవంతమైన ఆధ్యాత్మిక జ్ఞానముతో సంఘర్షించకుండునట్లు వాటిని ఆ విధంగా అదుపులో పెట్టారు.

సంన్యాసము భిక్షా పాత్రము తీసుకొనడం మీద అధారపడి లేదు. తలనున్నగా గొరిగించు కొనడంలో కూడ లేదు. జేగురు గుడ్డలు ధరించడంలోనూ లేదు. "నకాషాయే నముండనే".

బ్రహ్మచారి – విద్యార్థి తన ఉన్నత, పవిత్ర బ్రహ్మచర్యం వలన అదర్శ గృహస్థుగా రూపొందుతాడు. ఇతరుల సేవ చేస్తాడు. సమాజానికి సహజ కాంతులతో నిస్వార్థంతో నిస్సంగముతో ఉపయోగ పడతాడు. ఆ పయిన తపస్సుకోసం ఏకాగ్రయత్నం చేసి మూడవ ఆశ్రమ మయిన వానప్రస్థము నందు ప్రవేశిస్తాడు. ఉగ్ర తపము వలన తాపసుడు స్ఫటికము వలె నిర్మలుడౌతాడు. నాలుగవ ఆశ్రమమునకు తగినప్పుడే అది దానికదే ప్రాప్తిస్తుంది. నేను చెప్పినట్లు అతడు ఇది పొందదగిన శాశ్వత విషయమేమి కాదు."

– సంభాషణలు

శ్రీ భగవాన్ చెప్పిన కోవలో జూచిన గణపతి ఈ ఆశ్రమ సోపానములకు అతీతుడు. అతడు విరాగి, జేగురు గుడ్డలుధరించని సన్యాసి. పవిత్ర, బ్రహ్మచర్య వ్రత నిష్ఠుడు మరియు ఆదర్శ గృహస్థు. తండ్రియొక్క సంపూర్ణ సహకారము వలన అతనికి

ఇల్లు నిర్బంధము కాలేదు. భార్య కూడ అతని తపోనియమమునకు భంగము కలిగించలేదు. అతనికి అనుకూలమైన తపస్విని యామె. భర్త వద్దనే మంత్రోపదేశము పొంది నిత్యము ఉపాసన చేయుచు ఆధ్యాత్మిక ఉన్నతిని పొందిన ఋషిపత్ని యామె. భగవాన్ మహర్షి యామెను 'అమ్మ' అని అనేవాడు. అటు భర్త గత ఆరునెలలుగా కాశీ, భువనేశ్వర క్షేత్రములందు తపోయాత్ర సలుపుచుండగా పురిటికై పుట్టింటికి వచ్చిన యామె ఇంటియందే సదాధ్యాన నిరతి యందు కాలము గడుపు చుండెను.

పురిటిరోజులు దగ్గరకు వచ్చినవి. విలంబినామ సంవత్సర మాఘ శుద్ధ పంచమి నాడు రేవతి నక్షత్రమున (14-2-1899) ఆమె మగపిల్లవానికి జన్మనిచ్చినది.

భువనేశ్వరమునందు తపస్సు చాలించిన గణపతికి తొలి దినముననే (13-2-99) రాత్రి ధేనువు వత్స నీనినట్లు కలవచ్చి నందున విశాలాక్షికి పుడుడు వచ్చియుండునని ఊహించెను. అచటకు సమీపమున గల వైతరణీ నదీతటమగు విరజాపురము నకు వెళ్ళి విరజాదేవి దర్శనము చేసుకొని గృహోన్ముఖుడై కలువ రాయి చేరుకున్నాడు. తనయుని తపో విజయము తండ్రికిని తదితర బంధువులకును సంతోషము కలిగించినది. వారము రోజుల పాటు తన యాత్రా విశేషములను గణపతి తండ్రికి చెప్పుచునే యుండెను. మాటల సందర్భమున దుర్గా మందిర యోగి ప్రసక్తి వచ్చినది. అప్పుడు నృసింహశాస్త్రి కాశినుండి తనపేర గణపతి వ్రాసిన ఉత్తరమును తెచ్చి చూపించి "ఇందు నీ చిత్రపటము వ్రాసి యున్నది. ఈబొమ్మ నెవరు గీసిరి" యని యడిగెను. గణ పతికి ఆ ఉత్తరమును చూడగానే విస్మయము కలిగినది. దానిని

తాను పసుపురంగు కాగితముపై వ్రాసి యుండెను. ఇప్పుడది ధవళ వర్ణమున నుండెను. తాను వ్రాసిన పంక్తులు క్రిందకు జరుపబడి మీద మాత్రము తన రేఖాచిత్రము గీయబడి యుండెను. అందు దుర్గామందిర యోగి వ్రాసిన సందేశముగూడ కలదు. ఈ ఉత్తరమును పోస్టు చేసినదికూడ యోగియే. కావున ఇది యాతని మహిమయై యుండును. ఇట్లు తలచిన వాడై తండ్రితో

"నాన్నగారూ! ఈ యోగి తనపేరు సోమయాజుల సూర్యనారాయణ అని చెప్పియున్నాడు. నాకు కలలో కనిపించిన భద్రకుని దెలుసునన్నాడు. తాను సుకేతుడనని, నీవు పుట్టక ముందు నీతల్లి దండ్రులు తనదగ్గఱకు వచ్చియున్నారు. అని కూడ చెప్పియున్నాడు. ఈ ఉత్తరమునందలి విచిత్రమునకు అతడే బాధ్యుడు. ఇది యంతయు గమనించిన అతడు దివ్యపురుషుడై యుండునని తోచుచున్నది" అనెను.

నృసింహశాస్త్రియు కొంతసేపు ఆలోచించి "అయి యుండ వచ్చును. నీవు పుట్టక మునుపు మేము అరసవల్లి వెళ్ళియుంటిమి. అచట సూర్యదేవుని దర్శనము చేసికొంటిమి. ఈ యోగి చెప్పిన పేర్లన్నీ ఆ ప్రభువు పేర్లతో సరిపోవుచున్నవి. బహుశా యతడు సూర్యభగవానుడే అయియుండవచ్చును" అనెను. గణపతియును అట్లే భావించినాడు.

కుమారునకు మూడవ నెల రాగానే బారసాలకై బొమ్మికపాడునుండి పిలుపు వచ్చినది. గణపతియు నృసింహశాస్త్రియు, ఇతర బంధువులతోగలసి ప్రయాణమైనారు. బారసాల దిగ్విజయముగ జరిగినది. ఈశ్వరుని వరముచే జన్మించిన యా సంతునకు "మహాదేవ శాస్త్రి" యని నామకరణము జేసిరి.

# 18. రాజాశ్రయము

రాజు విష్ణుస్వరూపుడు. సంస్కృతీ రక్షణ యతని కర్తవ్యము. కవి క్రాంతి దర్శకుడు. ఇతడు సంస్కృతీ వ్యవస్థాపకుడు. కావున వీరిరువురిమధ్య పరస్పరమైత్రి లోకమునకు శ్రేయస్కరము. అలనాటినుండి రాజులు కవులను పోషించుట ఆనవాయితీ. బ్రిటిష్ పాలకులు మనదేశమునకు వచ్చిన నాటి నుండి ఈ రాజుల ప్రాభవము తగ్గినది. వారు సంస్థానాధీశులుగ ప్రభుత్వమునకు కప్పము గడుతూ కొద్దిగానో, గొప్పగానో రాజభోగములను మాత్రం అనుభవిస్తూఉండేవారు. కొందరు వారి ఆనవాయితీ ప్రకారం కొలువునకు గురువులను, పండితులను రావించి సత్కరిస్తూ ఉండేవారు. శ్రీకాకుళమునకు సమీపమున మందరగిరి ప్రాంతమై యొప్పు మందసా సంస్థానపు మహారాజు బహుసద్గుణవంతుడైన సంస్థానాధిపతి. ఇతడు తఱచుగా పండితులను, కవులను రావించి, పండిత సభలు గావించి సత్కరిస్తూ ఉండేవాడు.

1900 సం॥లో హేవిళంబి నామ సంవత్సర ఉగాది పండగ సందర్భముగా పండిత సభల నేర్పాటు చేశాడతడు. నిర్వాహక వర్గమువారు పలువురు పండితులకు ఆహ్వానము పంపి యుండిరి. అందు కలువరాయి వాస్తవ్యులయిన గణపతి శాస్త్రి కూడ ఉన్నారు. పురమంతయు పందిళ్ళతోను, పచ్చని తోరణముల తోడను నిండు వసంతోదయ శోభతో కళ కళలాడింది. ఆంధ్ర సంస్కృత భాషలయందు నిగ్గుతేరిన పండితులు వచ్చిరి. గణపతియు వచ్చియుండెను.

సభలు ఆరంభమైనవి. తెలుగు సంస్కృత సాహితీ వైభవం అందు చిందులాడినది. పలువురు ప్రతిభాశాలురు ప్రేక్షకులను

ముగ్ధుల్ని చేశారు. గణపతి యొక్క అష్టావధానము ఒక ప్రత్యేక ఆకర్షణ. అతని ఆశుకవిత పలువుర నాశ్చర్యమున ముంచినది. మందసా రాజు గణపతియందు అనురాగ చిత్తుడైనాడు. గణపతిని కొన్నాళ్ళపాటు తన యాస్థానమున ఉండుమని వేడినాడు. గణపతియు అందులకంగీకరించెను. యువరాజు "శివపంచాక్షరి" మంత్రోపదేశమును కోరినాడు. ముందుగా రాజగురువు యొక్క అనుమతి అందులకు కావలయునని గణపతి యువరాజుతో చెప్పెను. రాజ గురువు వైష్ణవుడు. మతమౌఢ్యము, ఛాందస వాదములందు అతడు మసలు చుండెను. కావున గణపతి ఉదారత అతనికి నచ్చలేదు. ఒక రోజు ఆస్థానమున గణపతితో మతవాదమునకు దిగినాడు. అందు చిత్తుగా ఓడిపోయి, ఈర్ష్యతో గణపతిపై వాగ్బంధన మంత్రం ప్రయోగించాడు.

వాక్ స్వరూపమైన గణపతి వాక్కును బంధించుట ఎవరి తరము! ప్రయోగము విఫలమైనది. రాజగురువు యొక్క ఈ ప్రయత్నమునకు గణపతి కోపగించినవాడై "ఓయీ! మతమౌఢ్యముతో వాదోపవాదములందు ధర్మాధర్మముల నెరుంగకుంటివే? వాదనలు విజ్ఞానదాయకములుగాని మతద్వేషమును పెంచుటకు గాదని ఎరుంగవా? మూలస్వరూపమైన పరమాత్మను జేరుట సర్వమత ధర్మముకాగా, ఆచారమునందలి శ్రద్ధ, భావము నెంచకుంటివే? గురు పీఠమును అలంకరించిన నీకు ఇటువంటి అసహనము శోభ నిచ్చునా?" యని మందలించినాడు. సభ యందున్నవారు నివ్వెర బోయిరి. విషయమును గ్రహించిన రాజు మధ్య కలిగించుకొని గణపతిని శాంతపరచినాడు. ఆ తరువాత గురువు కూడ తన తప్పిదమును తెలిసికొని క్షమాపణ వేడుకున్నాడు.

ఇదిలా ఉండగా గాలిలోతేలే ఒక యోగి ఆగమన వార్త పట్టణంలో సంచలనం రేకెత్తించింది. ఆ యోగి పేరు నిష్ఠల రామదాసు. అతడొక చీకటి గదిలో, సన్నని వెలుతురులో భూమికి నాలుగు అడుగుల ఎత్తున గూర్చుని ప్రజలకు దర్శన మిచ్చుచుండెను. గదిలోనికి ప్రవేశము నిషిద్ధము. అందరూ అతనిని కిటికీనుండి చూడవలయును. ఇద్దరు శిష్యులు బయట నిలబడి యోగి తాలూకు మహిమలను ప్రజలకు చెప్పుచుండిరి. గుంపులు గుంపులుగ ప్రజలు వచ్చి యా మహిమను జూచి కట్న కానుకలు చదివించి తీర్థ ప్రసాదములను పుచ్చుకొనుచుండిరి.

రాజుగారికి ఆ యోగిని చూడాలనిపించింది. గణపతితో గలసి వారు యాతని దర్శనమునకని బయలుదేరినాడు. ముందు గవాక్షము ద్వారా యోగిని జూచినారు. అతనిని సమీపించి జూచి మాటలాడిన బాగుండునని తన యభిప్రాయమును శిష్యుల కెరింగింపగా వారుఅందులకు నిరాకరించిరి. గదియందు ప్రవేశము నిషిద్ధమనియు, యోగమునందున్నప్పుడు వారు ఎవరితోనూ మాట్లాడరనియు శిష్యులు చెప్పినారు.

సంపూర్ణముగ ధ్యానమునందు మునిగిన తాపసికులందు కొందరికి ఇటువంటి యోగము కలుగుతుంది. దానికి ఇంతటి రహస్య బంధనము చేయనవసరము లేదు. కావున శిష్యుల మాటల్ని విన్న గణపతి ఇందు మోసమున్నదని శంకించెను. రాజుతో తలుపులను బ్రద్దలు కొట్టించుమని వేడినాడు. ముందు రాజు అందులకంగీకరించలేదు. కాని గణపతి అందు మోసమున్నదని చెప్పడంతో చివరకు అంగీకరించి తలుపులు తెరపించాడు. అందు త్రాళ్ళకు సహితము నల్లరంగు పూయబడిన ఒక ధర్మకాటా యున్నది. ఒక బల్లపై అధికమైన బరువుపెట్టి ఎవ్వరికిని కనబడ

కుండునట్లు అమర్చిరి. రెండవ బల్ల మీఁదికి తేలియున్నది. అందు యోగి కూర్చుని యుండెను. వెలుఁగు సన్నముఁగా యుండుటచే కిటికీనుండి జూచిన కాటా కనబడుటలేదు.

రాజునకు యోగిపై ఆగ్రహము కలిగినది. కాని గణపతి వారిని సముదాయించి యోగిని మందలించెను. "అతడు పేద బ్రాహ్మణుడు, పొట్టకూటికై యిటుల చేసియున్నాడు. క్షమింపుడు కొంత ధనమిచ్చి యాదరింపుడు" అని రాజుని వేడుకొని ఆ కాటా యోగికి కొంత ధనమిప్పించెను. దీనితో రాజునకు గణపతిపై గౌరవము మరింత హెచ్చెను. నిత్యమూ జరుగే సాహితీ చర్చల మధ్య కాలచక్రము గిర్రున తిరిగినది.

గణపతికి నవద్వీపమునకు వెళ్ళు సమయము దగ్గఱపడినది. రాజువద్ద గౌరవ సత్కారములను ధన సహాయమును పొంది, ఇరువురు సహచరులతో అతఁడు నవద్వీపమునకు బయలుదేరినాడు.

## 19. సదాచారబోధిని

శ్లో॥ సత్యం స్వర్గస్య సోపానం సత్యం పుణ్యం పరం మతమ్ ।
సత్యే రమన్తే ధీమన్త స్తస్మా త్సత్యం వచోవదేత్ ॥

[సత్యము స్వర్గమునకు సోపానము. సత్యమే గొప్పదైన పుణ్యమైన మతము. బుద్ధిమంతులు సత్యమునందే వర్తింతురు. కావున సత్యమే పలుకవలెను.]

శ్లో॥ నకించి దవ మన్యేత మనసా దేహధారిణమ్ ।
దేహే సర్వస్య జీవాత్మా లోకనాథో హ్యవస్థితః॥

[శరీర ధారుడైన మనుజుని కొంచమైననూ అవమానించ రాదు. అందరికీ దేహమునందు లోక నాథుడైన భగవంతుడే కదా జీవనామముతో నుండును.]

శ్లో॥ ఆచారహీనః పురుష స్సంపదా పరిహీయతే ।
ఆచార ఏవ పాండిత్యం న శాస్త్రేషు ప్రవీణతా ॥

[ఆచార హీనుడైన పురుషుడు సంపదచే విడువబడును. ఆచారమే (ఆచరింపబడునదే) పాండిత్యముకాని శాస్త్రములందున్న ప్రావీణ్యము కాదు.]

శ్లో॥ యాన్యాచరంతి కర్మాణి సంతో లోకహితం కరాః ।
భజంతే తాని సర్వాణ్య ప్యాచార పదవాచ్యతామ్ ॥

[లోక హితము కొరకు సత్పురుషులు ఏకర్మలనాచరింతురో అవియన్నియు ఆచారములని చెప్పబడుచున్నవి.]

- సదాచార బోధిని
గణపతి ముని



పూర్వమైక్య భారతమునందలి తూర్పు ప్రాంతమును వంగదేశమనుచుండిరి. ప్రస్తుతమున్న బెంగాలు రాష్ట్రము అందలి భాగము. రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, రవీంద్రనాథ ఠాగూరు వంటి ఎందరో ఆధ్యాత్మిక ఋషిపుంగవులకును, దేశ భక్తులకును, సంఘ సంస్కర్తలకును జన్మనిచ్చినటువంటి పుణ్య భూమి యిది. విద్యలకు వరప్రదాయిని అయినటువంటి కాళికాదేవి క్షేత్రమిది. దేవీ పద భక్తులు, ఉపాసకులు ఇచట అనేకులుండెడి వారు, ఉన్నారు. దేవీ నవరాత్రి ఉత్సవములు ఇచట విశేషముగ

జరుపుదురన్న విషయము అందరకును తెలిసినదే. బెంగాలు రాష్ట్రపు రాజధాని కలకత్తా. అచట ప్రసిద్ధి చెందిన రెండు కాళికాలయములు గలవు. నవద్వీపమునకై బయలుదేరిన గణపతి ముందుగా ఈ కలకత్తా నగరమును చేరుకున్నాడు. పరమేశ్వరీ కటాక్ష విలసితమై, దశమహావిద్యలయందు మొదటి విద్యకు అధికారిణియైన కాళీమాతపీఠమై యొప్పు ఆ పుణ్యస్థల దర్శన మాహాత్మ్యమును ఇలా కొనియాడాడు.

శ్లో॥ సంగేయ మానం స్థల మార్య బృందై
ర్బృందారకాణాం సరితస్తటేస్తి ।
యః కాలికాం పశ్యతి కాలకేశీం
తత్రాస్య కాలాదపి నైవ భీతిః ॥

[ఆర్య సంఘములచేత సంకీర్తింపబడుచున్న క్షేత్రము దేవనదీ (గంగ) తీరమందున్నది. ఆ స్థలమందున్న నల్లని జుట్టు గల కాళిని సందర్శించిన భాగ్య శాలికి కాలుని (మృత్యువు) వలన గూడ భీతి కలుగదు.]

విచిత్రమేమన ఇచట యీ పరాశక్తి కాళీఘాట్ యందు, మంత్ర తంత్ర విధానముల పూజనందుకొనుచు భీకర ప్రళయ కాల స్వరూపమున భయోత్పాతము కలిగించుదానివలె గనబడును. అటు దక్షిణేశ్వరమునందు మందస్మిత వదనయై చిన్మయకళల చిందులాడుచుండును. కాల స్వరూపమొకరైన శాంత స్వరూపిణి యింకొకరు. ఒకామె జంతువుల రుధిరమును ద్రావు రక్తపిపాసిని వలె కనబడును. మరియొకామె రామకృష్ణుని నైవేద్యము నారగించి శుద్ధ స్వరూపిణి యైనది కాబోలు, కరుణారస ప్రపూర్ణ చక్షువుల హృదయతాపమును హరించు దేవతవలె కనబడును.

కాలము యొక్క భీకర స్వరూపమొకరైన ప్రశాంత స్వరూప మింకొకరు. అయినను ఇరువురును భక్త వర ప్రదాత్రులే. ఇరు వురును కరుణామూర్తులే.

ముందుగా కాళీఘాట్‌నందున్న కాళికాలయము చేరుకున్నాడు గణపతి. కాళిదాసునకు నాలుకపై శ్రీకారముచుట్టి విద్యానొసగిన ఆ కరుణా మూర్తిని హృత్పీఠంపై నిల్పి కండ్లు మూసుకొని ధ్యానం చేశాడు. కొంతసేపటికి కండ్లు తెరచి ప్రక్కన చూడగా ఒకటి భీకర దృశ్యము కాన వచ్చింది. ఒక ఏనుపోతు బలిపీఠముపై కట్టబడియున్నది. దానికి స్నానముచేయించి పసుపు కుంకుమలతో అలంకరించి, మెడయందు మాలలు వేసి బలినిచ్చుటకై సిద్ధపెట్టి యున్నారు. ప్రక్కన కొందరు మాంత్రికులు పూజలు చేయు చున్నారు. ఆ అమాయక ప్రాణి బిత్తర చూపులతో రక్షణ కోరు తున్నట్లు అనిపించింది గణపతికి.

అమ్మా! ఏమిటీ దారుణము! భక్తవర ప్రదాత్రివే! అందరినీ చల్లగా చూచెడి దానవే! నీవే రక్త పిపాసినివై ఇటులుండుట ధర్మమా? జీవహింసను నీవు సహింతువా? అంధకారమున మూఢా చారములలో మునిగిన యీ ప్రజానీకానికి జ్ఞానము కలిగించవా? అని అమ్మని వేడినాడు. ఆ బలిపీఠమును సమీపించి "ఆపండి! దేవీ ప్రసన్నమునకని యీ జంతువును బలి యిత్తురా? జీవహింస పాపము కాదా! దానిని చంపవద్దు వదలి వేయుడు" అని ఒకటి పరశురామునివలె అరచినాడు. అందరి దృష్టి అతనిపై బడినది. పూజచేస్తున్న తాంత్రికులు పూజలాపారు. గణపతిని కోపంగా చూచారు. ఆలయమునకు వచ్చిన ప్రజానీకం అవాక్కయినారు. ఈ హఠాత్, పరిణామమున కాశ్చర్యము, ఏమి జరుగనున్నదో యను భయము అచటి వారి యందు కనబడినది. గణపతి,

పూజారుల మధ్య వాదోప వాదములు జరిగినవి. గణపతి బలి పీఠముపై నిల్చుండి "మీకు బలియే ప్రధానమైన నన్ను బలి ఈయండి. అంతేకాని జీవహింస సహించను" అని మొండికెత్తాడు. చివరికి ఆ రోజు బలి జరుగలేదు. కొందరు అపచారమని గణపతిని దూషించారు. మరికొందరు శ్లాఘించారు.

గణపతి యందలి సాంఘిక దృష్టికి ఇది అంకురార్పణ. అంతవరకు తపస్సు తప్ప అన్యము నెరుగని యతనియందు సంఘ సేవా దృక్పథం కలిగింది. వేదోక్తమైన క్రతువులందు నవ ధాన్యములను బలి యిచ్చుటయే యాచారము కాని జీవహింస ప్రోత్సహింపబడలేదనునది యతని వాదన, సర్వ జన హితకరమైన యాచారము అవసరమనియు, మతములపై, అసంతృప్తి, హేతు వాదము ఇత్యాదులకు మూఢాచారములు కారణమగుచున్నవని యతను తలచాడు.

తరువాత దక్షిణేశ్వరము నందలి కాళికాదేవిని దర్శించాడు.

శ్లో॥ సుధా కరాలంకృత చారు చూలీ
శివాం మతిం నః ప్రదదాతుకాలీ ।
యన్నామగాయీ కిల రామకృష్ణో
ధీరాగ్రగణ్యః పరమాలులోకే ॥

[చంద్రకళా ధారిణియైన కాలి మాకు శుభమైన మతి నిచ్చుగాక. అట్టి కాళీ నామమును గానము చేసి రామకృష్ణ పరమ హంస ముక్తుడాయెను కదా!]

సముద్రమందలి అలలను ఎలా నిర్మూలించలేమో అలాగే మత నిర్మూలనము గావించుట కూడా అసాధ్యము. "మతము" అనగా అభిప్రాయము అని అర్థము. ప్రాణి యొక్క మనస్సు,

బుద్ధి పరిపక్వతలను బట్టి అభిప్రాయములందు ఔన్నత్యము కని పించును. గావున అందరికినీ ముఖ్యముగ కావలసినది సరళమైన యాచార ప్రక్రియ. అది సత్యశోధనకు దారి తీయును. తోటి మానవులను సమానదృష్టితో చూడలేనటువంటి అలవాట్లు, బొగ్గులను కూడ కడిగేటటువంటి మడి, జీవహింస ఇత్యాదులు రాక్షసాచార మగునుగాని దేవతాప్రీతికాజాలదు. సమన్వయదృష్టి, ప్రేమ, వినయము, నమ్రత, సత్యదృష్టి ఇత్యాదులే సమాజ వికాసమునకు ఆవశ్యకము. గణపతి సరళమైన రీతిలో ఆచార నియమావళిని సంకలనము చేయవలెనని యెంచాడు. అందరిలాగ మతము—వర్ణ వ్యవస్థ అని అనకుండా నానాత్వముతో నిండిన సమాజమునందు ఏక యుక్తమైన ఆచార నియమావళిని సూచించుటయందు గణపతి లో కొంతవరకు బుద్ధుని 'పంచశీల' తత్త్వ భావములు కనిపిస్తాయి.

అన్నం, కూర, పచ్చడి పులుసు ఇలా తిను పదార్థములను వేరు వేరుగా వడ్డించినా శ్రీ రమణ భగవాన్ 'అన్నీ కలిపి ఒక పట్టెడు ముద్దను ఆరగించెడివాడు. 'అన్నీ వేరు వేరుగా కలిపి తిన్నచో రుచిగా ఉండును. మీరేల ఇట్లు ఏకము చేయుచున్నారు, అని అడుగగా "ఇప్పటికే నానాత్వము అధికమయిపోయింది. ఇక్కడ కూడా అదేనా" అన్నారు వారు. ఇందులో ఎంతటి సత్యం దాగి ఉన్నదో గమనించండి.

మూఢమైన మతాచారములకు విపరీతమైన ప్రామాణిక బుద్ధియే కారణమని గణపతి ముని యభిప్రాయము. ఇందు వారి వివరణము ఇలా ఉన్నది.

"ప్రామాణిక బుద్ధి—విమర్శనము ఇవి పరస్పర విరుద్ధములు మనకు ఒకరి గ్రంథముపై విపరీతమైన నమ్మకము కలిగినచో

దానిని మనము విమర్శించలేము. వారిపై గల భక్తి భావము అట్టి అటుల చేయుట వినయము కాదని మనము తలంతుము. అట్టి ప్రామాణిక బుద్ధి వల్ల విమర్శనాశక్తి క్షీణించి పోతుంది. ఎవరైన సాహసించి విమర్శ జేసినచో వారిని మనము నాస్తికుని వలె జూచెదము. ఇటువంటి ప్రామాణిక బుద్ధి దాస్య హేతువు. వేదములు తప్ప తక్కిన గ్రంథములన్నియు విమర్శకు లోను స్థలము లగుటకు దగినవి. వేదములందు గూఢ తత్త్వములను గ్రహించుటకు విమర్శ అవసరము. ముఖ్యముగ ప్రాచీనుల గ్రంథములందు మనకు ప్రామాణిక బుద్ధి అధికమై యున్నది. దానిచే మనమొక భావదాసుల మగుచున్నాము. అయితే విమర్శ చక్కని స్థాయిలో నుండవలెను. ఈ విషయమును ప్రస్తుత గ్రంథకారు లోకియు గమనించవలెను."

ఈ విధముగా గణపతి ముని యందు కొన్ని విప్లవాత్మక భావములను మనము గమనించవచ్చును. 14 ఏండ్ల వయస్సులోనే ఛాందస వాదముపై సవాల్ చేసిన కవి కులపతి యితడు.

సంగ్రహముగ అయిదు అధ్యాయములుగా విభజించి 112 శ్లోకములు గల "సదాచారబోధిని యను గ్రంథము వ్రాసినారు. అందు ఆచారములను కర్మాచారము, జ్ఞానాచారము, మానస ఆచారము అని మూడు వర్గములుగా వివరించి యున్నారు.

(1) ఒకే కన్యను వివాహమాడి ఆమెతో విద్యుక్త ధర్మమున వైవాహిక జీవితము గడుపుచూ, విషయ వాంఛల యందు అధికముగా మనస్సును పోనీయక, పూజ జప చింతనాదులతో జీవితము గడుపుట కర్మాచారము.

(2) అందరి యందును ప్రకాశించువాడు పరమాత్మ యని తోటి జీవుల నాదరించుచు, ప్రియవచనము, సత్పురుషుల సేవ, సత్కథలయందాసక్తి, సత్యశోధన ఇత్యాదులు జ్ఞానాచారములు.

(3) సర్వజనహితకాంక్ష, పరస్త్రీని గౌరవించుట, రాగ ద్వేషములందు మనము లగ్నము కానీయకుండుట ఇత్యాదులు మన ఆచారములు.

ఇవి యన్నియు ధర్మస్మృతుల వలన మేము సంగ్రహించిన సారములని మొదటి శ్లోకమునందు తెలిపి యున్నారు. ఈ పుస్తకము ఇప్పటికినీ అనేక మంది పండితుల మన్ననలను అందుకొనుచున్నది.

## 20 విజయ పతాకము

శ్లో॥ సుధాం హసన్తీ మధుచాక్షిపన్తీ
యశో హరంతీ వనితాధరస్య ।
పరిష్కరోత్యస్య కవిత్వధారా
ముఖం హరప్రేయసి । లోకసే యమ్ ॥

[అమ్మా శివప్రేయసి ! లోకమున ఎవరిని నీవు జూచెదవో వాని ముఖమును, అమృతమును జూచి నవ్వునదియు, మధువు (తేనె) నాక్షేపించునదియు, వనితలయొక్క అధరామృత కీర్తిని హరించునదియు నగు కవిత్వధార అలంకరించును]

—ఉమాసహస్రము

• • • •

హైందవ సంస్కృతి సంస్కృత వాఙ్మయమునందు నిక్షిప్తమై యున్నది. దేవభాష యని చెప్పబడే యీ సంస్కృత భాష అనేక భారతీయ భాషలకు మూలమనునది కూడ అందరికీ తెలిసినదే. ఈ భాష నిండు వసంత శోభతో కళకళలాడు కాలము నందు అమరావతి, ఉజ్జయిని, నలందా మరియు నవద్వీపములందు ప్రసిద్ధిచెందిన సంస్కృత విద్యాపీఠములుండెడివి, పాశ్చాత్యుల పాలన ప్రారంభమైన నాటినుండి యీభాష క్రమ క్రమంగా మరుగు పడడంతో మొదటి మూడు స్థలములందుగల విద్యాపీఠములు ఆదరణను కోల్పోయినవి. అయినను వంగదేశమునందుగల నవ ద్వీపమునందు మాత్రము కొద్దిగానో గొప్పగానో మొన్నటి వఱకు సంస్కృత పరిషత్తులను జరుపుచూ ఈ దేవ భాషను విజ్ఞులు ఆదరించు చుండిరి. ఇచట ప్రతి సంవత్సరమూ అఖిల భారత స్థాయిలో విద్వత్ సభలు జరుపుచుండెడివారు. దేశ విదేశముల నుండి వచ్చు పండితులను పరీక్షజేసి, వారిని ఆదరించి, బిరుదు లను, పట్టాలను బహుకరించుట ఆచారమైయుండెడిది. కావున పండితులు నవద్వీపమును సరస్వతీ నిలయముగ భావించెడివారు. కళాపోషకులకు పామరులకు ఈ సభలు చక్కటి వినోదమును కలిగించుచూ, విజ్ఞానదాయకములై యుండెడివి. ఇందు ప్రవేశము పొందుటకు సామాన్యమైన పాండిత్యము చాలదు. కావున తఱచుగా పెంట్రుకలు నెరసిన దిట్టలు మాత్రమే బిరుదులను పట్టాలను పొందుచుండిరి. దాక్షిణాత్యులు ఎవ్వరును ఈసభలందు ఇదివరకు సత్కరింపబడి యుండలేదు. అందుచే సంస్కృతభాష ఉత్తర దేశ వాసులకే వచ్చునను అహంకారముకూడా కొందరిలో కనిపిస్తూ ఉండేది తత్ఫలితంగా దాక్షిణాత్యులకు ఆదరము లభించేది కాదు.

అటువంటి ప్రతిష్ఠాత్మకమైన సభలయందు ప్రాగాసనుడకై తన సహచరులతో వచ్చినాడు గణపతి. సభకార్యదర్శి పేరు శితికంఠ వాచస్పతి యనియు, వ్యాకరణ పాఠశాలయందతడుండు ననియు తెలసి ఆ పాఠశాలకై వారు వెతుకనారంభించిరి. అచట ప్రతి గుమ్మము ఒక విద్యాలయ ద్వారముగానే కనిపించింది వారికి. కావున యీ పాఠశాల జాడ వారికి చెప్పువారు లేక పోయిరి. పురమంతయు అలంకరింపబడి, పండిత పామర జనసందోహముతో కిటకిటలాడినది. గణపతి గోడు పట్టించుకునే వారు లేకపోయిరి. నెరసిన వెంట్రుక గలవాడే పండితుడను భావము వారియందుండ బాలునివలె దోపు గణపతి తాను పండితుడని చెప్పినను విశ్వసించు వారు కరువైరి. పగలంతయు తిరిగి తిరిగి వారు అలసి పోయిరి. శరీరమందు ఓపిక తగ్గినది. ఇక ఆరోజుకి కార్యదర్శిని కనుగొనుట కష్టమని గణపతి తలంచెను. చీకటి పడినది. ఒక్కసారి తన సహచరులను చూచాడు. వారు ఆకలితోనున్నారని గ్రహించాడు. ప్రక్కన ఎత్తైన అరుగులతో గల ఇల్లు జూచి అచట విశ్రమించుట మేలని వారు ఎంచిరి. ఒక అరుగుపై ముగ్గురును కూర్చుని మూటవిప్పి అందుగల అటుకులను భక్షించి, మేను వాల్చారు. గణపతికి నిద్ర పట్టలేదు. "ఏమిటీ పరమేశ్వరీ విలాసము : ప్రతీచోటా పరీక్షయేనా ? ఇంత చిన్న పట్టణమునందు ఒక పేరుగాంచిన కార్యదర్శి విలాసము చెప్పువారు కరువైనారే:" అని తలచినవాడై ఆమె నిట్లు స్తుతించాడు.

శ్లో॥ దేవలోక పూజితాం శ్రీ రీశ్వరస్య భామినీ
మానసాభిధాన వారి సంభవార్పణ ప్రియా ।
సాధుకామదాయినీ దురాత్మ కామ ఘాతనీ
వీరలోక మాననీయ మాదధాతు మా ముమా ॥

[దేవలోక పూజ్యురాలైన ఈశ్వరుని కాంతయు, మనస్సు నర్పించుటచే సంతసించునదియు, సజ్జనులకు హితము గూర్చునదియు, దుర్జనుల కామములను నశింపజేయునదియు అయిన దేవి నన్ను వీరలోక పూజితునిగ చేయుగాక:]

"దేవాసుర సమీకేషు బహుశో దృష్ట విక్రమః"

రామాయణమునందు హనుమంతుని పరాక్రమమును వర్ణించు శ్లోకమిది. హనుమంతుని పరాక్రమము దేవతా ప్రశంసనీయమైనదన్న భావమిందు గలదు. పాండిత్యమునందు గణపతి అటువంటి పరాక్రమము గలవాడని ఇది సూచించుచున్నది. శివకుమారుడంతటి వాడు ఇట్లు పొగిడియుండిన గణపతి నిశ్చయముగ గట్టివాడై యుండునని యెంచి శితికంఠ వాచస్పతి యతనికి సభయందు పాల్గొను అవకాశమిచ్చుటకు అంగీకరించెను.

నిర్ణీత సమయమునందు విద్వత్ పరీక్షలు ప్రారంభింపబడెను. "హరిసభ" యను మండపము సభా వేదికయైనది. అది పచ్చని తోరణములతో అలంకరింపబడి దేశదేశముల నుండి వచ్చిన పండిత సముదాయముతో కళకళలాడినది. వేద మంత్ర జయగానముల మధ్య ఆనాటి సభాధ్యక్షుడైన అంబికాదత్తుడు వేదిక నలంకరించినాడు. అతడు గొప్ప ఆశుకవితానిపుణుడు. అధ్యక్షుని ఆగమనంతో సభ నిశ్శబ్దమైపోయింది. అందరూ జరుగబోయే కార్యక్రమమునకై ఎదురుచూడసాగారు. అంతలో గణపతిని తోడ్కొని శితికంఠ వాచస్పతి వేదికముందుగల తన యాసనమును చేరుటకై వచ్చుచుండెను. వేదికకు దగ్గరకు రాగానే పైనున్న అధ్యక్షుని జూచి "కోఽసౌ మహాశయః? (ఎవరీ మహాశయుడు) అని గణపతి గురించి అడిగాడు. ఆ నిశ్శబ్ద వాతావరణములో అతని పలుకులు అంతటా ప్రతిధ్వనించాయి. అందరి దృష్టి గణపతిపై మరలినది. ఎవరీ యువకుడు? ఏమిటీ సాహసము? అన్న ప్రశ్నా భావములు అందరియందు గోచరించాయి. వాచస్పతికి ఇది అనూహ్యముగ యున్నది.

అంతలో సరసుడు, మృదుహృదయుడు అయిన అధ్యక్షుడు ఆ కవి బాలకుని సాహసమునకు మెచ్చెనో యేమో! నవ్వుతూ :-

శ్లో॥ సత్వర కవితా సవితా గౌడోహం కశ్చిదంబికాదత్తః।

[త్వరితముగ కవిత్వము చెప్పెడి (కవికులమునకు) సూర్యుడను. గౌడ బ్రాహ్మణుడను. నన్ను అంబికాదత్తుడందురు.]

అని ఒక చరణముతో తన పరిచయమును జేసికొని శ్లోకమును అసంపూర్ణగ వదిలెను. శ్లోకమును పూరించు బాధ్యత గణపతిపై బడెను. గణపతి యిది గ్రహించి :

గణపతిరితి కవికులపతి రతి దక్షోదాక్షిణాత్యోహమ్.

[నేను కవికులమునకు అధిపతిని, అతిదక్షుడను, దాక్షిణాత్యుడను. నన్ను గణపతి యని పిలుతురు]

అని శ్లోకమును పూరించి అందు తన పరిచయము గావించుకొనెను.

మొదటి చరణమునందు "కవితా సవితా" యనుచోట మాత్రమే శబ్దాలంకారముండెను. రెండవ దానియందు "పతిరితి, పతిరతి, దక్షోదాక్షి అను చోట్ల శబ్దాలంకారములు గలవు.

గణపతి యింతటితో నాగక "భవాన్ దత్తః, అహంత్వౌరసః (నీవు అంబికకు దత్తుడవు, నేను నిజపుత్రుడను) అని చమత్కరించెను ఇది సభికులను భయభ్రాంతులను జేసినది. హిమాలయ శిఖరముల నంటెడి కీర్తి నొందిన అధ్యక్షుడెక్కడ! నిండుగా మీసముగానని యీ బాలకుడెక్కడ! వాచస్పతి నివ్వెరబోయినాడు. కాని అధ్యక్షుడు డింభకుడు గట్టివాడని గ్రహించి వేదిక మీదకి పిలచెను.

వెంటనే పరీక్ష ప్రారంభమైనది. ముందుగా నాలుగు సమస్యలను గణపతికిచ్చి పూరింపుమనిరి. అవి :-

(1) స్తన వస్త్రం పరిత్యజ్య వధూః శ్వశుర మిచ్ఛతి
[కింత్యనపద్యచరితా]

[పయ్యెదను విడచి కోడలు మామను కోరుచున్నది]
[అయినను కులటగాదు]

(2) వత్సరస్త్యైకదా గౌరీ పతి వక్త్రం నపశ్యతి
[వత్సరమున కొకమారు గౌరీదేవి పతి ముఖమును చూడదు]

3] సూర్యః శశాంకేన సమం వినష్టః
[సూర్యుడు చంద్రునితోబాటు నష్టము నొందెను]

(4) పిపీలికా చుంబతి చంద్ర మండలమ్
[చీమలు చంద్రమండలమును చుంబించినవి]

గణపతి ఈసమస్యలను చమత్కారముగా ఇట్లు పూరించినాడు.

శ్లో॥ హిడింబా భీమదయితా నిదాఘే ఘర్మ పీడితా ।
స్తన వస్త్రం పరిత్యజ్య వధూః శ్వశుర మిచ్ఛతి (1)

[భీముని భార్య అగు హిడింబ వేసవి తాపమును భరించలేక మామగారగు గాలిని కోరినది]

"హిడంబను ఇందు పేర్కొంటివి. ద్రౌపది నేల పేర్కొనలేదను సందేహము రావచ్చును. హిడింబ రాక్షస స్త్రీ. అనాగరికురాలు. ద్రౌపది క్షత్రియ వనిత. నాగరికురాలు. కావున ఆమె పయ్యెద తొలగించదు." అనుచు తన భావమును సమర్థించి వివరించెను.

శ్లో॥ చతుర్థ్యాం భాద్ర శుక్లస్య చంద్ర దర్శన శంకయా।
వత్సర స్త్వేకదా గౌరీ పతి వక్త్రం న పశ్యతి॥ (2)

[భాద్రపద శుద్ధ చవితి (వినాయక చవితి) నాడు చంద్రుని జూడ వలసివచ్చునన్న శంకతో (అపవాదు వచ్చునని) వత్సరమున ఒక్క రోజు గౌరి పతియైన ఈశుని ముఖమును (జటాజూటమున నందుండుటచే) చూడదు.]

శ్లో॥ రాహు స్త్రి కోణేచ గురుస్తృతీయే
కళత్ర భావేచ ధరా తనూజః।
లగ్నేచ కోష్ఠే యది బాలకఃస్యాత్
సూర్యః శశాంకేన సమం వినష్టః॥ (3)

[జాతకమునందు కోణములు అనగా 5, 9 స్థానముల రాహు వుండి, మూడింట గురుడు కళత్ర భావమైన 7 వ॥ యింట కుజుడు ఉన్నచో, పుట్టిన బాలకునకు లగ్నమున సూర్య చంద్రు లున్నను లేని వారే యగుదురు (నష్టము తప్పదు)

శ్లో॥ సతీ వియోగేన విషణ్ణ చేతసః
ప్రభోః శయానస్య హిమాలయే గిరౌ।
శివస్య చూడా కలితం సుధాశయా
పిపీలికా చుంబతి చంద్రమండలమ్ ॥ (4)

[భార్యయైన సతీదేవి దక్షుని యజ్ఞమునందు అగ్నికి ఆహుతియైనందున ఆమె వియోగముచే ఖిన్నుడైన ఈశ్వరుడు విచారము నొందిన వాడై హిమాలయ శిఖరము నందు శిరస్సు వాల్చగా యాతని జటాజూటమునందున్న చంద్రుని అమృతఖండ మని ఎంచి చీమలు చుంబించినవి]

సరసము, మనోహరమునగు ఈ సమస్యా పూరణ చమత్కారమునకు అందరును సంతోషించిరి. తరువాత అంబికాదత్తుడు కాళిదాసు విరచితమైన 'రఘువంశము' నందు గల ఈ దిగువ శ్లోకమునిచ్చి అందలి భావపటిమను, అలంకార, కావ్య విశేషములను తెల్పుమన్నాడు.

శ్లో॥ న మృగయాభి రతిర్న దురోదరం
న చ శశి ప్రతిమాభరణం మధు ।
త ముదయాయ నవా నవ యౌవనా
ప్రియతమా యత మాన మపాహరత్ ॥

అతి మధురముగ ఇందలి విశేషములను గణపతి వివరించగా సభికులు హర్షము ప్రకటించిరి.

తదుపరి పరీక్ష శ్లోకమునందు గల రసపోషణను తెల్పి ఆ రసమును అభాస చేయుట (రసభావము నిజానికి లేదనుట). ఈయబడిన శ్లోకము కావ్య ప్రకాశ గ్రంథములోనిది.

శ్లో॥ స్తుమః కం వామాక్షి క్షణమపి వినాయం నరమసే
విలే భేకః ప్రాణాన్ రణమఖ ముఖేయం మృగయసే ।
సులగ్నే కోజాతః శశిముఖి య మాలింగసి బలాత్
తపః శ్రీః కస్యైషా మదన నగరి ధ్యాయసి తుయమ్ ॥

ఈ శ్లోకము శృంగార రసముతో కూడినది ఇందు యౌవనవతియైన కాంత తన భర్తతో జరుపు మదన క్రీడలు (అనగా రమించుట, వెతకుట, కౌగిలించుట) ఇత్యాదులు వర్ణింపబడినవి. గణపతి

మాధుర్యముగ ఇందలి రస పోషణను ముందు తెలియ జేశాడు. తరువాత రసాభాస చేయుచూ "యమ్" అను పదము వాడుటచేత కాంత యొక్క ఊహగా నెంచ వలసియున్నది. ఊహతో కూడిన భావన ప్రత్యక్ష రసానుభూతిని కలుగ జేయదు అని వివరించెను. గంటకు పైగా విరామము లేకుండా మాటలాడు చుండుటచే ఒక చోట అతని నాలుక తొట్రుపడినది. 'సర్వేశాం' అనుటకు బదులు "సర్వాసాం" అని అతను పలికినాడు.

సమయమునకై వేచియున్న అధ్యక్షుడు ఈ తప్పును గ్రహించి "విరామతావత్" (విరమించుము) అని గర్జించినాడు. అంతటితో నాగక

శ్లో॥ అనవద్యే ననుపద్యే గద్యే హృద్యేపితే స్ఖలతి వాణీ।
తత్కిం త్రిభువన సారా తారా నారాధితా భవతా ॥

[చక్కని పద్యముపై మధురభాషణ చేయుచుండగా నీ వాణీ స్ఖలించినది. ఏమి నీవు త్రిభువన శ్రేష్ఠురాలగు తార నుపాసించ లేదా ?]
అని ఆక్షేపించినాడు.

గణపతికిది అసహ్యమైనది. ఇంత చిన్న దోషమునకు తన్ను విరమించుమని చెప్పుట యతనికి కోపము కలిగించినది. అందును దోషముతో కూడిన శ్లోకముతో నాక్షేపించుచున్నాడు. "సారస్తారా" యనుటకు బదులు "సారా తారా" యని ప్రాసకు ప్రాముఖ్యమిచ్చి తన తప్పు తెలియకున్నాడు. వెంటనే గణపతి అధ్యక్షుని జూచి

శ్లో॥ సుధాం హసంతీ మధు చాక్షి పంతీ
యశో హరంతీ దయితా ధరస్య ।
న తేల మాస్యం కవితా కరోతి
నోపాస్యతే కిం దయితార్ధ దేహః॥

[అమృతమును పరిహసించునదియు, మధువును అక్షేపించునదియు, ప్రియురాలి యధరోష్ఠ కీర్తిని హరించునదియు నగు కవిత్వము నీ ముఖమునలంకరించ లేదెందులకు? నీవు కాంతార్ధ విగ్రహుడగు ఈశ్వరుని ఉపాసించలేదా?]

దీనితో అంబికాదత్తుని ముఖ మెర్ర వారినది. అంతటి నిండు సభలో మీసములు రాని బుడతడు తన్ను ఆక్షేపించుటయా? పరాభవమతడు సహించలేక పోయాడు. గణపతి కూడ తక్కువ తినలేదు. ఇరువురును ఒకరి నొకరు దూషించు కొనిరి. వారి సంవాద మిట్లుండెను.

అం:_ శ్లో॥ జ్యోతిరింగణన కిం ను మన్యసే
యత్త్వమేవ తిమిరేషు లక్ష్యసే॥

[ఓ మిణుగురు పురుగా నీవు చీకటిలోనే వెలుగుదువు. వెలుగులో కాదు. _అనగా దోషము లెంచుట యందే ప్రకాశించుచుంటివి అను భావము.]

గణ:_ శ్లో॥ కిం ను దీప భవనే విభాససే ।
వాయునా బహిరహో విధూయసే ॥

[ఓ దీపమా ! నీవు భవనములందు మాత్రమే వెలుగుదువు. వెలుపలకు వచ్చినచో గాలిలో కదలి పోవుదువు._అనగా సభలలో నీ పాండిత్యము నిలువ జాలదు అని భావము.]

అంబి:- ఉచ్చైః కుంజర మాకార్షీః బృంహితాని మదోద్ధతః ।
కుంభి కుంభా మిషాహారీ శేతే సంప్రతి కేసరీ॥

[ఓ కుంజరమా! మదముచే గర్వించి బృంహిత ధ్వనులు (గర్జనలు) చేయుచున్నావు. ఏనుగుల కుంభస్థలములందుండు మాంసమును హరించు సింహమిచ్చటనే కలదుసుమా!]

మరల ఈ శ్లోకమందున దోషమును గ్రహించెను గణపతి. 'మిషాహార' అనుటకు బదులుగా 'మిషాహారీ' అని చెప్పబడినది. అభ్యక్షునకే దోషమును జూపుచూ!

శ్లో॥ సమాసీనో రసాలే చేత్ మౌన మావహ మౌకలే ।
లోకః కరోతు సత్కారం మత్వాత్వా మపి కోకిలమ్ ॥

[ఓ కాకమా! నీవు మామిడి చెట్టుపై నుండ దలచితి వేని మౌనముగా నుండుము. అప్పుడు లోకులు నిన్ను కోకిల యను కొని సత్కరింతురు.]

గణపతి ఇంతటితో నాగలేదు. అనుప్రాస, అలంకారము పేటియందు ఇచ్ఛ కలిగి రసవత్తరమగు కవిత్వము చెప్పుటకై ప్రయత్నించి, ప్రాస యందు మాటి మాటికి ఆతురత జూపుచు కావ్య రసము పాడుచేయుచున్న అంబికాదత్తుని జూచి యిట్లనెను.

శ్లో॥ అపుష్పా చూతలతికా విపన్నా సా సరోజినీ ।
హేమంతే హంత! రోలంబ నిరాలంబః క్వ మోదసే ॥

[మామిడి గున్న పుష్పించలేదు, శిశిర ఋతువు రానందున. పద్మము నశించినది హేమంత ఋతువైనందున. అక్కటా తుమ్మెదా! నీవు ఆశ్రయము లేనిదానవైతివి. ఎటుల సంతోషింప గలవు]

ఇందు ద్వంద్వార్థము గోచరమై యున్నది. మొదటిది కావ్య పటిమ లేకుండా ప్రాస యుక్తమైన పద్యం చెప్పుటకై పడే యాతన. రెండవది రసజ్ఞురాలు కాని భార్యవల్ల సంసార సుఖము లందు కలిగే అవస్థ. అంబికాదత్తుడు రెండవ పెండ్లి చేసికొని యుండెను. భార్య చాల చిన్న వయస్కురాలు. పుష్పవతి కాలేదు. ఆమె పేరు 'సరోజిని'. గణపతి తనకు తెలిసినట్లుగా భార్య పేరుతో సహా తన సాంసారిక యవస్థను చెప్పెను. దీనితో అధ్యక్షుని ముఖము వాడి పోయెను. గణపతి సామాన్యుడు కాడని సిద్ధ పురుషుడని తెలిసికొనెను. వెంటనే ఏమిచేయుటయో తెలియక గణపతిని కుర్చీయందు కూర్చొనుమనెను.

శితికంఠ వాచస్పతి ఈ పరిస్థితిని గమనించి సంవాదన మిక యాపుట మంచిదియని యెంచి వేదికమీదకి వచ్చెను. "మీరు సాంసారిక విషయములందు, వ్యక్తిగత విషయములందును నిందను మానుడు. పరస్పర జాతి పరిహాసము జేసికొని వాదమునాపుడు" యనెను. వెంటనే అంబికాదత్తుడు

"భట్టో ఖిలోఽట్టోపరి వార వధ్వా
నిపీయ మద్యా రభతే విహారమ్"

[భట్టులు (అనగా దాక్షిణాత్యులు) మేడలపై వేశ్యలతో గూడి మద్యపానము చేసి విహరింతురు.]

అని దక్షిణ జాతి వారిని పరిహసించగా, గణపతి

"అసువ్యయో వాస్తు వసువ్యయో
వాప్యమీ న మీన వ్యసనం త్యజంతి"

[ప్రాణము పోయినను సరే, డబ్బు పోయిననూ సరే మీరు మీ మీన వ్యసనము మాత్రము విడువరు]

వెంటనే అంబికాదత్తుడు లేచి కండ్ల ఆనంద బాష్పములు నిండియుండగా గణపతిని కౌగలించుకొని యాతని కావ్య పటిమను గొనియాడెను. సభికులు కరతాళ ధ్వని జేసిరి. గణపతి వాదము నందు తాను జేసిన దూషణమునకు క్షమాపణ వేడికొనెను. సరస చిత్తుడైన అంబికాదత్తుడు నవ్వుతూ "నీమీన' ద్వయ ప్రయోగము చేతనే నీ యపరాధము తొలగినది యనెను. (అ + మీన + మీన అని రెండు మీనములను గణపతి శ్లోకమందు బహూకరించినాడు. ఇది చక్కని పద ప్రయోగము)

పరీక్ష ఇంతటితో నాగలేదు. మహా భారతమునందలి 18 పర్వములను 18 శ్లోకములందు చెప్పుమనిరి. "అపి, హి, తు, చ" అను పదములు వాడరాదనిరి. సాధారణంగా ఈ పదములు లేకుండా శ్లోకములు చెప్పుట కష్టము. కాని భువనేశ్వరీ వర ప్రసాదియైన గణపతికిది యొక సమస్యకాదు. అనర్గళముగ 18 శ్లోకములను చెప్పుటయేగాక వాటిపై చక్కని వ్యాఖ్యానమును గూడ సభికులకు వినిపించెను.

నవద్వీపమునందు ఇంతటి మేటిసభ మొదటిసారిగా ఇట్లు జరిగినది. అంబికాదత్తుడు గణపతిని మిక్కిలి ప్రశంసించెను. "కావ్యకంఠ" యను బిరుదము ఈ కవికుంజరమునకు తగిన బిరుదని వక్కాణించెను. పరీక్షా వర్గము వారు కూడ అధ్యక్షుని ప్రస్తావనను ఆమోదించిరి. అంతట వేదఘోష నలుమూలలా వినిపించుచుండగా మేళతాళములతో గణపతిని సత్కరించి "కావ్య కంఠ" బిరుదమును ప్రధానము చేయుచూ అంబికాదత్తుడు ప్రశంసా పత్రమును చదివెను:-

# కావ్యకంఠోపహార ప్రశంసాపత్రము

## (తెలుగు అనువాదము)

శ్రీమద్గణపతి శాస్త్రిగారూ,                                                  క్రీ. శ. 20-6-1900

ఈ భూసంసారమునందు కవిత్వము సముద్రము నందు పుట్టిన యమృతము, మిగుల దుర్లభమగు దాని నెవడు లోకము కంటెనుత్కృష్టమగు సౌభాగ్యవశము వలనను ప్రసన్న దైవాను కంపము వలనను పొందునో అట్టి పురుషుడు ఈ భూమియందు దేవతా పురుషుడని గణింపబడి, గుణపక్ష పాతులగు బుధులచే మిగుల ప్రీతితో జూడబడి యాదరింపబడును.

శ్రీమంతుడవైన నీవు ఇప్పుడు అసాధారణ కవిత్వము నిచ్చుట ప్రకటించి సర్వపండిత సమూహమును సంతోషపరచుట వలన, నవద్వీప వాసులమగు మేము చరితార్థులమై, విశాఖపట్టణ ప్రదేశాంతర్గత కలువరాయి గ్రామవాసివై, సకలగుణముల కాస్పదుడవై, శ్రీమద్గణపతిశాస్త్రి నామధేయుడవైన నీకు ఆశీర్వాద పూర్వకమగు నీశ్లోకమును కానుకగా నిచ్చుచున్నాము.

శ్లోకము

ప్రాచీనై స్తైః కవికులవరైః కాళిదాసాదిభిర్యా ।
లబ్ధా కీర్తిర్భవదనుగతా సైవ భూయా దిదానీమ్ ।
సద్భిర్దత్తో య ఇహ రుచిరః 'కావ్యకంఠో', పహారః।
తేన శ్రీ మానిహ భువి భవానుజ్జ్వల శ్చాపి భూయాత్ ॥

[ప్రాచీనులగు కాళిదాసాది కవివర్యులెట్టి కీర్తిని పొందిరో, వారి ననుసరించిన నీచే నట్టి కీర్తి యిప్పుడు పొందబడెను. ఇక్కడ సత్పురుషులచే మనోహరమగు "కావ్యకంఠ" బిరుద

మేది యొసగబడెనో, ఆ బిరుదము వలన నీవు ఈ భూలోకము నందు శ్రీమంతుడవై ప్రకాశింతువుగాక:]

శ్రీయుత రాజకృష్ణ తర్క పంచాననః

1823 శకాబ్దీయు — మఱి పదముగ్గురు
సౌర జ్యేష్ఠ స్యాష్టమ దివసే — వర్గ సభ్యుల సంతకములు
(20-6-1900)

జయగానముతో సభ ముగిసినది. కావ్యకంఠుని కీర్తి పతాకము కవితాలోకమునందు శిఖరాగ్రమున కెగిరినది.

## 21. తారా మంత్ర సిద్ధి

శ్లో॥ భవతి పరావాక్ భైరవ్యాఖ్యా
పశ్యన్తి సా కథితా తారా।
రసనిధి మాప్తా జిహ్వారంగం
మాతంగేతి ప్రథితా సేయమ్॥

[పర, పశ్యంతి: వైఖరీ అను వాక్శక్తి స్వరూపిణిగా పరాదేవత మూలాధారమునందు త్రిపురభైరవిగాను, మణిపూర చక్రమునందు తారగాను, రసములకు నిదానమగు జిహ్వయందు మాతంగి గాను కీర్తింపబడుచున్నది.]

—ఉమాసహస్రము

* * * *

ఓంకారమును ప్రణవమందురు. ఇందు శబ్ద శక్తి ఇమిడి యున్నది. ఆలోచనకు, మాటకు ఇది మూలాధారము. తొలిదశలో ఇది "పరా" నామమున మూలాధారమందుండును. పండితులు

ఈ స్థితిలో ఆ శబ్ద శక్తిని పరావాక్కు అని అందురు. ఇది శక్తిమైన పరాదేవత చిత్కళ అయినందున "త్రిపుర భైరవీ స్వరూప" మందురు. ఈ నాదము హృదయమున పశ్యంతీ రూపమున దృష్టిని పొందుచున్నది. అట్టి స్థితిలో ఆమె తారాదేవి. ఇది సర్వార్థమును చూడగలుగునంత ప్రకాశశక్తి. తలపులకు చెందిన కార్య-కారణ ఉద్యమమునకు ఇది మూలమగుచున్నది. పశ్యంతి నుండి తలంపులు రూపుదాల్చి రస రూపమగు జిహ్వను (నాలుక) చేరి "వైఖరి" వాక్కు అగుచున్నది. ఈ రూపంలో వాక్శక్తి మాతంగి యని కీర్తింపబడుచున్నది. జిహ్వనుండి వాక్కు ప్రకటితమై ఆకాశమున "మధ్యమ" రూపమున లయమగును. యోగులు తురీయావస్థయందు పరా, పశ్యంతీ రూపములనుగాంచ గలరు. ఈ విధముగ వాక్కు అందరి యందుగల పరాశక్తి స్వరూపము. ఆ వాక్కుపై మానవుడు ఎంత అధికారమును పొందిన అంతటి జ్ఞానవంతుడగును.

వాక్కుపై అధికారము పొందుటకు చదువుతో పాటు సాధన యవసరము. తాంత్రికులు దీనిని దేవీ ఉపాసన ద్వారా పొందుదురు. నవద్వీప సభయందు గణపతి నాలుక తొట్రుపడగా అంబికాదత్తుడు "నీవు తార నుపాసించలేదా? వాక్కు స్ఖలించినదే!" యని హేళన చేసి యున్నాడు. గణపతి యందీపరిహాస భాషణ విపరీతముగా పని చేయుచుండెను. దక్షిణ దేశవాసులకు ఈ తారా మంత్రోపాసన తెలియదు. కావున తండ్రి తనకు యుపాసించి యుండలేదు. విచారించగా ఈ తార బెంగాలునందు అధికముగ ఉపాసన యందున్నదని తెలిసినది. తపస్సునందు దృఢ సంకల్ప మున్న గణపతి ఈ మంత్రసిద్ధిని గూడా పొందాలని తలచాడు.

పరిషత్ సభలు ముగియగానే తనతో వచ్చిన యనుచరులను వెనుకకు పంపివేసి, మిత్రుడగు కులాభిజ్ఞుని కోరికపై యతనితో కలసి మూర్షిదాబాదు వెళ్ళినాడు. అచట నాలుగు రోజులుండి రాజు కొలువులో తన పాండిత్యమును ప్రకటించి సన్మానము నొంది యటనుండి బయలుదేరి వైద్యనాథము చేరుకొనెను.

అది సుప్రసిద్ధ ఈశ్వర క్షేత్రము. గణపతి ఈశ్వర దర్శనం చేసుకున్నాడు. ఆలయములోనే అనువైన స్థలం చూసు కొని తన మూటను ప్రక్కన పెట్టి కొంతసేపు ధ్యానమందు మునిగాడు. తెలివి వచ్చేసరికి చీకటి పడినది. ఎదురుగా ఒకవ్యక్తి తనకై వేచియున్నట్లనిపించింది. గణపతి అతనిని చూడగానే యాతడు సమీపించి "స్వామీ" మీరు యోగిపుంగవులవలెనున్నారు. ఇచట మీకు భద్రము తక్కువ నా ఇంటికి రండు. అచట మీకు భోజన వసతి లభించును. ఆపైన మీరు శాంతముగ తపస్సు చేసు కొనవచ్చును" అనెను.

అపరిచితుడైన ఆ యాగంతకుని ఆదరణ గణపతికి ఆశ్చర్యము కలిగించినది. మాటలలో అతని పేరు సురేశ మిత్రు డని, పండితుడని తెలిసినది. ఇదియును ఈశ్వర కృపయేనని యెంచి గణపతి తన మూట తీసుకొని లేచుటకు ప్రక్కకు తిరిగి నాడు. అచట మూట విప్పివేయబడియున్నది. అందు పైకములు తప్ప తక్కిన సామాన్లన్నియు చిందర వందర చేయబడి కని పించెను. పైకము తస్కరించబడినది. సురేశ మిత్రుడిది గ్రహించి "అందుచేతనే యిచట భద్రముండదని చెప్పియుంటిని. మీరు చింతించవలదు. నాతోరండి'' యని తోడ్కొని పోయెను.

సురేశ మిత్రుడు కవి, పండితుడు, దేవీ పద భక్తుడు, తాను మంత్రసిద్ధిని పొందినవాడు. కానున్న కార్యమును గంధర్వులే

తీరుస్తారన్న సామెత చందమున, పరాదేవతయే గణపతి యొక్క కోరిక సాఫల్యమునకై ఆ మిత్రుని పంపినట్లనిపించినది గణపతికి. తన కోర్కెను యతనికి తెలియ జేశాడు. అతడును అందులకు అంగీకరించినాడు. ఈ మంత్రమును స్త్రీ ద్వారా ఉపాసన పొందవలెను. కావున ఒక మంచి ముహూర్తమున తటాకమునందు స్త్రీని మధ్యనిడుకొని సురేశ మిత్రుడు గణపతికి తారా మంత్రోపదేశము చేసెను.

గణపతి పదిరోజులబాటు దీక్షతో ధ్యానము చేసి మంత్రసిద్ధిని పొందినాడు. తాను వ్రాసినటువంటి "దశ మహా విద్యలు" అను గ్రంథములో తారా తత్త్వ దర్శనమును ఆయన వ్రాసియున్నారు. కొంత ముందు చెప్పబడినది. మరికొంత వివరణ యిది:—

దేవీ విద్యలలో ఇది రెండవది. తార ప్రణవ స్వరూపము. ఈమె "పశ్యంతీ" వాక్కును కలిగించును. పురుషరూపమున చెప్పబడిన "ఓమ్" అను ప్రణవమే స్త్రీ రూపమున తారయైనది. తార, నీల యివి సరస్వతీదేవి యొక్క పేర్లు. "ఓం హ్రీం హ్రూం ఫట్", "హ్రీం స్త్రీమ్ హూమ్" లేదా "ఓమ్ అను నొక్క ప్రణవ బీజమునైనను మంత్ర జపము చేయవచ్చును. మంత్రనాదమును దాని మూలమగు ప్రణవమునందు లీనమగు వఱకు జపించి నెరుంగవలెను. అదియే సిద్ధి. అదియే జప సార్థక్యము.

గణపతి యింతతో నాగలేదు. దీనికి సమానమైన వైదిక విద్యగూడ గలదని చెప్పి తాను వ్రాసిన "విశ్వమీమాంస" యందు ఈ వైదిక విద్యను "ఉద్గీథ విద్య" గా పేర్కొనెను. ఈ రెండు విద్యలను సమన్వయము చేసి సూత్ర రూపమున వివరించి జూపెను.

శ్లో॥ మూలే స్థిత్వా భైరవ్యాఖ్యాం
తారాం దేవీ ముద్గీథేన ।
సేవే తార్యో విదిత రహస్యో
మాతంగీంతాం గుణగానేన॥

[ఉపాసనా రహస్య జ్ఞానవంతుడైన ఆర్యుడు మూలాధార నిష్ఠచేత త్రిపుర భైరవిని, ఓమ్ 'అను' ఉద్గీథము చేత తారను స్తోత్ర రూపమగు గుణ సంకీర్తనము చేత మాతంగీ దేవిని సేవింప వలయును.]

—ఉమా సహస్రము

గణపతి ఈ తారా మంత్ర దీక్షను తన భార్యకిచ్చి, ఆమె ద్వారా పలువురకిప్పించి దక్షిణ దేశమున ఈ మంత్రప్రచారమును చేసిన తొలి దాక్షిణాత్యుడయ్యెను.

## 22. త్రోవ జూపిన తటిద్దేవి

శ్లో॥ మన్యంతే కేపి ఘనం పర్వతముక్తం నిగూఢయా వాచా ।
ప్రాదుర్భవతి గభీరధ్వని రవిషహ్యా యతః శక్తిః॥

[నిగూఢమగు వేద భాషయందు పర్వతమనబడే ఘన మేఘము నుండి గంభీరమగు ధ్వని గల్గి, సహించుటకు శక్యము కాని విద్యుద్రూపమగు ఏ శక్తి పుట్టుచున్నదో అదియే పార్వతి యని కొందఱు తలచు చున్నారు.]

—ఉమాసహస్రము

* * * *

పర్వత రాజుయొక్క పుత్రిక పార్వతి. ఆమె తనయుడు గణపతి. పర్వత రాజనగా సాధారణముగా హిమాలయములు మనకి జ్ఞాపకం వస్తాయి. ఈ కొండకు పుట్టిన కూతురు అని మనం

తెలుస్తాము. పురాణాలలో ఈ కథ కాన వస్తుంది. కొండలన్నీ ఆమె సృష్టించినవే అయితే ఆమె కొండకు కూతురెలా అవుతుంది? అంటే ఇందులో ఇంకా విస్తృతమైన అర్థం కూడా ఉందన్నమాట!

దృష్టి విస్తృతం అవుతున్న కొద్దీ భావం విస్తృతం అవుతుంది. దారుకా వనంలో ఋషులు మంత్ర సిద్ధులను పొందాలని విపరీతంగా యజ్ఞ యాగాదులను జరుపుతున్నారట. వారి యొక్క విపరీతమైన కర్మకాండను జూచి ఈశుడు గూడా విసుగు చెందాడు. అన్నింటికీ మూలమైన ఈశుని వదలి చిన్న చిన్న సిద్ధులకై వీరు ఎందుకు పాకులాడుతారు? వీరికి కొంత జ్ఞాన బోధ అవసరం అని తలచాడతను. భక్త వర ప్రదాతకదా! ఎలాగోలాగ భక్తులని కాపాడుతాడతడు. ఒక చక్కని భిక్షకుని వేషంలో ఆ ముని పల్లెకు వచ్చాడతడు. అతని అందానికి ముగ్ధులైన ఋషి పత్నులు యాచకుని వెంట బడ్డారట! ఇది గమనించిన ఋషులు భార్యల్ని కాపాడాలని పరుగులెత్తారు. ఇంతలో విష్ణుమూర్తి జగన్మోహినీ రూపంలో వారి మధ్యకి వస్తాడు. సరే! విష్ణుమాయలో పడ్డారు వారు. కొంతసేపటికి ఆ మోహిని కాస్తా మాయ మయింది. అప్పుడు వారికి భిక్షకునిపై కోపం కలిగింది. అంతా అతని మోసమేనని ఈశునిపై అస్త్రాలు ప్రయోగించారు వారు. ఈశ్వరునికి ఒక ప్రత్యేకమైన రూపం మన గ్రంథాలలో ఉన్నదికదా! అలా కనిపిస్తేగాని తానెవరో వారికి తెలియదు. కాబట్టి నిడుపాటి జటా జూటముతో, అందు చంద్రబాలుడు మెరుస్తూ ఉండగా, కంఠము నందు నాగ రాజుని చుట్టుకొని, గజ చర్మ ధారియై, నాట్యంచేస్తూ నటరాజ రూపంలో వారి ముందు ప్రత్యక్షమయ్యాడు ఈశుడు. అప్పుడు వారు తమ తప్పిదములను తెలుసుకొని 'దాసోహమ్'! అన్నారు వెంటనే ఉపదేశం ప్రారంభం అయింది. ఈ ఉపదేశ సారాంశమే శ్రీ రమణ భగవాన్ విరచితమైన "ఉపదేశసారము."

అలాగే పరిమితంనుండి అనంతంలో అమ్మను చూడాలంటే ఆమె పుట్టుకను కొండకు పరిమితం కానీకుండా సాకారం నుండి నిరాకారం వరకు చూడాలి. అందులకు ఉపాధి నుండి నిరుపాధికి తపోదృష్టి పెరగాలి. ఇంత వరకు సాకార రూపంలో అమ్మను గాంచిన గణపతి ఒకానొక నిరుపాధి యోగంలో అమ్మ యొక్క విద్యుత్ స్వరూపాన్ని గాంచాడు. అదియే తటిద్దేవి దర్శన వృత్తాంతము.

ఉత్కళ దేశము నందు భువనేశ్వరము-బాలేశ్వర్ రైలు మార్గము మధ్యన ధన్ మండల్ అనే రైలు స్టేషను వచ్చును. అచటికి సుమారు ౯ కి. మీ. దూరమున దంతవాణియను జమీందారీ గ్రామము గలదు. అచటి సంస్థానాధీశుడు మందసా రాజునకు మిత్రుడు. గణపతి యొక్క కీర్తి ప్రతిష్ఠలను అతను విని యున్నాడు. అతని పాండిత్యము వినవలయునన్న కోరిక యతనికి కలిగినది. తన గ్రామమునందు పండిత సభ ఏర్పాటు చేశాడు. మందసా రాజు ద్వారా గణపతికి ఆహ్వానము పంపించినాడు. గణపతి తన సోదరుడైన శివరామ శాస్త్రితో కలసి ఆ పండిత సభకు వచ్చెను. సభయందు తన ప్రతిభ జూపి అందరి మెప్పుల నందుకొనెను. రాజు మిక్కిలి సంతోషించి యతనిని సత్కరించి నాడు.

ఆసాయంత్రం ధన్‌మండల్ స్టేషనుచేరుటకు రెండెడ్లబండిలో వారు బయలుదేరినారు. రాజు వారలను జాగ్రత్తగా స్టేషనులో దింపి టిక్కట్లు కొని, రైలు బండీ ఎక్కించి రమ్మని బండీవానికి చెప్పియున్నాడు. ఎడ్ల బండీ ఊరు దాటగానే అనుకోని రీతిగా కారుమేఘములు క్రమ్ముకున్నాయి. కుండపోతతో వర్షము ప్రారంభ మైనది. చుట్టూ చీకటి కమ్మి దారి కనిపించుటలేదు. వర్షానికి వారు

చిత్తుగా తడిసారు. అంతా జలమయం కావడంతో ఎడ్లు కుంటుతూ కుంటుతూ అడుగులు వేయసాగాయి. పోనీ ఎచటైనా ఆగుదామా అనుకుందే చుట్టుపక్కల ఆశ్రయం కనిపించలేదు. బండీవాడు బండీ తోలుటకు భయపడెను. ముందుకు గాని వెనుకకుగాని వెళ్ళలేని పరిస్థితి ఏర్పడినది.

పరిస్థితి విషమించిందని తెలిసిన గణపతి కండ్లు మూసుకుని దేవీని ప్రార్థించినాడు. ఆశ్చర్యము! గుండెలు బ్రద్దలయ్యేటట్లు పెద్దచప్పుడైనది. ఆకాశమున దట్టముగా క్రమ్మియున్న కారు మేఘము రెండుగా బ్రద్దలుకాగా అందుండి ఒక ప్రకాశవంతమైన విద్యుల్లత తళుక్కు మని వెలిగింది. దారి తప్పి క్షణంలో గోతిలో పడవలసిన యీ బండీ ఆ వెలుతురుకి కండ్లు చివుక్కుమనడంతో ఎడ్లు ఆగిపోవడంవల్ల ప్రమాదమునుండి తప్పుకొన్నది. ఆ వెలుతురులోనే బండీ దారి తప్పిందని బండీవాడు గ్రహించి, దిగి బండిని మరల దారిలో పెట్టి "హమ్మయ్య! గండం గడిచింది" అని నిట్టూర్చాడు. అలా వెలువడిన సౌదామిని మాటి మాటికి తన కాంతిని ప్రకటిస్తూ వారికి దారి చూపసాగింది.

గణపతి తన యోగ నిష్ఠలోనే ఉన్నాడు. ప్రకాశ దీప్తియైన సౌదామిని అతని హృదయమునందలి చిన్మయ ప్రకాశముతో తాదాత్మ్యము కలిగినది కాబోలు పరాశక్తి యొక్క "తటిత్" రూప దర్శనములో తన్మయుడయ్యాడతడు!

శ్లో॥ పర్వతశ్చ పులోమాచ! సజలోయం ఘనా ఘనః।
పార్వతీతి తటిద్దేవీం। పౌలోమీతిచ తాం విదుః ॥

[పర్వతము, పులోమ అను పదములు సజల మేఘము యొక్క నామములు. కావున అందుండి వెలువడు పార్వతి యే సౌదామిని. ఆమెయే పౌలోమి (ఇంద్రాణి) యగు చున్నది].

శ్లో॥ శైవానాం భాషయాదేవి! త్వం తటిద్దేవి పార్వతీ ।
ఇంద్రాణాం భాషయా మాతః। పౌలోమీ త్వమనామయే॥

[నిన్ను శైవులు తటిద్దేవి, పార్వతి యని యందురు. ఇంద్రభక్తులు పౌలోమి యందురు.]

—ప్రచండ చండీ త్రిశతి (గణపతి ముని)

"ఆత్మ దర్శనం ఇప్పుడు ఈ క్షణంలో కలుగుతుంది. ఇంతకీ నీ దృష్టి పరిపక్వత కలిగి ఉండవలె" అని చెప్పియున్నారు శ్రీ భగవాన్. దృష్టి పరిపక్వత అంటే ఇదే అనాలి. అందరికీ సామాన్యంగా కనిపించే మెఱుపునందు పరమేశ్వరీ దర్శనము పొందాడు గణపతి. ఇది అతని తపస్సు యొక్క పరకాష్ఠకు నిదర్శనము. సంస్కృతమున మేఘమునకు 36 పేర్లు గలవు. అందు "పర్వతము" అనునది 13వ నామము. మేఘమునందు జనించు శక్తిగా ఆమె విద్యుల్లత. ఈ విద్యుత్తు ఆకాశమునందు గలదు. భూమియందు గలదు. గాలియందు గలదు. నీట గలదు. నిప్పులయందు గలదు. ఒకటేమి సమస్తమునందును గలదు.

పార్వతీ జననము, కళ్యాణము అని వేడుకలు జరుపు కోవడం మనకు అలవాటు. పుట్టుక కల్గిన శక్తికి రూపం ఉండాలి కదా! అదియే "తటిత్" (మెఱుపు) రూపము. విద్యుత్తునందు అగ్ని అంతర్లీనమై ఉన్నది. శబ్దము ఇందుండి వచ్చును. వినాయకుడు శబ్దమునకు అధిపతి. కావున శబ్ద బ్రహ్మగా అతడు విద్యుత్తునుండి జనించిన వైద్యుతాగ్ని. తల్లీ కొడుకుల తాత్త్వికత చాలా విచిత్రమైనది.

వారి బండి మెల్లిగా శైలు గేటు చేరుకున్నది. వర్షము జోరుగా కురుస్తుం డటం గేటు వేయ బడలేదు. బండీ వాడు గేటుతీసి

ఉండుటచే రైలు పట్టాలు దాటుటకై బండీని తోలుతున్నాడు. మరల పెద్ద చప్పుడుతో మెఱుపు మెరిసింది. రైలుపట్టాలపై లైటు లేని షంటింగు ఇంజను కనిపించింది వానికి "నయమే! ఈ వెలుగే లేకపోతే ఇంజన్ను ఢీ కొట్టియుందుము. మెఱుపు దేవతే మనల్ని రక్షించింది" అని ఆకాశం వైపు చూస్తూ లెంపలు వేసుకుని దండము పెట్టాడు వాడు.

స్టేషను వచ్చింది. పరమేశ్వరీ దర్శన భాగ్యంతో పరమానంద భరితుడై యోగ నిష్ఠ యందున్న గణపతిని "అన్నయ్యా! స్టేషను వచ్చినది. బండీ దిగు" అని తట్టి లేపాడు. శివరాముడు.

శ్రీకాకుళమునకు రెండు టిక్కట్లు కొనుక్కొని తడిసిన బట్టలతో, మూటలతో రైలుబండీ యెక్కారు వారు.

## 23. కాంచీపురమునకు రాక

శ్లో॥ కాంచీ రమణ్యాః కురుతాం గృహస్థే
క్వాశైర్ముదం కామపి కింకిణీనామ్ ।
కాంచీ భువః పుణ్యపురీ యతీంద్ర
త్వామంబి కానా మర వైర్థినోతు॥

[ఓ యతీంద్రా! కాంచీ కింకిణీ నాదము గృహస్థులకు మోదము కలిగించును. అయినప్పటికి భూమికి మొలనూలు (కాంచి) యైన యీ క్షేత్రము కామాక్షి అను పేరున ప్రసిద్ధమై ఆమె నామ సంకీర్తనముచే నిన్ను గూడ అనందింపజేయును.

—ఉమాసహస్రము

* * * *

దేవీ కటాక్ష తరంగములందు మునిగిన యోగికి భౌతికదృష్టి ఉండదు. దంతవాడీ యాత్ర యందు తటిత్ రూపమున ఆమె దర్శనమిచ్చినది మొదలు గణపతి తటము అంతర్ముఖుడగు చుండెను. రైలుబండియందుగూడ అతడట్లే ధ్యానమునందు మునిగియుండెను. తెలతెలవారుతూ ఉండగా శ్రీకాకుళము రోడ్ స్టేషను సమీపించినది. శివరాముడు అన్న భుజమును తట్టి "అన్నయ్యా స్టేషను వచ్చుచున్నది, దిగుదామా!" అని అడిగాడు. సంపూర్ణ కృపార్ణవమునందు తేలియాడుచున్న గణపతి యందు ఇహ దృష్టి లేదు. బలవంతాన కళ్ళు విప్పి తమ్ముని జూచాడు. "శివా ! నాకు ఇక్కడ దిగాలనిలేదు. ఏదియో శక్తి నన్ను ముందుకు లాగుచున్నది. నీవద్ద సొమ్ము జూచుకొని దక్షిణమునకు టిక్కట్లు కొనుము ఏ ఊరైనా సరే!" అనెను.

అన్న పరిస్థితిని తమ్ముడు గ్రహించినాడు. స్టేషనురాగానే దిగి విజయవాడకు రెండు టిక్కెట్లు కొని మరల బండీ యెక్కినాడు.

ఆ రోజు సాయంత్రమునకు వారు విజయవాడ చేరుకున్నారు. అచట కృష్ణలో స్నానము చేసి కనకదుర్గ దర్శనము చేసుకొని ఆ రాత్రికి సత్రములో బసచేసినారు. మర్నాడు వారు అచటి నుండి బయలుదేరి రేణిగుంట, కాళహస్తి మీదుగా కాంచీపురము చేరుకున్నారు.

కామాక్షీ నిలయమని పేరుగాంచిన ఈ పుణ్యపురిని శివ కేశవులు ఇరువురు చెరి సగము పంచుకొని యున్నారు. విష్ణుకంచి యందు వరదరాజుని రూపమున కేశవుడు పూజలందుకొను చుండగా, పార్థివ లింగ రూపమున కామాక్షి యొక్క హృదయాంతర్గత స్వరూపమై శివుడు శివకంచి యందు వెలసి యున్నాడు.

భూమండలమునకు ఈ క్షేత్రము మొలనూలువంటిదనియు, కింకిణీ నాదములతో భక్తుల నానందమున ముంచుననియు క్షేత్ర మహిమయందు చెప్పబడినది, ఆది శంకరులచే స్థాపింప బడిన శంకర పీఠము గూడ ఇందు గలదు.

ఉన్న పైకముతో నాలుగు అరటిపండ్లు కొనుక్కొని తిని పురవేడుకలను చూశారు శివరామ గణపతులు. ఉండడానికి వసతి కావలయును. దొరకనిచో ఆ రాత్రి ఏ చెట్టుక్రిందనో, పుట్ట క్రిందనో, పడుకోవలసి వచ్చును. కాని వారికా భయము లేదు. నిర్భయముగా ఊరు తిరుగుతూ ఉండగా వారికి ఒక జ్యోతి షాలయము కనిపించింది. అందు ప్రవేశించారు వారు. అచటి జ్యోతిష్యుని పేరు నారాయణ జ్యోతిష్కుడు. గణపతి యాతని పరిచయము చేసికొని శాస్త్ర ప్రసంగము చేయుచు అతనికే జ్యోతిష్యము చెప్పసాగెను. అతడు గణపతి చెప్పిన ఫలములకు మురిసిపోయి, తన యింటియందు వారికి బస కలిపించి, తనకు జ్యోతిష శాస్త్ర మర్మములను చెప్పుమని గణపతిని బ్రతిమాలెను.

ఈ విధముగా నారాయణ జ్యోతిష్యుని యింట బసచేసి, వారి ఆతిధ్యమును స్వీకరించి, పగటిపూట వారికిని, తమ్ముడగు శివరామమునకును జ్యోతిష శాస్త్ర మర్మములను తెలియజేస్తూ, రాత్రిపూట క్షీరావతి – వేగవతి నదుల మధ్యగల పాడుపడిన హనుమదాలయమునందు తపస్సు చేస్తూ, గణపతి నెలదినముల పాటు కాంచీపురమునందే గడిపినాడు.

ఈ లోపల వారికి ఇంటినుండి మనియార్డరు వచ్చినది. అందు వారిని వెంటనే ఇంటికి రమ్మని తండ్రి వ్రాసి యుండెను. కావున గణపతి ఇంటికి మరల నిశ్చయించెను. వారు బయలుదేరు

నప్పుడు నారాయణ జ్యోతిష్యుడు వారితో నిట్లనెను. "ఇచటికి సమీపమున అరుణాచల క్షేత్రము గలదు. అచట ఈశుడు. జ్యోతి ర్లింగమై వెలసి యున్నాడు. మీ వంటి తాపసికులు చూడవలసిన ప్రదేశమది. అటనుండి మీ ఊరికి మార్గము కలదు. కావున యరుణాచలమును దర్శించండి."

నారాయణ జ్యోతిష్కుని ప్రియవచనములు తన పూర్వ జన్మ బాంధవ్యమును జ్ఞప్తికి తెచ్చినట్లనిపించగా "అరుణాచలము" అను నామమున ఒడలు జలదరింప గణపతి కండ్లు మూసుకొనెను. అతని మనస్సు అంతర్లీనమైనది. కొంతసేపటికి కండ్లు విప్పి "అవశ్యము, అరుణాచలమును చూడవలయును" అన్నాడు.

* * * *

కంచి కామకోటి పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారికి గణపతి మునిపై అత్యంత ప్రేమ గలదు. వారు తమ స్వహస్తములతో గణపతి మునిని సన్మానించి, అభి నందించియున్నారు.

ఒకసారి వారు పాదచారులై మదరాసు పురమునందు వెడుతూ ఉండగా ఒక చోట ఏదియో కార్యక్రమము జరుగు తున్నది. అందు ఒక బాలిక అతి మధురంగా :-

సేవక పాతక శమనం దైవం
మానస వాంఛిత ఫలదం దైవం
సజ్జన రక్షణ చతురం దైవం
దుర్జన మర్ధన పరుషం దైవం

అని గణపతి ముని వ్రాసిన అంబికా గీతమును పాడుచుండెను. జగద్గురువులు ఆ గీతమును విని అచట ఆగిపోయి చివరి వరకు విని "ఇది అంబికా గీతము. గణపతి ముని వ్రాసారు. ఎంత మధురముగా నున్నదో చూడు" అన్నారట. అంతే కాకుండా తన విడిదికి ఆ అమ్మాయిని రప్పించి మరల ఆ గీతమును పాడించి విని సంతోషించారట.

సత్త్వ గుణోపేతులైన తాపసికులను ఆదరించని వారుందురా ! అభిమానించనివారుందురా !

— —

# మహాతపస్వి

## (రెండవ భాగము)

## 1. అరుణాచలము

శ్లో॥ తంత్ర విదో నవయోనితు చక్రం
శోణ ధరాధర రూపముశన్తి ।
అర్థ మముష్య వ పుర్మదనారే
రర్థ మగేంద్ర సుతే । తవగాత్రమ్ ॥

[అమ్మా ! నగేంద్ర పుత్రికా ! తంత్ర విదులు (శాస్త్రాగమములు నెరిగినవారు) నవయోనియగు శ్రీ చక్రమునే అరుణాచల రూపముగా చెప్పుచున్నారు. అందు అర్ధ భాగము నీశరీరము. మిగిలిన సగభాగము నీ భర్తయగు ఈశునిది.]

—ఉమాసహస్రము



తిరువణ్ణామలై యను పేరు గల ఈ శివక్షేత్రము చెన్నపురికి రెండువందల కిలోమీటర్ల దూరమున ఉత్తర ఆర్కాడు జిల్లా యందు కలదు. ఇచ్చట అరుణాచలేశ్వరుడు మూడు రూపముల వెలసినట్లు పురాణములందు వ్రాయబడినది. అందు మొదటిది అచల రూపము. ఇది విజ్ఞానగిరియని, జ్ఞానాగ్ని ప్రకాశితమై యొప్పునని శ్రీ రమణ భగవాన్ చెప్పియున్నారు. ఇది శివశక్తి స్వరూపము, తొమ్మిది కోణములనుకల్గి శ్రీచక్రమును పోలియుండును. అద్వైతులేగాక శాక్తేయులు గూడ ఈ గిరిని పూజింతురని శ్రీ గణపతిముని దెలిపియున్నారు. మానవులేగాక దేవతలుకూడా ఈ గిరిని ప్రదక్షిణము జేయుదురు. కొండను చుట్టు త్రోవయందు కుడివైపు నుండి దేవతలు నడిచెదరుగాన మానవులు ఎడమవైపునుండి నడువవలయునని పెద్దలు చెప్పెదరు.

భగవాన్ శ్రీ రమణ మహర్షి యొక్క వాస స్థల మిది. అత డచట నుండుటచే గూడ ఆ స్థలమునకు పేరు వచ్చినది. శ్రీ గణపతి మునుల వారు వ్రాసిన శ్లోక మిలా ఉంది :-

శ్లో॥ తద్భాగధేయ మసమాన మనేక మౌని
వాసార్జితం క్షితి భృతఃఖలు లోహితస్య ।
అంగీచకార భగవాన్ రమణో మహర్షి
రన్యేషు సత్స్వపి యదిదం బహుషు స్థలేషు ॥

[అరుణాచలమున బలువురు మౌనులు నివసించుటచేత చేకూరిన భాగ్యము అసమానమైనది. (ఏలన) భగవంతుడు శ్రీ రమణ మహర్షి కూడ ఇతర మహాస్థలములు లెన్నో యుండగా దీనినే అంగీకరించినాడు.] —చత్వారింశత్.

కొండను చుట్టి రావలయునన్న సుమారు 8 కి. మీ. నడువ వలసి యుండును. కొండపై అనేకమంది సిద్ధులు, యోగులు ఉందురని ప్రజలు విశ్వసింతురు.

అరుణాచలేశుని రెండవ అకారము జోతిర్లింగము. కొండ దిగువన ఈ స్వామి కోవెల గలదు. ఈ కోవెల నానుకొని నగరము వెలసినది. ఇవి శక్తీశ్వరులు ఏకస్వరూపమే.

శ్లో॥ అస్తు నగేశ్వర నందిని ! లింగం
తైజ సమేతదిహాపిత వాంశః
ప్రీత గుణస్య వినాత వయోగం
దేవి ! శివస్య కుతఃఖలు తేజః ॥

[ఓ నగరాజ నందనీ ! కాంచీ మొదలగు పంచభూత క్షేత్ర ములలో నుందు అరుణాచలమనునది తైజస లింగముగుగాక ! అరుణా

చలము (గిరి) నందేగాక ఈ లింగమునందు గూడ నీ భాగమున్నది దేవీ ! నిర్గుణుడగు శివునకు నీతోడి యోగములేనిదే తేజస్సు ఎట్లు కలుగును].
—ఉమాసహస్రం

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పోటీపడగా ఈశుడు ఈ లింగాకారమును దాల్చెననియు, బ్రహ్మ విష్ణువులు ఈ లింగముయొక్క తుది, వెదుక ప్రయత్నించి విఫలులయ్యారని క్షేత్ర పురాణము నందు గలదు.

మూడవది సిద్ధరూపము. ఈశుడు అరుణగిరి యోగి అను నామమున ఇచట తిరుగుచు ఋషులను, మునులను, భక్తులను బ్రోచు చుండును.

కార్తిక మాసమునందు ఇచట బ్రహ్మోత్సవములు జరుగును ఆసమయమునందు కృత్తికా నక్షత్రోదయ సమయమున అరుణ గిరిపై దీపము వెలిగింతురు. అదీపదర్శన తత్త్వమిది :—

ఈ శరీరమె యౌదునేనను మదిని
నాశ మొనర్చి పూర్ణముగ—నాబుద్ధి
హృద్వాసి యగుచు, లోదృష్టి వలసను
అద్వైతమగు నిజాహం జ్యోతిగాంచు
ట రయ భూమధ్యమౌ యరుణాద్రి దీప
దరిశనమై యొప్పు తత్త్వార్థమగును .— శ్రీ రమణ భగవాన్

మరికొన్ని స్థల విశేషములను గూడ శ్రీ రమణ భగవాన్ మాటలలో తెలుసుకుందాం :

డా॥ సయ్యద్ :— నేను స్తుతి పంచకం చదువుతున్నాను. అన్నీ అరుణాచలుణ్ణి సంభోధిస్తున్నవి. తాము అద్వైతులు గదా: దైవాన్ని వేరుగా ఎట్లు స్తుతించారు?

మహర్షి :— భక్తుడూ, దైవమూ, స్తుతులూ అన్నీ ఆత్మయే.

ప్ర : కాని తామూ దైవాన్ని సంబోధించారు. అరుణాచలాన్ని స్పష్టంగా దైవంగా వర్ణించారు.

మ :- ఆత్మను దేహంగా నీవు భావించవచ్చా! భక్తుడు ఆత్మను అరుణాచలుడుగా భావించకూడదా !

ప్ర :- అరుణాచలమే ఆత్మ అయితే, కొండలెన్ని లేవు? అరుణాచలాన్నే ప్రత్యేకంగా ఎన్నుకోనేల ? దానిని అరుణాచలుడని ఏల నిర్దేశించవలసి వచ్చింది ?

మ :- అలహాబాదు నుండి ఇక్కడికి నిన్నేమాకర్షించింది ?

ప్ర :- భగవాన్

మ :- నన్నిక్కడికి తెచ్చిందెవరు ? అరుణాచలము. ఆ శక్తిని కాదనలేము. కాని గుర్తుంచుకోవలసినది. అరుణగిరి ఉన్నది లోన, వెలుపల కాదు. ఆత్మయే అరుణాచలుడు.

ప్ర :- అరుణాచలమహాత్మ్యంనుండి పంగున్ని యోగికథ చదివారా! పంగున్ని కుంటివాడు. శ్రీ అరుణాచలుని అనుగ్రహం వల్ల వాని కాళ్ళు చక్కనైనాయి. భగవాన్ తాము గురు మూర్తంలో యుండగా ఒకతన్ని చూచారు. అతని పేరు కుప్పు అయ్యర్. వాని కాళ్ళు పయోగపడేవి కావు. నడువలేడు. పిరుదులపై జరుగుతూ అతడొకసారి వేత్రావలం వెళుతున్నాడు. ఉన్నట్లుండి ఒక ముదుసలి దారిలో వానికడ్డుపడి "ఏమిటీ జరగడం ! లేచినడు" అని గద్దించాడు. కుప్పు అయ్యర్ తనకు తెలియకుండానే లేచి సులువుగా నడువసాగాడు. అతడాశ్చర్య సంభ్రమాలతో ఉపశుద్ధైనాడు. నాల్గు అడుగులువేసి వెనుదిరిగి చూస్తే ఆ ముసలివాడు ఎక్కడాలేడు. ఆయన నడుస్తుంటే చూచిన వారికి ఎంతో

ఆశ్చర్యం వేసింది. వారికాయన జరిగిన కథ వివరించాడు ఇది మహర్షి తిరువణ్ణామలైరావడానికి రెండేండ్ల ముందు జరిగింది. కుప్పుఅయ్యర్‌కి కాళ్ళొచ్చిన వైనం ఊళ్ళో ఎవర్నడిగినా తెలుస్తుంది. ఊళ్ళో బాలబాలికుల బడిలో ఒకపిల్ల నెవరో వంచించి తీసుకువెళ్ళి ఆమె సొమ్ములను హరిస్తుండినాడు. అకస్మాత్తుగా అక్కడికొక ముసలివాడు వచ్చి ఆపిల్లని అపదనుండి తప్పించి ఇంటికి తెచ్చి విడచి కనబడకుండా బోయినాడు.

మ :- ఇట్టి విశేషాలు తిరువణ్ణామలైలో కొత్త గాదు. మామూలుగా జరిగేవే.

పృ :- అరుణగిరి చుట్టూ మూడు యోజనాల మేరలో వసించే వారికి వారడిగినా అడక్కపోయినా ముక్తి లభిస్తుందన్నారు. జ్ఞానం వల్ల కైవల్యం అందరూ ఆమోదించేదే. వేదాంత విజ్ఞానం చాలా దుస్సాధ్యమంటుంది పురాణం. కాబట్టి ముక్తి దుర్లభం. అయినా గిరిచుట్టూ ఉన్నంత మాత్రాన అంతసులభంగా ముక్తి ఎట్లు సాధ్యం ?

మ :- 'అది నాఆజ్ఞ' అన్నాడుశివుడు ఇక్కడ వసించేవారికి దీక్షాదు లవసరం లేకనే ముక్తి దొరుకుతుంది. శివాజ్ఞ అట్లున్నది.

పృ :- ఇచట పుట్టినవారు శివానుచరులైన భూత ప్రేత పిశాచాదు లని పురాణంలో ఉంది.

మ :- అదేమాట. తిరువారూరు, చిదంబరాది క్షేత్రాల విషయంలో కూడా ఉంది.

దర్శనాదభ్ర సదసి, జననాత్కమలాలయే
కాశ్యాంతు మరణాన్ ముక్తిః స్మరణా దరుణాచలే ।

చిదంబరంచూచి, తిరువారూరులో పుట్టి, కాశీలో మరణించి, అరుణాచలాన్ని స్మరించి ముక్తి పొందగలరని ఒకరి దృష్టి.

ఇటువంటి పరమ పవిత్రమైన శివక్షేత్రమునకు 1903 వ సంవత్సరమున, బాద్రపదమాసమున, గణపతి నవరాత్రి దివసము లందు శివరామ గణపతులు చేరుకొనిరి.

* * * *

## 2. వినాయకుని విందు

శ్లో॥ జిహ్వాతు వేది స్తవతోయ పూతా
లోక ప్రసంగ స్తవతత్ర ధూమః ।
జ్వాలా జగన్నాథ కథాపవిత్రా
చేతో ఘృతం జుహ్వాతి యత్ర సంతః ॥

హేరంబుడా: జ్ఞానులు నిన్ను యజ్ఞ పురుషునిగా సంకల్పించి ఆదిమ ప్రకృతి ప్రకృతియైన జలమువలె పావనమైన జిహ్వను (నాలుక) వేదికగానూ లోకవాసనను ధూమముగానూ, ఈశ్వర కథా ప్రసంగములను జ్వాలగాను చేసి తమచిత్తమే నేయిగా హోమం చేస్తూ ఉంటారు అదే ఆత్మదర్శన యజ్ఞమౌతుంది]

— హేరంభోపస్థానమ్ (గణపతి ముని)

* * * *

అరుణగిరి నిశ్శబ్దగురు స్వరూపము. అతని మౌనబోధనకు అలవాటు పడిన ప్రకృతికాంత నితంబమున నిశ్చలతత్త్వమును ప్రకటించుచు మౌన గాంభీర్య వ్రతదీక్షయందు కనిపించుచుండును అచటి జీవరాసులు గూడ నిశ్శబ్ద వాతావరణమునకు అలవాటు చెందెనా అన్నట్లు ఈశుని తత్త్వమునే ప్రకటించుచుండును.

చలనతత్త్వమునకు ప్రతిరూపమైన మహామాయయు ఈశుని యందణగి ప్రకాశించు తేజో రూపిణియై "అపీతకు చాంబ" యను నామమును వడసినది. శిశువునకు స్తన్య దుగ్ధమును ఇచ్చునది మాత. ఈ దుగ్ధము శిశువు పెరుగుటకు ఉపయోగపడును. సృష్టికి ఈ అన్న శక్తి అవసరము. కాని ఇచట దేవి శిశువులకు ఇచ్చునది అన్న శక్తికాదు. జ్ఞానశక్తి కావుననే ఆమె అపీతకు చాంబ అయినది ఈ పుణ్య దంపతుల యొక్క కనిష్ఠ పుత్రుడు స్కందుడు. అతడు హృదయ విద్యాచతురుడు, ఆత్మయందు మునుగుచు అన్ని భాషలకు అతీతమైన ఆత్మ భాషయందు అనగా మౌనము నందు భక్తులను సాదరముగా ఆహ్వానించుచూ ఉండును.

జ్యేష్ఠుడైన హేరంబుని స్థితి యిచట సంకట స్థితి శబ్ద బ్రహ్మ అయిన ఈ బాల పరమేశ్వరుడు ఇంతటి మౌనావృతమైన ఈ ప్రదేశమందు జ్ఞానబోధ నెటుల చేయగలడు ? సామాన్యులను సహితము తరింప జేయుట అతని ఆశయము. ఇంతటి గంభీర మౌనతత్త్వమును దెలియుట సామాన్యుడికి సాధ్యమా ! ఎంతటి అజ్ఞానియైననూ దేవుని పూజింపవలయునని అభిలషించునుగదా, మరి వారికి తత్త్వార్థమును తెలియజేయుట ఎట్లు ? అందరూ మౌన మునే ప్రకటించిన వాక్కున కందని ఈ తత్త్వమును వాక్కున జెప్పువారెవరు ? ఈశుడు ఎంత మౌనస్వామి అయినప్పటికీ ఓంకార స్వరూపుడుకదా ! ఉత్కృష్టమైన, ఉద్దామమైన బలం కలవాడు హేరంబుడు. శివునియందు తత్త్వజ్ఞానమునుశబ్దముగా జేసేవాడతడు. ఈక్షేత్రంలో శబ్దనాదం ఎంతైనా ప్రయోగవలసిన అవసరమున్నదని సమయమునకై వేచియున్నాడు హేరంబుడు.

అటువంటి సమయమునందు అరుణాచలం చేరుకున్నారు. శివరామగణపతులు. వారు పురము చేరుసరికి చీకటి పడినది. ఊర.

చేరగానే ముందుగా దేవదర్శనము చేసికొనుట దాక్షిణాత్యులకు అలవాటు. దానిని ధూళి దర్శన మందురు. అన్నదమ్ములిరువురూ ముందుగా ఆలయమున జొరబడి ప్రభుదర్శనము చేసుకున్నారు. వారు బయటకు వచ్చేసరికి రాత్రి '8' గంటలైనది. ఆ నిశ్శబ్దపురి యందు వీధులు నిర్మానుష్యములైనవి. రెండు మూడు బ్రాహ్మణ గడపలు చేరుకుని భోజనమర్థించారు. ఆ రోజు ఏకాదశి అగుటచేత వారికి భోజనం లభించలేదు. దూరము నుండి ప్రయాణము చేసి వచ్చియుండుట చేత వారియందు బడలిక అధికంగా ఉంది. తిరిగి తిరిగి వసతి భోజనాదులు దొరకక చివరికి ఒక కొంపజేరి ఆచటి వీధి వసారా (అరుగు) పై విశ్రాంతి తీసుకొనుట మంచిదని వారు నిర్ణయించి మూటలను దింపిరి. అంతలో ఒక తేజోమూర్తియైన విప్రుడు వారివద్దకు పరుగు పరుగున వచ్చెను.

"అయ్యా ! నేను ఏకాదశి వ్రతమునందున్నాను ద్వాదశి ఘడియలు రాగానే ఇరువురు బ్రాహ్మణులకు భోజనం పెట్టనిచో నాకు వ్రతభంగము కల్గును. ఇపుడు ద్వాదశి ఘడియలు వచ్చినవి నాకు ఎచటనూ బ్రాహ్మణులు దొరకలేదు. మీరు బ్రాహ్మణ బాలకులవలె కన్పించుచున్నారు. నా ఆతిథ్యం స్వీకరించినన్ను గ్రహింపుడు" అని అతడు వారలను వేడుకొనెను. అప్పటికి రాత్రి 10 గంటలైనది. ఇంత రాత్రిపూట ద్వాదశి పాలన ఏమిటి? అయినను ఆకలితోనున్న వారికి ఆ విప్రుని ఆహ్వానము అమృత ప్రాయమై తోచగా వారు అతనివెంట నడచిరి.

దేవాలయంవలె గన్పట్టిన ఆవిప్రుని గృహమందు శివరామ గణపతులకు నిండగు విందుభోజనము లభించినది. పంచభక్ష్య పరమాన్నములతో వంటలు రుచికరముగా నుండుటచేవారు తృప్తిగా భుజించిరి. భోజనం అయినతరువాత వీధి అరుగుపై వారుకూర్చుండిరి.

విప్రుడు తాంబూల పళ్ళెరం వారి ముందుంచెను. వారు తాంబూల మారగించి, ముచికలను ప్రక్కన పారవైచి ఆరాత్రికి అచటనే విశ్రమించిరి. బాగుగా అలసి యున్నారు గాన చక్కని నిదుర పట్టినది.

తెల తెలవారుతూ యుండగా గణపతికి తెలివి వచ్చినది. దంతధావనము జేయుటకై లేచి నీళ్ళకని పీధి తలుపు తట్టి విప్రుని పిలువ నెంచినాడు. కాని ఆశ్చర్యము! అచటవారు గత రాత్రి చూచిన గృహం కన్పడలేదు. అందుకు బదులుగా అచట హేరంబుని ఆలయం గలదు. వారు విశ్రమించిన స్థలం అరుగుకాదు. మండప పథం. రాత్రి తాము పారవైచిన తమలపాకు ముచికలు అచట కానవచ్చినవి. విప్రుడు గాని అతని భార్యగాని అచటలేరు.

"తమ్ముడూ! చూచావా! దైవమాయ ఎటువంటిదో! రాత్రి ఆకలిబాధతో తిండిమీదనే మనం దృష్టి ఉంచాముగాని ఆ విప్రవరుని పేరు గూడ మనమడుగమైతిమి. ఆకలితోనున్న మనలను ఆదరించి నది ఎవరోకాదు! మనము వినాయకుని విందు ఆరగించినామన్న మాట! అదిగో హేరంబుని జూడుము! మనవైపే జూచుచున్నాడు! అన్నాడు గణపతి."

శ్లో॥ మాహాత్మ్యం నను వక్తుం కశ్శక్తః పురుషస్తే
హస్తేం దాద్రినన! భాగ్యం సర్వేషాంతవహస్తే ॥

[గజాననా : నీ మహిమను వర్ణించగల సమర్థు డెవరు? అందరి భాగ్యము నీచేతిలో నున్నది.]

భక్తి శ్రద్ధలతో హేరంబునికి సాష్టాంగ నమస్కారములు చేసారు వారు. ముందు ముందు నీ ద్వారా జరుగవలసినదెంతో ఉంది సుమా! అనే సూచన చేసినట్లు వారిని జూచుచూ హేరంబుడు వారల నాశీర్వదించాడు.

## 3. భక్తి, అనుగ్రహము

శ్లో॥ భారత భూవల యే(త్ర విశాలే
సంత్వన ఘాని బహూని గృహాణి।
ఆస్య విగీత సుధాకర బింబా
శోణగిరే రమతేఽత్రమదంబా ॥

[విశాలమైన ఈ భారతదేశము నందు పావనమైన భవనము లెన్నో ఉండుగాక ! చంద్రబింబాన్ని క్రిందుచేసే నెమ్మొము గల మాఅమ్మ మాత్రం ఈఅరుచాచలమునందే ఎంతోఇష్టపడియున్నది.]

—ఉమాసహస్రం

• • • •

కావ్యకంఠుని ఇష్టదేవత 'ఉమ' భువనేశ్వరము నందు ఆమె అతనికి ముందుగా మధుకటాక్ష ప్రాప్తిని కలిగించింది. ఈనామానికి నిర్వచనం అనేకులు అనేకరకాలుగా చేశారు. మరి వారు ఆమె స్వరూపాన్ని చూచారోలేదో తెలీదుగాని వాసిష్ఠుడుఆమెనుచూచాడు. చూచిన భావనతోనే ఆమెను కొలచాడు. 'ఉ' అనగా శివునియొక్క 'మా' అనగా 'మాతీతమా' పరిమాణ శక్తియని ఆకార వికారాదులకు అతీతంగా నాపు వివరణ చేసారు. ఇంత చక్కగా తన తత్త్వమును అతనికి జూపిన ఆ పరాదేవత ఎవరోకాదు. ఆమెయే 'అపీతకు చాంబ' ఆమెయే కావ్యకంఠుని 'ఉమ'. ఇంతవరకూ అతన్ని తరింప జేసిన ఆమె దృశ్యరూపములువేరు. అరుణాచలమందు ఆమె అతనిని కటాక్షించిన పైనము వేరు. ఆమెను స్తుతిస్తూ అతను వ్రాసిన అనేక శ్లోకరాజములిందుకు నిదర్శనములు. అపీతకుచాంబయొక్క దర్శనం గావించు భక్తులు ఈ శ్లోకములను పఠిస్తూ ఆమెను జూచిన ఆమె అనుగ్రహము నొందెదరు.

స్వయంగా సిద్ధి వినాయకుని ప్రసాదమును ఆరగించిన శివరామ గణపతులు తమ బసని అచట గల ధర్మశాలకు మార్చినారు అందు మూడు దివములు భోజన వసతులకు లోటులేదు. రేపటి చింతలేని గణపతికి మూడురోజుల సాపాటు చింతలేనందున అంబికా పద చరణ సేవకు అవకాశము కల్గినది. పూర్వం వలె అతనిచట తపము పూనుకొనలేదు. త్యాగరాజువలె దేవీచరణ భక్తుడయ్యాడు. వివిధ చిత్కళలలో ఆమె అతనికి దర్శనమిచ్చుచుండుటచే ఒకానొక భక్తి పాశమునకు అతడు వశుడైనాడు.

ఆలయము నందలి అమ్మ శిల్పము నందు అంబను జూచాడతడు. ఆమెనిలాస్తుతించాడు :-

శ్లో॥ శిల్పవిదః ప్రతిమాం ప్రవిశంతీ
స్వల్ప విదాంతరణాయచకాస్తి ।
శోణ ధరాభృతి సంప్రతి లబ్ధా
హంత ! చిరాదియ మేవమమాంబా ॥

[శిల్పి నిర్మించిన విగ్రహానికి జీవంపోసిన దివ్యశక్తి, అల్పజ్ఞులను ఉద్ధరించే కరుణామూర్తి మా అమ్మ ఇంతకాలానికి అరుణాచలమందు నాకు కనుపించినందున ధన్యుణ్ణయ్యాను]

శ్లో॥ స్థాపితమూర్తి రియంత వనమ్యా
పూజయితుం జగదీశ్వరి ! రమ్యా ।
శోణ నగార్ధ మిదంతవ రూపం
కీర్తయితుంనగజే ! ధుతపాపమ్ ॥

[జగదీశ్వరీ ! శిల్పి రూపొందించిన యీ విగ్రహమందున నీమూర్తి చూడడానికి ఎంతరమ్యంగా ఉందో, నమస్కరించి

సేవించడానికి అంత సముచితంగా ఉంది. అరుణాచలేశ్వరుని సగ భాగమై పాపహరమై యున్నది.]

వేదములు ఈశుని గుణములు. వేదాంతములు ఉపనిషత్తులు ఇవి సంపూర్ణతత్త్వజ్ఞానాన్ని ప్రసాదిస్తాయి. అయితే అరుణాచల మండలి శక్తీశ్వరులు తాపసులకు ఇంతకు మించిన జీవరహస్యాన్ని అనుగ్రహిస్తారు. అది అనుభవింపవలసినదేగాని వ్రాతలతో తెలిపేది కాదు; కావ్యకంఠుడైన గణపతిముని నటువంటి అనుభవము నందు అనుగ్రహించి తరింప జేసినది అపీతకుచాంబ.

శ్లో॥ వేద తురంగ విలోచన భాగ్యం
వేద శిరోనిచయైరపి మృగ్యం ।
శోక విదారి సుధాకిరణాస్యం
శోణగిరౌ సమ లోకిరహస్యమ్ ॥

[వేదములు గుణములుగాగల శివునియొక్క నేత్రములకు భాగ్యమును, ఉపనిషత్తులజేత తెలియదగినది, శోకమును విదళించునదియు నగు సుధాంశునివంటి మోముగలదియును, అగు అరుణాచలమండలి "జీవరహస్య" మూర్తిని నాపున్నెంపండి చూశాను.]

భాగ్యమనగా పుణ్యఫలము; మృగ్యమనగా వెదుకదగినది; రహస్యమనగా పరమేశ్వరీ స్వరూపమనియు, ఈ మహాయోగికి ఈ దర్శన భాగ్యం లభించిందని ఇందలి భావం.

తాపసులకు తమకంటూ కోరుకోడానికి ఏదీ ఉండదు. సర్వధర్మరక్షణ. సమస్త లోకకళ్యాణం ఇదే వారు వాంఛించేది. అమ్మ నగవులు జ్ఞాన వికాసకములు అని ఎరింగిన గణపతిముని అపీతకుచాంబయొక్క నగవుల సొగసులను జూచి మురిసిపోయి శాస్త్రజ్ఞానముతో సంతృప్తిజెంది బ్రహ్మజ్ఞానము నెరుగని పండితులందు జ్ఞాన వికాసమును గలిగించి భారతీవంశజులను రక్షింపుమని కోరినారు.

శ్లో॥ ఆగమ విస్మృతి కైరవణీనాం
బోధ మజస్ర మసావిదధానః ।
పాతు మహేశవధూవదనాంశో
హాస శశీ సకలాని కులాని ॥

వేద శాస్త్రములను చదివిన పండితుల హృదయములను కలువలకు చంద్రుడులాగ విజ్ఞాన వికాసం కలిగించేదై భాసిల్లే మహేశ్వరి యొక్క చల్లని నగవుల మొలకలు మా భారత వంశజులను కాపాడుగాక !

శ్లో॥ ఆయతలోచన మంచితకర్ణా
దానయశోజిత తోయదకర్ణా ।
శోణ నగేశ మనః ప్రియవర్ణా
నాశయ తాజ్జగదార్తి మపర్ణా ॥

చెవుల వరకూ వ్యాపించిన కనుగవ, కర్ణునిమించి కోరినవి వర్షించే దానగుణం, అరుణేశుని మనస్సును రంజింపజేసే మైఛాయ గల అపర్ణ లోకము లందలి ఆర్తిని పోగొట్టుగాక.

ఇలా వ్రాసుకుపోతూ ఉంటే గణపతిముని స్తుతించిన శ్లోకాలనేకం ఉన్నాయి.

మూడు రోజుల పాటు నిత్యము అమ్మను స్తుతిస్తూ పలు రూపముల ఆమెను దర్శించి, ఆమె పాదారవింద భక్తుడైన గణపతిమునిని జూచి "అన్నా ! మూడు రోజులు అయిపోయినాయి ఈ రోజునుండి మనకి ఆశ్రియముకు తిండి ఈ ధర్మశాల యందు దొరకదు. మరియొకచోటు వెతుకొనవలయును" అన్నాడు శివరాముడు.

❀ ❀ ❀ ❀

# 4. అరుణేశునకు 'హరసహస్ర' మాల

శ్లో॥ అరుణాచల రూపేణ పరిణామము పాగతమ్ ।
జ్యోతిర్మయం పరబ్రహ్మ జ్ఞానాయ మమకల్పతామ్ ॥

[అరుణాచల రూపమున వెలసిన జ్యోతిర్మయుడైన పరా
ప్రరుడు నాకు బ్రహ్మజ్ఞానమును కలిగించును గాక!]

—హరసహస్రము

* * * *

మర్నాడుదయముననే ధర్మశాల ఖాళీచేశారువారు. మరల
ాపాటు అవస్థప్రారంభమైనది. ఏచెట్టుక్రిందనో పుట్టక్రిందనో ఉండ
చ్చును. ఉండడానికి అనేకమైన చోట్లుగలవు. కానీ భోజనం లేకపోతే
డవదుగదా! ఎలాగో ఆ గడపా ఈగడపా త్రొక్కితే పగటిపూట
ోజనం లభించేదివారికి. రాత్రిపూట ఉపవాసమే. గణపతికిటువంటి
రిస్థితులు క్రొత్తకాదు. ఇదివరకే అనుభవం ఉంది. పాపం!
వరామునికి మాత్రం కష్టంగా అనిపించింది. అన్నమీద భక్తికొద్దీ
క వారంరోజులు ఒంటిపూట భోజనములతో కాలం వెళ్ళబుచ్చాడు.
క తట్టుకోలేక అన్నతో "అన్నా! మనం ఇల్లు వదలి చాలాకాల
ైనది. నాన్నగారు మనకై ఎదురు చూస్తూ ఉంటారు. ఇచటి
శేషాలన్నీ చూచాముగదా! ఇంటికి పోదాము." అన్నాడు.

గణపతికి అరుణాచలమును వదలాలనిలేదు. అమ్మ అతనికి
కపరి కొకపరి వయ్యారమై కనిపించి దర్శనమిస్తోంది. తమ్ముని
ాచి "నాకు ఈ క్షేత్రమును వదలి రావాలని లేదు. ఏదియో
ివికమైనశక్తి నన్నిచటకు రప్పించినది. నన్ను వదలకున్నది
వు ఇంటికి వెడలుము" అనెను.

"నిన్ను వదలి నేను ఎటుల పోవుదును. నిన్ను వదలి ఎందుకు వచ్చానని నాన్న ప్రశ్నిస్తే ఏమిచెప్పగలను. నీరాకకై వేయి కళ్ళతో ఎదురుచూస్తుంది వదిన. నిన్ను తోడ్కొని రానిచో అందరూ నన్ను కోపగింతు"రని శివరాముడు పల్కెను.

అరుణాచలమందే ఉండవలయుననిన ఏదైనావృత్తి చేపట్ట వలయును. అప్పుడు కుటుంబమునుకూడ ఇచ్చటకు తేవచ్చును. వారభోజనములతో ఆట్టెరోజులు కాలముగడుపుట కష్టము. ఇప్పటికే తమ్ముడు శివరాముడు చిక్కిశల్యమైనాడు. అయితే తనకి వృత్తి నిచ్చేదెవరు ? ఇలా తలచిన గణపతి తలయెత్తి కొండని చూశాడు. అందు ఈశుని రూపం కనిపించిందతనికి "అరుణాచలా ! అనామయ పదము నిత్తురని అందరూ నిన్ను నమ్మి ఇచ్చటికి వత్తురు. ఒక పూటకి భోజన మీయలేని ప్రభువై యున్నావు. నీవు అనామయ పదమిచ్చెదవా?" ఇట్లు తలచి పరిహాసముగా-

శ్లో॥ వృత్తిదాస విముఖేన కిం
త్వయా దీయతే నిజమనామయం పదం?
కిం దదాతిహర ! సర్వవేపుర్వణాం
విణ్ణిశాశకల దాన దుర్మనాః ?

"ఓహరా! వృత్తినిచ్చుటకే విముఖుడవైన నీచే అనామయ పదమీయబడునా? పసుపుకొమ్ము నిచ్చుటకు లోభియైన వైశ్యుడు అంగణమును అడిగినచో ఇచ్చునా ?" అని నిందాస్తుతిగావించెను.

అరరే! ఈశుని దూషించుచున్నావా? నీవు ఏదైనా యాచించినకదా! అతడిచ్చుటకు. నీవుతలంపగనే హేరంబుడు భోజనమిడలేదా! ఇప్పటి వరకు సన్నిధి వీధిలో బ్రాహ్మణ గృహములందుగదా! నీవుఅన్నము యాచించితివి. అడుగక ఇచ్చెడి దాతయుండడు. అడిగి చూడుము" అని అంతర్వాణి పలికినది. ఇచ్చిపుచ్చుకొనుట కవి లక్షణము.

అది యాచన ఎట్లగును ? కావున ఈశునికై శ్లోకములతో గూర్చిన సుమమాలను సమర్పించనెంచి గణపతి తమ్మునితో నిట్లనెను. "మరి కొద్దిరోజులుండి దశరా వేడుకలు జూచుకొని వెళ్ళిపోవుదము."

మర్నాటి సాయం సమయానికి 36 శ్లోక పుష్పములు అతని కలమున జనించి వికసించినవి. వాటిని దోసిట గ్రహించి, తమ్మునితో బాటు ఆలయం చేరాడతడు. నందీశ్వరుని ముంగిటనిలిచాడు. ఎదురుగా స్వామి లింగము స్వచ్ఛముగా కనిపించుచుండెను. ప్రభువునకు నమస్కరించి ఇర్వురును కళ్లు మూసికొనిరి. గణపతి తన మధుర కంఠంతో శ్లోకములను గానమారంభించెను.

శ్లో॥ అరుణాచల రూపోవః కరుణా వరుణాలయః ।
భువనాధిపతిః కశ్చిదవనాయ ప్రకల్పతామ్ ॥
ఇహాలంకార మాధుర్య ధ్వనయః సంతివానవా ।
ఏకోనామధ్వనిః శంభోరస్యాదాతుం విదాంమనః ॥
అలం క్రియంతాం చిత్రార్థైః ప్రాచాంవాచో విపశ్చితామ్।
యశ ఏవ మహేశస్య భాషయా మధుభూషణమ్ ॥

ఇలా ఒక్కొక్క పుష్పము శివుని పాదములకు సమర్పితమౌతున్నాయి. అన్నదమ్ములిరువురూ భక్తిపరవశులయ్యారు వారి కండ్లయందు కన్నీరు ధారాప్రవాహమైంది. కావ్యకంఠుని మధుర గానం ఆలయమందు ప్రతిధ్వనించినది. కోవెలకువచ్చినవారందరూ ఆగానమున కాకర్షితులయ్యారు. అందరూ గణపతి శివరాముల చూట్టూ చేల్చున్నారు. తన్మయత్వమున వారి కంటి నుండి గూడ కన్నీరు ప్రవహించుచుండెను. కావ్యకంఠుని వాణి గిరిపై గల మునీశ్వర అను గూడ కదల్చివైచినది. ఎందరో సన్యాసులు,

యోగులు, యతులు, అచటికి వచ్చినారు. అందరూ ఈశ్వర చరణార విందములందు మైమరచినవారే. ఒక గంట ఇలా ప్రార్థన ముగించుకొని బసకి చేరారు శివరామ గణపతులు.

మర్నాటి నుండి వారికి భోజనమునకై ఇబ్బంది కలుగలేదు. పుర ప్రజలు ప్రేమతో వారిని పిలచి భోజనము పెట్టుచుండిరి. ప్రతి దినము గణపతి తాను వ్రాసిన శ్లోకరాజములను ఆలయమందు అరుణేశునకు వినిపించుచుండెను. ప్రతీదినము ఆదేసమయమునకు పామరులు, భక్తులు, కవులు, పండితులు కావ్యకంఠుని గానము వినుటకై వచ్చుచుండెడివారు. యోగులు యతులు అచట చేరు చుండెడి వారు. గణపతికి వారి ఆశీర్వచనములు లభించెడివి. అట్లు వచ్చెడి యతీంద్రులలో ముఖ్యులు శేషాద్రిస్వామి మరియు మౌన స్వామి (ఇతడే తరువాతి కాలమందు గణపతిమునికి గురువైన శ్రీ రమణ మహర్షి.)

గణపతియొక్క రచనా చమత్కృతి, భావపోషణ, శైలి, సరళత్వము ఇత్యాదులు పండితులను కవులను ఆకర్షించినవి. అతడొక మహాకవి యను విషయము వారికి తెలిసినది.

ఈ విధముగా నెల దినములపాటు ఆలయమందు "హర సహస్ర" ప్రవచనము గావించిన గణపతి చివరి శ్లోకమును గూడ అరుణేశునకు చదివివినిపించి అన్నింటినీ గూర్చిన" హరసహస్రసుమ మాలతో ప్రభువు నలంకరించెను. గణపతిముని పాండిత్యమును మెచ్చిన పుర ప్రముఖులు అతనికి సంస్కృత పాఠశాల యందు అధ్యాపక వృత్తినిచ్చిరి.

# 5. "అహంభో అభివాదయే"

శ్లో॥ త్వయ్యర్పితమనసా త్వాం
పశ్యం త్సర్వం తవా కృతితయా సతతం
భజతేఽ నన్య ప్రీత్యా
సజయత్యరుణాచల త్వయి సుఖేమగ్నః ॥

[అరుణాచలా ! మనస్సును నీకు అర్పించి, సర్వమునూ నీ యాకృతిగా జూచుచు ఇతరములను విడనాడి నీయందే భక్తిని జూపి, నిన్నే సతతము భజించువాడు (నీ) ఆత్మసుఖమునందు లగ్నమై యుండును.]

—అరుణాచల పంచరత్న స్తుతి
శ్రీ రమణమహర్షి

* * * *

అర్పణకు మరోపేరు శరణాగతి ఇందులకు వయోభేదము లేదు. పెద్దలైనను పిన్నలైనను శరణాగతిద్వారా ఈశుని అనుగ్రహము పొందవచ్చును. భౌతిక జీవితంతో ఇది ముడిపడి యుండదు. భౌతిక జీవితమునందు అనేక కష్టములను అనుభవించుచూ ఆధ్యాత్మిక సీమయందు ఉన్నతవ్యక్తిత్వము పొందిన మహానుభావులు ఎందరో ఉన్నారు. "మీరు వేషమును జూచెదరు. అందు వ్యక్తియొక్క ఆధ్యాత్మిక పురోగతి కనుపించదు" అనే భగవాన్ వచనములు గమనింపదగ్గవి. బాల్యమునందే భగవానుని శరణాగతి పొంది, కడపటివరకు భగవానుని కరుణలో పెరిగిన ఒక విచిత్ర బాలకుని కథ ఇది :

సాధువులకు నిలయమైన అరుణగిరిపై, తరుశాఖలయందు, గుహలయందు ఎందరో సజ్జనులు నివసిస్తూ ఉండేవారు. అందు కొందరు ఆత్మసిద్ధి చెందిన యోగులు. కొందరు జీవితముపై విరక్తి చెంది వచ్చిన అన్వేషకులు, మరికొందరు పొట్టకూటికై సంన్యాసి

వేషములందుండువారు. ఎవరు ఎటువంటివారో తెలిసికొనుట సామాన్యులకు కష్టసాధ్యము అయినప్పటికీ అరుణాచల పురవాసు అందరినీ ఆదరించి భిక్ష నిచ్చుచుండిరి.

పురజనులకు ప్రీతికరమైన వారిలో శేషాద్రిస్వామియను సిద్ధులొకరుండెను. వింత వింత చర్యలతో ఇతడు చూచుటకు పిచ్చివానివలె కన్పించుచుండెను. ఇతనిది అమృత హస్తము. ఇతడు కన్యకను తాకిన ఆమెకు వెంటనే వివాహమగును. అంగడిని తాకిన లాభము అధికమగును, సుమంగళిని తాకిన శుభములగును. ఇలా ఒకటననేల అనేక లీలల అతడు పురవాసుల ననుగ్రహించుచుండెను. అతడు దేవీ ఉపాసకుడని అచటి వారి విశ్వాసము.

అరుణగిరియందుగల మరియొక యోగి మౌనస్వామి. 17 సంవత్సరముల వయసునందే ఇల్లువదలి యతివలె అచటనే జీవితము గడుపుచుండెను. కరములే ఇతని భిక్షపాత్రలు. శాంతికి అతని సన్నిధి పెన్నిధి. మిక్కిలి కాంతు లొలుకు చూపులతో చూడవచ్చిన వారి భయమును హరించుచుండెను. అతనిని బ్రాహ్మణ స్వామియని అచటివారు పిల్చుచుందురు. అరుణాచలముతో అతనికి ప్రీతికరమైన బాంధవ్యమున్నది. మందుల కొండయని, కరుణాసముద్రమని పలు విధాలుగా అతడాకొండను పొగడియున్నాడు. అతడందరికీ ప్రీతిపాత్రుడే. అతడొక మహాయోగియని అందరి నమ్మిక.

మరియొక జటాధరుని పేరు పద్మనాభస్వామి. కొండపై ఇతడు ఆశ్రమమును నిర్మించుకొనెను. కొంత శాస్త్ర పరిచయం ఉంది. మంచి మాటకారి అందరూ ముందు ఇతని దర్శనం చేసుకొని మౌనస్వామినిచూడాలి. 1901వ సంవత్సరములో గణపతి ముని అరుణాచలంలో ఉన్ననాటి పరిస్థితులివి.

గణపతిముని మనస్సుని ఆకర్షించిన మౌని మౌనస్వామి. ఆయువ బ్రహ్మచారి యందలి ప్రశాంతము, పరివేష్టితమై యున్న శక్తి, ముఖవర్చస్సు అతని యందలి పారవశ్యానికి కారణం. తాను "హరసహస్రము" చదువునపుడు ఈ మౌనస్వామి వచ్చి విను చుండెను. తరచు కుటుంబముతో వెళ్ళి అతనినిదర్శించుచుండెనుగాని మౌనభంగము గావించలేదు. గణపతిపై ఆదరమైన వీక్షణములు తప్ప మరియొక చలనము మౌనస్వామియందు లేకుండెను.

బహుశా ఈశ్వర సంకల్పము లేదేమో! తనకు కాబోయే సుపుత్రుడని గణపతికి తెలియదు. మౌనస్వామిమనసులో 'ఏముందో' ఎవరికెరుక ?

ఒకనాడు భార్య విశాలాక్షి కుమారుడు మహాదేవునితో కలసి గణపతిముని మౌనస్వామి దర్శనం కొరకై కొండ ఎక్కారు. మౌన స్వామి ముందు దంపతులిద్దరూ కూర్చున్నారు. "దేవా! స్వామికి నమస్కారం చేయి" అని కుమారు నాదేశించారు గణపతిముని. ఆ బాలకుడు వారి మాటలు పట్టించుకోలేదు. మౌనస్వామినిమాత్రం ఒకసారి చూచి దూరంవెళ్ళి ఆడుకోసాగాడు.

ఇంతలో జటాధరుడు పద్మనాభస్వామివచ్చారచటికి. వెంటనే ఇరువురూ వారికి నమస్కరించారు. అతడు వెంటనే "శాస్త్రిగారూ! మీరు పండితులుగదా! శుక్లాంబరధరం అను శ్లోకాన్ని విష్ణుపరంగా అర్థంచెప్పి తెల్పగలరా"? అని అడిగారు. గణపతి తడుముకోకుండా "విష్ణుపరంగా ఏమిటి! ఇదిగో ఈ మౌనస్వామి పరంగా చెప్పెదను" వినండి అన్నారు.

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
పసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే॥

శుక్లాంబరధరం అనగా తెల్లని వస్త్రము (కౌపీనము) ధరించిన వాడు, విష్ణుమ్ - సర్వ వ్యాపకుడు; శశివర్ణమ్ - చంద్రుని వంటి (తెల్లని) శరీరచ్ఛాయ గలవాడు; చతుర్భుజమ్ - కామ, క్రోధ, మద, మత్సరములు అను నాల్గింటిని భుజించినవాడు; ప్రసన్న వదనమ్ - శాంతమైన ముఖముగలవాడు అగు మౌనస్వామిని; ధ్యాయేత్ - ధ్యానించిన - అతడు - సర్వ విఘ్నోప శాంతయే - అన్ని విఘ్నములు పోగొట్టును.

ఇలా వివరణ చెప్పేసరికి వెటకారం చేద్దామనుకున్న పద్మ నాభుని ముఖం పాలిపోయింది.

ఇంతలోపల దూరాన ఆడుకుంటున్న మహాదేవుడు పరుగు పరుగున వచ్చి మౌనస్వామి ముందు సాష్టాంగపడి, అతని చరణ ములు బట్టి "మహాదేవశర్మా అహంభో అభివాదయే" అని నమ స్కారం చేశాడు. ఇదియే ఆ బాలకుని శరణాగతి. శరణన్న వారిని కాపాడుట స్వామి లక్షణము. బాలకుని లేపి తొడపై కూర్చుండజేసి రుణతో, వాత్సల్యంతో తల నిమిరారు మౌనస్వామి. నాలుగు ంవత్సరాల వయస్సు గల ఆ బాలుని యొక్క సంస్కారం ఖ్బరం కలిగించిందని తరువాత కాలంలో వారే చెప్పియున్నారు. మహర్షికి మునికుమారునికి ఏర్పడిన మైత్రికి ఇది నాంది. తరువాత వారు ఎంతగానో ఆడుకున్నారు ముచ్చటించుకున్నారు. మహర్షి కరుణ అనంతం, నాజీవితంలో మరపురాని సంఘటనలివి" ని పెద్దయ్యాక మహాదేవుడు చెప్పేవారు. జీవితాంతం అతని ంందు గానవచ్చిన శాంతానికి, మౌనానికి, అంతర్ముఖ ధ్యానానికి హర్షి కరుణయే కారణమని వారి పరిచయమున్నవారు ఇప్పటికీ ంటూ ఉంటారు. అందుకే అతణ్ణి అందరూ "దేముడన్న" ంటారు.

ఈ విధంగా తన తండ్రికి కాబోయే గురువునకు తండ్రికన్నా ముందు శరణుజొచ్చాడా చిన్నారి బాలకుడు

"ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః"

• • • •

## 6. "ఇంద్రో విశ్వస్యరాజతి"

శ్లో॥ ఇంద్రో విజయతే దేవః సర్వస్య జగతః పతిః।
వేదమూలం జయత్యే తత్తస్య నామ సహస్రకమ్ ॥

[సర్వ జగములకు అధిపతియై యొప్పు ఇంద్రునకు జయమగుగాక! వేదమూలము నుండి పరిగ్రహింపబడిన యతని నామ సహస్రకమునకు జయమగుగాక!]– ఇంద్రసహస్రమ్

(గణపతిముని)

• • • •

దర్శనము రెండు విధములు. అందు మొదటిది బాహ్యరూప దర్శనమైతే రెండవది మనోదర్శనము. మనస్సు ఒక భావాన్ని సృష్టించి దానికి రూపం కల్పించుకొంటుంది. "నేను" అనేది ఒక భావం లేక ఒక తలంపు. నిజానికి దానికి రూపంలేదు. దానికి శరీరాన్ని కలిపితే శరీరమే ఒక రూపం అవుతుంది. అప్పుడు కలిగేదే దేహాత్మభావం. యోగులు ఈ "నేను" ను "నేను"గానే దర్శిస్తారట! అప్పుడు అదియే దానిరూపం అవుతుంది అంటారు పెద్దలు. దృష్టి విస్తృతమైన కొలది ఈ రూపంపై సాధకుని అవగాహన పెరుగుతూ ఉంటుంది.

అరుణాచలము చేరిన గణపతి ఇచట మునుపటివలె మంత్ర దీక్షను బూని తపస్సు చేయలేదు. మౌనస్వామి దర్శనానంతరము

అతని చిత్తము అధిక శాంతిని పొందినదై యుండెను. వేదాధ్య యనము తపస్సు గావున అచట వేదపాఠశాలయందు తోటి విద్యా ర్థులతో కలసి తానుగూడ వేద పఠనము గావించుచుండెను. "అగ్ని మీళే" మొదలుకొని "సుసహాసతి" వరకు వేదము నందలి ఋక్కు లను త్వరితగతిని పఠించి సాయనాచార్యుని వేదభాష్యమును గూడ పఠించెను అతడు వేదార్థమును చెప్పునపుడు తోటి విద్యార్థులతో బాటు గురువులు కూడ ఆశ్చర్యము చెందుచుండిరి.

ప్రతి కార్యమునకు ఒక పరమార్ధ ముండునని పెద్దలు చెప్పెడి నానుడి గణపతియందు నిజమైనది. "నేను'' అను అహం స్ఫురణతో స్వాభిమానపూర్వకమైన ఒక తేజోరూపమును అతడు దర్శించినాడు. తాను ఇప్పటివరకు తండ్రివద్ద ఉపాసనా పూర్వ కముగా దేవీతత్త్వమును గ్రహించియున్నాడు. ఆమెను పలు రూపములందు దర్శించియున్నాడు. కాని ఈ రూపము అందు లకు భిన్నమై ప్రకాశించుచున్నది. దృశ్యమును గాంచిన మనస్సు ఊరుకోదుగదా! అతనియందు ఈరూపముయొక్క అవగాహనపై విస్తృతమైన విచారణ ప్రారంభమైనది.

"నేను'' అను అహంభావన "ఇదమ్" (ఇది) అనే సృష్టికి దారి తీస్తుంది. పరమాత్మ "నేను" అను రూపంతో వెలుగుతున్నా డనునది ఉపనిషత్ వ్యాఖ్య. సత్ స్వరూపమైన బ్రహ్మము సృష్టి దశలో ఈశ్వరుడగుచున్నాడని శాస్త్రములందు తెల్పబడినది. కావున ఈ తేజోరూపము అరుణేశుడేయని గ్రహించి ఆ మహాదేవుని అనుగ్రహమునకు మిక్కిలి సంతోషించాడతడు. అంతేగాకుండా అరుణేశునికృపాతరంగములందు తేలియాడు ఆమహాతపస్వియందు వేదాంతము నందలి రహస్యములు గూడ అవగతమయ్యాయి.

'అధితి-దక్షుడు' సృష్టికి మాతాపితరులని వేదమునందు జెప్ప బడినది. సతీ-భవులు' తల్లి దండ్రులని కొందరందురు కావున ఈ భవుడే నిజానికి దక్షుడు. సృష్టికి దక్షత వహించుచున్నాడు గావున దక్షుడను నామము కలిగినది. ఏది ఖండముకాదో అది 'అదితి' అగును. సృష్టి ఆకాశమున జరుగుచున్నది. కావున సృష్టి సీమయైన ఆకాశమే 'అదితి' అమెయే ఎప్పుడూ ఉండేటటువంటి శక్తిస్వరూపిణియైన "సతి" ఈ దర్శనమును అతను ఉమాసహస్రము నందు శ్లోకరూపమున తెల్పియున్నారు.

శ్లో॥ ప్రాన్తేషుకోపిశక్తేః పృథగాత్మావియదుపాధి సంగేన।
పరమాత్మనో విభక్తః స్వయమభిమన్తా వినిష్పేదే॥

[ఆకాశమునందు శక్తియొక్క వితరణయందు ఉపాధిసంగము చేత పరమాత్మనుండి వేరై స్వాభిమానముతో గూడిన వేరొక పురుషుడుద్భవించాడు (పరమాత్మ యొక్క ఈశ్వర రూపమే ఇది. ఇతడే దక్షుడు).

దక్షుడు ప్రారంభించిన సృష్టి యజ్ఞము నందు రూపరచనా శక్తిధరుడైన బ్రహ్మ, సృష్టి భూతములను పాలించువాడైన విష్ణువు ఆహ్వానింపబడతారు. యజ్ఞహవిస్సు వారికివ్వబడుతుంది. ఈశుడు మూలపురుషుడు గాన సృష్టికి కావలసిన ఆహారము అతనికి ఈయ బడలేదు పురాణములందు జెప్పబడిన "దక్షయజ్ఞమునకు వేదాంత పరమైన తత్త్వమిది.

వేదములందు ఈశుని నామము ఇంద్రుడు. కావుననే అన్ని క్రతువులకు అతడు యజ్ఞపురుషుడౌతున్నాడు. పురాణములందు ఈ ఇంద్రతత్త్వము వక్రభాషణ గావింపబడినది. కావ్యకంఠుని కలము నుండి వెలువడిన ఇంద్రతత్త్వము సంక్షిప్తముగా ఇది:-

"ధరణీ రవీందుల ధర్త ఎవండు
పరశక్తి పౌలోమి భర్త ఎవండు
ఒజ్జలు వర్ణించు నుత్తము డెవడు
ముజ్జగముల నేలు మొనకా డెవండు
ధాతల ధాతయౌ తాత యెవండు
భూతంబులకు మూలభూత మెవండు
జీవులు జీవించు జీవ మెవండు
దైవంబు లర్చించు దైవ మెవండు
యుద్దేశుడగు నాదియోద్ధ యెవండు
బుద్ధీశుడగు నాది బోద్ధ యెవండు
అందరి లోపల ఆత్మ యెవండు
మందులు గానని మర్మ మెవండు
జ్యోతులు వెలిగించు జ్యోతి యెవండు
జాతు లేకంబగు జాతి యెవండు
అఖిలము మించిన వ్యాపకు డెవడు
నిఖిలము మించిన నిత్యు డెవడు
ఆకాశ తనువుచే నలరారు నెవడు
పాకారి తనువుచే పాలించు నెవడు
ఆయాధి దేవుని అభవు, ననంతు
మాయావినింద్రుని మదిలో తలంతు

— పూర్ణ (సత్యప్రభ)

ఇది యొక అపార వేద రహస్య దర్శనము. అదుణేశుని అనుగ్రహమున కావ్యకంఠుల వారికి లభించినది. నాటి ఋషికుల ...అంతరించిన తరువాత నవీనకాలంలో పురాణ రచనలను ఖండించి వేద తత్త్వమును వెలువరింప జేసే భాగ్యమును గణపతికి కలిగించి ఈశుడు ప్రజలకు అతని యందొక నవ్యఋషిని చూపించాడు. ఈ

దర్శనంతో అతడు మామూలు గణపతి కాదు. గణపతి ముని అయ్యాడు. ఆతడు వెలువరించిన వేద రహస్యము లనేకము లున్నవి.

"ఇంద్రో విశ్వస్య రాజతి" యనునది ఋగ్వేదము నందలి ఏకపద గాయత్రీ మంత్రము. గణపతి దీనిని వెలికి తీసారు. ఇంద్ర తత్వాన్ని వెలువరిస్తూ అనేక గీతాలు శ్లోకాలు వ్రాశారీయన. అంతే కాదు ఋషికుల సంప్రదాయము ప్రకారము 'అయ్యల సోమ యాజుల' అను తన ఇంటిపేరును అంతర్లీనము చేసి గోత్రాచార్యు డైన వసిష్ఠుని నామమును జతపరచి "వాసిష్ఠ గణపతిముని"గా పరిచితుడయ్యాడు.

తరువాతి కాలంలో ఋగ్వేదమును మథించి ఇంద్రునికి గల వేయినామములను సంపుటముజేసి 'ఇంద్ర సహస్ర' మను గ్రంథ మును వ్రాసారు. మంత్రరూపమైన ఈ రచనా చమత్కృతికి భగవాన్ శ్రీ రమణ మహర్షి కూడా ఆశ్చర్యం ప్రకటించి సంతో షించారు.

అది మౌనస్వామి దర్శన మహాత్మ్యమో లేక అరుణేశుని సన్నిధి ఫలమో 1303వ సంవత్సరములోనే గణపతిమునియందు "నేను ఎవరు" అను అహంవృత్తిపై విచారణ బీజము నాటబడినది. ఆ విచారణము వేదాంత విమర్శకు, వేదభాష్యమునకు దారితీయుగా అతడు ఆదిశంకరుల కోవలో భాష్యకారుడయ్యాడు.

# 7. నాదేశము, నాప్రజలు

శ్లో॥ అత్మీయ దేశరక్షణే
శక్తం కరోతు సర్వదా ।
పాపద్విషాం ప్రియంకరీ
వాసిష్ఠ మింద్ర సుందరీ ॥

[అమ్మా ! వాసిష్ఠుని ఇంద్రాణీ ! పాపము చేయువారి శత్రువులపై ప్రియము గలదానా ! నాదేశరక్షణకై సర్వదా నన్ను శక్తివంతుణ్ణి చేయుము].

– ఇంద్రాణీ సప్తశతీ, గణపతిముని

• • • •

అరుణాచలమునందు గణపతిముని కొండలందుగాని, కోవెల లందుగాని తపముజానలేదు. అతని దృష్టి వేదవిమార్శపై బడినది. అదియే అతని తపస్సు. స్వరయుక్తంగా వేద పఠనము జేయుచు అందే నిమగ్నుడై నాటి వేదకాలమునాటి సంస్కృతిని దర్శనము చేయుచుండెనతడు. మౌనస్వామి రూపమునగల భగవాన్ శ్రీరమణ మహర్షి అనుగ్రహం అతనికి సంపూర్ణముగా అప్పటికే లభించినది. కలువరాయి అగ్రహారము నుండి భార్య విశాలాక్షిని, కుమారుడు మహాదేవుని రప్పించి పురమునందు కాపురము బెట్టెను. 5 సంవత్స రముల వయస్సుగల మహాదేవుని మౌనస్వామికి జూపించగా ఆ మౌనయోగి బాలుని తొడలపై గూర్చుండజేసి తలనిమిరి ఆశీర్వ దించెను. ఆ బాలకుని భావిజీవితమునకది శ్రీరామరక్ష అయినది.

జైమినీయ తర్కవార్తికాది గ్రంథములు కూడ గణపతి సమూలముగా పఠించెను. వేదములు ఒకరు వ్రాసినవికావు. సత్యా సత్య శోధనయందు చిత్తమును ఏకాగ్రముగ దగల్చి, మూలా

భారతము నందలి అంతర్ గ్రంథాలయమును తెరచి తత్ఫలముగ తాము దర్శించిన ఋషుల యొక్క ఆర్థిక, పారమార్థిక ప్రమాణము లవి. పంచభూతాత్మకమైన ఈ జగత్తును నేటి వైజ్ఞానికులవలె వారు అనంతముగ పరిశోధించియున్నారు. ఇప్పుడు నవీనము అని మనము భావించే విషయవస్తు పరిజ్ఞానము వేదములందు గలదు. అటులనే ఏ సత్యము ఈ సృష్టికి మూలకారణముగుచున్నదో, ఆసత్యశోధన యందు ఋషులు దర్శించిన యనుభవములు నూత అంశము గలవు. కావున వేదములు నిత్య నూతన జ్ఞాన దీపికలు. అలనాటి ఋషికుల సంస్కృతియే భారతీయుల నిజ సంస్కృతి. ఎప్పుడైతే వేదములందలి విజ్ఞానము నిగూఢమైనందున ప్రజలచే విస్మరింపబడి దూర మైనదో అప్పటి నుండి హైందవ సంస్కృతికి పతనము ఆరంభ మైనది. పాశ్చాత్యుల పాలనయందు భారతీయులు బానిసలగుటకు నాటి పారమార్థిక క్షీణతయే కారణము. వేద విమర్శనము ద్వారా గణపతి గ్రహించిన సత్యమిది.

కావున భారతదేశ రక్షణకై సంస్కృతీ పునరుద్ధరణ ఆవశ్యక మని అతడు తలచాడు. అప్పటినుండి వేదోపన్యాసములు, సాహితీ ప్రసంగములు ఇత్యాదుల ద్వారా ప్రజలకు సన్మార్గము బోధిస్తూ వారియందు దేశభక్తిని పెంపొందించి చైతన్యవంతులను చేయ సాగాడు. అప్పటి వరకు కొండలపై గల స్వాముల సేవించుటయే గాని వారి యుపదేశములకు నోచుకోని పుర ప్రజలు మహాతపస్వి సాంగత్యమును పూర్వజన్మ సుకృతముగా భావించిరి. అతని దర్శ నార్థము జనులు తండోప తండములుగ వచ్చుచుండిరి. అందు శాస్త్రములందు సందేహములు దీర్చుకొనువారు, వేదాధ్యయనము నకై వచ్చినవారు కొందరు. మంత్ర దీక్షకై కొందరు. ఇలా జన సమూహముతో ఇల్లు కిటకిటలాడుచుండెను.

అతని కీర్తి పురమునకే పరిమితము కాలేదు. చుట్టుప్రక్కల గల పురములకు గూడ వ్యాప్తి చెందినది. అందుచే గణపతి సమీప క్షేత్రములందు అప్పుడప్పుడు అవధానాది ప్రక్రియలను జరుపుచుండెను. అనేకులు వారి శిష్యులైరి. అందు చెన్నపురి వాస్తవ్యులైన శాతంజేరి రామస్వామి అయ్యరొకరు. ఇతడు 'ఉపనిషద్బ్రహ్మ' యను యోగి వంశమున జన్మించి యుండుటచే సదాచార సంపన్నుడై మిక్కిలి పలుకుబడి కలిగియుండెను. మద్రాసు హైకోర్టునందు గుమస్తా వృత్తి చేయుచుండెను. వాసిష్ఠుని ప్రసంగములకు ప్రభావితుడైన ఇతడు గణపతిని మద్రాసుకు ఆహ్వానించెను. శిష్యునిపిలుపు మన్నించి గణపతి పాఠశాల సెలవు దినములందు మద్రాసు జేరి రామస్వామి అయ్యరు ఇంట బస చేసెను. గురువురాకతో తమఇల్లు పావనమైనదని ఆకుటుంబము వారు సంతోషించిరి:

వాసిష్ఠుని రాక సందర్భంగా మద్రాసునందు బుధజనసభ ఒకటి ఏర్పాటు చేయబడినది. రాజకీయ, సాహిత్య, పాండిత్య సీమలయందు పలుకుబడి గలవారు ఆ సభకు విచ్చేసిరి. వాసిష్ఠుని కీర్తిని ఇదివరకే వినియున్నవారున్నందున కొందరు విద్యార్థులు కూడ వచ్చియుండిరి. నవద్వీపమునందు 'కావ్యకంఠ' బిరుదము పొందిన ఈ మహాకవిని జూచుటకు పామరులు కూడ వచ్చిరి. కావున యది బుధజనసభ యనుటకంటె ప్రజాసభ యనుటయే మేలు. వాసిష్ఠుని వాణి గంభీరముగా నాటి ఋషికుల సంస్కృతీ సీమల యందు పయనించి, హైందవ సంస్కృతీ పతనమునకు గల కారణముల విపులీకరించుచూ ఆగిపోయినది. అతని దృష్టి అంతర్ముఖమైనది. అతడు ధ్యాననిమగ్నుడయ్యాడు.

ప్రజలు కొన్ని నిముషములు ఈ మౌనమును భరించారు. వాసిష్ఠుని మధురనాదము మరల మ్రోగకుండుటచే, ఒకబుధజనుడు అతనిని సమీపించి "మీరు ఏమి ధ్యానించుచున్నారు ?" అని అడిగెను" దశాందేశ స్యైతాం ప్రతిపదమయుం ధ్యాయతి జనః" అని వాసిష్ఠులవారి ముఖమునుండి ఒక శ్లోక చరణం వెలువడింది. దేశమునకు కలిగిన ఈ దశ నీజనుడు మాటిమాటికీ తలపోయు చున్నాడు అని చరణముయొక్క భావమైయున్నది. సభలో ఉన్న వారికిది అంతగా అర్థంకాలేదు. ఈలోపల గణపతి మరల బాహ్య దృష్టికివచ్చి శ్లోకములను చదివి భావమును వివరించారు.

శ్లో॥ కులీనః క్షుద్రాయ ప్రవర ఇతిదత్తే నిజసుతా
మనార్యాన్ విజ్ఞాశ్చ ప్రభవ ఇతిగాయన్తి శతశః ।
బలం బాహ్వోర్లుప్తం హృతమపిచ వాగ్వీర్యమరిభి-
ర్దశాందేశ స్యైవ్తాం ప్రతిపదమయం ధ్యాయతిజనః ॥

[సత్కులమందు పుట్టిన యొకడు తన కుమార్తెను, వీడు మంచి వరుడు అని క్షుద్రునకిచ్చుచున్నాడు. అనార్యులను ప్రభువులని కొందరు స్తుతించుచున్నారు. వాని భుజబలము లోపించుచున్నది. వాగ్వీర్యము శత్రువులచే నపహరింపబడు చున్నది. దేశమునకు కలిగిన ఈ దశనే మాటిమాటికీ యీ జనుడు తలపోయుచున్నాడు.]

శ్లో॥ అరిభిరధమైః రాక్రాంతాఏతేముహుర్ముహురుద్ధతైః
కరమ వికలం పాతుం ధీరోన కోపి విలోక్యతె ।
కృతపదయితాస్తేతే పూర్వేధరే భరతాదయో
యదజిత భుజాదుర్గస్థాయా స్తవాంబన భీరభూత్ ॥

[ఓ భూదేవీ ! నిర్దయులై మాటి మాటికి గర్వించుచున్న శత్రువులచే నాక్రమింపబడిన నిన్ను రక్షించుటకు అభయహస్త

మిచ్చు ధీరుడొక్కడైననూ గానరాడు. ఎవరి భుజబలములను నీవు దుర్గసుగా గాని నిర్భయంగా పూర్వముంటివో అట్టి భరతాదు లిప్పుడెచటనున్నారో గదా:]

బ్రిటిష్ వారి పాలనలో అధోగతి చెందిన భారత భూమిని రక్షించుటకు స్వాతంత్ర్య నినాదములు అచ్చటచ్చట లేచుచున్న రోజులవి. మద్రాసు పౌరులానాడు కావ్యకంఠునియందుదేశరక్షణకు కంకణం కట్టుకున్న వీరుని జూచారు. వారి ఉత్తేజకరమైన ప్రసంగం సభాసదులందు నూతన చైతన్యం కలిగించింది.

మర్నాడు వాసిష్ఠుని జూచుటకని రామస్వామి అయ్యర్ ఇంటికి పలువురు ప్రముఖులు వచ్చిరి. వారిలో విద్వత్కుల శేఖరులైన వేదం వేంకటరాయశాస్త్రి, తండులం సుబ్రహ్మణ్య అయ్యర్ పంచాపకేశశాస్త్రి రంగయ్యనాయుడు అను ముఖ్యులుకూడ గలరు కావ్యకంఠునితో ముచ్చటిస్తూ శ్రీ వెంకటరాయశాస్త్రిగారు "నన్నొక శంక బాధించుచున్నది" అన్నారు. విద్వన్మణికి శంకయా! గణపతి వారిని జూచి వెంటనే ఒకచమత్కార శ్లోకమును ఆశువుగా జెప్పెను.

శ్లో॥ స్యతు సర్వజ్ఞ శిరోమణి
'దీధితి' దోష ప్రదర్శనేపి పటుః ।
భవతాం శంకాః శంకర
హరిణ దృశోహాసనవశాస్త్రీ ॥

[1. సర్వజ్ఞ శిరోమణియైన భట్టాచార్యుని 'దీధితి' యను న్యాయ గ్రంథమునందు గూడ దోషముల జూపు పటుత్వం కల్గిన పార్వతీదేవి నూత్న మందహాస రూపమై యొప్పు ఈ గణపతి మీ శంకలను నివారింపగలడు.]

[2. ఈశ్వరుని శిరోభూషణమగు చంద్రుని యొక్క కాంతి యందు సైతము దోషము జూపగల పార్వతీ సూత్నమందస్మిత యొక్కనైన యెప్పు గణపతి మీ శంకలను నివారింపగలడు.]

ఒక్క శ్లోకమునందు మనోజ్ఞమైన రెండు భావములు! అందు తాను పార్వతీ తనయుడనని పల్కెడి ధీరత్వము! ఈ కవి సామాన్యుడు కాడు. కావ్యకంఠుడేయను భావము అచటివారియందు కలిగినది. తరువాత వారి ప్రసంగము పలు విషయముల సాగినది. తంకులం సుబ్రహ్మణ్య అయ్యర్ గణపతి నుండి మరియొక శ్లోకం వినగోరి "శాస్త్రిగారూ" స్కంద–గణపతి–పార్వతీ–పరమేశ్వరులు నల్గురికీ వర్తించునట్లు చక్కని శ్లోకం చెప్పగలరా" అని అడిగెను. వెంటనే గణపతి ఇట్లు పలికెను.

శ్లో॥ జగతీధరజామాతా
భవతాం భవ్యాయ భూయసే భవతు ।
కంచిదపి కించనమపి
యద్వీక్షా విదధాతి శక్రసమమ్ ॥

జగతీధర – జామాతా = కొండకు అల్లుడైన ఈశుడు, జగతీధరజా + మాతా = కొండకు కూతురు; భువనములకు మాత–పార్వతీ; జగతీ ధరజా + మాతా = కొండకు పుట్టిన దెవరి తల్లియో – స్కంద గణపతులకు–కావున

స్కంద, గణపతి, పార్వతీ పరమేశ్వరుల యనుగ్రహదృష్టి ఏది దరిద్రుని సహితము ఇంద్రతుల్యునిగా జేయునో ఆ అనుగ్రహదృష్టి మీకు అధిక మంగళముల నొసగుగాక.

అంతటితో అచటి వారికి కావ్యకంఠునిపై గురుభావం ఏర్పడినది. వారు ఆ కవి సార్వభౌమునకు నమస్కరించారు.

* * * *

# 8. చెన్నపురిలో సారస్వత సభలు

సాహిత్యసీమయందు హిమాలయమువలెఎదిగిన మహామనీషి గణపతిముని. అతనియందు ఒక కాళిదాసుని, ఒక ఆదిశంకరులను జూచిన పండిత ప్రముఖులు మరల మరల అతని ప్రసంగములను వినవలెననిఉవ్విళ్ళూరుతూ ఉండేవారు. అతనిలో నవీనభావములను జూచినవిద్యార్థులు అతనుకనిపించినచాలు చుట్టుముట్టెడివారు. పెద్దల్లో పెద్దల్లాగ, పిన్నల్లో పిన్నలవలె మెలిగే గణపతి అందరికీ గురు తుల్యుడే. దక్షిణ భారత దేశమున అనేకమంది అతనికి శిష్యులయ్యారు. ఎంతోమందికి మంత్రదీక్ష నిచ్చారాయన. అతని సన్నిధిలో మంత్ర జపం ఏకాగ్రతతో జరిగేదని ఎంతో ప్రశాంతంగా ఉండేదని వారి శిష్యులు చెబుతూ ఉండేవారు.

ఈ విపరీత జనాదరణతో అతనికి ఏకాంతం భంగమైనది. తపస్సు సాగినదికాదు. తరచూ సాహితీ ప్రసంగాలతో సమయం జరుగుతూ ఉండేది. శిష్యుల బలవంతాన పాఠశాల సెలవు దినాలలో మరోసారి చెన్నపురి వెళ్ళారాయన. ఈసారి అతని బస దొరస్వామి అనే విద్యార్థి ఇంట ఏర్పాటు చేశారు. ఫలితంగా విద్యార్థి సమూహం ఆయన్ని చుట్టుముట్టింది.

"ఆచార్యా! మీరు ఆంగ్లకవుల రచనలు చదివియున్నారా? ఆంగ్లకవులపై మీ అభిప్రాయమేమి?" అని అడిగాడొక విద్యార్థి.

"నాకు ఆంగ్లమురాదు. అయినను మీరు క్లుప్తముగా ఏకథనైనా వినిపించిన అందలి రచనాపటిమను చెప్పగలను"నన్నారు గణపతి.

షేక్స్పియర్ వ్రాసిన "మెక్‌బెత్" క్లుప్తముగా వివరించారు దొరస్వామి.

"డంకన్నామ మహీపతి స్సమభవత్స్కాట్లాండు దేశేపురే"
అని ప్రారంభించి ధారా ప్రవాహముగా సంస్కృతమున ఆ కథను మధుర చమత్కార భావంతో గణపతి చెప్పుకుపోతూ ఉంటే అతని వాణీ ప్రవాహమునకు వారు ముగ్ధులైరి. ఆంగ్లమే గొప్పదనుకునే ఆ విద్యార్థులకు సంస్కృతభాష అతి మధురమైనదన్న విషయం అపుడు తెలిసింది. గణపతి అంతటితో ఆగక షేక్స్‌పియర్ భావములు ఎటువంటివో గూడ వారు ఆశ్చర్యం చెందేలా వివరించారు.

ఆ సాయంకాలం పండితవర్యుడు శ్రీ శ్రీనివాసశాస్త్రి అధ్యక్షతన తిరువళ్ళిక్కేణిలో పండిత సభ జరిగినది. ప్రముఖులైన హాలాస్య నాథ శాస్త్రి, నీలమేఘశాస్త్రి, వేదం వెంకటరాయశాస్త్రి ప్రభృతులు పరీక్షకులు కాగా సమస్యాపూరణములు చేయవలయునని గణపతి శాస్త్రి నాదేశించిరి. గణపతియు వేదిక నలంకరించి పరీక్షకు సిద్ధమయ్యెను. సమస్యలను ఒకటి వెనుక మరియొకటిగా ఇచ్చిరి. గణపతి అతిసులువుగా వాటిని పూరించెను. ఇక సమస్యలు కరువయ్యెను. సమస్యనిచ్చుటకు పరీక్షకులకు సమస్య అయ్యెను "వాసిష్ఠ మహాశయా! మీరు మాకు సమస్యలు లేకుండా చేశారు" అన్నారు వెంకటరాయశాస్త్రిగారు. ఈ చమత్కారోక్తికి అందరూ నవ్వారు.

గణపతికి మోసం తెలియదు. అవధాన కార్యక్రమాలలో కూడా మోసం ఉంటుందన్న విషయం మైలాపూర్ సభలో అతనికి తెలిసింది. నారాయణ సుదర్శనుడు అనే మహాపండితుడు ఆ సభకి అధ్యక్షత వహించాడు. పోటీ ఒక కవికి లేఖకునికి మధ్య జరిగింది. అందు కవి గణపతి. అతనిని రుక్మిణీ కళ్యాణ ఘట్టము శ్లోకరూపంలో ఆశువుగా చెప్పమన్నారు. గణపతి కిది నల్లేరుపై బండివంటిది. అతి త్వరితగతిని శ్లోకములు చెప్పనారంభించారు. లేఖకుడు అతి వేగంగా వ్రాయునట్లు నటించి గణపతిని "తరువాత తరువాత"

యని తొందర చేశాడు. కొంత సమయానికి మోసం జరిగిందని గ్రహించిన గణపతి వ్రాసిన శ్లోకములను చదువుమని లేఖకుని కోరారు. అతడు వెంటనే కొన్ని శ్లోకములు చదివాడు. అవి గణపతి చెప్పినవి కావు. ఆ శ్లోకముల శైలిని బట్టి నారాయణ సుదర్శనుని రచనలని శ్రోతలకు తెలిసింది. వెంటనే సభ్యులు ఆగ్రహించారు. అధ్యక్షులవారిని లేఖకుని దుయ్యబట్టారు. చివరకు లేఖకుడు ఓటమిని ఒప్పుకున్నాడు.

తరువాత వ్యస్తాక్షరి పరీక్ష జరిగినది అందునూ మోసమే. సాధారణముగ శ్లోకం నందలి అక్షరములు కత్తిరించబడి వాటిపై క్రమసంఖ్య వేయబడి ఒక్కొక్కటిగా పృచ్ఛకునకు ఈయబడును. అప్పుడు క్రమసంఖ్యనుబట్టి ఆఅక్షరములను జ్ఞప్తియందుంచుకొని అవధాని శ్లోకము చెప్పును. వాసిష్ఠునకు అటులగాక కత్తిరింపబడిన అక్షరములన్నియు ఒక్కసారి ఈయబడెను. అక్షర క్రమమును బుద్ధియందు చేర్చుకుని చెప్పుట, ఒక్కసారి అన్ని అక్షరములిచ్చిన కష్టము. అయిననూ ఏక సంథాగ్రాహి అయిన గణపతి సభికులు అభ్యంతరం తెల్పిననూ వాటిని గ్రహించిచూచి శ్లోకమును అందరూ ఆశ్చర్యబోవునట్లు వెనుకనుండి ముందుకు చదివి మరల ముందు నుండి వెనుకకు చదివెను. సభయందు కరతాళధ్వనులు మ్రోగినవి.

తరువాత గణపతి ఆదేశ్లోకమునకు వ్యాఖ్యానము జెప్పుచూ అందుగల అసాధు ప్రయోగములను దోషములను జెప్పి కవిని విమర్శించెను. ఆశ్లోకము వ్రాసిన కవి నారాయణసుదర్శనుడగుటచే అతనికి చురక తగిలినను మిన్నకుండెను. చివరిగా తన ఉపన్యాసమును ముగించుచూ వాసిష్ఠుడు ఆశ్లోకరచన యందలి విశిష్టతను పొగిడి అధ్యక్షుని జూచెను. తాను మోసముజేసిననూ తన్ను ప్రశంసించిన వాసిష్ఠుని ఔదార్యమునకు సిగ్గుచెంది సుదర్శనుడు క్షమా

పిం వేడికొనెను. పిదప అసమాన ప్రతిభాశాలియైన గణపతికి సన్మానము జరిగినది.

ఈ విధముగా మద్రాసునందు సాహితీ సభలు ముగించుకొని అరుణాచలము చేరుకున్న గణపతికి కొలది దినములలోనే వేలూరు నందలి క్రిష్టియన్ కళాశాలలో తెలుగు పండిత పదవికి పిలుపు వచ్చినది. చెన్నపురి శిష్యులే దానికి కారకులు. వేతనము అధికమని వేలూరు వాసయోగ్యమని వారు అతనిని బలవంతము జేసిరి. ఫలితముగా గణపతి అరుణాచలము వదలి వేలూరునందు కాపురము పెట్టినాడు.

## 9. ఇంద్రసేన

శ్లో॥ శక్తాం దేవివిధే హ్యార్తానా మవనే ।
ఇంద్రస్యేవ భుజాం వాసిష్ఠస్య మతిమ్ ॥

[అమ్మా ఇంద్రాణీ ! ఆర్తినొందిన వారిని రక్షించుటకు నీవు ఏవిధముగా ఇంద్రుని భుజమును శక్తిమంతమొనర్తువో, వాసిష్ఠుని బుద్ధిని అట్లు శక్తిమంతము జేయుము]

శ్లో॥ భిన్నాం సంఘ సహస్రైః భిన్నాం శత్రుభరేణ ।
పాతుం భారత భూమిం మాతర్దేహి బలం నః ॥

[మాతా ! వేలకొలది సంఘములుగా విచ్ఛిన్నమై శత్రు భారముచే భిన్నరాలైన భారత దేశమును రక్షించుటకు నాకు బలమిమ్ము.] ఇంద్రాణీ సప్తశతి (గణపతిముని)

• • • •

సంపూర్ణముగా మనోనాశనముకలిగిపతరువాత కేవలము ఆత్మ తేజముతో వర్తించువారు జ్ఞానులు. వారియందు కోరికగానరాదు. ఒక వేళ కోరిక జనించినయెడల అదితక్షణమే సఫలమగును. వారియందు

ప్రసరించేశక్తి అతినిర్మలమైనఇంద్రశక్తి.మనంమామూలుగాచెప్పే శమము దమము మొదలైనగుణములు సహజమైన ఈశక్తియందు అంతర్లీనమై ప్రకాశించుచుండుటచేత మహర్షుల సన్నిధి శాంతి ధామమై యుంటుంది. భగవాన్ శ్రీ రమణ మహర్షివద్ద అశాంతితో కోరికల బాహుళ్యంతో వచ్చిన అనేకులు అన్నింటిని మరచి శాంతి చెందారంటే అతనిచుట్టూ ప్రభవలె వ్యాపించియుండే ఇంద్రశక్తి మహిమయే అని పెద్దలు అనేవారు. ఆత్మశక్తి ఈశ్వరశక్తి, ఇంద్ర శక్తి ఇవన్నీ ఒకేశక్తియొక్క పలునామములు. సంకల్ప మాత్రాన సృష్టినే తలక్రిందులు జేయు శక్తి కల్గియు, ఆశక్తిని కేవలము శాంతికై వినియోగించి, ప్రకృతితోను, జీవరాసులతోనూ మైత్రినే పెంచి అపర ఈశ్వర స్వరూపులై మెలిగే వెలిగే మహర్షుల సంతతికి చెందినవారు హైందవులు. వారి మతము బహు విశ్రుతము ఆస్తిక నాస్తిక వాదములు రెండింటికిని అందు చోటు గలదు. వారిమూల గ్రంథములైన వేదములు ఒకరిచే వ్రాయబడినవి కావు. పలు మహర్షుల దర్శనములు, విశ్వాసములు అందుగలవు. ఈ అనంత జీవన స్రవంతి వారికి ఒక సాధనాప్రక్రియ కాగా విశాల విశ్వ మొక శోధనాలయమైనది. వారిదృష్టి కేవలము వస్తు విజ్ఞానమునకే పరి మితము కాక వ్యక్తి విజ్ఞానమునకు గూడ ప్రాకినది. అనంత విశ్వ మును తన హృదయమునందు జూచువ్యక్తి వారికి అతిముఖ్యుడు. నైతిక నృక్పథములేని విజ్ఞానమును వారు హర్షించలేదు. అంతటి మహత్తరమైన హైందవజాతి ఆంగ్లేయుల పాలనలో బానిసత్వము నకు గురియై గమ్యము తెలియక తల్లడిల్లుచున్నది. వాసిష్ఠుని బాధించు సమస్య ఇది.

మనిషికి ధైర్యసాహసాలను ఇచ్చేది ఆధ్యాత్మిక దృష్టి. అంతర్ముఖుడైన సాధకుని వ్యక్తిత్వం స్వార్థచింతనకు అతీతమై

అహంకార వివర్జితమై ఔన్నత్య దృష్టిని చెంది ఉంటుంది. దేశమునకు అటువంటి వ్యక్తుల అవసరము ఎంతైనా ఉంది. అందులకు సామాజిక దృక్పథముతో గూడిన ఆధ్యాత్మిక శిక్షణా కేంద్రములు అవసరమై యున్నవి. బుద్ధుని నాస్తిక వాదముతో దేశము అస్తవ్యస్తమైనపుడు, మండన మిశ్రునివంటి విపరీత కర్మాచరణ మూఢాచారములు అధికమైనపుడు ఆదిశంకరుల వారు అద్వైత ప్రబోధము ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేశారు. శంకరపీఠములను స్థాపించారు. అరీతిగనే నేడుకూడా వేద విజ్ఞాన బోధన అవశ్యకమైయున్నదని గణపతిముని తలచారు. (అతని ఈ సంకల్పబలమే మహాచార్యుడైన భగవాన్ శ్రీరమణ మహర్షిని దేశమునకు పరిచయము చేయుటకు దోహదము చేసిందనవచ్చును) అందులకొక పటిష్ఠమైన సంస్థను స్థాపించాలనునది అతని సంకల్పము.

మూర్తీభవించిన బ్రహ్మ వర్చస్సు, కాంతివంతమైన నేత్రములు, ముఖమునందు దివ్యత్వము గోచరించుచుండ, అడుగులు వేయుచూ వేలూరు క్రిస్టియన్ కళాశాలయందు పదవీస్వీకరణ కొరకు ప్రవేశించిన గణపతిమునిని జూచి అప్రయత్నముగా లేచి చేతులు జోడించి హిందువుల పద్ధతిలో నమస్కరించాడు ప్రిన్సిపల్ చాంబర్లీ. కళాశాల చరిత్రలో ఇదియొకవింత "అతనిలో నేను క్రైస్తవ ప్రవక్త 'జీసస్'ను చూశాను" అన్నాడతను.

మతప్రచారము ఆంగ్లేయులకు పెట్టిన విద్య. తమ అధికారమును వారు అందులకే వినియోగించిరి. బైబిల్ నందలి సూక్తులు క్రైస్తవ మత విశిష్టత ఇత్యాదులు ఏదో ఒక విధముగా పాఠ్యాంశములలో కాలేజీయందు కనపడెను. ఆంగ్లేయులకుగల గౌరవము భారతీయుల కుండెడిదిగాదు. సంస్కృత భాషగాని హైందవజాతి

గొప్పదనముగాని తెలియని విద్యార్థులు ఆంగ్లమును గౌరవించు చుండిరి. తెలిసిన విద్యార్థులు భయముచే వారల ననుసరించు చుండిరి. ఈవిధముగా విద్యాకేంద్రములు మత ప్రచార భవనము లగుట వాసిష్ఠునకు నచ్చలేదు. విద్యాస్థానములు జ్ఞానబోధకుగాని మత ప్రచారమునకు గాదని, మతముల కతీతమగు జ్ఞానము స్వతంత్ర వాతావరణమునందే లభించునని అటువంటి వాతావరణమును కాలేజీయందు తేవలయునని అతడు ఉపాధ్యాయులకు విద్యార్థులకు చెప్పుచుండెను. అంతటితో ఆగక హైందవుల విశిష్టత, వేద సంస్కృతి యొక్క గొప్పదనముపై ఉపన్యాసములిచ్చు చుండెను.

కొందరు క్రైస్తవులు అతనిని సమీపించి "శాస్త్రిగారూ! బైబిలు చదివిన మీకు అందలి గొప్పదనము క్రైస్తవ మతము యొక్క గొప్పదనము తెలియు" ననిరి.

"క్రీస్తుపై నాకు గురుభావము గలదు. ఆంగ్లభాషను నేను గౌరవింతును బైబిలు నందలి సూక్తులవలె ఇతర మత గ్రంథము లందుగూడసూక్తులుగలవు. అవివ్యక్తివికాసమునకై వ్రాయబడినవి. బైబిలుపై మీకుగలభక్తి ఇతరమత గ్రంథములపై ఏల ఉండరాదు? విజ్ఞానమే ప్రధానమైనచో అన్ని గ్రంథములను చదువవలయును. అందులకు బైబిలొక్కటి చాలదు. ఇతర మతములందు మంచి భాష్యములు లేవా? మేము భారతీయులము మాది వేద సంస్కృతి కేవలము ఒక వ్యక్తి యొక్క సాధనాబలమువల్ల ఏర్పడిన మతము కాదది. వేదములు అనేకుల విశ్వాసముల సమష్టి సంపుటి. సంకుచిత భావములకు అందు తావులేదు. మీరు మాదేశము వచ్చియుంటిరి. మాధర్మమును విశ్వసించుట మీకుమేలు. అటులగాక మమ్ము

దూషించుచుంటిరి. ఇది మీకు న్యాయమా? మాకు మాభారత భూమిపై అత్యంత విశ్వాసము గలదు. మా జాతి సంస్కృతిమాది. దానిని నిరసించుట మీకు వివేకముకాదు" అని గణపతిముని గంభీరముగ పలుకవారు నిశ్చేష్టులైరి.

నానాటికి గణపతి ప్రవచనములు విద్యార్థులయందు చైతన్యమును తెచ్చినవి. వారు భయభ్రాంతులను వదలి ఉత్తేజితులైరి. కాలేజీ ఉపాధ్యాయులైన శివసుబ్రహ్మణ్యము, సర్వేపల్లి నరసింహము (ప్రణవానందుడు) మొదలగు వారు గణపతుల వారి శిష్యులైరి. ఉత్సాహవంతులైన విద్యార్థులతో గణపతి ఒక సంస్థను స్థాపించారు అదియే 'ఇంద్రసేన'. హిందువులు ఈశ్వరార్పిత కర్మయందు విశ్వాసము గలవారు గాన అటువంటి దృక్పథంతో గూడిన సంస్థ ఇది గాన 'ఇంద్రసేన' యను పేరును గణపతుల వారు సూచించారు. ఇందు ఆధ్యాత్మిక చింతనతో బాటు సంఘసేవా దృక్పథం ఒక భాగంగా యుండేది. ఈ క్రింది భావములకు సంస్థ అంకితమైనది.

(1) విద్యాబోధన మత ప్రచారమునకు అతీతమై యుండవలయును.

(2) భారతీయుల విశ్వాసములను అణగద్రొక్కే అధికారము ఆంగ్లేయులకు లేదు.

(3) వేద విజ్ఞానము ప్రజలకు చాటి చెప్పవలయును.

(4) జ్ఞానసముపార్జనకు అందరూ అర్హులే. ఇందు కుల, మత, వర్ణ వ్యత్యాసము లుండరాదు.

(5) ప్రతి వ్యక్తి అంతర్ముఖుడై ధ్యాన నిష్టలో అంతర్గత ఇంద్ర శక్తిని జాగృతము చేయవలయును. మంత్రదీక్ష జప

తపములు పాటించుట ద్వారా సాధ్యము. విద్యయందిది అంతర్భాగము.

ఈ సంస్థయందు వేద విజ్ఞానబోధ ప్రాధాన్యము వహించెను. నాటి ఋషికుల నాగరికత, స్త్రీ, పురుషుల సమానత్వము, కర్మాచరణయందు నిస్వార్థత ఇత్యాదులు పాఠ్యాంశములుగా నుండెను. గణపతి ప్రవచనములతో విద్యార్థులకు హైందవ సంస్కృతీ విశిష్టత తెలియుచుండెను. పుష్కలముగా దైవశక్తిని సంపాదించి, దైవానుగ్రహము పొందనిదే, దేశమునకు స్వాతంత్ర్యము తెచ్చుట కష్టమనియు, అటుల స్వాతంత్ర్యము వచ్చిననూ అది అట్టే కాలము నిల్చుట కష్టమనియు ఆర్థిక పారమార్థిక స్వాతంత్ర్యములు పొందుట ఆవశ్యకమనియు గణపతిముని తలచియుండెను. అందుచే అతడు విప్లవాత్మక మార్గమును ముందుగా అవలంబించక వ్యక్తి ఔన్నత్యమునకై ప్రణాళిక తయారు చేసెను "ఇంద్రో విశ్వస్యరాజతి" అను ఏకపద గాయత్రీమంత్రము దీక్షగా సభ్యుల కీయబడినది. "ఉమాం వందే మాతరమ్" అనునది వారి నినాదము. అఖిల జగన్మాతయైన "ఉమ" యొక్క స్వరూపమే భారతమాతయని ఈసంస్థ భావించెడిది.

గణపతిముని నాయకత్వంలో అనేకులు ఇందు సభ్యులైరి. ఇంద్రసేనయొక్క శాఖలు అతిత్వరలోనే మద్రాసు, చిత్తూరు పరిసర ప్రాంతములందు స్థాపించబడినది.

ఇదిఆధ్యాత్మిక సంస్థవలె వ్యాప్తిచెందినప్పటికీ, దేశభక్తి దేశ స్వాతంత్ర్య నినాదము లిందుగలవు గాన బ్రిటిష్ పాలకుల నిఘా గణపతులవారిపై బడినది.

# 10. రేణుకా దర్శనము

శ్లో॥ యః కుణ్డలీ పట్టణ రాజధానీ
మాలోకతే కామపి కృత్తమస్తామ్ ।
నిస్సార మానంద కళావిహీనం
సంసారమేతం సజహాతి బుద్ధ్యా ॥

[కుండలీ పట్టణము రాజధానిగా గలదియు, ఛేదింపబడిన శిరస్సు గలదియు చెప్పుటకు శక్యముకానిదియు అగు రేణుకాదేవిని దర్శించిన భక్తుడు సారములేనిదియు ఆనందమను మాటలేనిదియూ నగు జనన మరణ రూపమగు ఈ సంసారమును బుద్ధిచేత విడచి విరక్తుడగును.] —ఉమా సహస్రము గణపతి ముని.

• • • •

వేలూరునకు సమీపమునగల పుణ్యక్షేత్రము 'పడైవీడు' ఇది కమండలు నదీతీరమున గలదు. దశమహా విద్యాత్మికయు, దేవతలచే పూజింపబడునదియు పరశురాముని జననియు అగు రేణుకాదేవి ఇచట వెలసియున్నది. పాముపడగను తమిళమున "పడై" అందురు "వీడు" అనగా గృహమని అర్థము. కుండలీ పురము అనునది ఈక్షేత్రము యొక్క సంస్కృత నామము. ఇంద్రీ శక్తి యొక్క మరియొక నామము కుండలినీశక్తి. ఇది శరీరమున మూలాధారము నందు అణగి యుండును. యోగులు ఈ శక్తిని జాగృతము చేసి సహస్రారమునకు లేపెదరు. అప్పుడాశక్తి పడగ విప్పిన పామువలె వీణాదండం (వెన్నెముక) నుండి లేచి శిరస్సు చేరునట. పామువలె లేచు శక్తి గాన దీనిని కుండలినీశక్తి అందురు. యోగులయందు ఇది వ్యక్తమైనచో కపాల భేధమగును. అందుచే దీనిని చిన్న మస్త అని

అందురు. కావున రేణుకయే చిన్నమస్త. ఆమెకుండలినీ విద్యకు అధికారిణి.

1906 వ సంవత్సరము నందు దేవీనవరాత్రి పూజలు జరుగుచుండగా గణపతి తన భార్యాపుత్రులతో ఈ క్షేత్రమునకు వచ్చెను. దర్శన మాత్రమున ఆదేవీ తత్త్వమును గ్రహించి అచట తపమాచరించి వరము పొంద సంకల్పించెను. డిశంబరు నెలలో కళాశాల సెలవు దినములందు మరల ఈ క్షేత్రమునకు వచ్చి మండల దీక్ష బూని ఘోర తపమాచరించెను. 39 దినములు గడచినవి. తపోదీక్షచే ఆహార నియమితుడై యుండుటచేత అతని శరీరము కృశించినది కాని తనువునందలి కుండలినీశక్తి మాటిమాటికి జాగృతమగుచుండుటచే సహజకాంతులచే ముఖము ప్రకాశించుచుండెను. ఆరోజు తాను సంకల్పించిన దీక్షకు ఆఖరిదినమైయుండెను. అర్ధరాత్రి ఆలయమునందు ధ్యాన నిరతుడై యున్న అతని వెన్నెముకయందు అకస్మాత్తుగా నొప్పి కలిగినది. గణపతి ఆ నొప్పిని తట్టుకొనలేక శవాసనమున పరుండి ధ్యానము సాగించుచుండెను. అంతట అనుకోని రీతిలో అతని శరీరము తాళవృక్ష ప్రమాణము పెరిగినది. కింకిణీ స్వనములు వినిపించినవి. అందెలు ఘల్లు ఘల్లు మన పెదవుల చిరునగవుల తొణికిసలాడ ముగ్ధమోహన రూపవతియైన రేణుక అతనిముందు నిలచినది. పుత్రవాత్సల్యముతో గణపతిని జూడ ఆమె చూపుల యందలి దయామృత తరంగములు గణపతి హృదయము సోకి తప్త హృదయమును చల్లార్చినవి. కండ్లలో నీరు ద్రవించుచుండ చేతులతో ఆమె చరణములు తాకి గణపతి ఇట్లు నివేదించెను.

[illegible] భాహి వివిధాకృతి మతీద్విజ సమూహే
పాహిగతిహీన మఖిలేశ్వరి ! కులం నః ।
దేహి బహుకాల భజకాయ వరమేతమ్
పాహి నగ నందిని ! యశః శశివలక్షమ ॥

[అమ్మా నగరాజతనయా ! మా ద్విజకులంలో మంచి భావా [illegible]ంచు గతిలేని మా భారతకులాన్ని రక్షించు. చిరకాల సేవ [illegible] ఈ వరములు నిమ్ము భక్తుల రక్షించు దానవను నీ [illegible] కొనుము.]

[illegible] వారయతి ఘోరతర పాతక సమూహమ
వర్ధయతి ధర్మమపి శర్మ కరమన్తే ।
కింకర జనస్యన కిమాపహతి భవ్యమ్
శంకర పురంధ్రి ! తవపాద పరిచర్యా ॥

[శంకర భామినీః నీపాదసేవ ఘోర పాతకములను నివా[illegible] ధర్మవిజయమును చేయును. భక్తులకు సర్వమంగళము [illegible]ప్పును.]

భక్తుని హృదయ నివేదన ఆ కరుణామూర్తిని కరిగించి [illegible]. అభయ హస్తముతో గణపతిని ఆశీర్వదిస్తూ "లెమ్ము ! [illegible] !" అని పలికినది. నొప్పితో పరుండియున్న గణపతి [illegible]పై [illegible]చినది. ఆ చల్లని తల్లి కరస్పర్శతో అతని యొడలు [illegible]ంప విద్యుత్తు శరీరమునందు ప్రాకినట్లైనది. నడుమునొప్పి [illegible]మైనది. అతడులేచి ఆమెకు నమస్కరించినాడు. ఆలయము [illegible] పడమటి దిక్కునగల మారేడుచెట్టు వద్దకు వెళ్ళారు వారు. [illegible] అచట వేదికపై కూర్చున్నది. గణపతి చరణముల వద్ద

కూర్చున్నారు. మరికొంత సేపటికి ఆమె లేచినది. గణపతియు ఆమెను అనుసరించాడు. అచటగల ఏకముఖ కుమారస్వామి ఆలయమందు ఆమె జొరబడి కుమారస్వామి హస్తమునందుగల శక్త్యాయుధమును గణపతికిచ్చినది. అచటనుండి తన గర్భగుడి జేరుకుని ఆమె మాయమైనది.

ఈ అద్భుత కటాక్షము గొన్న గణపతి విస్మయచిత్తుడై బాహ్యదృష్టికి వచ్చినవాడై కనులు విప్పినాడు. ఆశ్చర్యము! తాను మునుపటివలె పండుకొని యున్నాడు. కాని తొడపై అమ్మ గీచినచోట రక్తము స్రవించి యున్నది. భగవతి అనుగ్రహమునకు సంతసించి మరల ధ్యానమగ్నుడైనాడు.

మరల అదే దృశ్యము! అదే అనుభవము! ఈసారి భగవతి కుడితొడను జీరినది. ఉత్తరదిశగా నడచి, గర్భగుడి ప్రవేశించి అంతర్ధానమయినది.

మర్నాడు ఉదయముననే లేచి భగవతీ కటాక్ష కౌశలమునకు ఆనందము చెందినవాడై కుమారస్వామియొక్క శక్త్యాయుధమును అమ్మ ఇచ్చిన వైనమును దివ్యాస్త్ర లబ్ధిగా భావించి, వేలూరునకు పయనమయ్యాడు గణపతి.

• • • •

## 11. ఉద్యోగ విరమణము

శ్లో॥ కిన్ను సుకృతం మయాకృత మఖిలేశ్వరి కింతపస్తప్తమ్।
క్రీడయసిమాం ప్రతిక్షణమానంద సుధానిధావంతః ॥

[అఖిలేశ్వరి! నేను ఏమిసుకృతము నొనర్చితినో, ఏతపము

నాపేరించితినో నన్ను ప్రతిక్షణమూ ఆనందామృత సాగరాంతర మున క్రీడింప జేయుచున్నావు.]

—ఉమాసహస్రము (గణపతిముని)

• • • •

రేణుకా దర్శనానంతరము మంత్రసిద్ధి నొందిన గణపతి మహామంత్రేశ్వరుడైనాడు. భువనేశ్వరి, తార, నండాదేవి, కాళి ఇత్యాది అనేక రూపాలలో దర్శనమిచ్చిన జగన్మాత రేణుకా రూపమునందు అతని యందలి కుండలినీశక్తిని ఉద్దీపింపజేసి ఆనందామృత సాగరమందు అతనిని నిరంతరము క్రీడింపజేయ సాగినది. ఆమె అతనికి పిలిస్తే పలికే దేవత అయినది. అంతేకాదు అతని కుటుంబమునందు ఈనాటికీ ఆమె పిలిచిన పలికేదేవతయే! గణపతికి మంత్రోపదేశముజేసి, శ్రీవిద్య నేర్పించి, దేవీకటాక్ష ప్రాప్తికి దారిచూపిన గురువు నృసింహశాస్త్రి గావున గణపతి తన తంత్రియందు ఎల్లప్పుడూ గురుభక్తినే ప్రకటించేవారు.

"నీవు తపముజేయుము ఈశుడు నీకగుపించి 'నిన్ను నీవు తెలిసికొనుము' అని చెప్పును" అను శ్రీరమణ మహర్షి వచనములు ఇచట గమనార్హములు. మంత్రసిద్ధి చెందిన గణపతికి తపస్సిద్ధి చెందు సమయము ఆసన్నమైనది. రేణుక కుమారస్వామి హస్తము నందలి వేలాయుధమును గణపతి కిచ్చుట యందలి తాత్పర్యమిదియే. గణపతి యది గ్రహించినాడు.

కుమారస్వామి పార్వతీ పరమేశ్వరుల చిన్నితనయుడు అని పురాణగాథలు చెప్పుచున్నవి. అతడు వైశ్వానరుడు, హృదయ గుహయందు వర్తించువాడుగాన 'గుహుడు' అనునది వేదదర్శనము. "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"

అను గీతా వచనములందుగూడ ఈ తత్త్వార్థము గూఢముగా గాన నగును. తన్ను తెలిసిన వాడు సర్వమునూ తెలియగలడు. కోలాహలయుతమైన భారతావనియందు ఈ తత్వార్థ ప్రచారణావశ్యకత ఎంతైనా గలదు. గణపతి కోరికయూ అదే ఆనాటి అదిశంకరులు గూడ చాటిచెప్పినదిదియే. కావున అటువంటి గురుదర్శనము ద్వారా ధ్యేయము సిద్ధించుననని రేణుక గణపతికి సూచించినది. కాశీయందు దుర్గామందిరయోగిగూడ స్థూల శిరస్సు'' అనువాని దర్శనము ద్వారా నీకు తపస్సిద్ధియగునని చెప్పియున్నారు. హృదయ నిష్ఠయందుండువాడే స్థూలశిరస్సు గలవాడగును. కావున ఇదియును గుహావతారుడగు యోగి యొక్క దర్శనమగుననియే సూచించుచున్నది.

సూచనలన్నియు బాగుగనేయున్నవి: అందులకై యెటు బోవుట ? ఎచట వెదుకుట ? మహామంత్రేశ్వరుడైన గణపతి యువివేకియా ? భారము రేణుకకే వదలి ఆమె చరణారవింద సేవ నిత్యము జేయుచు యథాప్రకారము తన అధ్యాపక వృత్తి నెరవేర్చుచుండెను.

02-11-1907 నాడు రాత్రి మూడవ ఝాము నందు మరల యొక విచిత్ర ప్రేరణము కలిగినవాడై గణపతి చలించెను. ఆరోజు భగవతి కటాక్ష రసానుభూతియందు కనులు మూసి పరుండియుండ అకస్మాత్తుగా, ధవళ వస్త్రధారి యైన యొక పురుషుడు "నేను దేహము చాలించుచున్నాను. నాతరువాత దేశక్షేమ నిరతికై ఉద్యమమునల్పు బాధ్యతనీది లెమ్ము! తపోయాత్ర సాగింపుము" అని పలికి మాయమయ్యెను.

మర్నాడు ఆల్కాటు దొర మరణవార్త పత్రికలయందు ప్రకటింపబడినది. ఇతడు 1882 లో అమెరికా యందు జన్మించి

నప్పటికీ, భారతీయుల ఆధ్యాత్మిక తత్త్వ భావములచే ఆకృష్టుడై 1878 సంవత్సరమున భారత దేశమునకు వచ్చి "దివ్యజ్ఞాన సమాజము" స్థాపించి శ్రేష్ఠమైననీతిని ప్రజలకు బోధించెను. జగత్కళ్యాణమునకై ఉపకరించిన మహాపురుషులలో ఇతడొకడని గణపతి విశ్వసించి యుండెను.

శ్లో॥ ఇతరోభాగ్యశాలీ రమణీయైః ప్రసంగైః ।
వితనోతిస్వజాతిం జగతి శ్రేష్ఠ నీతిమ్ ॥

[భాగ్యశాలియైన ఇంకొకడు (ఆల్కాటుద్వార) రమ్య ప్రసంగములచేతను జాతిని శ్రేష్ఠమైన నీతిమంతులను జేయును]

– ఇంద్రాణీ సప్తశతి గణపతిముని

అతనిని గణపతిముని శ్లాఘించిన వైనమిది.

ఇందిరసేనలో కొందరు విద్యార్థులు చదువులు మానేసి దేశసేవ పేరుతో విపరీత ధోరణులు ప్రారంభించారు. విప్లవ నినాదాలు లేవనెత్తారు. దీనితో వారితల్లి దండ్రులు ఆందోళన చెందినవారై గణపతి మునిపై కాలేజీ ప్రిన్సిపాలుకు ఫిర్యాదు చేశారు. ప్రిన్సిపాల్ హారన్ ద్వార గణపతిని హెచ్చరించారు. సమయానికై ఎదురుచూస్తున్న గణపతిముని తన పదవికి రాజీనామాచేశారు.

భార్యవిశాలాక్షి గర్భవతి. రేణుకాదర్శనము చెందినతరువాత ఆమెకూడ మంత్రసిద్ధి చెందిన యోగినివలె కనపడ సాగెను. ఆమెను "భగవతి విశాలాక్షి" గా గణపతిముని పేర్కొన్నారు. తపమునకై అరుణాచలమునకు వెళ్ళ దలచి తన భార్యకెరిగించుటకై గణపతి ఆమెను సమీపించారు.

"విశాలా" ప్రేమతోకూడిన గణపతి పిలుపు ఇది.

ధ్యానమునందు అర్ధనిమీలిత నేత్రురాలైన ఆయోగిని భర్త పిలుపు విని కండ్లు విప్పి అతనిని జూచినది.

గణపతి : నాయందు మరల తపోప్రేరణ కలుగుచున్నది. ఉద్యోగము వదలితిని. అరుణాచలం పోవ సంకల్పించి యున్నాను. నీ యనుజ్ఞ కావలయును.

విశాలాక్షి : (సంతోషవదనయై) సరే వెళ్ళిరండి.

గణపతి : నీవు కుమారునితో కలువరాయి వెళ్ళుట మంచిది.

విశాలాక్షి : వద్దు. నాకు ఇచట ధ్యానము ప్రశాంతముగా సాగుచున్నది, మీరు తిరిగివచ్చువరకు మేము ఇచటనే యుండెదము.

శాతంజేరి రామస్వామి అయ్యరు కుటుంబీకులైన సుబ్రహ్మణ్య శాస్త్రి కళ్యాణ రామశాస్త్రి అను ఇద్దరు సోదరులు గణపతి ఇంటనే యుండి చదువుకొనుచుండిరి. అందు సుబ్రహ్మణ్య శాస్త్రి గణపతి విశాలాక్షుల ప్రేమనుపొంది వారిచే "అప్పశాస్త్రి" యని పిలువబడుచుండెను. వారా బాలకునికి పుత్రవాత్సల్యము జూపి "నీవు మాదత్తపుత్రుడ" వని జెప్పుచుంటిరి. ఫలితముగా ఆ ఇరుకుటుంబములు ఏకమైనవి. "అమ్మను తమ్ముని జాగ్రత్తగా జూచుకొనుము" అని భార్యాపుత్రులను వారల కప్పగించి, ప్రతి నెలాఖర్చుకు కావలసిన సొమ్ము భార్యకు పంపవలసినదిగా తండ్రి నృసింహశాస్త్రికి లేఖ వ్రాసినవాడై గణపతి 1907 వ సంవత్సరమున కార్తీక మాసారంభమునందు తపమునకై అరుణాచలమునకు బయలుదేరెను.

# 12. కదలని రథం కదిలింది

శ్లో॥ "స్మరణ మాత్రమునసె పరముక్తి ఫలద
కరుణామృత జలధి యరుణాచలమది"

— భగవాన్ శ్రీ రమణులు

• • • •

అరుణాచలమునందు బ్రహ్మోత్సవములు జరుగు రోజులవి. జ్యోతిర్లింగ స్వరూపుడైన అరుణేశుని అవతార తత్త్వమును చాటుచూ పదిరోజులపాటు ఈ ఉత్సవాన్ని జరుపుతారు. కార్తీక మాసమునందు కృత్తికా నక్షత్రము ప్రవేశించిన రోజు పదియవ రోజగును. ఆరోజు అరుణగిరిపై బ్రహ్మాండమైన జ్యోతి వెలిగించెదరు. ఈ దీప దర్శన తత్త్వమును భగవాన్ శ్రీ రమణులు ఇలా తెల్పియున్నారు.

ఈశరీరమె యౌదునేనను మదిని నాశమొనర్చి పూర్ణముగా
నాబుద్ధి హృద్వాసియగుచు, లోదృష్టివలనను అద్వైతమగు
నిజాహం జ్యోతి గాంచుటరయు. భ్రూమధ్యమౌ యరుణాద్రి
దీపదరిశెనమై యొప్పు తత్త్వార్థ మగును.

స్వామి అంబికతో సహా ఈ దివసములందు పదునాల్గు అంతస్తులు గల రథము నధిరోహించి పురమునందు ఊరేగును. అచలత తన నైజమైనప్పటికీ పదునాల్గు భువనాధీశుడైన అరుణేశుడు పురమున చలుడై దిరుగు వేడుకను జూచుటకు ప్రజలు తండోపతండములుగ వచ్చెదరు. ఈపండగ దినములందు అలంకార శోభితమై యొప్పు అరుణాచలము భూకైలాసమువలె చూడముచ్చటగ నుండును.

గణపతి ఈఉత్సవ దినములందు అరుణాచలము చేరుకొనెను. ముందుగ అరుణేశుని దర్శనము చేసికొని అంబిక ఆశీర్వచనము పొంది మిత్రుడగు వాసుదేవశాస్త్రి సహాయమున ఊరికి చివరగల మరకత శ్యామలాంబ గుడి (పచ్చైయమ్మన్ కోయిల్) జేరి అచట తపస్సు చేయ సంకల్పించెను. వాసుదేవశాస్త్రి అతనికి ఆహారవసతి చేకూర్చెను.

మొదటిరోజు కడు దీక్షతో తపస్సమాధి యందుండగా అర్ధ రాత్రి గర్భాలయమునుండి మధురమగు నృత్య శబ్దము విన వచ్చినది. అరుణేశుడు నటరాజై తాండవించు సమయమది గాబోలు! అరుణగిరి మహాత్మ్యమును వర్ణిస్తూ అరుణాచలుని నటనా కౌశలమును భగవాన్ శ్రీ రమణ మహర్షి ఇట్లు తెలిపియున్నారు.

> "అచలమై తన శక్తి యచలజ యరయ అచలత తన సైజ మయ్యె నాశివుడు కనక సభాంతరంబున తాండవించు అరుణాచలాన దానచలత నెగర అంబిక యతని యందణగి శమించు".

మధురతరమైన నృత్యనాదము చెవులకు విందు కలిగించు చుండగా ఆదిదంపతుల ఆనంద తాండవమును మనసున జూచు గణపతి సంతోష మొందుచుండెను. అంతట అకస్మాత్తుగా నృత్య నాదము లాగిపోయినవి. వికృత పురుషుల వికటాట్టహాసములు చెలరేగినవి. "ఆహా భారతదేశమున కెట్టి దుర్గతి పట్టినది! ఆది దంపతుల ఆనంద నిలయమై యొప్పుచు సత్పురుషుల తపో భూమిగా వేద సంస్కృతీ శోభలతో కళకళలాడు భారతదేశమును నేడు పీడించు దుష్టశక్తులివియేగదా! ఈదుష్టగణములను పారద్రోలు టకుగదాతన తపము! ఇవి ఇంకను నన్ను వెంటాడుచునే యున్నవి! అనితలచినవాడై మరకత శ్యామలాంబను మనసున ధ్యానించి,

శ్లో॥ ఉక్షరాజ వాహనస్య జీవితా దరీయసీ।
పక్షిరాజ వాహనాది వర్ణ్యమాన వైభవా।
కేకిలోక చక్రవర్తి వాహనేన పుత్రిణీ।
వారణారి సార్వభౌమ వాహనా గతిర్మమ॥

[వృషభ వాహనుడైన ఈశునికి ప్రాణేశ్వరి యైనదీ శక్తియో గరుడ వాహనుడైన విష్ణువాది దేవతలచే స్తుతింపబడు వైభవము కల్గినదై, నెమలివాహనుడైన కుమారస్వామిని పుత్రునిగా వడసి, గజములకు శత్రువైన సింహమును వాహనముగా గొన్న దుర్గనాకు గతియగుగాక!] అని స్తోత్రించిన వెంటనే అలజడి తగ్గి మనస్సు శాంతించినది.

మర్నాడు గణపతి తపఃస్థలమును మార్చనెంచి అరుణగిరి సమీపమున గల నైఋతి లింగస్థలమును జేరి అచట ధ్యానమున కూర్చుండెను. పురమునందు ఏడవరోజు ఉత్సవములు కడురమ్యముగా జరుగుచుండెను. భక్తజనుల పూజాదిసేవల నందుకొనుచు అరుణేశుడు రథారూఢుడై పురమునందలి అన్నధర్మశాల సమీపమునకు చేరుకొనెను. పూర్వము గణపతీ శివరాములను ఆదరించిన సత్రమిది. వారికి విందుభోజన సత్కారములు జరిపిన గణపతి ఆలయముగూడ అక్కడికి దరిదాపుననే యున్నది. బహుశా అరుణేశునకు తన జ్యేష్టకుమారుడు జ్ఞప్తికి వచ్చెనో ఏమో! అచట నుండి కదలనని మొరాయించాడు. పురప్రజలు తమ శక్తి నంతను వినియోగించి రథమును లాగిరి. కాని రథము కదలలేదు. మార్గమును జూచిన చాలా చదునుగా యున్నది. రథము ఎందుకు కదలలేదో కారణము తెలియులేదు. పూజలు అర్చనలు ప్రత్యేకముగా చేసి "అరుణాచలశివ" నామస్మరణములతో భజనలు గావించుచూ పలు ప్రయత్నములు జేసిననూ స్వామి ససేమిరా

కదలనన్నారు ! పుర ప్రజలలో భయాందోళనలు చెలరేగినవి. ఏదియో అపచారము జరిగెనని కొందరు, ప్రళయమురానున్నదని కొందరు భీతిచెందినవారైరి. అప్పటికి రాత్రి పదిగంటలైనది. చేసేదిలేక అర్చకులు రథము దిగిరి. స్వామివారి రథమును అచటనే విడచి అందరూ ఇండ్లకు పోసాగారు.

నైఋతి లింగస్థలమునందు గణపతి నిండు ధ్యానమున మునిగియున్నాడు. అకస్మాత్తుగా అతనిముందొక రూపము అగుపించినది. అతడు ఆలయము యొక్క పెద్దపూజారి పేరు రామలింగ శివార్చకుడు. అతడు గణపతినుద్దేశించి" ఆచార్యా ! పురమునందు అరుణేశుని రథం ఆగిపోయినది మీరు వచ్చినగాని కదలదని ఈశుడు చెప్పెను. మీరు దయచేసి రావలయును" అనిచెప్పినాడు గణపతి కండ్లు విప్పినాడు. ఎదురుగా ఎట్టి ఆకారము కనుపించలేదు. ఇది కలయా ! నిజమా ! ఇటూ అటూ జూచి గణపతి మరల కండ్లు మూసుకున్నాడు. అప్పుడు అశరీరవాణి ఇట్లు పలికినది "గణపతీ ! ఈశ్వరుడు నిన్ను పిలుచుచున్నాడు. లెమ్ము" వెంటనే గణపతి ఇది శివాజ్ఞగా నెంచి లేచి వడి వడిగా పురము జేరుకొని అన్న ధర్మశాల వద్ద రథమును జూచెను. అచటి వారిని అడిగి విషయము దెలిసికొనెను. అది రథచాలనము గావించు సమయము కాదు గావున వేకువను వచ్చుట యుచితమని యెంచి గణపతి తన తపః స్థలమునకు వెనుదిరిగెను.

శ్లో॥ కింయాగైరతి దారుణేన తపసా కింవాకి మభ్యర్చనైః
కింస్నానేన సుపర్వ పుణ్య సరితో నానావిధైః కింవ్రతైః।
కామారే! కరుణానిధే! పశుపతే! భూతేశ ! గౌరీపతే !
శంభోశంకర। చంద్రచూడ ! జగతాం నాథేతి నామావళీ॥

హే కామారే! కరుణాబ్ధే! పశుపతే! భూతేశ! గౌరీపతే! [illegible]ఘోశంకరా! చంద్రధామా! అనేక నామములతో నిన్ను జపించు వారికి యాగములు, ఘోర తపములు, అర్చనలూ, పుణ్యనదీ స్నానములు నానావిధ వ్రతములు ఏలనయ్యా! నీనామ సంకీర్తనమే సర్వఫలములు ఇచ్చునుగదా! అని అరుణేశుని అనుగ్రహమునకు భక్తి పారవశ్యము చెందిన గణపతి పలువిధముల అతని స్తోత్రగానముల కొనియాడుచూ, మర్నాడు ఉషోదయకాలమున రథము నధిరోహించి ఈశుని చరణ పంకజములదాకి భక్తితో హారతి గావించెను. ఈశునికంఠాలంకృతమైయున్న పూలమాలనుండి గణపతి ప్రార్థనలను అతడంగీకరించెనా యనునట్లు ఒక పువ్వు గణపతి శిరముపై బడినది. ఆ భక్తుని ఆనందమునకు మేరలేదు. భక్తితో శరీరము వణకినది. గొంతు గద్గదముచెందినది కండ్ల నీరు కారినది" జగదీశుడు మనలను అనుగ్రహించాడు. ఇకభయములేదు రథమును లాగండి" యని పురప్రజలనుకోరి తానుగూడా రథము దాని మోకునుపట్టి లాగాడు. ఆభక్తవ శంకరుని అనుగ్రహ లీలలు ఎంత గొప్పవి! రథము చెంగుచెంగున పరుగు దీసినది.

ఈ లీలను జూచి ఆశ్చర్యము చెందిన జనావళి గణపతిని చుట్టుముట్టారు. ఈశ్వరుని చరణార్చిత మనస్కుడై యున్న గణపతియందు ఆవేశము చల్లారలేదు. జనాన్ని తప్పించుకొని ఎవరితోనూ మాటలాడక సందుల గొందులబడి తిన్నగా గిరిని సమీపించి కొండనెక్కాడు. విరూపాక్ష గుహను చేరుకున్నాడు. అప్పటికి సమయం మధ్యాహ్నం రెండుగంటలు. గుహసమీపమున మౌనస్వామి చదునైన రాతిపై గూర్చుండి యుండెను. అతడు తన రాకకై ఎదురుచూస్తున్నట్లు మందహాస వదనుడై కన్పట్టెను. నిశ్చలచిత్తుడై, నిర్మల హృదయుడై, కనులనుండి చల్లనికాంతి

వెలుగుల వెన్నెలచిందించుచుండ శాంతి ధామమునందు వెలుగు నిండు చంద్రునివలెనున్న ఆమౌని దర్శనముతో గణపతి ఆవేశము చల్లారినది. పద్నైదేడునందు రేణుక తనకు అస్త్రము నిచ్చిన దృశ్యము కనులయందు గనపడినది. అచట తాను చూచిన ఏక ముఖ కుమారస్వామి రూపము అతనికి మౌనస్వామియందు గోచరించినది. "ఇతడే స్థూలశిరస్సు. నీకు తపఃసిద్ధి నొసగువాడు" అని చెప్పియున్న దుర్గామందిర యోగివాటలు అంతరాంతరాలలో మ్రోగినవి. ఒకేసారు వినయము, విధేయత, ఆర్ద్రత ఇత్యాది శరణాగతి లక్షణములు గణపతియందు చోటుచేసుకున్నవి. అతడు మౌనస్వామిని సమీపించారు. మోకాళ్ళపై నిలబడి ఆస్వామి కుడి పాదమును కుడిచేతితోను ఎడమ పాదమును ఎడమచేతితోనూ పట్టుకుని కంపూర్ణార్పిత మనస్కుడై

గీ॥ తపము - బహుశశ్చరితము, శాస్త్రములు అధీతములు, మహా మంత్రములు - జప్తములు, తపఃస్వరూప మెరుగనట్లుంటి త ద్రూపమెరుగు దీవు నను సత్కృప నను గ్రహింపుమయ్య" అని ప్రార్థించాడు.

మౌనస్వామి హృదయము కరుణాసముద్రమైనది. అతడు శరణాగత వత్సలుడయ్యాడు. దశాబ్దమునకుపైగా మౌనమునందే యుండిన ఆ మహనీయుడు తన మౌనము త్యజించాడు. అతని యందు వాణి ఉత్తేజభరితమై శబ్దచక్రాల రథమధిరోహింప అతని యందలి కదలని వాణీ రథం కదిలింది గణపతి శిరస్సుపై తన అభయ హస్తము నుంచారు.

ఆహా! సమయమెంత సుహిమాన్వితమైనది! ఇరువురు మహా యోగుల సమాగమమునకు ముహూర్తము కుదిర్చిన ఆఅరుణాచలు డెంత దయాళువు! అరుణాచలమున రమణోదయముగా

నున్న ఈ శుభదినము (కార్తీక శుద్ధ చతుర్దశి-అశ్వినీ నక్షత్రయుక్త సోమవారము. (18-11-1907) భారత చరిత్రయందు సువర్ణాక్షరములలిఖింపదగినదై యున్నది.

— X —

## 13. గురూపదేశము

శ్లో॥ వందే శ్రీరమణర్షే రాచార్యస్య పదాబ్జమ్ ।
యోమే దర్శయదీశం భాంతం ధ్వాంతమతీత్య ॥

అంధకారమున కావల ప్రకాశించు ఈశ్వరుని నాకుజూపిన ఆచార్య శ్రీ రమణమహర్షుల పాదారవిందములకు మ్రొక్కుదును.

శ్రీ రమణ చత్వారింశత్ (గణపతిముని)

* * * *

గీతోపదేశము జరిగిన స్థలము కురుక్షేత్రము. అచ్చట ఆచార్యుడు గోవిందుడు. ఉపదేశ గ్రహీత అర్జునుడు. రమణోపదేశం జరిగిన స్థలము అరుణాచలము. ఇందు ఆచార్యుడు శ్రీ రమణ మహర్షి కాగా గ్రహీత గణపతిముని అయ్యారు. ఈ రెండు ఉపదేశములు సంకట సమయమందే జరిగినవి. దేశమునందు దుష్ట శక్తులు వికటాట్టహాసము చేయుచూ, సత్యధర్మములకు కీడు తలపెట్టినపుడు దుష్టశిక్షణ శిష్టరక్షణ గావించుటకై గీతాచార్యుడైన వాసుదేవుడు మహాభారతయుద్ధము సంఘటితమగువరకు నాగి నరరూపధరుడైన అర్జునునకు ఈ ఉపదేశము జేసియున్నాడు. అటులనే రమణోపదేశము గావించు సమయమునందు ఆంగ్లేయుల పాలనయందు బానిసలై హిందువులు ఛాందసవాదులై నిగూఢమై యొప్పు బ్రహ్మజ్ఞాన తత్త్వమునకు దూరమై యుండిరి. శ్రీ రమణావతార విశేషమును శ్రీ గణపతి ముని ఇలా తెల్పిరి.

శ్లో॥ అధునాత్వం మహాభాగ బ్రహ్మజ్ఞానస్య గుప్తయే।
శాస్త్రజ్ఞానేన సంతృప్తైః నిరుద్ధస్యాగతోధరామ్ ॥

[ఓమహిమగలవాడా ! ఇప్పుడు శాస్త్రజ్ఞానముచే దృప్తిచెంది యనుభవజ్ఞానము లేనివారిచే చెరుపబడిన జ్ఞానానుభవము దెలిపి రక్షించుటకు భూమియందవతరించితివి.] —రమణగీత

1902 వ సంవత్సరములో మొదటిసారిగా శ్రీ శివప్రకాశం పిళ్ళెయను భక్తుడు మౌనస్వామిని జేరి కొన్ని ప్రశ్నలడుగగా అతను జవాబిచ్చిరట. అప్పుడప్పుడు ఒకటి రెండుసార్లు కొందరితో మాట్లాడినట్లు చరిత్రయందు గలదు. కాని గణపతిముని కలయిక అతని ప్రవృత్తియందు ఎంతయోమార్పు దెచ్చినది. అతనిని జన సముదాయమునకు దగ్గర జేర్చినది. సంపూర్ణముగ మౌనత్యాగము జేసి ఉపదేశామృతము పంచిపెట్టుటకై సంసిద్ధుడైనాడు.

శరణార్థియైన గణపతిమునికి హస్తదీక్ష ప్రసాదించినవాడై కమనీయమైన మాటలతో తమిళమున తపఃస్వరూపము నెరింగించాడు. గణపతి ఆనందమునకు మేరలేదు. అచటగల విరూపాక్ష గుహయందు ఆసీనుడై గురుసమక్షమున ధ్యానంచేసి ఉపదేశ సారాంశమును గ్రహించి సంస్కృతమున సమస్త జనులకు దెలియునట్లు బహిర్గతం చేశాడు. ఆ ఉపదేశవాణి ఇది :-

(ఎ) "అహమ్‌అహ" మితికుత ఆయాతి విచారయన్
ఉదయ స్థానేలీనం మనః తదేవతపః।
నేను—నేను అను భావము ఎచటినుండి వచ్చుచున్నది అని విచారించినమనస్సు ఉదయించినచోట లీనమగును. అదియే తపస్సు.

ఈ ఉపదేశము సమస్త జనులచేతను ఆచరణీయమైనది.

గణపతిముని మంత్ర జపముగూడ చేసితినని చెప్పియు న్నారుగదా! కావున ఉపాసనాపరులకు మౌనస్వామి ఇచ్చిన సూచనయిది.

(బి) జప్యమానస్య మంత్రస్య నాదః కుత ఉదేతీతి విచారయన్ ఉదయ స్థానేలీనం భవేన్మనః తదేవతపః ।

జపింబడుచున్న మంత్రము యొక్క నాదము ఎచటనుండి వచ్చుచున్నదని విచారించిన మంత్రమునుజపించు మనస్సు ఉదయించిన చోట లీనమగున. అదియే తపస్సు.

మౌనస్వామి అవతారపురుషుడన్న విషయమును గణపతి ముందుగానే గ్రహించియుండుటచేత, అతనికి సేవలుచేయుచున్న ఫళనిస్వామిని జూచి "ఈతనిపేరు నీకు తెలియునా"? యని ప్రశ్నించెను. "తెలియదుగాని పూర్వాశ్రమమునందు 'వెంకట్రామన్' అని అతను ఒకరికి వ్రాతపూర్వకముగా దెలిపియున్నారు" అని ఆతడు జవాబిచ్చెను.

గణపతిముని ఆ పేరుని సంస్కరించి "సత్యమును దెలిసిన వాడు, భగవంతుడు" గావున, భగవాన్ శ్రీ రమణ మహర్షి యను నామమున బిలచెను ఈ నామమే అతనికి సార్థకముగా నిలిచి పోయినది.

గణపతిముని తన్ను ఆశ్రయించినపుడు "నాయనా" యని సంబోధించి ఉపదేశము జేసినట్లు కొన్ని పుస్తకములందు వ్రాయ బడియున్నది. ఉడతలని కోతులనిగూడ 'మీరుమీరు' అనిమన్నించే భగవాన్ "వారు నాకంటె వయస్సున పెద్దవారు. నేను మన్నిస్తే అతను వప్పుకునేవారుకాదు. కావున నాయనా అని పిలచేవాణ్ణి" అని ఒకసారి చెప్పియున్నారు. భగవాన్ అలా చెప్పినప్పటికీఈ పేర్లు రెండూ నారాయణ అష్టాక్షరిలోనివి అని శ్రీమతి పప్పువిశాలాక్షిగారు

తాను వ్రాసిన "వాసిష్ఠ విజయం" అనుగ్రంథంలో వ్రాసియు న్నారు. ఆతత్వాన్ని గూడ తెల్సుకుందాము.

"గణపతి మునీంద్రులు ఒకానొక దివ్య ప్రేరణమున భగవాన్ రమణ మహర్షి యొక్క పాదములను బట్టి గుంజగనే అతనిలో బాహ్యమును మరచి అంతర్ముఖమై వెలుగుచున్న చైతన్యాగ్ని బిగిసిపోయిన కంఠనాళముల నుండి మొట్టమొదటి సారిగా "నాయన" అను సంబోధన రూపమున ప్రవహించెను. ఆ సంబోధన "ఓం నమోనారాయణాయ" అను అష్టాక్షరీ మంత్రము నందలి నా, య, న అను అక్షర రూపమున వెలువడెను.

శ్లో॥ ఆపోనారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః
'అయనం' తస్యతాః పూర్వం తస్మాన్నారాయణః స్మృతః॥

నారములు అనగా ఉదకములు. ఆయనము అనగాస్థానముగా గలవాడని బాహ్యార్థము. చరాచర స్వరూపముగ నుండు శరీరము లని నరశబ్దార్థము. 'అయన' అనగా ఆశ్రయుడు, అంతర్యామి నియామకుడు, సర్వాంతర్యామి యని అర్థము.

సన్యాసికి జ్ఞానమే లక్షణము. ఫలాపేక్ష లేక భగవదర్పణ బుద్ధితో తపస్సు చేసిన యెడల నయ్యది చిత్తశుద్ధికిని, తన్మూల ముగా జ్ఞాన నిష్ఠాపర్వతకు, మోక్షమునకు కారణమగుచున్నది. ఈ యర్థము ననుసరించి సాక్షాత్‌స్కందాంశ సంభూతుడు శివుడు అగు రమణుడు గణపతిని మహాగణాధిపత్యాం శకలవాడుగా సృష్టి, స్థితి, లయకారకుడు అగు విష్ణువుగా గుర్తించి 'ఓం నమోనారాయణాయ' అను అష్టాక్షరీ మంత్రము నుండి నాయన అను అక్షరత్రయమును గుర్తించి "నాయన" యని సంబోధించెను. 'నాయన' యనిన గణపతియను అర్థము తమిళమునగలదు. రమణ అనుఅక్షరములతో 'రమణ' నామమేర్పడెను.

వారి నామములు విచిత్రముగ "ఓం నమోనారాయణాయ" అను మంత్రము నుండి రమణ-నాయన అక్షరములతో స్థిరబడినవి. ఈవిధముగా 'నాయన-రమణ' అను నామములతో ఈ తపోధనులు చరిత్రయందు కృష్ణార్జునులవలె స్థిరముగ నిలచిపోయిరి.

• • • •

## 14. శుభసంకల్పము

శ్లో॥ దివ్యం ఘనతేజః కుర్వన్ ధ్వనిమంతః।
సంపశ్యదశేషం మూర్తిః ప్రణవాత్మా ॥

[అందరిలోను ధ్వనిని కల్పిస్తూ జగమును వీక్షించు దివ్యమగు తేజమే ప్రణవాత్మ. బ్రహ్మాండములో అవ్యక్త నాదమును కలిగిస్తున్న తేజమే ప్రణవము. అదే శక్తీశ్వరుల దేహము]

-ఉమాసహస్రము-గణపతిముని.

• • • •

సంకల్పం ఉన్నంతవరకు ద్వైవానికి రూపం ఉంటుంది. అది నశించిన అద్వైవం అపురూపం అవుతుంది. కావున సగుణం నిర్గుణం అనేవాదన మాని రెండింటా అద్వైవాన్ని స్మరించి ధ్యానించి, తన్మయత్వం చెంది ఆనందించాలన్నది నాయన అభిమతం. అందుకే అటువంటి వాదనలకు స్వస్తిచెబుతూ పైవిధంగా శక్తీశ్వరుల దేహాన్ని వర్ణించారాయన. గుర్వనుగ్రహంతో ఆత్మదర్శన సౌభాగ్యం చెందినప్పటికీ, సగుణ స్వరూప ఆరాధన నాయన విడనాడలేదు.

తనకు కలిగిన గురుదర్శన భాగ్యాన్ని తెలియజేస్తూ భార్య విశాలాక్షికి, తండ్రి నృసింహశాస్త్రికి ఉత్తరాలు వ్రాశారాయన.

మౌనస్వామి మాట్లాడుతున్నారన్న వార్త అతివేగంగా నగరమంతా ప్రాకడంతో ఆవింతను చూడాలని పురవాసులు కొండపైకెక్కారు. నాయన "మహాత్ములను పదిసంవత్సరముల కొకసారి చూడవచ్చు గాని మహర్షుల దర్శనం దుర్లభం" అని, అటువంటి మహర్షి అరుణాచలముపై ఉండుట అచటి నగరవాసుల అదృష్టమని "వారికి తెలియజేస్తూ మౌనస్వామిని "భగవాన్ శ్రీ రమణ మహర్షి" గా వారికెరింగించారు.

భగవాన్ దర్శనానికని వెల్లూరు నుండి విశాలాక్షమ్మ కుమారుడు మహాదేవునితోబాటు వచ్చినది. ఆమెను చూడగానే భగవాన్ నాయనతో "అమ్మ" వచ్చింది చూడండి అన్నారు. ఆ పిలుపుతో ఆనాటి నుండి అందరూ ఆమెను "అమ్మ" అని పిలచేవారు. గురుసన్నిధిలో కొన్నాళ్ళుండి ధ్యానం చేయాలని నాయన సంకల్పించారు. భగవాన్ వెంటనే కొండదిగువన గల ఒక గుహని నాయనకు చూపించి ఇది మీవసతికి బాగుంటుంది అన్నారు. అది మామిడిచెట్టు నీడన ఉండుటచే నాయన దానికి 'చూతగుహ' అని పేరు పెట్టారు.

"పుణ్యాచూత గుహాసేయం రమణేన మహర్షిణా ।
అధిష్ఠితా సేవకానాం పాపహంత్రీ విరాజతే ॥

రమణమహర్షి సేవకుల నివాసమైన పుణ్యప్రదమైన చూత గుహ సేవకుల పాపములను పోగొట్టునదై విరాజిల్లుచున్నది: అని ఆగుహను ముందు పూజించి అందు ప్రవేశించారు నాయన.

ఎచ్చమ్మాళ్ అనే భక్తురాలు భగవాన్‌కి రోజూ ఆహారం తెస్తూ ఉండేది నాయన వచ్చిన తరువాత ఆయనకుగూడ ఆహారం ఆమె తెచ్చుటచేనాయనకి నిశ్చలంగా ధ్యానంచేసే అవకాశంలభించింది. కొన్నాళ్ళు రమణ–గణపతు లిద్దరూ భిక్షాటనం కూడా చేసారు.

చూతగుహయందు మూడు రోజుల పాట అహం మూలా న్వేషణయందు ఏకగ్రీవంగా లీనమయ్యారు నాయన. సంకల్పాలకు అతీతమైన చిత్ ప్రవాహ వాహినిలో మునిగి తేలియాడుతుండగా తెల్లని పట్టుచీర ధరించి, ముత్యాల కిరీటం ముచ్చటగా శిరము నలంకరింప శుద్ధ మానసమును బోలిన తెల్లని పారిజాతమాలను, మెడలో ధరించి, వెన్నెలవలె స్రవించు చిరునగవులతో పారిజాత సుమములను పలుకరించుచు, ఆచిరునగవులు పూలతో మైత్రి జేయుచు మౌనభాషణ మొనర్చుచున్నవాయని దోపునట్లు శోణ నగీశ్వరియైన అపీతకు చాంబ నాయనముందు నిలబడినది. అమ్మ శరీరచ్ఛాయ తెలుపు ఆమె ధరించిన పట్టుచీర తెలుపు, మెడలోని పారిజాతములు తెలుపు, మౌనభాషణ జేయు నగవులు తెలుపు. ఆహా! రూపమునందు సగుణతత్త్వము, మౌనబోధయందు నిర్గుణ తత్త్వము ప్రకటించే పరాత్పరిని వర్ణించుటకు భాషలు గలవా! గణపతి హృదయం ద్రవించింది. కండ్లయందు కన్నీటిధార స్రవించింది. సహజకవి ఊరకుండలేదు.

శ్లో॥ సహాదరేణ యోవలక్ష పారిజాత మాలయా
గలస్థలీ విభూషయా ధ్వనిం వినైవ భాషతే।
మహేశ పుణ్యయోషితో మనోజ్ఞహాస ఏషమే
విభూతయే ప్రకల్పతాం విధూతయేచ పాప్మనామ్ ॥

మెడలో ఆభరణమువలె నొప్పు తెల్లని పారిజాత మాలతో గూడి ఆదరము కలిగి ధ్వని లేకుండునట్లు సంభాషించుచున్న మహేశ్వరుని పుణ్యస్త్రీయగు ఉమాదేవత యొక్క నిర్మలమగు నగవులు మాకు సంపదలిచ్చి, పాపములను దూల్చుగాక!

ఈ విధముగా ఆమెను స్తుతించి చరణములను తాకి నమస్కరించాడు. సుతుని ఆశీర్వదిస్తూ అభయ హస్తం జూపింది అమ్మ. అంతటితో నాగక "గణపతీ! రూపముల కతీతమైన ఆత్మదర్శన సౌభాగ్యం కలిగిందిగదా! మరి నేను వెళ్ళిరానా! అన్నది.

గణపతి : (వెంటనే) తవార్చనం నిరంతరం యతో విధాతు
మస్మ్యహమ్ ।
న విశ్వనాథపత్ని! తే విసర్జనం విధీయతే ॥

నిన్ను సదా ఆరాధించే సంకల్పంతో ఉన్నాను. ఆ సంకల్పాన్ని విడువలేను. కావున అమ్మా! నాకు నువ్వు ఎప్పుడూ కనిపించి తీరాలి.

అమ్మ : దివ్యదర్శనమనేది ప్రారబ్ధరీత్యా జ్ఞానులకు కలుగుతుంది. నీకు అటువంటి ప్రాప్తి ఈజన్మలోగలదు.మరివెళ్ళిరానా?

గణపతి : అలా వెళ్ళిపోతానంటే ఎలాగమ్మా! దేశసేవకై కంకణం కట్టుకున్న నాకు కర్తవ్యం బోధించు.

అమ్మ : సకల శాస్త్ర సమన్వితము, సగుణ నిర్గుణ వాదోపవాదముల కతీతము, మంత్ర తంత్ర వైదిక మతస్థుల కభిమతము అగు గ్రంథమును వ్రాయుము. అది దేశమునకు విజ్ఞాన దీపికయై వెల్గొందును.

గణపతి : (ఆనందముతో) అలాగేనమ్మా! ఇరువది దినములలో నిన్ను స్తోత్రం చేస్తూ వేయి శ్లోకములు గల గ్రంథము వ్రాయుటకు నాకు శక్తిని ప్రసాదించుము అన్నారు. తథాస్తు! అని ఆమె పలికినది.

శ్లో॥ అర్చనకాలే రూపగతా సంస్తుతికాలే శబ్దగతా ।
చింతనకాలే ప్రాణగతా తత్త్వ విచారే సర్వగతా ॥

[పూజ చేయునపుడు రూపము కల్గియు, స్తవమునందు శబ్దముగను చింతనమున ప్రాణశక్తిగనూ తత్త్వ విచారమున సర్వగతమునగు అంబికను స్తోత్రంచేస్తూ నాయన నమస్కరింప, ఆమె సుతుని ఆశీర్వదించి అదృశ్యమైనది.]



## 15. "ఉమాసహస్ర" మహాకావ్యరచనము

శ్లో॥ యేనామశాన్తిం పరమావహన్తో నామాని శీతాచల పుత్రికాయాః।
సంకీర్తయన్తో విజనేవసన్తి జయన్త తా తాదపితే జయంతి॥

[ఎవరు అన్నీ విసర్జించి పరమశాంత చిత్తంతో దేవీనామ సంకీర్తనం జేయుదురో వారు ఇంద్రునికన్న మిన్నయైన ఆనందాన్ని పొందుతారు.]

—ఉమాసహస్రము (గణపతిముని)



అనేక నామాలతో పరాశక్తి స్తుతింపబడుతూ ఉంటుంది. అయితే నాయన 'ఉమ' నామాన్నే ప్రత్యేకంగా ఎన్నుకొన్నారు. ఇందుకు కారణం లేకపోలేదు. 'ఉ' అనే శివునియొక్క మానశక్తి అనగా సృష్టిని కొలుచుశక్తి కాన ఆమె "ఉమ" అయినది. ఇది నాయన నిర్వచనము (ఓం శివస్య మానశక్తిఃమా) ఈశుడు అనగా "నేను" అనే అహం స్ఫురణతో సృష్టిని చేయువాడు అన్నమాట. "ఉమ" ఆతని పరిణామశక్తిగా జగతిని కొలుచుచున్నది. "జగత్తు" అంటే కనిపించే ఈలోకాలే కాకుండా, మనస్సు, బుద్ధి, అహంకారాదులు కూడా జగత్తు క్రిందే రావడంవల్ల ఈ శక్తి యొక్క అనుగ్రహంతో సాధకుడు పురోభివృద్ధి పొందవచ్చును. అంతేకాకుండా

ఈశునియందు శక్తియై యొప్పుశక్తి "ఉమ" పరాశక్తి యొక్క తాత్త్విక రూపం ఇదే. మహర్షులయందు ఈమె తపశ్శక్తిగా ప్రకాశిస్తుంది. నాయనకి ఈ శక్తి అనుభూతము కావుననే ఈ కావ్యానికి 'ఉమాసహస్ర' మని పేరు పెట్టారు.

సాధారణంగా ఒక కావ్యాన్ని శాస్త్రజ్ఞానంతో వ్రాయడంవేరు. అనుభవంతో వ్రాయడంవేరు అనుభవముతో వ్రాసిన గ్రంథము నందు దేవశక్తి నిక్షిప్తమై యుంటుంది. తాను ఈ గ్రంథాన్నెలా వ్రాశారో కావ్యకంఠులవారు తెల్పి యున్నారు :-

శ్లో॥ దర్శితం రమణ స్సర్షేర్యావద్వాక్యైర్మితాక్షరైః ।
యావచ్చపితృ పాదానాం విజ్ఞాత ముపదేశతః ॥
తంత్రేభ్యోవగతం యావత్ప్రాచామాచార శాసినాం ।
యావత్పరమ పుణ్యానుకులగోష్ఠిషు చ శ్రుతమ్ ॥
విదితం వివిధం యావదితిహాస విలోకనాత్ ।
యావద ప్యాత్మనాదృష్టం తపతావిపులం తపః ॥
అధికృత్య మహామాయాం భువనానామధీశ్వరీం ।
అత్రస్తోత్రే ప్రసంగేషు సమస్తం తత్ప్రదర్శితమ్ ॥

[శ్రీ రమణ మహర్షి యొక్క మితాక్షర వాక్యములచే నెంత వరకు దర్శనమయ్యెనో, పూజ్యనీయులైన తండ్రి యుపదేశము వలన ఎంతవరకు తెలియబడినదో ప్రాచీనుల ఆచార శాసనముల నుండి, తంత్ర శాస్త్రమునుండి ఎంత అవగతమయ్యెనో పుణ్య పురుషుల సభలయందెంత శ్రుతమయ్యెనో, భారత ఇతిహాసాది గ్రంధముల విలోకనము వలన వివిధ విషయము లెంత విదితమైనదో విపుల తపస్సువలన ఎంతవరకు చూడబడెనో భువనముల కధీశ్వరి యైన మహామాయ నుద్దేశించి ఆ సమస్తమును ప్రదర్శించితిని.]

ఈ విధముగా తన దర్శనముతో ఈ గ్రంథమును ఇరవై రోజులలో వ్రాయ సంకల్పించారు నాయన. ప్లవంగ నామ సంవత్సర కార్తీకబహుళ షష్ఠి మంగళవారంనాడు (అనగా 26-11-1907) మాతృగుహాయందు శ్రీ భగవాన్ మహర్షి సమక్షంలో వ్రాత ప్రారంభించారు. ప్రతిరోజా సాయం సమయమున తాను వ్రాసిన శ్లోకాలను భగవాన్ ముందు చదివి వినిపిస్తూ ఉంటే, వారిరువురితో పాటు అక్కడున్న శిష్యులుకూడా విని ఆనందించేవారు. ఇలా పారాయణం నిత్యం జరుగుతూ ఉండటంవల్ల చూతగుహదేవీ నిలయమైంది.

ఒకరోజు సాయంకాలం 7 గంటల సమయమున అతను చదివి వినిపిస్తున్న శ్లోకమిది:-

శ్లో॥ ఛిన్నాం భిన్నాం సుతరాం సన్నా
మన్నాభావాదభితః ఖిన్నామ్ ।
ఏతాం పాతుం భరతక్షోణీం
జాయే జిష్ణోః కురుమాం శక్తాః ॥

[ఓదేవీ! ఛిన్నాభిన్నమై క్షీణించుచు అన్నములేక అంతటను దుఃఖించు భారత భూమిని రక్షించుటకు నాకు శక్తినిమ్ము !]

ఇందు అన్నము లేకపోవుట అనగా శక్తిలేకపోవుటయని అర్థము అనగా భుజబలాన్ని బుద్ధిబలాన్ని ఇచట "అన్నము" అను పదజాలంతో చెబుతూ దేశమునందు అనగా భారతీయుల యందు భుజబలం బుద్ధిబలం లోపించుటచే భారతభూమి ముక్కలై భిన్నమై క్షీణించుచున్నది. కావున దేశమును రక్షించుశక్తి నాకిమ్ము అని ఇందు కోరబడినది.

అందరితోబాటు శ్లోకాన్ని వింటూ ఆనందిస్తున్న ఉమాదేవి ఆయన శ్లోకాన్ని విని చిన్న చమత్కారం చూపించింది. శ్లోకం

చదివిన తరువాత నాయనకి విపరీతంగా ఆకలివేయ నారంభించింది. వారికి అన్నం తేవల్సిన ఎచ్చమ్మాళ్ రాత్రి 8 గంటలైతేగాని అన్నం తీసుకురాదు. ఈ శ్లోకం చదివే సమయానికి ఎచ్చమ్మాళ్ బియ్యం పప్పు గిన్నెలలో పోసి పొయ్యిమీద పెట్టింది. అంతలో ఒక ముత్తైదువు అచటికివచ్చి "నాయనగార్కి ఆకలివేస్తోందట. నిన్ను వెంటనే అన్నం తెమ్మంటున్నారు" అని అంది. "ఇప్పుడేగా బియ్యం పప్పు పొయ్యిమీద పెట్టాను అది ఉడకాలిగా" అని ఎచ్చమ్మాళ్ చెప్పగా "ఉడికిపోయాయి! చూడు" అని చెప్పి ఆ ముత్తైదువ వెళ్ళిపోయింది. ఎచ్చమ్మాళ్ మూతలుతీసి చూడగా అన్నం పప్పు ఉడికి సిద్ధంగా ఉన్నాయి. ఆమెకి ఆశ్చర్యంవేసింది. వెంటనే ఆహారం పట్టుకొని గుహకి పంపి విషయ మెరిగించగా, పరమేశ్వరి చూపిన చమత్కారానికి నాయన భగవాన్ నవ్వుకున్నారు.

పదిరోజులపాటు విరామం లేకుండా వ్రాయడంతో నాయన కుడిచేతి బొటనవ్రేలు వాచి గాయమైంది. అయినప్పటికీ ఖాతరు చేయకుండా నాయన వ్రాత సాగించారు. 10వ రోజునాటికి 700 శ్లోకాలు పూర్తయ్యాయి. ఇంకా 300 శ్లోకాలు వ్రాయవలసియుంది. చేతిమీద పుండు పెద్దదై సలుపూ పోటూ పెట్ట నారంభించింది. నాయన మరి వ్రాయలేకపోయారు అతని పరిస్థితి చూచి శిష్యులు ఆందోళన చెందారు. మిగిలిన 300 శ్లోకాలు ఎలా ఒక్కరోజులో వ్రాసి ముగించడం అన్నది సమస్య. నాయన ముఖంలో ఎటువంటి ఆందోళన కనుపించలేదు. అన్నీ విస్మరించి పరమశాంతితో దేవిపై భారముంచి కార్యం సాగిస్తున్నారు వారు. కావున భారం పరమేశ్వరిదె.

ఆ రోజు రాత్రి పుణ్యకోటియను నొక వైద్యునకు స్వప్నం లో నొక బ్రాహ్మణుడు కనిపించి "అరుణగిరిపై గల మునీశ్వరుని చేతికి గాయమైనది పోయి చికిత్స చేయుము" అని చెప్పినాడట. మర్నాడతను కొండపైకెక్కి భగవాన్‌ని సమీపించి అతని చేతి వైపు చూడసాగాడు. విషయము నెరింగిన భగవాన్ "గాయము నాకు కాదు నాయనకి నాతో రమ్ము "అని వైద్యుని తోడ్కొని చూత గుహకి వచ్చారు. వైద్యుడు వెంటనే గాయమునకు శస్త్రచికిత్స చేసి కట్టుకట్టి నొప్పితగ్గుటకు మందిచ్చి వెళ్ళిపోయాడు.

చికిత్స జరిగినప్పటికీ చేతితో వ్రాయుట కష్టము కదా! నాయన శిష్యులు కొందరు అతనిని సమీపించి "మీరు ఆశువుగా శ్లోకాలు చెప్పండి మేము వ్రాస్తాము" అని అన్నారు. నాయన కొంచెం నీరసించియున్నారు. విశ్రాంతి అవసరమనిపించింది. అందుచే శిష్యులతో "రాత్రి 8 గంటలకు ఐదుగురు వ్రాయుటకు సిద్ధమైరంటే నేను శ్లోకములు చెప్పెదను" అని వారిని సమాధాన పరచి పంపి వేశారు. ఆరోజు మార్గశీర్ష శుద్ధ ఏకాదశి రవివారము (15-12-1907) గ్రంథము ముగించుటకు ఆఖరిరోజు. పుణ్యకోటి చికిత్స కారణంగా సలుపూ పోటూ తగ్గి నాయనకి కొంతఉపశమనం కలిగింది. రాత్రి 7-30 గంటలకు విరూపాక్ష గుహజేరి భగవాన్ మహర్షిని తోడ్కొని వచ్చారు. వారిని ఎత్తైన ఆసనంపై కూర్చోబెట్టి వారి పాదాలవద్ద తాను కూర్చున్నారు. అనుకున్నట్లుగా ఐదుగురు లేఖకులు కలము, కాగితములనుబట్టి నాయనచుట్టూ కూర్చున్నారు. సమయం 8 గంటలైంది. భగవాన్ కండ్లు మూసుకొని సమాధి స్థితిలోకి వెళ్ళారు. నాయన శ్లోకాల్ని ఆశువుగా చెప్పడం ప్రారంభించారు. ఐదు శ్లోకాల మొదటి చరణాన్ని ముందుగా వ్రాయుమన్నారు. తరువాత ఐదు రెండవ చరణాల్ని చెప్పారు. ఇలా ఒకే

సారి శ్లోకాలు ఒకేకాలంలో విభిన్న వృత్తాలలో వ్రాయబడుతున్నాయి. గంభీరమైన నిశ్శబ్ద వాతావరణంలో అనర్గళమైన కవిత్వధార మధుర స్రవంతియై ఆ పర్వత ప్రాంతంలో ప్రతిధ్వనించింది. ఎంతటి కవితావైభవం! ఎంతటి చమత్కృతి! చరిత్రలో కనీ వినీ ఎరుగని దృశ్యమిది.

సరిగ్గా రాత్రి 12 గంటలైనది. ఆఖరి ఐదు శ్లోకాలు ఒకేసారి లిఖింపబడ్డాయి. నాలుగు గంటల సమయంలో 300 శ్లోకాలు వ్రాశారు లేఖకులు. దీర్ఘమైన నిట్టూర్పుతో వారు వ్రాత ముగించి నాయనను జూచారు. నాయన ఈ లోకంలో ఉన్నట్లు లేరు. ఐదు నిమిషాలపాటు అచ్చట నిశ్శబ్దం తాండవించింది. అంతలో భగవాన్ కండ్లు తెరచారు "నాయనా! నేను చెప్పింది అంతా వ్రాశావా!" అన్నారువారు.

భగవాన్ పిలుపుతో భౌతిక దృష్టికి వచ్చారు నాయన. అతని కండ్లు చెమ్మగిల్లాయి. భక్తి ఆనందం రెండూ అతని ముఖాన అనిపించాయి. భగవాన్ చరణములను తాకి "చిత్తము మీరు చెప్పినదంతా గ్రహించి వ్రాయబడినది" అన్నారు నాయన.

ఈ గురు-శిష్యానుబంధం లేఖకులకు అంతుబట్టలేదు. నిజమే! ఇది అనుభవముతో తెలుసుకోదగినది. వ్రాతలకు మాటలకు అందనిది.

— X —

# 16. గజారోహణము

"రక్షణ నీ స్వభావమని బుక్కులు చూచిన తెల్లమయ్యెడున్
శిక్షణ రక్షణాదికము జీవుల చిత్తికిఁ జేర్చి నేర్పుతోన్
దక్షత జూపినాడవు సదాత్మమయుండవు నిర్గుణుండవై
రక్షక ! నీగుణార్చనయె రమ్యము యోగము పార్థసారథీ॥

శ్రీ వాసిష్ఠ మహాదేవశాస్త్రి.

• • • •

జ్ఞానులు అడవులందున్నను, పురములందున్నను వారి సన్నిధియందు సంపూర్ణ రక్షణ జీవులకు కలుగుచుండును. శ్రీ రమణ భగవాన్ సన్నిధియే ఇందులకు ప్రత్యక్ష నిదర్శనము. ఎన లేని చింతాసముద్రమునందు తల్లడిల్లినచో "శ్రీ భగవాన్ సన్నిధిని మూడురోజులుండి రమ్ము ప్రశాంతత కల్గుతుంది" అని వారిని రమణ సన్నిధికి పంపేవారట మహాత్మాగాంధీ. కేవలము సన్నిధి యందే అంతటి ప్రశాంతత లభ్యమైనపుడు, వారి చెలిమి ఎంతటి భాగ్యము కలుగజేయునో వేరుగా చెప్పనవసరములేదు. అతి దీనుడైన కుచేలునిగాచినది శ్రీకృష్ణునితో అతను చేసిన చెలిమియేగదా! కావుననే కాబోలు గురువు నాశ్రయించిన శిష్యులు, పరమశివుని గొల్చు భక్తులు. వారిని అర్చించి, సేవించి, పూజించి, ప్రేమించి, చెలిమింజేసి దూషణ భూషణాదులతో స్తుతించి తరించుచుందురు. తన వాత్సల్యమును గురువు శిష్యునకు చెలిమితో ప్రసాదించిన, అదేచెలిమితో శిష్యుడు గురువునకు సమర్పితుడై యొప్పుచుండును. జ్ఞానముతో గురుభక్తిని నాయన ప్రకటింప, బాలకుడైన మహాదేవుడు ఆ గురునితో ఆటలాడి, చెలిమిచేసి తన అజ్ఞాత భక్తిని ప్రదర్శించాడు. ఆ వింతగాథయిది.

ఇరువది రోజులు నిర్విరామంగా తపస్సు చేసి తన అనర్గళ కవితా ధారలో అతి ఉత్తమమైన అరుదైన స్తోత్ర కావ్యాన్ని ప్రజలకందజేసిన నాయనయందు ప్రకటితమైన తపోగ్ని జ్వాలకు శీతల సేవ అవసరమని గ్రహించి భగవాన్ వారిని కొండపై గల "సప్తర్షురి" యను ప్రాంతానికి తీసుకువెళ్ళారు. అచట వారం రోజుల పాటు విశ్రాంతి తీసుకున్నారు. నాయన ఉమాకటాక్షంవల్ల అతనికి దూరశ్రవణసిద్ధి THOUGHT READING, (ఆలోచనల నాకళించే శక్తి) దూరదృష్టి ఇత్యాది సిద్ధులు లభించాయి.

నాయన ఉత్తమ గ్రంథాన్ని వ్రాశారన్న వార్త దశదిశలా వ్యాప్తిచెందింది. అంతేకాకుండా నూతనముగా శ్రీ భగవాన్ రమణ మహర్షి పేరున తెల్పబడిన మౌనస్వామి మాట్లాడుతున్నారని కూడా అందరికీ తెలిసింది. దానితో ఇరువురినీ చూడాలని భక్తులు గుంపులు గుంపులుగా రాసాగారు. ఉమాసహస్రాన్ని చదివి వ్యాఖ్యానించి గ్రంథపుయొక్క గొప్పదనాన్ని చెప్పవలసిందిగా శిష్యులు పదే పదే నాయనను వేడుకున్నారు. వారు అందుల కంగీకరించి "మరకత శ్యామలాంబ సన్నిధి (పచ్చైయమ్మన్ కోవెల) "అందు లకు తగిన స్థలముగా నిర్ణయించి, దూరమునుండి వచ్చువారికి భోజనవసతుల నేర్పాటు చేయుమని నాయన శిష్యులనాదేశించారు. శిష్యులందుల కంగీకరించి అందరికీ ఆహ్వానములను పంపారు. విషయము తెల్సిన విశాలాక్షమ్మ కుమారునితో సహా వేలూరునుండి వచ్చినది. రాగానే వారిరువురు రమణులకు ప్రణమిల్లారు. భగవాన్ ప్రేమతో మహాదేవుని జూచి "ఏమిరా నేను గుర్తున్నానా?" అని అడిగారు. ఆ బాలకుడు సమాధానం చెప్పలేదు. ఎప్పుడో నాలుగేండ్ల వయస్సప్పుడు "అహంభో అభివాదయే" అన్న బాల కుడు వాడు గుర్తెక్కడుంటుంది. దూరంగా వెళ్ళి ఆడుకోసాగాడు. ఇంతలో ఎవరో భక్తులు స్వామీ ముందొకసారి వచ్చాము జ్ఞాపక

షున్నామా?" అన్నారు. జ్ఞప్తి లేక భగవాన్ ఊరుకున్నారు. కొంత సేపు వారు మహర్షితో ముచ్చటించి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళి పోగానే అంతవరకూ దూరంగా ఆడుకుంటున్న మహాదేవుడు మహర్షిని సమీపించి "ఆవచ్చినవాళ్ళు మిమ్మల్ని ఏమని అడిగారు?" అని ప్రశ్నించాడు "మేము మీకు జ్ఞాపకమున్నామా?" అని అడిగారని భగవాన్ చెప్పగా" అందులకు మీరు ఏమన్నారు?" అని మరల ప్రశ్నించాడు "లేదన్నాను" అని సమాధానమిచ్చారు. భగవాన్ వెంటనే "నన్ను మీరడిగితే అదీ ఇంతే" అని చెప్పి తుర్రుమని వెళ్ళిపోయాడు బాలకుడు. కుఱ్ఱవాని వింత చేష్టకి అందరూ నవ్వుకున్నారు.

నాయన కోరికపై తన నివాసాన్ని పచ్చెయమ్మన్ కోవెలకు మార్చారు భగవాన్. అమ్మా నాయనా తరచు పనిమీద ఊళ్ళోకి వెళ్ళివస్తూ ఉండేవారు. అటువంటి సమయంలో మహాదేవుడు భగవాన్ సన్నిధిలో ఆడుకుంటూ ఉండేవాడు. బాలకుడు సహజంగా స్ఫురద్రూపి అందుకు తోడుగా నిడుబాటి గిరజాల జుత్తు ఉండేది. ముఖానికి విభూతి పట్టాలు, బొట్టుపెట్టి చేతిలో వెదురుబద్దలతో చేసిన బాణాతో భగవాన్ ముందుగా ఆడుతూ ఉండేవాడు. చూడడానికి బాలయోగిలా కనిపించే బాలకుడు వచ్చే పోయే వారిని కూడా ఆకర్షిస్తూ ఉండేవాడు. భగవాన్ వానితో ఎక్కువగా మాట్లాడుతూ ఉండేవారు. "దేవన్" అని పిలచేవారు. అలా పెరిగింది వారి చెలిమి.

ఒకరోజు వానిని వీపుపై కూర్చుండబెట్టి కోనేటిలో ఈత ప్రారంభించారు భగవాన్. సగం ఈదేసరికి దేవన్‌లో హుషారు పెరిగింది. "చల్ చల్ హైహై" అని వీపుపై ఊగుతూ గుఱ్ఱపుస్వారీ ప్రారంభించాడు. భగవాన్‌కు ఈదడం కష్టమైంది "దేవన్ కదలకు"

అని చెప్పారు. వాడు వింటేగా ! ఎక్కడవాడు నీటిలోపడి మునిగి పోతాడేమోనని భగవాన్ గాభరాపడ్డారు. అతికష్టంమీద గట్టెక్కారు వారు "ఏమిటీతుంటరితనం ! ఈతరాదు సరికదా నన్ను అల్లరి పెట్టావే" అని వానిని మందలిస్తే" మీకు ఈతవచ్చుగా నాకు రాక పోతేఏం" అన్నాడు దేవన్ అమాయకంగా. దేవన్ నిజజీవితంలో కూడ ఈ మాట నిజమే అయింది. పరమ భక్తుడైన ఈ శిష్యుడి జీవితాన్ని కొసవరకు భగవానే ఈదారనిపిస్తుంది.

దేవన్ కొంటెతనం అంతటితో ఆగలేదు. భగవాన్ కోవెలలో కూర్చుని యుండగా వారిని జూచుటకై కొందరు వచ్చారు. దేవన్ వారి నటకాయించి" భగవాన్ మౌనంలో ఉన్నారు. ఇప్పుడెవర్తోనూ మాట్లాడరు. మీరు ఏమైనా అడగదల్చుకుంటే నన్నడగండి చెబు తాను" అని పట్టుబట్టాడు. ససేమిరా వారిని వదలకుండా భీష్మించిన యాబాలకుడు "దేవన్ వారిని వదలు" అని భగవాన్ చెబితేనేగాని వారికి ప్రవేశం లభించలేదు. వారు కొంతసేపు భగవాన్‌తో ముచ్చ టించి" ఈ బాలకుడు సందేహాలను తీర్చుతానంటున్నాడే ! అంతటి ఘనుడా !" అని మహర్షిని అడిగారు. మహర్షి నవ్వుతూ దేవన్‌వైపు జూచి" అవును సమర్థుడే" అన్నారు.

ఆ వచ్చిన వారి ఆనందమునకు మేరలేదు. బాలకుని ఎత్తి కుదేసి తమతో తీసుకుపోయారు. చీకటిపడే వేళకు దేవన్ కోవెలకు వచ్చినవాడై "భగవాన్ గజారోహణం చేసాను వారునన్ను ఏనుగుపై ఎక్కించి ఊరేగించారు" అన్నాడు సంతోషంతో.

ఆహా ! జ్ఞానుల లీలలు వర్ణనాతీతముగదా ! వీపుపై కూర్చుని గుఱ్ఱమునెక్కినట్లు సంతోషించిన బాలకుని ఏనుగుపైనే ఎక్కించారు భగవాన్ !" చాలా అలసిపోయావ్ ఇకపడుకో" అనితనతొడలపై వాలిన దేవన్‌ని లాలిస్తూ ఉండగా, అమ్మ నాయనపురము నుండి

వెనుదిరిగి వచ్చారు. జగదాచార్యులైన గురువు వారి కరుణా స్రవంతిలో సేదదీర్చుకుంటున్న కొంటెతనయుడు ఏమీ ఎరుగని వానివలె గప్‌చిప్‌గా అమ్మ నాయనలకు స్వాగతం పల్కారు.

— × —

## 17. ఇతడు కార్తికేయుడు

శ్లో॥ అజ్ఞాజుషే రమణాయను దాతుం
మానవ వేషధరాయ గుహాయ ।
శోణనగార్ధ తనోబహు దుగ్ధం
మాతరపీత కుచేహ విభాతి ॥

[అరుణ గిరీశుని అర్ధాంగీ ! మానవ వేషధారియైన నీకుమారుడ (గుహుడు శ్రీ రమణ మహర్షికి నీవు స్తన్యాన్ని పూర్తిగా ఇస్తున్నావు. అతడు నీ అంకమందుండి పాలు త్రాగుచున్నాడు. అలా నీకుమారునికి పాలు ఇవ్వడానికే నీవు ఇచట అపీతకుచాంబగా వెలసియున్నావుకాబోలు].

– ఉమాసహస్రము. గణపతిముని.

• • • •

అనుకున్న సమయానికి ఉమాసహస్ర కావ్యపఠనం ప్రారంభించారు నాయన. శ్రీ భగవాన్ వారి సమీపాన ఉన్నతమైన ఆసనంపై కూర్చున్నారు. ముందుగా ఫలశ్రుతిని ఇలా వివరించారు.

శ్లో॥ యదిగాయన్ని మంగ్రంధసుత్తరే దాపదఃకృతీ
మహిమాస మహేశ్వర్యాః శీఘ్రం స్యాదున్నతం నమే ।
అయమం బాపర ప్రీతే రుద్రాగోవాఙ్మయాకృతిః
అర్థః కశ్చిదనేనా పినతాం యది మయార్జితమ్ ॥

పుణ్యాత్ముడీ గ్రంథమును పఠించినచో ఆపదలను దాట గలడు. అ విషయము పరమేశ్వరియొక్క మహిమయేగాని నా గొప్పతనముగాదు. ఈ వాఙ్మయాకృతి అంబయొక్క పాదము లందు నాకు గల ప్రీతి సంబంధమగు ఉద్గారము. కావున సత్పురుషులకు దీనివలన ఏమైనా ఉపకారము కలిగినచో నాకది విజయమే:

మధురాతి మధురమైన వాణి నాయనదై దిగంతాలకు ఎగ బ్రాకినది. దివినుండి సమస్త దేవతలు అచటికి దిగివచ్చారు. అచటి వాతావరణం దివ్యమయింది. ఆహా: అందరిలోనూ ఒక ఆవేశం, ఆనందం, అనుభూతి: శ్రోతలు మంత్రముగ్ధులయ్యారు. అరుణగిరి కైలాసమయినది. గ్రంథపఠనం సాగుతున్నంతకాలం ఎవరికీ తెలియకుండానే ప్రొద్దుగడచిపోతూ ఉండేవి. శ్రోతలు ఏదో ఒక గొప్ప అనుభూతిని చెందుతూ ఉండేవారు. ఇక భక్తుల విషయం చెప్ప నక్కరలేదు. తమ భావాలతో అంబను జూచినవారు కొందరయితే ఆ పరాశక్తి స్వప్నదర్శనం పొందినవారు మరికొందరు. నాయన అందరికీ సాక్షాత్తూ "గణపతి"లా కనిపించారు.

నాయన శిష్యుడైన నారాయణ ఘనపాఠికి ఒకరోజు స్వప్నంలో అంబిక కనిపించి "ఏదీ ఉమాసహస్రంలో కొన్ని శ్లోకాలు చదువు" అన్నదట. అతడు చదవటం ప్రారంభించేసరికి 'అవిగావు' "గణపతయేస్తన ఘటయోః" అను శ్లోకాన్ని చదువు అన్నదట". ఘనపాఠి ఆశ్లోకం చదవగానే ఆమె నవ్వుతూ మాయ మయిందట.

శ్లో॥ గణపతయేస్తన ఘటయోః
పదకమలే సప్తలోక భక్తేభ్యః ।
అధరపుటే త్రిపురజితే
దదాసి పీయూషమంబ తత్వమ్ ॥

అమ్మా! గణపతికి నీవు స్తన్యమునందు అమృతము నిచ్చుచున్నావు. సప్తలోక భక్తులకు చరణ కమల మకరందామృతమును, కాంతునకు అధరము నందలి అమృతమును ప్రసాదించుచున్నావు.

మరునాడు శ్లోకముయొక్క భావాన్ని ఇలా గ్రహించిన ఘనపాఠి అంబికకు ఈశ్లోకము ఎందువలన ఇష్టమయిందని విచారించాడు. అప్పుడతనికి అర్థమయింది-నవద్వీపమునందు "నేను సొంత పుత్రుణ్ణి" (నేను నిజపుత్రుణ్ణి) అని చెప్పిన నాయన ఈ శ్లోకముద్వారా అంబిక తనకు స్తన్యదుగ్ధామృతము నిచ్చుచున్నదని దెల్పుచున్నారు. ఇటువంటి రచన నిజపుత్రునికే సాధ్యము. ఈ విషయమునే దేవత కలయందు దెల్పినది. అనగా నాయనయే "గణపతి" యని సంతోషించి తనకు కలిగిన దర్శన విశేషాన్ని శ్రీ రమణ గణపతులకు తెలియజేశాడు.

తన పెద్దకుమారుని ఇలా పరిచయం చేసిన ఉమాదేవి అంతటితో నాగలేదు. ఆ మర్నాడు ప్రాతఃకాలమందు మరియొక వింతను శిష్యులుచూశారు. శ్రీ రమణమహర్షి ధ్యానమునందుండగా నాయన అతని సమీపాన కూర్చుని యున్నారు. కొందరు శిష్యులు గూడ నాయనతో అచటనున్నారు. అకస్మాత్తుగా శ్రీ రమణభగవాన్ చుట్టూ ఒక చిత్రమైన వెలుగు కనిపించి అది అతనివెనుక ప్రభవలె నిలిచింది. అందుండి ఆరునక్షత్రాలవలె కాంతి పుంజములు లేచి భగవాన్ నుదిటిని ఆరుసార్లు తాకి మరల ప్రభయందు లీనమంకాగా, ఆ ప్రభాజ్యోతి క్రమక్రమంగా శ్రీ రమణులయందు లీనమైంది. అపుడు శ్రీ భగవాన్ నుండి "నేను ఎవరు" అనుమాట అస్పష్టముగా వెలువడినది. నాయన అది గ్రహించి ఆనందోత్సాహములతో "స్వామీ మీరు కార్తికేయులు" అని అన్నారు. వెంటనే వారి చరణ

ములకు సాష్టాంగ నమస్కారము జేసి అచటనున్న శిష్యులతో శ్రీ రమణుల అవతారతత్వం తెలియజేస్తూ :—

శ్లో॥ యానాయాత్ర న కేకినాం కులపతిః స్నానాయ న స్వర్ణదీ
పానాయక్షితి భృన్మహేంద్ర దుహితుర్న స్తన్యదుగ్ధామృతమ్।
గానాయ ప్రమథేశ్వరా స్సవయసో నైవాత్ర వీణాభృతో
వాసం శోణగిరౌ కరోషి భగవన్ క్రౌంచాద్రి భేత్తః కుతః॥

కుమారస్వామీ ! ఇచట ఆసనమునకై నెమలిరాజు లేడు, స్నానము చేయుటకై స్వర్గనదిలేదు, త్రాగుటకు పార్వతీదేవి చనుబాలు (అమృతము) లేదు, గానమునకై సమవయస్కులగు వీణాధరులుగానీ ప్రమథనాథులు గాని లేరు ! మరి ఈ అరుణాచలమునందేల నివసింతువు?

ఇలా పదిశ్లోకాలలో శ్రీ రమణులని స్తుతించారు. వారి యనుగ్రహంతో కార్తికేయ దర్శనంతోపాటు ఉపాసనామంత్ర దర్శనం కూడా పొందారు. "ఓం వచద్భువేనమః" అను ఈ మంత్రాన్ని "శ్రీ రమణగీత" లో తెలియజేసారు. స్తుతిశ్లోకాలు "శ్రీ రమణ చత్వారింశత్" లో గానవస్తాయి.



## 18. "కషః కాలస్య కారణమ్"

శ్లో॥ క్షాంతం కింమమదురితం, శాన్తంకిదేవి ! తేస్వాన్తమ్ ।
అనుగృహ్ణాసి విచిత్రం మామప్య పరాధినాం ప్రథమమ్ ॥

దేవీ ! నా పాపము సహింపబడినదా ! లేక నీహృదయము శాంతానురాగముతో నిండినదా ! అనేక అపరాధములు చేసినవారిలో

మొదటివాడనునేను! నాపై నీ విశిష్టానుగ్రహం కలుగుతోంది (ఆశ్చర్యం). —ఉమాసహస్రం. గణపతిముని.

• • • *

నాయన వ్రాసిన ఈ శ్లోకం కొంచెం ఆశ్చర్యాన్ని కలుగచేస్తుంది. తాను అపరాధులలో మొదటివాణ్ణి అని ఇందులో చెబుతున్నారు. అంతటి మహాతపస్వి అపరాధెలా అవుతారని అనుకుంటారేమో! "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్" అని సంస్కృతంలో ఒక నానుడి ఉంది. ఉదార చరితులకు ఈ జగత్తంతయు వారి కుటుంబమే అవుతుంది అని ఈ నానుడియొక్క అర్థం. వారిదృష్టి సమష్టి మానవాళిపై ఉంటుంది. అందరి కష్టాలు వారి కష్టాలే! అందరిపాపాలు వారిపాపాలే! అందరిలోను అనంత చైతన్యశక్తిగా ప్రకాశిస్తున్న పరాదేవత వారివారి అజ్ఞానం వల్ల తాపత్రియములలో చిక్కుకొని శాంతిలేక ఉండన్నమాట! కావున ఆమె హృదయమునందు శాంతము కలిగినచో పాపములు పోయినట్లే సమస్త మానవ కళ్యాణానికే తన తపస్సు. అందుచే మహాపరాధినైన నన్ను క్షమించగల్గిన నీవు భారతీయుల నందరినీ అనుగ్రహించగలవు అనే చమత్కృతి ఇందు గలదు. ఇది నాయన దేశసేవాతత్పరతకు, అతనియందలి మహాసత్త్వమునకు అద్దము వంటిది.

జగదాచార్యుడైన భగవాన్ శ్రీ రమణ మహర్షిని జగతికి పరిచయం చేసి, గొప్పదైన వేదాంత, తత్త్వ, స్తోత్ర గ్రంథమైన ఉమాసహస్ర కావ్యం వ్రాసిన తరువాత ప్రజలలో మూఢ నమ్మకాలను పెంచే పుక్కిటి పురాణములను సంస్కరించి ఆధ్యాత్మిక దృష్టిని పెంపొందించాలని, దేశ స్వాతంత్ర్య ఉద్యమంలోను మానవ పురోగతి యజ్ఞంలోను ఒక సమిధయై వెల్గాలని, శేషజీవితం

వసుధైక కుటుంబానికి అంకితమని తలంచిన నాయన గురువుని సమీపించి "ఇంకనూ సమాజసేవ జేయవలయుననునది నా సంకల్పము. అందులకు మీఅనుగ్రహశక్తి నాకుతోడ్పడును. మద్రాసునందు నా ప్రియతమ శిష్యులు పదేపదే రమ్మంటున్నారు. ఉమా సహస్ర విశేషాలు వారికి తెల్పుమని వేడుతున్నారు. మీరు అనుమతించిన నేను వెళ్ళి వచ్చెదను" అని వినయంగా వేడుకున్నారు.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అని గీతయందు చెప్పినట్లు విష్ణు అంశయందు జన్మించిన నాయన ఈశ్వర సంకల్ప చిత్తుడని ఎరిగిన భగవాన్ చిరునగవుతో నాయనకు తమిళమున హితోపదేశం చేశారు. అది అందరికీ ఉపయోగకరమని నాయన దాన్ని సంస్కృతమున శ్లోకరూపంచేశారు. ఆశ్లోకములివి:-

శ్లో॥ న్యస్యతాం భరః సకల జిత్వరే ।
కార్య సత్కరే జగదధీశ్వరే ॥

సకల లోకములను జయించి సత్కార్యములను జేయు జగధధీశ్వరిపై భారముంచుము.

శ్లో॥ నిత్యయాధియా నిహితయా స్వయం ।
స్థీయతాం త్వయాహృది పరాత్పరే ॥

హృదయమునందు నిశ్చలమైన పరమేశ్వరునియందుంచిన బుద్ధితో నీవు స్థిరముగా నుండుము.

శ్లో ॥ భావ నిర్ణయ ప్రభురసౌపుమాన్ ।
కార్యసాధనే భవతిశక్తిమాన్ ॥

భావ నిర్ణయమును జేయ సమర్థుడైన అతడు కార్యసాధనమందును శక్తిమంతుడే.

శ్లో॥ భూత భవ్యకృద్భువన భూపతిః ।
కారయే దయం కుశల కారిణః ॥

భూత భవిష్యత్తులను నడిపించు భువన భూపతి, మంచి కార్యకర్తలనుగూడ కల్పించును.

శ్లో॥ సాధ్య ముత్తమం సమయ తశ్చరేత్ ।
మాస్తు సంశయస్తవ విదాంమతే ॥

ఓ విద్వన్మణీ! సమయము ననుసరించి సాధ్యమైన ఉత్తమ కార్యమును (ఈశుడు) నడిపించును గావున కార్యమును ఈశున కర్పించి నీసంశయమును వీడి హృదయనిష్ఠుడవుకమ్ము. నీకు మంగళమగును.

శ్రీ భగవాన్ ఉపదేశామృతమిది. అతి శ్రద్ధతో నాయన దానిని గ్రహించి, తన శిష్యుడైన వాసుదేవశాస్త్రి వెంటరాగా, శ్రీ భగవాన్ అనుమతినొంది చెన్నపట్టణం బయల్దేరారు.

చెన్నపురిలో నాయనకి విశేషాదరణ లభించింది ఉమా సహస్ర కావ్యరచయితగా కాళిదాసుని దలపింప జేసిన నాయనను శ్రద్ధాభక్తులతో వారు సేవించారు. ప్రతిదినము నాయన ఉమా సహస్ర వైభవం చెబుతూండేవారు. అంతేగాకుండా నవీనకాలంలో అవతరించిన మహర్షి శ్రీ రమణులని, మత సంకుచితాల మధ్య శాస్త్ర జ్ఞానం మధ్య తల్లడిల్లే ప్రజలకు వారి దర్శనము ముక్తి దాయకమని, జ్ఞానప్రబోధం కల్గుతుందని తెలియజేస్తూ గురు ప్రశంస జేసేవారు.

ఒకనాడు ప్రక్కనేయున్న తిరువత్తియూర్ వెళ్ళారు నాయన అచట ఆది త్రిపుర సుందరీ దేవాలయముండుట జూచి ఆలయమునందు మాతను దర్శించి తన్మయత్వముతో స్తుతిస్తుండగా ఒక విద్యార్థి అతని చరణములను తాకి నమస్కరించాడు.

అమ్మ చరణాలపై మనసును లగ్నము చేసిన నాయన తన ధ్యానము ముగించుకుని, ఆ విద్యార్థిని ప్రేమతో కూర్చొను మని చెప్పి "నాయనా నీపరిచయమేమిటి?" అని ప్రశ్నించారు.

"ప్రభూ! నాపేరు కపాలిశాస్త్రి. స్వయముగా సంస్కృత భాషను నేర్చుకొనుచున్న విద్యార్థిని. మీస్తోత్ర పఠనమును విని అందలి భావ కవితా విశేషములకు ముగ్ధుడైనాను. మీరు కావ్యకంఠ గణపతి మునివర్యులని ఎరిగి, మహాకవి తపస్వియైన మీచరణసేవ ద్వారా ముక్తి సాధన లభ్యమగునని దలంచి మీయనుగ్రహమును గోరుచున్నాను" అని అతి వినయముగా ఆయువకుడు పలికినాడు.

నాయన ఐదునిముషముల పర్యంతము కండ్లుమూసి బాలకు నకు ఉజ్జ్వల భవిష్యత్తు కలదని గ్రహించి, ఒక్కసారిగా త్రిపుర సుందరీ ముఖారవిందాన్ని చూచారు. బాలకుని నిండుగా ఆదరించు మన్నట్లు ఆమె చిరునగవులు రహస్యభాషణ చేసాయి! ఆనందం వాత్సల్యం రెండూ అతనిలో చోటు చేసుకున్నాయి. కపాలిని అనుగ్రహించారు.

వారిరువురూ ఆలయ ప్రదక్షిణంజేస్తూ మూరుమూల చీకటి గదిలో గల ఒకనూతిని జూచారు. "ఇది మొదట కాళికా క్షేత్రము ఆమె ఏలనో అలిగి ఈ నూతిలో ప్రవేశించినదట" అని కపాలి ఆ నూతిని చూపించి కధ వివరించాడు. నాయన వెంటనే చమ త్కారంగా :-

శ్లో॥ కూపే విభాసికిల కోపవతీ త్రియామా
చారిణ్య శేష జగదీశ్వరి కాళి! భద్రే।
విభ్రాజదాది పురవాసిని దాసమాప
త్కాపాదు చంచయ పథాంబుజ భక్తమేతమ్ ॥

[అమ్మా ! కాళీ ! భద్రా ! ఆది పురవాసినీ ! నీవు అలిగి కూపములో ప్రవేశించి ప్రకాశించుచున్నావు అట ! రమ్ము ! వెలికి రమ్ము ! పాదభక్తుని ఆపద కూపమునుండి బయటకు తీయుము- అని పలికారు] ఈ చమత్కారానికి గురు శిష్యు లిరువురూ నవ్వుకున్నారు.

శ్రీ భగవాన్ రమణమహర్షి దర్శనానంతరము అవధానాలకు, కవితాగోష్ఠులకు స్వస్తి చెప్పారు నాయన. అతనియందు తపస్సు సహజమైన హృదయనిష్ఠకు అలవాటు పడ్డారాయన. సద్వస్తువు యొక్క దర్శనం సాధ్యతరం అనుటకు భగవాన్ ప్రత్యక్ష నిదర్శనంఅనేది అతనినమ్మకం. కావున ఉత్కృష్టమైనమానవతామతం, సమన్వయ దృష్టి, అహింసా తత్త్వం ఇత్యాదులు భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకు కావలసిన అస్త్రాలు. శ్రీ భగవాన్ వంటి ఆచార్యుని సౌలభ్యంతో అది సాధ్యమవుతుందని తలచారాయన. అందులకు తన కలాన్ని పదునుచేశారు. నవీన యుగంలో ప్రజలను ప్రభావితం చేసేవాడు కవి. సత్యాన్ని నిర్భయంగా చెప్పేవాడే కవి. నాయన అటువంటి మహాకవులలో ఒకరు.

కపాలి నాయన పూర్వవైభవాన్ని చూడాలన్న కోరికతో అతనిని బ్రతిమాలి వ్యస్తాక్షర పరీక్షకు అంగీకరింపజేశాడు. ఫలితంగా అనేకమంది పండితులు గుమిగూడారు. పలకపై 56 గళ్ళు నాలుగు వరుసలలో గీసి వానిలో వరస సంఖ్యలనువేసి వసంత తిలకమనే వృత్తంలో అక్షర క్రమమున శ్లోకాన్ని వ్రాయుమని కోరారు వారు. నాయన కలం పట్టగానే ఒక పండితుడు అక్షరాలు చూపసాగెను. నాయన చక్కటి శ్లోకాన్ని ఇలా వ్రాశారు.

శ్లో॥ ప్రీతిం దదాతి విపులాం శ్రియమాతనోతి
నిర్మాతి నూత్న సమయం దురితంధునోతి ।
ఆర్ద్రీ కరోతి హృదయాన్యపిదేవతానాం
కస్మై శుభాయన భవేత్కవితా విదోషా ॥

[దోషములేని కవిత్వము ప్రీతిని కలిగించును. విపుల సంపదల నిచ్చును. నూతన కాలమును నిర్మించును పాపములను తొలగించును దేవతా హృదయములను కూడ కరిగించును. ఏమంగళముల నీయజాలదు?]

"రాజా కాలస్య కారణమ్ (రాజే కాల నిర్మాణమునకు ముఖ్యుడు)" అనునది ఆర్యోక్తి. పూర్వము రాజులు రాజ్యములను ఏలుచుండిరి. కవిత్వములు వారిని స్తుతిస్తూ వ్రాయబడినవి కావున ఈ ఆర్యోక్తి ఉచితమై ఉండేది. కాని రాజులు లేని ఈ నవీన కాలంలో 'కవి' యే యుగ నిర్మాణకర్త. ధర్మ రక్షణకు సత్య నిరతికి సుఖ సౌఖ్యాభివృద్ధికి సమాజ పురోభివృద్ధికి కవి యొక్క రచనలు అతి ప్రాచుర్యం వహిస్తాయి. కావున "కవిః కాలస్య కారణమ్" అనుటయే ఉచిత మౌతుంది. కలము యొక్క విలువను ఇలా తెలియజేస్తూ నాయనపై శ్లోకములలో "నూత్న" అనే పదం ఒక్క క్షణం ఆలోచించి వ్రాశారు. అది భవిష్య దృష్టికి నిదర్శనము.

"ఇంద్రాణీ సప్తశతి" యను కావ్యమునందు తనయవతరణ విశేషాన్ని ఇలా తెలియజేశాడు.

శ్లో॥ అపరోనవ్యా కావ్యాన్యనవద్యాని ధన్యః ।
విదధాత్వ ప్రయత్నాదుప్బధ భోగక్షమాణి ॥

[ధన్యుడగు మరియొకడు (అనగా తాను) పండితుల యాస్వాదము కొరకు అప్రయత్నముగా అనింద్యమైన నూత్న కావ్యములను రచించును].

శ్రీ నాయన వ్రాసిన "విశ్వమీమాంస" ఉపనిషాసంగ్రహము, ఇంద్రాణీ సప్తశతి, పూర్ణ భారతచరిత్ర పరీక్ష ఇత్యాధి గ్రంథాలను పరిశీలించిన తాత్త్విక భావములందతనికి నూత్న దృక్పథము, దేశ భక్తి, సామాజిక వ్యవస్థ యందు అతని ఆశయము ఇత్యాదులు ఎంతో ఉన్నతంగాను, నవీనంగాను కనిపిస్తాయి.

— × —

## 19. గురుని చేయూత

శ్లో॥ యాతాయాత విహారేరాధారేషుచ శీర్షే ।
సంచారం విదధానం కించాశేష విసారి ॥
ఆలంబేన విహీనం వ్యోమాభం పరిపూర్ణం ।
నిశ్శబ్దం గురురూపం తద్బ్రహ్మ స్ఫురతాన్మే ॥

[ఏయ్యది షడాధార చక్రములందును, సహస్రారము నందును యాతాయాత విహారము చేయుచూ సర్వవ్యాప్త మగుచున్నదో, అట్టి నిరాలంబము, ఆకాశ సదృశము, పరిపూర్ణము, నిశ్శబ్దము అయిన గురు రూపము నాకు స్ఫురించునుగాక!]

– గురుగీతము

• • • •

"శిష్యుడు తన్ను గురువునకు అర్పించుకుంటాడు. ఇక శిష్యునికి ప్రత్యేకవ్యక్తిత్వం అంటూలేదు. స్వార్పణంపూర్తిగాసైతే

వ్యక్తిభావన సర్వం నష్టమైపోతుంది. అటుపై దుఃఖ కారణము నశిస్తుంది. ఆనందమే వెలుగుతుంది "శరణాగతి మహాత్మ్యమిది" అని చెప్పియున్నారు శ్రీ రమణ భగవాన్.

ఉమాసహస్రం వ్రాసి ముగించగానే భగవాన్ కండ్లు విప్పి నాయనని జూచి "నేను చెప్పినదంతా వ్రాశావా?" అని అడిగారు. నాయన వెంటనే "ఆహా! మీరు అనుగ్రహించినదంతా వ్రాయ బడింది" అని జవాబిచ్చారు. భౌతికంగా రెండు రూపాలుగా కనిపించినా వీరిరువురి మధ్యా ఆ "నేను" ఎవరు? అని విచారిస్తే ఆ శక్తియే గురువు, ఈశ్వరుడు, ఆత్మ అని అర్థమౌతుంది.

ప్రణవానందస్వామి గురుస్తుతి వ్రాయుమని నాయనని వేడు కుంటే వారు తాముదర్శించిన గురుస్వరూపాన్ని గురుగీతంగా వ్రాసి ఇచ్చారు. శ్రీ రమణ భగవానుల విశ్వరూపం ఇందుగానవచ్చు.

తిరువత్తియూరులో త్రిపుర సుందరీ దర్శనం చేసుకుని, నూత్నసమయ నిర్మాత, కవియని పండిత సభలో ప్రకటించిన నాయన దృష్టి ఆ ఊరిలోనే చిన్నతోటలో గల వినాయకుని గుడిపై పడింది. అచటి వాతావరణం ప్రశాంతంగా ఉండడంతో నాయన ఆ గుడిలో ప్రవేశించి అంతర్ముఖులైనారు. దీక్షకు మారుపేరైన ఆ మునీశ్వరులు సర్వమునూమరచి ధ్యానంలోనే ఉంటూ పదహారు రోజుల పాటు ఆలయంలో గడిపారు.

అతనియందు శక్తి యాతాయాత విహారం ప్రారంభించింది. అతని దేహమే దేవాలయమైంది. నిత్యానందస్థితిలో నిండుగా ఉన్నారాయన. అంతలో అకస్మాత్తుగా అవరోధం. వెన్నెముకలో నొప్పిలేచింది. శరీరం నీరసమైంది. కూర్చోడం కష్టమైంది. మెల్లగా పడుక్కున్నారు నాయన. పరమేశ్వరుని ఈ పరిశోధన అంతుచిక్క లేదతనికి. ఎదురుగా వినాయకుడు ఏమీ ఎరగనట్లుచూస్తున్నాడు.

శ్లో॥ నాఖేయాతిసురోవా త్వంచేత్కించిదు దాస్యం।
ఆధారే విధధాసి స్కందస్యాగ్రజ! లాస్యమ్ ॥

[ప్రభూ స్కందాగ్రజా! నీవు ఆధార చక్రమునందు కొంచెము మృదువుగా నాట్యము చేయవయ్యా! అప్పుడీమానవుడు ఖేచరుడవుతాడు" అన్నారాయన.

అతని ప్రార్థన అరుణాచలంలో విరూపాక్ష గుహలో ఉన్న భగవాన్‌కి వినిపించింది. మరుక్షణం నాయనముందు నిలిచారాయన శ్రీ రమణుల కరస్పర్శతో నాయనలో నొప్పి మాయమైంది. ఆనందాశ్రువులతో గురుచరణాలను తాకి నమస్కరించారాయన!

17-10-1929 ని స్వామి దర్శనమునకై నాయన అరుణాచలం వెళ్ళినప్పుడు తనకు కలిగిన ఈ గురు కటాక్ష మహిమను మహర్షి సన్నిధిలో చెప్పగా రమణులు సత్యమని దానిని స్థిరీకరించిరి.

"కొన్నియేండ్ల క్రిందట నేను విరూపాక్ష గుహలో పరుండియుంటిని. సమాధిలో లేను. ఉన్నట్లుండి దేహముపైకెగయుచున్నట్లయ్యెను. ఎగయుగా నెగయుగా బాహ్యవస్తుజాలము కానరాలేదు. చుట్టును ధవళకాంతి పుంజము మాత్రముండెను. హఠాత్తుగా దేహము క్రిందికి దిగుట కారంభమయ్యెను. మరల వస్తువులు కానవచ్చినవి. ఇదియే కాబోలు సిద్ధులదృశ్యమగుచు నావిర్భవించు రీతులు అనుకొంటిని. ఇది తిరువత్తియూరు అని నాకు స్ఫురించెను. ఒక హైరోడ్డును బట్టి నడచిపోయితిని. కొంత దూరమున గణపతి దేవాలయము కానవచ్చెను. లోపలికి పోయితిని. ఏమోయొనర్చితిని, మాట్లాడితిని గాని ఆ వివరము లిప్పుడు జ్ఞప్తికి వచ్చుటలేదు. హఠాత్తుగా నేను మేల్కొని విరూపాక్ష గుహలో శయ్యపై నుండుట తెలిసినది. ఈ సంగతి అప్పుడే పరిచారకుడు పళని స్వామికి చెప్పితిని".

ఇలా తిరువత్తియూరులో గురుకటాక్షాన్ని పొందిన నాయన తన తపస్సును ముగించి వేలూరు చేరుకున్నారు.

— × —

## 20. "రేణుక" నిజగాథ యిది

శ్లో॥ పాపాని మేహరతు కాచన కృత్తశీర్షా
మాతా పదాంబుజ భుజిష్య వితీర్ణహర్షా ।
యాభక్తలోక వరదాన విధావినిద్రా
వాసం కమణ్డలు ధునీపులినే కరోతు ॥

కమండలు నదీతీరమున గల కుండలీపుర (పడైవీడు) వాసినియైన రేణుక, ఆమెపాదాల నాశ్రయించిన నాపాపములను తొలగించుగాక! ఆమె భక్తలోక వరదాన జాగరూకురాలు

- ఉమాసహస్రము (శ 7 స్త బ 4 శ్లో 3)

• • • •

పరమేశ్వరియొక్క ఆరవ అవతారమే రేణుకావతారము. వేదములు ఈఅవతారమునందు ఈమెను వజ్రవైరోచనిగా కీర్తించుచున్నవి. "తామగ్ని వర్ణాం తపసాజ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్" అను మంత్రమిందులకు ప్రమాణము. ఆకాశమే పరాశక్తి. అందు రేణుమయమై ప్రకాశించు శక్తి రేణుక. కావుననే మహర్షులు అంతరిక్షమును (మహదణ్డజము) అనిరి. తేజస్సును రేణు సమూహములందు విభజించి ప్రకాశింపజేయు శక్తిగాన తాంత్రికులు ఆమెను 'రేణుక' అని అందురు. శిరములేనిదిగాన ఈమెను "అశిర" "ఛిన్నమస్త" అని కూడ కీర్తిస్తూ ఉంటారు.

గ్రామస్తులు పూజించే 'అశిరమ్మ' ఈమెయే. ఒకరకంగా ఆలోచిస్తే అహంకార నాశనమే శిరశ్ఛేదనము. యోగులయందు కుండలినీ శక్తి యొక్క ప్రభావముతో కలుగు 'కపాలభేదనమే' శిరచ్ఛేదమని శ్రీ నాయన తెలిపియున్నారు. అది అతనికి అనుభూతము.

అయితే పురాణాలు ప్రతి విషయాన్ని ఒక కథారూపంలో తెలియజేస్తూ ఉంటాయి. అందు కొన్ని నిజాలు వికృతరూపం దాల్చుతూ ఉంటాయి. పురాణాలలో చెప్పబడ్డ రేణుకగాథ అటు వంటిదే. ఇది నిజాన్ని విస్మరించి ప్రజలను తప్పుత్రోవలో పెట్టేదిగా ఉంది అని అంటారు నాయన.

మద్రాసు నుండి వేలూరు చేరుకున్న తరువాత నాయన దృష్టి ఈ కథాసంస్కరణపై బడింది. భార్య విశాలమ్మకి పురుటి రోజులు కావడంతో అతను ఇల్లు కదలక పడైవీడు గ్రంథాలయం లోని కొన్ని పుస్తకాలు తెప్పించుకొని కథా సంస్కరణలో నిమగ్ను లయ్యారు.

పురాణగాధ క్లుప్తముగా) :—

రేణుక జమదగ్ని మహర్షి యొక్క భార్య. మహాపతివ్రత. ఒకనాడు నీటికై తటాకానికి వెళ్ళింది. నీటిలో ఒక గంధర్వుని నీడ జూచింది. ఆమె మనస్సు చలించింది. విషయమెరిగిన జమదగ్ని కోపంతో తల నరికివేయుమని చెప్తాడు. కుమారుడైన పరశురాముడు ఆపనిచేస్తాడు. ఆమెశిరస్సు క్రిందపడకుండా తన చేతిలో నుంచు తుంది. కార్తవీర్యార్జునుడు అనే రాజు జమదగ్నివద్ద నున్న కామధేనువును అపహరిస్తాడు.

ఇలా పొంతనలేకుండా ఉంటుందీకథ.

నాయన తన ఉమాసహస్రంలో, ఈగాథనుఇలా ప్రస్తుతిస్తారు.

శ్లో॥ భేదాయ చేద్గత రజా మునిరాదిదేశ ।
చిచ్ఛేదచే ద్భహు గుణస్తనయ స్సవిత్రీమ్ ।
దాహ్యం శరీర మఖిల పత్రిభురీశ శక్తి
ర్వ్యద్యావివేశ చకథా పరమాద్భుతేయమ్ ॥

[శాంతుడైన ఋషి, భార్య శిరస్సును ఛేదింపుమని కుమారుని ఆదేశించుట, అతడు తండ్రిమాట జవదాటకుండ మాతృమూర్తికి శిరచ్ఛేదము చేయుట, అట్లు శిరస్సు తొలగిన దేహమున శక్తి ఆవేశించుట అను మూడును మహాద్భుతములు.

శ్లో॥ పుత్రిః ప్రియస్తవ శిరః సహసాచకర్త
కృత్తాచహర్ష భరితా భవతీ ననర్త ।
నోతస్య పాప మపినోతవకాఽ పిహాని
ర్నాశోస్యహా భుజభువామభవద్విపాకః ॥

[ప్రియమైన నీ పుత్రుడు నీ శిరమును ఛేదించెను. వానికే పాపకళంకమునులేదు శిరము ఖండింపబడిననూ నీవు నాట్యము చేసితివి. నీకునుహానిలేదు. కాని ఆసన్నివేశము దుష్టక్షత్రియుల నాశనమునకు ఉపయోగపడినది.]

శ్లో॥ అమ్మైవసా సురభిరర్జున భూపతిర్యాం
వీర్యాజ్జహార సచ భార్గవ ఆజహార ।
తస్యాహతేః పరగృహ స్థితిరేవ హేతుః
గన్ధర్వ దర్శన కథాఽపి కల్పితైవ ॥

[పురాణములందు చెప్పబడిన గంధర్వ దర్శన కథఽపి కల్పితము. నిజానికి కార్తవీర్యుడు అపహరించిన కామధేనువే

రేణుక. పరశురాముడు కార్తవీర్యుని జపి ఆమెను తీసుకొని వచ్చెను. శతృగృహవాసమే ఆమె శిక్షకు కారణము. రేణుక శుద్ధ చరిత. కాకున్న దేవీ అనుగ్రహము పూజాదికం అసంభవము.]

సంస్కరింపబడిన కథ :-

కార్తవీర్యార్జునుడు హైహయులకు ప్రభువు. ఇతడు రావణునివలె (దత్తాత్రేయుని వలన) అనేక సిద్ధులను పొందాడు. చక్కటి పాలనాదక్షుడు అయినప్పటికీ కాలక్రమమున అహంకార వర్తనుడయ్యాడు. ఇతని భార్య పేరు సత్య. ఈమె జగదగ్ని మహర్షి భార్య అయిన రేణుక సహోదరి. వీరిరువురు ప్రసేన జిత్తను సామంతరాజునకు కుమార్తెలు.

క్రమక్రమంగా కార్తవీర్యుడు అహంకారంతో దుశ్చర్యలకు అలవాటుపడతాడు. సజ్జనులకు అతడు కంటకుడయ్యాడు. ప్రజలు భయభ్రాంతులైరి. అయితే అతని మరణము దత్తగురువు వంటి వీరుని చేతిలో గలదు. అటువంటి వీరుడు శక్తిగలవాడు జమదగ్ని కుమారుడైన పరశురాముడు. ఆతనియందు అవతార లక్షణములను తమతపస్సుద్వారా రేణుకా జమదగ్నులు కల్పించిరి. అందుకు కారణహేతువు ఈకథ.

ఒకనాడు రేణుక సోదరి సత్యను జూచుటకు కార్తవీర్యుని రాజధానియైన మహిష్మతీపురము వెళ్ళినది. సోదరిని జూచి ఆమె ఆతిధ్యము గ్రహించి తన ఇంటికి ఆమెను ఆహ్వానించెను రేణుక. మరికొన్ని దినములలోనే తన రాణులతోగూడి కార్తవీర్యులు వేటకై అడవికేగి వినోదమందుచు, హద్దు తెలియక తన మండలమును దాటి జమదగ్ని యున్న అడవిని ప్రవేశించెను. అప్పటికి ఆహారపదార్థములు క్షీణించుటవలన సైనికులు కలవరపడిరి. సమీప

మున జమదగ్నిమహర్షి ఆశ్రమము గలదని చారులవల్ల తెలుసు కున్న సత్య సంతోషముతో సోదరి రేణుక ఆతిధ్యము గొనుటకై సపరివారంగా విచ్చేసెను. రేణుకా జమదగ్నులు వారిరాకకు సంతోషించి ఉచిత సత్కారములు జేసిరి. రేణుక కమండలోదకముతో అన్నరాసులను కల్పించి వచ్చినవారందరికి రుచికరమైన భోజనము వడ్డించెను. ఈ మాహాత్మ్యమును జూచిన కార్తవీర్యుడు రేణుకపై మోహముచెందినవాడై జమదగ్నిని శీర్షాఘాతముచే మూర్ఛబుచ్చి రేణుక నపహరించెను. ఆమెను తాకుటకు జంకి స్త్రీపరివారముచే బంధింపజేసి రాజధానికి దీసికొనిపోయెను. (పురాణములందు కామధేనువును అపహరించినట్లు జెప్పబడినది).

తెలివివచ్చిన జమదగ్ని అడవినుండి వచ్చిన పుత్రులకు జరిగిన వృత్తాంతము జెప్పి పరశురామునియందు తన అస్త్రశక్తిని ధారవోసి తల్లిని చెఱవిడిపించి తెమ్మనిబంపెను. పుడమియందు పాప ప్రక్షాళనకు ఇది హేతువుకాగా పరశురాముడు కార్తవీర్యుని జంపి తల్లిని చెఱ విడిపించిదెచ్చెను. కాని శత్రుగృహవాసము వల్ల రేణుకకు శిరచ్ఛేధనశిక్ష విధించబడినది. ఈ విధముగా పుడమికి పాపహేతువగు బాహ్యశత్రువులను కృత్త శిరస్కులు గావించుటకు కారణమైన రేణుక కృత్తికాశక్తిగా పేరుగాంచగా ఆమె పుత్రుడుగా పరశురాముడు కార్తికేయుడైనాడు.

ఇలా రేణుక గాధను సంస్కరిస్తూన్న నాయనకు ఆమె అనుగ్రహము వలన 12-5-1908 నాడు పుత్రిక జనించినది. ఆబిడ్డ రేణుకా వరప్రసాదిత గావున ఆమెకు 'వజ్రేశ్వరి' యని పేరు పెట్టినారు.

— X —

# 21. మంత్ర దర్శనము

శ్లో॥ సంహోత్ర మిత్యద్భుత శక్తియుక్తం
వృషాకపేర్దర్శన మంబ మంత్రమ్ ।
యోవైదికంతే మనుజోభజేత
కించిన్నత స్యేహ జగత్య సాధ్యమ్ ॥

[అద్భుతశక్తియుక్తమై వృషాకపికి (గణపతికి) దర్శనమైనట్టి "సంహోత్ర" మనెడి నీయొక్క వేదమంత్రము నెవడు భజించునో । ఓ దేవీ ! వానికి జగత్తునందు అసాధ్యమైనది ఏదియును లేదు]
- ఇంద్రాణీ సప్తశతి.

• • • •

ఈ శ్లోకంలో నాయన తనకొక వైదికమంత్ర దర్శనం కలిగిందని అది రేణుకా మంత్రమై యొప్పుచున్నదని చెప్పియున్నారు. మంత్రదర్శనమనేది మహర్షులకే సాధ్యము. మన వేదములన్నియు మహర్షులచే దర్శించబడిన మంత్రములతో నిండియున్నాయి. సాధకునకు సిద్ధియొసగునది మంత్రము. వేదమంత్రములు భావముతో గూడినవి. భావప్రాధాన్యంతో వాటిని జపించిన సిద్ధిసాధ్యమగును. నాయన మహర్షి కులమునకు జెందినవారు. కావున మంత్రదర్శన భాగ్యము అతనికి లభించినది.

"మనము దేవుని కుమారులము-అనునది బైబిలు వ్యాఖ్య." "తండ్రీ నీయాజ్ఞను గొనివచ్చితిని"- అని భగవాన్ శ్రీరమణమహర్షి అరుణాచలేశుని సన్నిధిలో తొలిసారిగా శరణు పొందారు. "అప్పావుక్కుపిళ్ళైయణక్కమ్ (తండ్రికి తనయుడు అణకువ)" అని అరుణేశుని ప్రసాదాన్ని అతను అతి భక్తితో స్వీకరించేవారు.

ఇవన్నీ మనకు తెలిపే సత్యం ఒక్కటే. విశ్వ నిర్మాణకర్త అయిన ఇంద్రుడు (ఈశుడు) విశ్వపాలకుడుగా అందరికీనీ తండ్రి. అతడే కుహరరూపమున జీవుల హృదయములందు 'నేను'గా ప్రకాశించు చున్నాడు. ఆ తండ్రిని మనసారా పిలచి ధ్యానించే హక్కు కుమారులకు గలదు. హృదయమునందు శుద్ధమానసమును జూచిన తండ్రిలో కుమారుడు ఐక్యము కాగలడు అదియేధ్యానము. అదియే నిష్ఠ. అదియే మంత్ర స్వరూపము.

కుమార్తె జనించిన తరువాత నాయన పడైవీడులోనే మకాం పెట్టారు. రేణుకా చరణారవిందసేవ, తపస్సు, ఉమాసహస్ర పారాయణ ఇవి అతని కార్యక్రమాలు. బ్రహ్మజ్ఞాన నిష్ఠాగరిష్ఠుడైన అతని దృష్టియందు వాక్కునందు రేణుక నాట్యంచేస్తూ ఉండేది. రేణుకా నామ ఔషధ సేవనం జేసిన ఆ మునియందు కుండలినీశక్తి యాతాయాత విహారముచేస్తూ ఉండేది. శ్రీరమణుల వద్ద గ్రహించిన హృదయ విద్యారహస్యమే రేణుకా చరిత్రయందు గూడ అతనికి స్ఫురించినది.

ఒకనాడు ఏకముఖ కుమారస్వామి ఆలయంవద్ద కూర్చుని యున్నారు నాయన. ఒకజడధారి నాయన ప్రక్కనుండి నడచుచూ వెళ్ళి ఆలయమున జొరబడి కుమారస్వామి చేతనున్న ఆయుధమును గ్రహించి పరశువువలె భుజాన వేసికొని బయటకు వచ్చి నాయననుజూచి కొంతదూరం నడచి అంతర్థానమయ్యాడు. ఈ విచిత్ర సంఘటన ముందు ఆశ్చర్యం కలిగించినప్పటికీ తరువాత నాయన ఆజడధారిని పరశురామునిగా గ్రహించారు. అరుణాచలంలో శ్రీ రమణ రూపంలో కనిపించిన కుమారస్వామియే ఇచట పరశురాముని రూపంలో కనిపించడం విశేషం. తాత్వికంగా వీరిరువురూ ఒక్కరే. ఒకే అంశకు చెందినవారే.

ఈ సుదర్శనాన్ని తలచుకుని నాయన ఆనందం చెందు చుండగా అకస్మాత్తుగా ఋగ్వేదము నందలి సూక్త మొకటి అతని జ్ఞప్తికి వచ్చినది. "రాయస్కామోవజ్రహస్తం సుదక్షిణం। పుత్రోన పితరంహువే" - (ఋ-మం 7, అ-2, సూ 32)

ఈ సూక్తమును ఇరువదియేడు పాదములతో 'బృహతీ' ఛందస్సులో నుండగా ఈ మంత్రవాక్యమొక్కటీ "విరాట్" ఛందస్సులో కవచమువలె నుండెను. ఇది విరాణ్మహా మంత్రమను పేరుతో వసిష్ఠఋషికి తొలుతదర్శనమై తరువాత పుత్రుడైన శక్తికి కనుపించెను. కావున వీరిపేర్లతో ఈ మంత్రము వేదములందు గలదు. వీరితర్వాత ఈ మంత్రమును దర్శించిన ఋషి నాయన. ఏలయన దీనికి విశ్రుత ప్రాధాన్యం నాయన ఇచ్చారు. ఈ మంత్రార్థమిది రాయస్= ఇహపరములకు చెందు సకలైశ్వర్యములు; కామః=కామించువాడనై వజ్రహస్తమ్= వజ్రాయుధమును హస్తమునందున్న వాడును; దక్షిణమ్ = దక్షిణభాగమునందున్న వాడగు ఇంద్రుని, పుత్రోన పితరంహువే = తండ్రిని పిలుచు కొడుకువలె పిలుచుచున్నాను.

పరశురాముడు తల్లి శిరస్సు ఛేదనము చేయునపుడు ఆమె నుండి పుత్రునకు ఉపదేశముగా వెలువడిన మంత్రమిది. ఇందు ఇరువది అక్షరములుగలవు. పురాణమునందు ఆమె ఇరువదిసార్లు గుండెబాదుకొనునట్లు వ్రాయుట, ఈ మంత్రోపదేశము వైనమును వికృతము చేసినట్లుగా గమనించవలయును. ఇది అస్త్రవిద్యకు చెందినమంత్రము. పరశురామునకు ఇది ప్రాప్తమైనది. ఇతడు ఇరువదిసార్లు భూమిని జయించెననుటయు ఈమంత్రార్థభావనయే. ఈ పురాణగాథ యొక్క బాహ్యార్థముకంటె తత్వార్థము అతి శ్రేష్ఠమైనది.

"పరదేవత మన శరీరంలో శక్తిరూపములో నున్నది. ఆరు చక్రములందు, ఆచక్రమునకు ఆధారమైన మూలమునందు ఆమె వర్తిస్తూ, హృదయావర్తనుడై, 'నేను'గా ప్రకాశించు పురుషునకు మాతగా (సప్తమాతలు) కీర్తింప బడుచున్నవి. ఈ శక్తియే తలపులకు మూలమై మునస్సుగుచున్నది. మనస్సు దేహాత్మ భావంకలవారికి అహంకార హేతువు. ఆ అహంకారమే కార్తవీర్యార్జునుడు. శరీరమునందువెన్నెముకవ్రజదండము అందు సుషుమ్ననుండి సర్పమువలె లేచు శక్తి రేణుకాశక్తి. మనస్సు శుద్ధమగుటకు నాడీ భేదనముగావలెను. కర్రతోకొట్టిన పాము చితుకును, అటులగాక నిశితమైన ఆయుధముతో కొట్టిన తెగును. యోగులయందు నాడీగ్రంధి భేదనము: కర్రతో కొట్టిన పామువలెగాక నిశితముగా తెగవలెను. పరశువు అటువంటి నిశితమైన ఆయుధము. అహంకారమునందు మనోరూపమున వర్తించు శక్తి కోర్కెలతో గూడినదిగాన మలినశక్తియగును. అనగా శుద్ధమైనశక్తి కోర్కెలయందు దగుల్కొని మలినమయ్యెనన్నమాట. అదియే కార్తవీర్యార్జునుడొనర్చిన రేణుకాపహరణము. ఆమెను తిరిగి తెచ్చుటకు మనస్సునకు మూలస్థానమైన కంఠము ఛేదించుట అనగా గ్రంధిఛేదనద్వారా మనోనాశనము గావించి సహస్రారమునకు శుద్ధశక్తి చేరునట్లు గావించుట రేణుకాశిరచ్ఛేదనముగా జెప్పబడినది. ఈ యోగమునందు కుండలినీశక్తి విజృంభించగా యోగులకు కపాల భేదనము జరుగును. ఈ విద్యను జ్యోతిర్విద్యయని ఉపనిషత్తులందు జెప్పబడినది. ఇది ప్రత్యక్ష పరోక్షజ్ఞానములతోబాటు అణిమాది మహాసిద్ధులను కలుగజేయును. నాయనకు ఈ విద్య అనుభూతము (ఇది క్లుప్త వివరణసుమా).

శరీరాన్ని వ్రజతుల్యంజేసే ఈ మంత్రాన్ని దర్శించిన నాయన "నవీన వాసిష్ఠుడై" తనశిష్యులలో చాలామందికి మంత్రోప

దేశం చేసెను. ఈ మంత్రమును భజించుటవలన సర్వైశ్వర్య ప్రాప్తి కలుగునని వారు తెలియజేసియున్నారు.

— × —

## 22. కావ్యం కరిగిన వేళ

శ్లో॥ భగవతీ గగన స్థలచారిణీ ।
జయతి సంగర రంగ విహారిణీ ।
సుకృత శత్రుమతి భ్రమ కారిణీ ।
హరిహయారి హయాది విదారిణీ ॥

[గగనమునందు సంచరించునది, యుద్ధమందు విహరించునది, పాపాత్ముల మతులను భ్రమింప జేయునది ఇంద్రుని శత్రువులైన నహుషుడు మొదలుగాగల రక్కసులను ఛేదించునది యగు భగవతి ప్రకాశించుగాక!]

—ఇంద్రాణీ సప్తశతి, గణపతిముని.

• • • •

శ్రీ శ్రీరేణుకా పాదారవింద సేవలో ఆమె కృపాకటాక్ష సముద్ర తరంగములందు తేలియాడుతూ ఆమె నిజగాథను దర్శించిన నాయన, ఆమె ఆనందామృతవర్షిణియై భారతీయుల రక్షణా కవచమై యుండవలెనని 'రేణుకా గీతాన్ని' రచించారు. వారిశిష్యులకిది పునశ్చరణ మంత్ర గీతము. వారు స్థాపించిన ఇంద్రసేన సభ్యులకు ఇది మంత్రకవచమై స్వాతంత్ర్యోద్యమ దీక్షకు దీపికైనది. ఈ గీతమునందలి మాహాత్మ్యమేమోగాని ఈనాటికి ఇది

పఠించినవారి ఇంట ఒక దైవికశక్తి ప్రమోదానందములను కలుగ జేయుచు మృత సంజీవినియై విరాజిల్లుతూ ఉంటుంది.

నాయన దేశభక్తి అనంతము. భారతదేశాన్ని రక్షించుమని, భారతీయులను బానిసత్వము నుండి విముక్తి కలిగించుమని ఉమా సహస్రమునందు కొన్ని శ్లోకాలు వ్రాశారు. నాటి బ్రిటిష్ ప్రభుత్వముపై అభిమానమున్న కొందరు ఈకావ్యం ఒకవిప్లవకావ్యంగా సమస్య సృష్టించవచ్చునని ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు. అప్పటికే "ఇంద్రసేనను" విప్లవసంఘంగా ప్రభుత్వం గుర్తించింది. ఈఫిర్యాదుతో నాయన బ్రిటిష్‌వారికి సమస్య అయ్యారు. అతనిపై నిఘావేస్తూ పత్రికల్లో ప్రకటన వచ్చింది:

రాష్ట్ర విప్లవసంఘ మొకటి స్థాపించి పెక్కుమంది విద్యార్థులతోగూడి, కపటవృత్తిబూని గ్రామ గ్రామముల సంచరించుచున్న కావ్యకంఠ గణపతిశాస్త్రియను వ్యక్తి తపస్సు నెపమున వివిధ స్థలముల నాశ్రయించుచూ ఇప్పుడు 'పడైవీడు' యను రేణుకా క్షేత్రమున ఉన్నాడు. ఈ విప్లవము తుపాకి గుండ్లవలె పేలనున్నది. కనుక ఇందు విషయమై అధికార్లు అత్యంతశ్రద్ధ గైకొనవలయును".

ఈ వార్త దక్షిణ ప్రాంతాన సంచలనం రేకెత్తించింది. మర్నాడే ఈ ప్రకటనను ఖండిస్తూ ప్రకటనలు చేశారు కొందరు. వేలూరు కళాశాలయందుపాధ్యాయుడైయున్న శ్రీ సుబ్రహ్మణ్యం అను భారతీయుడు తీవ్రపదజాలంతో ప్రభుత్వ వైఖరిని దుయ్యబడుతూ "హిందూ" పత్రికయందు వ్యాసం వ్రాశారు.

ఉమా సహస్ర కావ్యాన్ని నిషేధిస్తూ గవర్నరు, కావ్యంతో పాటు నాయనను బంధించవలసినదిగా ఆదేశించారు. ఇరువురు

రహస్య చోదకులను ఇందులకై నియమించారు. నాయనకీవిషయం అప్పాశాస్త్రిద్వారా తెలిసింది. అతను చలించలేదు ఎంతో సంతోషించారు. కురుక్షేత్ర సంగ్రామమునందు ఎలా రేణుక ద్రౌపది రూపంలో శత్రుసంహారంచేసెనో అలాగే దుర్గరూపంలో దేవి ఉద్యమానికి నాంది పలికిందన్నారాయన అలా అంటూ అమ్మ ముఖారవిందాన్ని చూసారు. అందు రౌద్రం తాండవించింది. పుష్కరులను సంహరించుశక్తివలె ఆమె కనుపించెను.

శ్లో॥ వైరిగణ నిర్దలన ఖడ్గవరపాణే
వాససి పదోర్దశన వాససి చశోణే ।
నేత్రమిషపావక విశేషితలలాటే
పాప మఖిలం జహిమృగాధిపతిఘోటే ॥

శత్రుసంహారకమగు ఖడ్గమును చేతినధరించి, బింబాధరిగా అగ్నినేత్రము భూషణముగాగల లలాటము కలిగిన సింహవాహిని యగు దుర్గ నన్ను రక్షించుగాత :

నాయన తపః ఫలితముగా అవతరించిన దుర్గయిది.

ఆమధ్యాహ్నము మూడుగంటల సమయమునందు నాయన వాలుకుర్చీలో కూర్చుని యున్నారు. ఎదుట చిన్న మేజాబల్లపై ఉమాసహస్రకావ్యముంది. అర్ధనిమీలిత నేత్రాలతో ధ్యానంలో ఉన్నారు నాయన ఆకస్మికంగా ఒక నూతనవ్యక్తి లోన ప్రవేశించి నాయన పాదాల్ని తాకి నమస్కరించాడు. నాయన వెంటనే కండ్లు తెరచి చూచారు. "ఆచార్యవర్యా": మీకావ్యాలు నన్ను ప్రభావితం చేసాయి. మీ సేవచేసి మీవద్ద ఉందామని సంకల్పించాను. అనుగ్రహించండి. అన్నాడావ్యక్తి.

నాయన అతనిని ఒక్కసారితేరి పారజూచి కండ్లుమూసుకున్నారు. రెండు నిముషముల తరువాత కండ్లువిప్పి "సత్యాన్వేషణ కోరు వారు అసత్యము లాడరాదు. మీరు రహస్య శోధకులుగదా ; మీకర్తవ్యం మీరు నిర్వహించండి" అని మరల కండ్లు మూసుకున్నారు.

చకితుడయ్యాడతడు! నాయన మహనీయుడని గ్రహించాడు. ఈలోగా మరికొందరు పోలీసులచటకువచ్చారు. నాయనకు సెర్చి వారంటు చూపించి (Search Warrant) ఇల్లంతా ఉమాసహస్రానికై వెతుక నారంభించారు. పుస్తకం నాయనముందే తాటికాయలంత అక్షరాలతో కనిపిస్తుంది. అదేమిమాయయో ! వారికి మాత్రం కనిపించలేదు. గ్రంధానికై వారుచేసిన ప్రయత్నం వృథా అయింది. ఇక నాయనని అరెస్టు చేయాలా వద్దా అన్నది మీమాంస. పుస్తకంతోపాటు బందీచేయుమని ప్రభుత్వ ఉత్తరువు. ఒకవేళ అది లేకుండా ఖైదీచేస్తే సాక్ష్యాధారాలుండవేమో! సందిగ్ధంలోపడి చివరికి మరల వస్తామని చెప్పి వెళ్ళిపోయారు వారు.

ఈ సంఘటనతో నాయన శిష్యులు భయభ్రాంతులయ్యారు. నాయనను బాధించుతారేమోయని భీతిచెందిన దొరైస్వామి. చీకటి పడగానే ఎవ్వరికీ తెలియకుండా 'ఉమాసహస్ర' కావ్యాన్ని పుచ్చుకొని కుండలినీ నదీతీరంచేరుకున్నారు. ఆచట 'పాంబడిచ్చాన్‌పారై' అనేరాయి ఉంది. ఆరాతి చుట్టూ ఇసుకమేట వేసిఉంది. ఆవిద్యార్థి అచట లోతుగా గొయ్యితీసి అందు పుస్తకాన్ని కప్పారు! తరువాత నెమ్మదిగా తీసుకురావచ్చునని అతడు తలచాడు కానీ ఆరాత్రి అనుకోకుండా వరదరావడంతో ఇసుకమేట కరిగిపోయింది. కావ్యం నదీగర్భితమైంది.

ఉదయాన్నే నాయనకీవిషయం తెలిసింది. అతను ఎవ్వరినీ ఏమీ అనలేదు. నవ్వుతూ ఇందంతా అమ్మ చిద్విలాసం అన్నారు. భగవాన్‌కి ఈ విషయం తెలియజేయుమన్నారు.

ఆ సాయం త్రం రేణుకా సన్నిధిలో ధ్యాననిమగ్నుడైన నాయనలో అంతర్వాణి ఇలాపలికింది.

"గణపతీ ! నీకావ్యం నదీగర్భంలో కల్సిపోలేదయ్యా ! అది కరిగి శక్త్యాయుధమై భారత చరిత్రలో అంతర్లీనమైంది. అందలి శక్తి సర్వవ్యాప్తమై సమరశంఖారావాన్ని పూరించి భారతీయులను చైతన్యవంతం చేస్తూంది. అందలి మంత్ర, తంత్ర, వేదాంత అస్త్ర విద్యారహస్యాలు భారత స్వాతంత్ర్య ఉద్యమానికి అస్త్రాలవుతాయి. జగన్మాతయొక్క దివ్యశక్తి స్వరూపం అది. దానికి క్షయం లేదు. భారతీయులలో దేశ దాస్య విముక్తికి కావలసిన శక్తి పెరగాలంటే ఆకావ్యం కరిగి వారియందు ప్రసరించాలి. అదే ఇప్పుడు జరిగింది. నీవు మహాకవివి ! ఇటువంటి కావ్యాలెన్నో వ్రాయగలవు. ఉద్యమించు".

జగన్మాత కరుణకు నాయనకండ్లు చెమ్మగిల్లాయి. భక్తితో రేణుక చరణాల్ని తాకారాయన. చిరునవ్వుతో తనయుని ఆశీర్వదించింది మాత.

"పాంబడిచ్చాన్‌పారై" అనగా పామును కొట్టిన రాయి అని అర్థము. శరీరమునందు వెన్నెముకనుండి పామువలెలేచు కుండలినీ శక్తి యోగులందు నాడీగ్రంధి భేదనము చెందినదై సహస్రార మందు అమృత వర్షిణి అవుతుంది. రేణుకా శిరచ్ఛేదనము అంటే అదే. ఈ పేరునందు అటువంటి తత్వార్థము కలదు. ఉమాసహస్రము ఈచోటనే అంతర్లీనమైంది. అంటే అటువంటిస్థితి త్వరలో నాయనకు అనుభూతంకానున్నదన్నమాట.

మ్మ చిరునగవులో ఈ తత్త్వార్థాన్ని కూడా గమనించిన ఆమె లీలకు భక్త్యంజలి ఘటించి ఇల్లు చేరుకున్నారు.

—×—

## 23. H. Y. హంఫ్రీసు ఆగమనం

అభిషిక్తస్య మాతా తవతేజోంశభూతా ।
సుదశాం సేవమానా మనయత్పశ్చిమాశాం ॥

ఇంద్రాణీ: అభిషక్తుని తల్లియైన తేజోంశమున జన్మించిన విక్టోరియారాణి తనను సేవించు పశ్చిమ వాసులను మంచి దశకు తెచ్చెను.

అయికాలం కియంతం దయసే పశ్చిమస్యామ్ ।
ఇత ఇంద్రాణి పూర్వామవలోక స్వదీనామ్ ॥

ఓ ఇంద్రాణీ! ఎంతకాలము పడమటిదిక్కుపట్ల దయతో నుందువు ఈ దీనురాలైన పూర్వదిక్కును చూడుమా!

నవయం పశ్చిమస్యాశ్శచి! యాచామనాశమ్ ।
కృపయైతాంచపూర్వాం నిహతాశామవాశామ్ ॥

ఓశచీ! మేము పశ్చిమదిక్కుయొక్క నాశము నాశించ లేదు. నిరాశ చెందియున్న పూర్వ దిక్కును కృపతో రక్షింపుమంటిమి: అదియే మా ఆశ.

—ఇంద్రాణీ సప్తశతి: గణపతిముని.

•　•　•　•

రాయన విశ్వవ్యాప్తంగా ఇంద్రాణీ శక్తిని ఉద్యమింప ...నం పై శ్లోకాలలో కానవస్తుంది. ఇదియే అస్త్రప్రయోగము.

ధర్మరక్షణే ఇందలి ధ్యేయం. సర్వజన రక్షణయే కర్తవ్యం ఇందుకై సకల దేవతలను స్తుతించిన నాయన పశ్చిమ వాసుల ఆరాధ్య దైవమైన మేరీమాతను కూడా స్తుతించారు.

శ్లో॥ కలయాతదాతి బలయాకవితా
పురుషస్యయోగ మఖిలాంబ వినా ।
అఖిలేశ్వర ప్రహితతేజ ఇయం
సుతజన్మ నేకిల దధావనఘా ॥

ఓ అఖిలాంబా: (ఇంద్రాణీ:) అతిబలమైన నీకళలతో గూడిన మేరీమాతకు పురుషయోగములేకనే అఖిలేశ్వరుని తేజము వలననే లోకరక్షకుడు జన్మించె.

శ్లో॥ సురరక్షకస్య మదయిత్రి దృశాం
నరరక్షకస్య జనయిత్రి పరే !
కులరక్షణాయ కృతబుద్ధిమిమం
కురుదక్ష మచ్ఛృత పవిత్ర కథే ॥

అట్టి నరరక్షకుని జననీ! కులరక్షణమందు బుద్ధికలిగియున్న వీనిని (కవిని) సమర్థునిగా జేయుము.

భక్తుల ప్రార్థనలు వృధాగావు. సత్వరఫలితాలు గానవస్తాయి. నాయనను బంధించడానికి ప్రయత్నించిన పోలీసు శాఖలో క్రమ క్రమంగా మార్పులు వచ్చాయి H. Y. హంఫ్రీసు అనే వినయ శీలుడు వేలూరు మండలానికి ASSISTANT SUPERINTENDANT OF POLICE గా నియమింపబడ్డాడు. క్రీ. శ 1911 సం॥ లో మొదటిసారిగా హిందూదేశము వచ్చాడీయన. బొంబాయిలో పడవ దిగిన వెంటనే అతనికి విషజ్వరం సోకింది. ఫలితంగా కొంతకాలము

చికిత్స పొందుతూ ఉండిపోయాడు. ఇతనికి తఱచు దివ్యదర్శ నాలు వస్తూ ఉండేవి. ఒకరోజు సాయంసమయాన తెల్లని కఫినీ ధరించి నిడుబాటి గడ్డంతో క్రీస్తుని బోలిన పురుషుని ఇతడు దర్శించాడు. ఆ పురుషుడు మంచంపై కూర్చుండి ప్రేమతో తలని నిమరగా ఒక విద్యుత్ శరీరమునందు ప్రవహించినట్లైందట. ఆ తర్వాత జ్వరం త్వరితగతిన తగ్గింది.

వేలూరులో పదవీబాధ్యతలు స్వీకరించి తెలుగు నేర్పుటకై ఒక మున్షీని (TEACHER) నియమించుకున్నాడితడు. అతని పేరు సర్వేపల్లి నరసింహం. ఒకరోజు "ఇచట మహాత్ములు గలరా?" యని మున్షీని ప్రశ్నించాడు హంఫ్రీసు.

ఆ రోజులలో మైత్రేయ మహర్షియే వేగుచుక్క యనియు అతడు లోకకళ్యాణముకొరకు అవతరించుననియు దివ్యజ్ఞాన సమాజమువారు ప్రచారముచేసియుండిరి. దివ్యదర్శనములకు యోగ సాధనకు, ఆధ్యాత్మిక చింతనకు అలవడిన హంఫ్రీసు ఈ ప్రబోధములను వినియున్నాడు. హైందవ ఋషుల దర్శనము చేయవలయునన్న అభిలాష అతనియందు కలదు.

కానీ మున్షీ వేరొక రీతిగా దలచెను. నాయనపై గూఢచారి శాఖ నిఘా వేసియున్నది. నాయన తన గురువు అతనిని పట్టుకొనుటకు ఇది ఒక ఎత్తు అయియుండవచ్చును. కావుననే "ఇచట మహాత్ములు లేరు" అని జవాబిచ్చెను.

అంతటితో ఈ ప్రసంగము మారిపోయినది. కాని మర్నాడు హంఫ్రీసు "మున్షీగారూ! గతరాత్రి మీగురువుగారిని కలలోజూచి నాను వారి ఫోటోచూపించండి" అన్నారు. మున్షీకి గుండెల్లో రాయి పడింది చూపించుటయా ! కూడదా. చూపించిన యేమియుపవాదము

వచ్చునో (ఉపద్రవము వచ్చునో) అని తలచుచు గురువుగారి ఫోటోని అనేకఫోటోలతోకలిపి హైందవమహాత్ముల చిత్రపటములను హంఫ్రీసునకుచూపించెను. కానిహంఫ్రీసు అందు నాయనఫోటోతీసి మున్షీకి చూపించుచూ "వీరుమీగురువుగారుకదా! నాకు బొంబాయిలో కనిపించినాజబ్బునునయంజేసినారు.వీరిదర్శనముజేయవలయును. దయచేసినన్ను వారివద్దకు తీసుకొని వెళ్ళండి" యని వేడుకొనెను.

అమితానంద భరితుడైన మున్షీ మర్నాడు హంఫ్రీసుని తోడ్కొనివచ్చి నాయనగారి వద్దకువచ్చి పరిచయం గావించినాడు.

మొదటిసారిగా భారతీయఋషిని జూచిన సంతృప్తి కలిగింది హంఫ్రీసుకి. నాయనతో ఎన్నో విషయాల్ని చర్చించాడతడు. అతని యందలి ఆధ్యాత్మిక తృష్ణను గమనించిన నాయన క్రీ.శ. 1911 సం॥ నవంబరు మాసమునందు తొలిసారిగా శ్రీరమణమహర్షుల దర్శనం చేయించారు. "THE MAHARSHI IS A MAN BEYOND DISCRIPTION IN HIS EXPRESSION OF DIGNITY GENTLENESS. SELF-CONTROL AND CALM STRENGTH OF CONVICTION." మొట్టమొదటిసారిగా INTERNATIONAL PSYCHIC GAZZETTE లో మహర్షులను వివరిస్తూ హంఫ్రీసు వ్రాసిన మాటలివి.

మహర్షుల దర్శనంతో అధికలాభాన్ని పొందిన మొట్టమొదటి పాశ్చాత్యుడితడు. శ్రీ రమణోపదేశాన్ని పశ్చిమానికందించిన తొలి విదేశీయుడు కూడా ఇతడే. అంతవరకూ పశ్చిమదిశపై దయామృత వీచికలను ప్రసరింపజేసిన ఇంద్రాణి నాయన ప్రార్థనతో తూర్పు దిశకు తిరిగినది శ్రీ రమణోపదేశం సర్వవ్యాప్తం కావడాని కిది అంకురార్పణ. భారతీయులు సర్వ జనహితమును కోరెడివారు. అదే ఋషికుల ధర్మం. అదే నాయన ధ్యేయం.

— X —

# 24. గోకర్ణయాత్ర-కుమారునికి పరీక్ష

శ్లో॥ తీరేవిపశ్చిద్వర పశ్చిమాబ్ధే
గ్గోకర్ణగాం లోకయ భద్రకర్ణీమ్ ।
బుద్ధిం శివాం సర్వమనోరథావాం
సిద్ధించ యద్యస్తి మనోధిగన్తుమ్ ॥

[ఓ విద్వదగ్రణీ! కళ్యాణమయియగు బుద్ధిని - సర్వ మనో రథసిద్ధిని - గూడ పొందుటకు నీకు మనస్సు కలిగినయెడల పశ్చిమ సముద్ర తీరమునందలి గోకర్ణక్షేత్రమున నివసించిన భద్రకర్ణీ నామమున ప్రసిద్ధియగు కాళిని - వీక్షింపుము].

- ఉమాసహస్రము. గణపతిముని,

* * * *

మహాదేవునకు పదియేండ్లు నిండగానే ఉపనయనం చేశారు నాయన. గాయత్రీమంత్ర జపంతోబాటు హృదయనిష్ఠకి అలవాటు పడ్డాడాబాలకుడు. బహుశా ఇది శ్రీ భగవాన్ అనుగ్రహం కావచ్చు. బాలకుని దీక్ష నాయనకే ఆశ్చర్యం వేసేదట. "కొంత కర్మ శేషం ఉండిపోయింది అందుకే వీడు పుట్టాడు" అని అనేవారట నాయన. శ్రీ రమణ గీతలో "మహాదేవస్య జననీ ధీరస్య బ్రహ్మవాదినః" అని చెబుతూ ఆ బాలకుడు 'బ్రహ్మవేత్త' అని పరోక్షంగా చెప్పియున్నారు. బాలకుని అలవాట్లు కూడా అలాగే ఉండేవి పగలంతా అతడు మామూలు మహాదేవుడు. రాత్రి 12 గంటల తరువాత నిత్య సమాధిలో ఉండేయోగి. ఎప్పుడూ కండ్లుమూసుకొని ఉండేవారు?" ఎందుకునిద్రపోరు? ఎప్పుడూ కూర్చునేయుంటారేమిటి? అని అడిగితే "నేను కూర్చునే నిదురపోతాను" అని అనేవారు. అంతేగాని తాను చేస్తున్నది ధ్యానమని అతను ఎప్పుడూ ఎవరితోనూ చెప్ప లేదు. రాత్రి 12 గంటలనుండి తెల్లవారు ఝాము 4 గంటల వరకూ

ఉండి సరిగా నాలుగు అయ్యేసరికి గురుస్తుతి, ఇంద్రసహస్ర పారాయణ అగ్నిమీళే అనే వేదసూక్తం ఇత్యాదులు ఉదయం 6 గంటల వరకూ పఠించేవారు.

సాధారణంగా మరణిస్తున్నప్పుడు ఏది తలిస్తే మరుజన్మలో అది అవుతారట! "యాంతేమనస్సా గతిః"! మహాదేవుని సమాధిస్థితి అందరికీ వారి అవసానదశలోనే తెలిసింది. సంపూర్ణమైన ఆరోగ్యంతో ఉండి తనకుమారునితో "పురందరా! ప్రాణంపోతున్నదిరా! హూం, పోతేపోనీ!" అని ఎడమ ప్రక్కకు తిరిగి మాతృభ్యోనమః, పితృభ్యోనమః, గురుభ్యోనమః భగవాన్ రమణా! నారాయణ, శివఃశివః" అని ప్రాణం వదిలారు.

ఖరగ్‌పూరులో ఇలా జరిగింది. ఎంతటి తపస్వి కాకపోతే ఇలాంటి మరణం సంభవిస్తుంది! శ్రీ భగవాన్ హృదయ విద్యను సంపూర్ణంగా ఇతనికి ప్రసాదించారేమో అనిపిస్తుంది.

"ఏకేనాఽపి సుపుత్రేణ తపోయుక్తేన సాధునా ।
ఆహ్లాదితం కులం సర్వం యథా చంద్రేచ శర్వరీ॥"

[ఎలా చంద్రుడు రాత్రి అంతటికీ ఆహ్లాదం కలిగిస్తాడో, అలాగే తపోధనుడు, సాధుశీలుడు యిన సుపుత్రుడు ఒక్కడైనా కులమంతటికీ ఆహ్లాదం కలిగిస్తాడు].

అటువంటి ఈ పుత్రరత్నాన్ని తోడ్కొని భార్య విశాలాక్షితో సహా గోకర్ణయాత్రకు 1912లో బయలుదేరారు నాయన. ముందుగా కాలడి సందర్శించి అచటనుండి గోకర్ణానికి సముద్రయానం చేయాలి అని సంకల్పించారాయన. అటులనే కాలడి చూచుకొని సముద్రయానం చేసే తలపుతో సముద్రతీరం చేరుకుని నావ ఎక్కారు. అది పున్నమిరోజు. సాయంత్రం ఆరుగంటలకు నావ

బయలుదేరింది. రాత్రి 10 గంటల వేళకు అదియొక దీవికి చేరు కుంది. అచట జనసంచారంలేదు. సుమారొక మైలుదూరంలో ఒక తోటమాత్రం కనిపిస్తోంది. నావికులు లంగరువేసి తాళ్ళనిచ్చెన దించి క్రిందికి దిగారు. తోటవైపు నడచారు. అచట మదిర సేవించి వచ్చుట వారి అలవాటట! కాని యాత్రికులకు ఇది తెలియదు. నిండుపున్నమి వెన్నెలలో ప్రకృతి అందాలను తిలకించాలని కొందరు యాత్రికులుగూడ అచట దిగారు. ఒక అరగంట తరువాత నావలో ఒక ఆలజడి చెలరేగింది. "గోకర్ణం ఇదే ఇక పడవనడవదు" అనేపుకారు అందరిలో ఆందోళన కలిగించింది. కొందరు గబగబా నిచ్చెన దిగారు. ఈ లోపల నావికులచటికివచ్చి "ఇది గోకర్ణంకాదు ఎక్కండి ఎక్కండి" అని యాత్రికులను తొందరచేశారు. కొంత తొక్కిసలాట జరిగింది. నాయన చేయిపట్టుకొనియున్న మహాదేవుడు వెనక్కి తోయబడ్డాడు. అమ్మ నాయన నావ ఎక్కగలిగారు. తనయుడు ఎక్కలేకపోయాడు నీటిలోజారిపడగా ఒకయాత్రికుడు లేవదీసి వెనక్కి నెట్టేశాడు. ఫలితంగా బాలకుని యెవ్వరూ గమ నించలేదు. నావ బయలుదేరిపోయింది. మహాదేవుడు తీరాన ఉండి పోయాడు. బాలకుని కేకలు ఏడ్పు నావికులకు వినిపించలేదు.

అదియొక మరుభూమి, జవసంచారంగాని జంతుసంచారం గాని ఎచ్చటా కానరాలేదు. అంతయు ఎడారివలెనున్నది దగ్గరలో గ్రామం ఉంటే ఇళ్ళు దీపం వెలుగు ఇత్యాదులు కానవస్తాయి. కాని అటువంటి ఆస్కారం కూడా ఉన్నట్లు లేదు. బాలకునికి భయం వేసింది. తోటవైపు వెళ్దామా అని అనుకున్నాడు కాని నావ మరల వస్తే తాను కనిపించకపోతే అమ్మా నాన్న ఏంచేస్తారు? అనే శంక కలిగింది. కళ్ళంట నీళ్ళు తిరిగాయి. రాత్రిముదురుతున్నకొలది భయంవేసింది. అతని పరిచయం అధికంగా భగవాన్ మహర్షితోనే

యుండేది. నాయన శాస్త్రతపః పరిచయాలను అందుకునే వయసు కాదది. ఆ ఇసుక దిబ్బపై కూర్చుని, మదిలో మహర్షిని తలచుకుని గాయత్రీ మంత్ర జపం చేస్తూ ధ్యాననిష్ఠుడైనాడు. ఆశ్చర్యం. రెండురోజులు గడిచాయి ఈదురుగాలికి చుట్టూ ఇసుక పోగైంది. వళ్ళూ తలా అంతా ఇసుకే కానీ బాలకుడు మాత్రం చెక్కుచెదరని ధ్యానంలో కూర్చున్నాడు. ఆకలి దప్పిక అతన్ని అంటలేదు. ఎంతటి గుర్వనుగ్రహం!

మూడవరోజు ఉదయానికి నావ అచటికి వచ్చింది. అందుండి నాయన క్రిందకి దిగారు. బాలకుని దీక్షకు ఆశ్చర్యం చెందారు వారు. గాలి ఇసుక కారణంగా వంటిపై పొక్కులు లేచి ఉన్నాయి. అటాలమ్మ అని అనవచ్చు. బాలకుని తట్టి లేపారు నాయన. కండ్లు విప్పి తండ్రినిజూచి భోరున ఏడ్చాడు మహాదేవుడు. వానిని ఓదార్చి పొక్కులు తగ్గించుమని రేణుకాస్తుతి చేశారు నాయన.

శ్లో॥ ఛిన్న మాత్మన శ్శిరః కరాంబుజేనబిభ్రతీ ।
వజ్రపాణి ముఖ్యదేవగీయమాన వైభవా ॥
రేణుకా హ్వయాద యాతరంగిణీ భయాపహా ।
ధీరమౌలిలా లితేయమాదధాతు మామజా ॥

[నరకబడిన తన తలను తనచేతితోనే ధరించునది, ఇంద్రాది దేవతలచే స్తుతింపబడునది, దయగలది, భయమును పోగొట్టునది, ధీరులచే లాలింపబడునది, అగ[illegible]త మమ్ము రక్షించు గాక!

నాయన గృహస్థు అయినప్పటికి ఎచటికి వెళ్ళినా కొండల్ని గుహల్ని వెదికేవారు. అందరిలాగా సత్రములందు దిగి యాత్ర చేయుట అతనికి నచ్చేడిదిగాదు. క్షేత్రములందు గూడ తపోదీక్ష కొనసాగించవలెను. అందులకు అనువైన ఏకాంత స్థలం అతనికి కావాలి. గోకర్ణంలో ఒకపాడుపడిన కృష్ణమఠం అతనికి కనుపించింది

అందు బసచేశారువారు. "దేవా! నీకు ఉపనయనం చేసాముకదా; నీవు ఊరిలోకివెళ్ళి భిక్ష తీసికొనిరమ్ము. మేము ఇచట తపస్సు చేసెదము మమ్ము కాపాడుటనీవిధి" అన్నారు నాయన తయునడు అందులకంగీకరించాడు వారు ముగ్గురు కావున "భవతీ భిక్షాందేహి" అని మూడు ఇండ్లకు మాత్రమే వెళ్ళేవాడా బాలకుడు.

గోకర్ణేశ్వరునకు నాయన పాండిత్యంపై అభిరుచి కలిగింది కాబోలు! ఒకనాడొకపండితుడువచ్చి ఆమరంలో నాయనతో ముచ్చటించి అతడు మహాపండితుడని తెలుసుకున్నాడు. వెంటనే వార్త నగరానికి పాకింది. అచట హోసమన్ గణేశశాస్త్రియను పుణ్యపురుషుడు సంస్కృత విద్యాపీఠాన్ని స్థాపించియున్నాడు. అందలి పండితులు ఒకనాడు కృష్ణమఠానికి వచ్చి విద్యాపీఠానికి రమ్మని నాయనను వేడుకున్నారు. నాయనందుల కంగీకరించారు.

పాండిత్యం రెండు విధములు. అందొకటి పుస్తక పరిచయంతో కలిగేది రెండవది సాధనద్వారా హృదయగత ప్రజ్ఞతో తెలిసికొనేది. పండితుడు అనేపదానికి నాయనఇచ్చే నిర్వచనంఇది:-

శ్లో॥ స్వాధీనే హృదయేవాణీ సర్వమర్థంచ పశ్యతి :
మనసారంజితావాణీ వ్యష్టేరనుభవం మితమ్ ॥

[హృదయము స్వాధీనమై ప్రజ్ఞతో పలికిన వాక్కు అన్ని విషయములను తెల్పుతుంది. మనస్సుచే కూడిన వాక్కు వ్యక్తి అనుభవమునకు మాత్రమే పరిమితం అవుతుంది. కావున హృదయగత ప్రజ్ఞతో పలికినవాడే పండితుడు, కవి.]

అనంతశాస్త్రియను మహాపండితునకు అచట మంచి పేరు ప్రఖ్యాతులున్నాయి. అతడు ఉపాసకుడు. విష్ణుతత్త్వ వివరణలో అతనికి అతడే సాటి నాయనకి అతనితో తత్త్వవాదన తటస్థించింది "ఇంద్రతత్త్వం"పై ప్రవాహంలా వెలువడిన అతనివాణిని తట్టుకునే

శక్తి అనంత శాస్త్రికి లేకపోయింది. నాయన వేద వాసిష్ఠుని కోవకు చెందిన మహర్షియని అతడు గ్రహించాడు. తన ఓటమిని అంగీకరించి అతనికి శిష్యుడైనాడు.

నాయన మహాజ్యోతిష్కుడను వార్త పండితులకి తెలిసింది. తమకావిద్యను నేర్పుమని వారు కోరుకున్నారు. ఫలితంగా నాయన తపస్సు వీడి కొన్నాళ్ళు అధ్యాపకుడై వారికి జ్యోతిషశాస్త్ర మర్మములను తన దైన శైలిలో చెప్పారు. అపుడు రచించిన జ్యోతిష గ్రంథములే "త్రిభావఫలచంద్రిక, నిర్ణయ సంగ్రహము, లఘు సంహిత" ఇత్యాదులు.

ఇలా మూడు నెలలపాటు గోకర్ణంలో అధ్యాపక వృత్తి జేయుచున్న నాయనకు అకస్మాత్తుగా తండ్రికి జబ్బుచేసినదను వార్త తంతిద్వారా అందినది. వెంటనే కలువరాయి బయలు దేరారు.

—×—

## 25. పితృ వియోగము

శ్లో॥ తపోనిర్ధూత పాప్మానః తథాతథ్యాభిధాయినః ।
వేద వేదాంగ తత్త్వజ్ఞా ఋషయః పరికీర్తితాః ॥

[ఎవరు సర్వకాలములందును సత్యమునే వచించెదరో, ఎవరు వేదవేదాంగముల నుతత్త్వము గ్రహించి ఆచరించెదరో ఎవరు తమ పాపములను తపస్సుద్వారా కడిగివైచెదరో వారు ఋషులుగా పరిగణింపబడెదరు].

• • • •

మనసుయొక్క ఏకాగ్రతకు అనుకూలమైనది మంత్రోపాసన. అది మనస్సును పవిత్రం చేస్తుంది. అందలి తమోరాజ సగుణాలను నశింపజేసి సాత్త్వికమును అధికం జేస్తుంది, సత్త్వగుణోపేతమైన మనస్సునందు ప్రసరితమయ్యే శక్తి పరమాత్మశక్తి. అదియే ఆత్మశక్తి, దానినే తపఃశక్తి అని కూడా అంటారు. మంత్రాలు రెండు విధాలు. అందు కొన్ని వైదికమంత్రాలు కొన్ని తాంత్రిక మంత్రాలు. వైదిక మంత్రాలకు ఆచార నియమాములు ఎక్కువగా అవసరంలేనప్పటికీ తాంత్రిక మంత్రాలకు అవికావాలనే అంటారు పెద్దలు. బహుశా అందుచేతనేనేమో శ్రీ చక్రాది తాంత్రిక పూజలందు ఆచార క్రమాలు అధికంగాకానవస్తాయి. అయితే వైష్ణవ సంప్రదాయంలో కూడ నియమాలను అధికంగానే చూస్తాము మనం. ఏది ఏమైనప్పటికీ మనస్సు నిలపడేవరకు నియమం అవసరం. అలా నిలబడాలంటే మంత్రం కావాలి. మంత్రాన్ని ఉపదేశించే గురువు కావాలి.

నాయన మంత్రోపదేశం చేస్తే వెంటనే ఫలితం కనిపిస్తుందట అతని వాక్కులోను చూపులోనూ అంతటి శక్తి ఉండేదని వారి శిష్యులు ఈరోజు కూడా చెబుతూ ఉంటారు. వారు నడుస్తూ ఉంటే వారి వెంట దేవతలు కూడా నడిచేవారట. అతను ఏ ఊరు వెళితే అచటి క్షేత్రపాలిక అతనికి దర్శనం ఇచ్చి ఆహ్వానించేదట. మౌనస్వామియైన భగవాన్ రమణులను కూడా మాట్లాడించేరంటే అతని తపఃశక్తి ఎంతటి మహిమకలదో వేరుగా చెప్పనక్కర్లేదు. శ్రీ రమణుల చెంతకు నాయన జేరినప్పటికి అతను బాగుగా పక్వానికి వచ్చిన పండువలె నుండిరి. అక్షరమణి మాలలో భగవాన్ మహర్షి ఇలా వ్రాసియున్నారు.

నైందళి కనియా నలనిలై పళత్తి
నాడి యుట్కొర్ నల అరుణాచలా ॥

[పక్వమునకు వచ్చిన పండును తగు సమయమున ఆరగించని యెడల అది వాడి, క్రుళ్ళి నశించును, గావున వేగిరమున పండు నారగింప మరుణాచలా]

వాడి వత్తరైన ఫలమేల, పండు మే
ల్తిరమున గొనగాదె యరుణాచలా ॥

దీనినిబట్టి అట్టే ఉపేక్షిస్తే పండుమాగిపోతుందని ఈశ్వర నిర్ణయంగా భగవాన్ వారికి స్పందించారు. అంతటి తపోధనుడైన నాయన ఉపాసించినది పరాశక్తి. ఆమె దర్శన భాగ్యం పొందే మహత్తర మంత్రోపదేశమును నాయన కందించినవారు అతని తండ్రి శ్రీనృసింహశాస్త్రిగారు. ఎంతటి ఉపాసకుడు కాకపోతే తండ్రి కుమారుని ఇలా తీర్చిదిద్ద గలడు!

వేషభాషలను చూచి మోసపోయే మనము వేదపురుషులు ఎవరో తెల్సుకోలేము. మనమధ్యనే సత్పురుషులున్నప్పటికీ వారిని తెల్సుకోలేని అజ్ఞానం మనది. అందులకు కావల్సినది అంతర్దృష్టి. శ్రీ నృసింహశాస్త్రిగారికి ఈ అంతర్దృష్టి చిన్ననాటి నాటి ఉండెడిది. అతని ఇంట వంశపారంపర్యముగా వచ్చే శ్రీ చక్రపూజ ఇంతకు ముందు చేసినవారూ ఉన్నారు. కాని నృసింహశాస్త్రి కాలంలోనే ఆపరాదేవత కుటుంబాన్ని అనుగ్రహించి ఆదరించినది. కారణం ఆ విప్రుని అకుంఠితదీక్ష "జగతఈశధీయుక్తసేవనమ్"అని భగవాన్ వ్రాసినట్లు ఈ జగత్తునే ఈశ్వర స్వరూపంగా పూజించారాయన. ఆలనాటి బ్రిటిష్ వారి పాలనలో అస్తవ్యస్తంగా ఉన్న హైందవ జాతిని జూచి ఉద్యమించారాయన. సాధారణంగా ఉద్యమం అంటే ఆందోళన లేవదీయడం అనే మనకు తెలుసు. ఆధ్యాత్మిక సీమలో ఉద్యమానికి మరోపేరు తపస్సు. ఋషికుల ధర్మ సంస్థాపనే హైందవ జాతి పురోగమనానికి గతి. ఆ నమ్మకంతోనే అటువంటి ఒకకుమార

రత్నాన్ని ప్రసాదించుమని తపస్సు చేసారాయన. ఫలితంగా జన్మించారు నాయన.

అందరూ దైవశక్తినే అధికంగా నమ్ముతూ ఉంటారు. నాటికీ నేటికీ విశ్వశాంతికై యజ్ఞాలు యాగాలు నిర్వర్తించే వారిని మనం చూస్తూనే ఉన్నాము. మనిషిని స్వార్థచింతనకు అతీతంగా మరల్చ గలిగేది దైవశక్తి. దేశక్షేమానికై అటువంటి దైవశక్తిని ప్రార్థించడం విప్రుల ధర్మం "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అనే శ్లోకాలలో ఈ విషయాన్ని మనం గమనించవచ్చు. అటువంటి దైవశక్తిని సమీకృతం చేయగలిగినవాడు ఋషి. నాయన ఆటువంటి ఋషి కావాలి. అందులకై పుత్రమమకారముకంటే శిష్యుడనే మమకార మునే తనలో పెంచుకున్నారు నరసింహశాస్త్రి. కావుననే, అందరి లాగ సంసారసుఖాలకు నాయన జీవితాన్ని పరిమితం కాకుండా జాగ్రత్త వహించారాయన, ఆంగ్లవిద్యకు బదులు సంస్కృత విద్యను నేర్పించారు ద్వాదశ మంత్రదీక్ష ఇచ్చారు. తపస్సనే నెపంతో తప్పటడుగులు వేయకుండా హితబోధ చేశారు. వ్యావ హారిక జ్ఞానానికి అతనిని దూరంచేసారు. నిరంతర తపోదీక్షయందు నాయన ఉండేలా చేశారాయన.

తాను ఆత్మనిష్ఠుడు గావుననే తనయుని అలా చేయగలిగారు ఆయన. ఒక వైద్యునిగా అతను చేసిన సేవ అపారం. మంత్ర ద్రష్టగా అతను సాధించిన ఉపాసన అనూహ్యం. తాను తెరవెనుక ఉంటూ తనయుని తెరముందుంచారాయన.

నాయనకి మంత్రగురువు తండ్రికాగా మహాగురువు శ్రీ రమణులు. 1910 సం॥లో భగవాన్ రమణమహర్షి దర్శనం చేసు కున్నారు శ్రీ నృసింహశాస్త్రి ఇరువురిమధ్య మౌనమే తాండవించింది "THE REAL HEART TO HEART TALK IS SILENCE"

అని శ్రీ భగవాన్ చెప్పియున్నారు గదా! నాయన యొక్క ఈ రెండు గురు స్వరూపముల మధ్య మౌనమే రాయబారం చేసింది. శ్రీ నృసింహశాస్త్రి కండ్లవెంట కన్నీరు ప్రవాహమైంది.

భారతీయునిగా మాతృదేశ సంరక్షణ నాకర్తవ్యం. "అందు కై తపస్సుచేసి కుమారునికన్నాను. బాలకుని విశ్వానికర్పించాను. గమ్యం ఈశ్వర నిర్మితం" ఇవియా విప్రుని మనోగతం.

నిండు పరిపూర్ణ వదనంతో నిర్మల మందహాసం తొంగిచూడ కమ్మని చూపులతో కరుణారస స్రవంతి ప్రసరింప శ్రీ భగవాన్ నృసింహశాస్త్రిని జూచారు. తన జన్మ సార్థకమైనదనే పరిపూర్ణ త్వాన్ని అందుగమనించారు వారు. నిండైన ఆనందంతో కలువ రాయి చేరుకున్నారు.

1912 వ సంవత్సరం వరకూ దేవీచరణారవింద సేవలో గడిపా రాయన. ఆ తరువాత జ్వరం తరచూ వస్తూ ఉండేది. గోకర్ణములో ఉండే నాయనకు తంతి పంపించారు. పెద్దకుమారుడు భీమశాస్త్రి, కనిష్ఠుడైన శివరామశాస్త్రి తండ్రి సేవజేస్తూ యుండేవారు. గోకర్ణం నుండి నాయన కలువరాయి చేరుకోవడానికి వారంరోజులు పట్టింది. కాని తండ్రి ప్రాణాలతో అంతవరకూ ఉండలేదు. తేది 05-12-191 నాడు అనగా కార్తీకబహుళ ద్వాదశి (పరీధావినామసంవత్సరము) నాడు నృశింహశాస్త్రి దేహయాత్ర చాలించి మోక్ష ధామాన్ని చేరు కున్నారు.

చివరి దశలో తండ్రిని చూడలేకపోయానని నాయన విచా రించారు. "యావచ్ఛ పితృపాదానాం విజ్ఞానముపదేశతః" (పితృ పాదులనుండి ఎంతటి విజ్ఞానమును ఉపదేశముద్వారా పొందితినో) అని ఉమాసహస్రమునందు వ్రాసిన శ్లోకచరణం అతనికి గుర్తుకు వచ్చింది. మంత్రోపదేశం చేసిన ఆ గురువుని హృదయమందే దర్శనం చేసుకున్నారు నాయన.

* * * *

# మహాతపస్వి

## మూడవ భాగము

### 1. మహాయజ్ఞ నిర్వహణము

గీ॥ ఆత్మ ప్రతీతియే యప్రమాదమగు।
నాత్మను మఱచుట యగు ప్రమాదంబు॥
అప్రమాదము యోగ్య మన్నింటకన్న।
అప్రమత్తుడు నిన్నె హరిహయ! జేరు॥
నిన్ను జేరుట యనంగ నిర్జరనాథ।
తనయందు నిల్చుట తాత్పర్య మంద్రు॥
తనపట్టు విడుచుచు తలచుట భవము
తనపట్టు విడువక తలచుట తపము
తనచోట నుండుట తలపులు లేక!
ఘన వాహ! నీయందు ఘనమగు నిష్ఠ॥

— గణపతి ముని.

• • • •

"ఇంద్రం భజేత్ వేదం పఠేత్" ఇంద్రుని సేవించవలెను. వేదమును పఠించవలెను. "గోకర్ణము నందలి పండితులకు నాయన బోధించిన హితము ఇది. "ఇంద్రుడు విశ్వ నిర్మాణకర్త" విశ్వము నందు "నేను"గా వెలుంగువాడు. అతడు దేవతలకు అధిపతి. యజ్ఞ పురుషుడు. యజ్ఞముచే దేవతాఋణ విముక్తి కాగలదనునది శాస్త్ర వచనము. ఏలయన మనకు ప్రాణము, ఇంద్రియములు, మనో బుద్ధులు వారిచే దత్తమయ్యెను. కావున అవి వారి విభూతులు. వారివి వారికి అర్పించుట మన ధర్మము. దీనినే పూర్ణమైన ఆత్మా

ర్పణ యందురు. అందులకు శరణాగతి, విచారణ అనునవి మార్గ
ములు. యోగుల మతమందు దేవయాగ మనునది యంతర్యాగమే.
వేదకోశ మథనము ద్వారా కూడా ఇది సాధ్యమగును. కావున
ప్రతి జీవులయందు "నేను" గా వెలుగొందుచున్న ఇంద్రుని
భజింపుడు. వేద విమర్శ గావించి అంతర్మథనము ద్వారా సత్య
మును తెలుసుకొనుడు" అని శాస్త్రజ్ఞులకు నాయన ఇంద్ర తత్త్వ
మహిమను దెలియజేయుచుండెను.

గోకర్ణ పురమునకు చివరను ఉమామహేశ్వర పర్వతమను
కొండ గలదు. దానిపై చక్కటి ఉద్యాన వనముతో గూడిన విఘ్నే
శ్వరాలయము గలదు. నాయన కుటుంబమునకీ ఆలయము
ఆశ్రయమయినది. అచట నాయన "వేదకోశమథన"మనే యాగం
తలపెట్టారు. అందు వేద విమర్శ, దేవతా ఋణ నిరూపణము,
అగ్ని యొక్క విభూతులు, వాటి తత్త్వము ఇత్యాదులపై చర్చ
జరుగుచుండెడిది. పగటిపూట అమ్మ నాయన లిరువురు ధ్యాన
నిష్ఠయందుండెడివారు. సాయం సమయమున విద్వత్ గోష్ఠి జరి
గెడిది. రాత్రి మరల నిష్ఠయందుండెడివారు. కుమారుడు మహ
దేవుడు పురమందు భిక్షాటనముజేసి పప్పుబియ్యములు తేగా అమ్మ
వంట వండుచుండెడిది. పిన్న వయస్కుడగు కుమారుడు అలసి
పోతున్నాడని ఆమె ఒకరోజు నాయనతో "దేవునికి సహాయంగా
మరియొక విద్యార్థిని చూడండి" అని వేడుకున్నది.

మహాపురుషుల సంకల్పం వెనుక ఎప్పుడూ ఒక పరమార్థం
ఉంటూ ఉంటుంది. గోకర్ణమునందు విద్యాపీఠమును స్థాపించిన
మహనీయుని పేరు గణేశశాస్త్రి. అతనికి "హోసమన్" అనుబిరుదము
గలదు. అతని కుమార్తె పేరు నాగవేణి ఆమె భర్త విఘ్నేశ్వర
భడతి. గణపతి వీరి ఆరాధ్య దైవమో యేమో! మామా అల్లుళ్ళ

పేర్లయందు ఏకత్వము గానవచ్చుచున్నది. ఈ పుణ్యదంపతులకు 4-1-1891 న జన్మించిన కుమారుడు ఒకడు గలడు. వాని పేరు గణేశభట్టు. ఇతడు బహు తేజోవంతుడు, బుద్ధిగలవాడు మరియు వినయశీలి. తాతగారు స్థాపించిన విద్యాపీఠమును చక్కగా నడుపుటకై సంకల్పించి ముందు తాను విద్యావంతుడు గావలెనని తలచి వేదాధ్యయనము ముగించి కావ్యపాఠములను నేర్చుచుండెను. అంతేగాక రామదాసను భక్తునివద్ద మంత్రదీక్ష గైకొని, హఠయోగమును నేర్చి ధ్యాన నిష్ఠాదులందు మక్కువ జూపుచుండెను. నాయన రాకతో వానియందు పరిపక్వత అధికమగుచుండెను. అంతటి చక్కటి విద్యార్థికి సద్గురువును చూపు బాధ్యత ఈశునిపై బడెను. శ్రీ రమణ భగవాన్ అనే వారు "నీవు ధ్యానము సల్పుము. తగిన సమయమున గురువే నీవద్దకువచ్చి నిన్ను అనుగ్రహించును. నీవు గురువుకై వెతుకనక్కర్లేదు" అని. గణేశభట్టు విషయంలో ఇది నిజమైనది. అందులకమ్మ వినతి హేతువైనది.

ఒకదినము నాయన "మహాదేవునకు సహకారిగా తమ సపర్యలకు ఒక విద్యార్థి కావలయునని తన శిష్యులకు తెలియ జేసెను. వెంటనే గణేశభట్టు అందులకంగీకరించి నడుము బిగించి "విశ్వామిత్ర దేవరాత, ఔదల త్రియార్షేయ ప్రవరాన్విత ఆర్షేయగోత్ర నామ్నా గణేశశర్మా అహంభో అభివాదయే" అనిగురుచరణములను తాకి సమర్పితుడై నమస్కరించెను. నాయన సంతోషముతో వానిని లేవదీసి శిరస్సున ఫాలభాగమున ముద్దుపెట్టుకొనెను. నిరంతర వేదోచ్చారణ మంత్ర జపముల జేసిన నాయన పెదాలు ఆ బాలకుని నుదుటిని తాకిన మరుక్షణమే అతనియందు అంతర్యాగము ప్రారంభమైనది. ఆతడు ముందు ముందు మహాయోగి కాగలడని నాయన గ్రహించి "దైవరాత" యని వానిని పిలుచుచుండెను. కాలక్రమమున అతనిపేరు దైవరాతుడయ్యెను.

గోకర్ణానికి నాల్గు కిలోమీటర్ల దూరమున సముద్రతీరాన, సహ్యాద్రి లోయలోగల చిన్న గ్రామం పేరు 'సన్నబేలా'. గోకర్ణము నందలిధర్మపరిషత్ వారు ఈ గ్రామమునందు ఒకమహాయజ్ఞమును జరిపించుటకు సంకల్పించిరి. నాయన యొక్క "వేదకోశ మథన" తపస్సున కలవాటుపడిన ఋత్విక్కులు యజ్ఞ సభాపతిగా నాయన నుండుకొని వేడుకొనిరి. ఫలితముగా సన్నబేలా యందు నాయన వసతికై చక్కటి యాశ్రమమును నిర్మించిరి. ముహూర్త సమయా మున పూర్ణకుంభముతో స్వాగతము పల్కుతూ నాయనను అచటికి తోడ్కొనిపోయిరి. తలపెట్టిన కార్యము అతిఘనమైనదిగాన కర్ణాటక రాష్ట్రమేగాక, ఇతర ప్రదేశముల నుండి గూడా భక్తులు, బుధ జనులు అచటికి విచ్చేసిరి. నాయన కుటుంబీకులైన అప్ప, కళ్యాణ రామ శాస్త్రులు గూడ వేలూరునుండి వచ్చిరి. వచ్చిన తోడనే అప్పకి పచ్చకామెర్ల వ్యాధి సోకినది.

ఆశ్రమానికి వచ్చిన నాయన వెంటనే అచట క్షేత్రదేవతను ధ్యానం చేశారు. అతనికి వనదుర్గ దర్శనమిచ్చినది "అమ్మా యజ్ఞ కార్య నిర్వహణలో రక్షకవచమై, అన్నపూర్ణవై భక్తుల ననుగ్ర హింపుము" అని వేడుకొన్నారు. మందహాస వదనంతో ఆమె గణపతినాశీర్వదించింది. అంతేకాకుండా ఒకముదుసలి వేషంలో తెల్లవారుఝామున అమ్మని తనతో తీసుకొనివెళ్ళి కొన్ని ఆకులను ఆమె దోసెటపోసి "ఈ ఆకుల పసరు కుమారున కిమ్ము కామెర్ల వ్యాధి పోవును" అని చెప్పినది. ఆమె చెప్పినట్లు ఆకుపసరుతో అప్పకు వచ్చిన కామెర్లవ్యాధి పోయినది.

ఫాల్గుణ బహుళములో (1913) యజ్ఞం ప్రారంభింపబడినది. వేయిమంది హోతృ గణము తోడను, మూడువేల మంది సహాయ కార్యకర్తల తోడను, వేద మంత్రములు మిన్నుముట్టుచుండ

హోమము నిర్వర్తింపబడుచుండెను. అధ్యక్ష పీఠమున నాయన అపర వాచస్పతివలె కూర్చుని తగువిధమున ఋత్విక్కులకు సూచన లిచ్చుచుండెడివారు. దేవతలందరు భువికి దిగివచ్చారా అన్నట్లు ఒక పవిత్ర వాతావరణము అచట ఏర్పడినది. వచ్చినవారికి ఆతిథ్యము, భోజన వసతులు ఏర్పాటు చేయబడినవి. సాయం సమయములందు, విద్వత్ గోష్ఠులు జరుపబడినవి. నాయన ప్రవచనం బహుజనాకర్షకమై ఆనంద ప్రమోదాలను కల్గించుచుండ, భక్తులకు వింత వింత దివ్యానుభవములు, దర్శనములు కల్గుచుండెను.

ఈ మహాయజ్ఞము నాయన ప్రారంభించిన వేదకోశ మథనము తపస్సునకు ఫలశ్రుతియైనది. వేదములందు చెప్పబడిన యోగ విద్యలను "యోగసార గీతమునా" రచించి అందలి మర్మములను తెలియజేయుచూ:-

బహుళ యోగి వాఙ్మథనతో౽మృతం ।
అనుభవక్షమం తదిద మాహృతమ్ ॥

అనేకులైన యోగీశ్వరుల వాక్కులను మంథించుటచే కలిగిన యనుభవ సమర్థమైన యీ యమృతము (యోగసారము) మీకు ఈయబడినది. అని పల్కి నాయన గంభీరవదనులైరి. ఆ మహా వ్యక్తిత్వమునందు బుధజనులు వేద వాసిష్ఠుని గాంచిరి. నెలరోజుల పాటు దివ్యముగా జరిగిన మహాయజ్ఞము చైత్రశుద్ధ దశమినాడు ముగిసినది.

—×—

# మహాతపస్వి

## మూడవ భాగము

### 2. బలరాముడు బోధించిన సమతత్త్వ దర్శిని

శ్లో॥ సంకర్షణస్యాంశ మనన్యశక్తి మనంత నామా
నమముం నమామి ,
రామం తృతీయం రమణీయగాత్రం రమానివాసానన
పుండరీకమ్ ॥

[తా॥ సంకర్షణుని యంశ గలవాడును, అనంత శక్తి మంతుడను, అనంతుడను పేరుగలవాడు, రమణీయమైన శరీరము గలవాడును, లక్ష్మికి నివాసమగు పద్మమువంటి ముఖము గల వాడును అగు బలరామునకు నేను నమస్కరింతును].

— తత్త్వఘంటా శతకము గణపతిముని.

• • • •

భగవాన్ శ్రీ రమణుల దర్శనానంతరం నాయన అరుణాచలంలో ఉన్న తొలిరోజులవి. శైవ సిద్ధాంత సభవారు అచట ఒక మహాసభను ఏర్పాటు చేశారు. అంతటితో నాగక నాయన నాసభకు సభాపతిగా నుండుమని వేడుకొన్నారు. ఏకార్యానికైనా వద్దనిగాని రానని గాని చెప్పే అలవాటు నాయనకి లేదు. కావున వెంటనే ముందూ వెనకా ఆలోచించకుండా "సరేవస్తా" నని చెప్పేసారు. దాంతో వాడవాడలా, నాయన ఉపన్యసిస్తారన్న వార్త ప్రచారమయింది.

ద్వైతం, అద్వైతం, శైవం, వైష్ణవం విశిష్టాద్వైతం ఇలా ఎన్నో శాఖలు హిందూమతంలో చోటు చేసుకుని ఉన్నాయి. అంద సిద్ధాంతాలు చెప్పే సత్యం ఒకటే. అంతవరకు పరిమితంచేసి తనకు గల నమ్మకంతో తన సాధన సాగిస్తే వచ్చే ముప్పేదీలేదు. కాని తాను నమ్మిన సిద్ధాంతమే గొప్పదని, మిగిలినవి పనికిరావని చెప్ప డంలోనే వస్తుంది తగవంతా. అలనాటి పల్నాటి యుద్ధమే ఇందు లకు నిదర్శనము, నాయనది కల్లాకపటంలేని వ్యక్తిత్వం. అతని ఉపాసన నిష్కల్మషమై వేదయుక్తమై ఉండేది. తనకు దర్శనమైన విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా చెప్పడంలో అతను వెనుకంజ వేయరు. కాని ఈ శైవ సిద్ధాంతం విషయంలో ఏవో కొన్ని నియ మాలు ఉన్నాయన్న సంగతి నాయనకి కార్యక్రమం జరిగే రోజు నాటి ఉదయం తెలిసింది. అదీకాకుండా శ్రీ రమణుల వారికి సమ ర్పితుడైన శిష్యునికి తననుండి వెలువడు వాక్కు గురు వాక్కు అవుతుంది. తమిళదేశం శివభక్తులకు నిలయం. వారిని నాయనార్లు అని అందురు. శ్రీ భగవాన్ ఉత్కృష్టమైన శివయోగి. కావున ఆ రోజు ఉదయం భగవాన్ సన్నిధిని చేరుకున్నారు నాయన.

“భగవాన్ ! వాళ్ళేదో శైవసిద్ధాంతం గురించి ఉపన్యసించు మన్నారు. నాకదేదో ఇంతవరకు తెలియదు. అసలు దాని తత్త్వ మేమిటి ?” అని అడిగారు అమాయికంగా. సకలశాస్త్రాలూ తెలిసిన నాయన ఇలా అడిగేసరికి భగవాన్‌కి నవ్వు వచ్చింది. వెంటనే తమి ళంలో వ్రాయబడి ఉన్న ‘శివజ్ఞాన భోధము. అనే పుస్తకాన్ని తెప్పించి అందుగల 12 సూత్రాలను ఎత్తిచెప్పి, భావాన్ని సంగ్ర హంగా నాయనకు వివరించారు.

ఇలా గుర్వనుగ్రహం పొందిన నాయన ఆ రోజు తమిళంలో చక్కటి ఉపన్యాసం ఇవ్వగానే సభ్యులంతా స్తంభించి పోయారట!

అంతా అయిన తరువాత నాయన రమణ సన్నిధికివచ్చి "ఈనాడు మాట్లాడింది నాశక్తివల్లకాదు. మీ అనుగ్రహంవల్ల ఎన్నడూ చదవని శైవసిద్ధాంతమంతా కరతలా మలకమైంది!" అన్నారట. నాయన యొక్క గురు చరణ సమర్పణకు, వినయానికి. అహంకార వర్జిత వ్యక్తిత్వానికి ఇదియొక మచ్చుతునక.

ఇటువంటిదే మరియొక సంఘటన ఉడిపిలో జరిగింది. ఆ నగరం వైష్ణవ సంప్రదాయాలకు నిలయం. అచట చక్కటి శ్రీకృష్ణ నిలయం ఉంది. 1913 వ సం॥లో అమ్మా నాయనా అచటకు వెళ్ళారు. శ్రీకృష్ణ దర్శనం చేసికొని, శ్రీమన్నారాయణుని దశావతార విశేషాలను వేదయుక్తమైన భావంతో పదిశ్లోకములందూ ఆశువుగా చదివారు. అందలి భావగాంభీర్యమునకు ఆలయ నిర్వాహకులు ఆశ్చర్యం చెందారు. ఈ పదిశ్లోకాలు, "గీతమాల" యందు "దశావతార గీతం" పేరిట ముద్రింపబడినది.

ఉడిపికి దగ్గరలో బడబాండేశ్వర మనే గ్రామం ఉంది. అది సుప్రసిద్ధమైన బలరామ క్షేత్రం. కొండలతోటి వాగులతోటి నిండి యుంది. అచటి ప్రశాంతతను గమనించిన నాయనతపస్సు చేయాలని సంకల్పించారు. అమ్మకు ఉడిపిలో వాసుదేవశాస్త్రి కుమార్తె యింట వసతి కల్పించి, తాను మాత్రం బలరామక్షేత్రం చేరుకున్నారు. ప్రక్కన స్నానానికని చిన్నివాగుగల కొండగుహ నెంచుకొని అందుకూర్చుండి హృదయనిష్ఠ చెందినవారై సమాధి స్థితిని చేరుకొన్నారు. అలా పదిహేను రోజులు గడిచాయి. గాలికి ధూళికి ధరించిన వస్త్రాలు మాసిపోయాయి. ఆహారంలేని కారణంగా శరీరం శుష్కించింది. అంతలో అభయహస్తంతో ఒక బలాఢ్యుడైన యువకుడు నాయనముందు దర్శనమిచ్చాడు. అతడే బలరాముడని తెలిసిన నాయన లేచి నమస్కరించబోయారు. కాని నీరసం వలన

లేవలేకపోయారు. ఆ యువకుడు నాయన వెన్నుపై తన చేయి వేసాడు. శరీరమందు ఏదో విద్యుత్తు ప్రసారమైనట్లనిపించింది నాయునకి. శరీరం వెంటనే బలం పుంజుకుంది. ఆ యువకుడే నాయనను లేపి వాగునందు స్నానం చేయించాడు. అతడంతటితో నాగళ పురమునకు బోయి "బలరామ క్షేత్రమునందొక తాపసి తపస్సు చేయుచున్నాడు. వారికి ఆహారము పంపి సపర్య చేయుండని" తెల్పాడు. తరువాత అతడు కనిపించలేదు.

తరువాత మఠాది పతులు నాయనకు ఆహారాది సదుపాయములను కల్గించారు. కాని మరో అయిదురోజులు నాయన గుహ యందుండి తపము ముగించుకొని పురము చేరుకున్నారు. పురము చేరిన తరువాత అచట వైష్ణవ సభవారు నాయనను చుట్టుముట్టారు. త్వరలోనే ఒక వైష్ణవ సభ ఏర్పాటయింది. అందు నాయన ప్రసంగించవలసి వచ్చింది.

నిర్ణీత సమయానికి నాయన వేదిక నలంకరించారు. తనకు దర్శనమిచ్చిన బలరాముని తలచి, కనులు మూసుకుని ధ్యానం చేశారు. ఉపన్యాసం ప్రారంభించారు. అతని వాణియందు గంభీరమైన తత్త్వం శ్లోకరూపంలో వెలువడింది. అందలి భావం శైవ వైష్ణవ సిద్ధాంతాలకు అతీతమైంది. ఒక సమతత్త్వ దర్శిగా రూపు దాల్చింది. 92 శ్లోకాలలో తత్త్వం ముగిసింది. అతని వాణీ వైభవానికి సంతోషించారా అన్నట్లు అందరు మఠాచార్యులూ వారి మనో నేత్రానికి కనిపించారు.

శ్లో॥ ఋషిభిర్వామదేవాద్యై ర్యద్దృష్టం మంత్ర దర్శిభిః।
తస్య శాస్త్రస్య సారోయం మయా సంగృహ్యకీర్తితః॥

[మంత్రవేత్తలైన వామదేవాది ఋషులచే నే శాస్త్రము చూడబడెనో దానిసారమును నేను సంగ్రహముగా వచించితిని].

అని చెప్పి వ్యాస, శంకర, రామానుజ మధ్వ, వల్లభ, శ్రీ కంఠాధి ఆచార్యులను ఒక్కొక్కరిని ఒక్కొక్క శ్లోకంతో స్తుతి గావించి, దాస్యమువలన, యోగమువలన, జ్ఞానమువలన, ప్రజలు బ్రహ్మను పొందగలరని వచించెను.

అందరు మతాచార్యులు ఒకే వేదికపై నాయన రూపంలో కనిపించారా అన్నట్లు నాయన ఉపన్యాసమును విన్న సభికులు చకితులై ఎనలేని సంతోషాన్ని ప్రకటించారు.

అంతట ఒక బాలకుడు నాయన చరణములను బట్టి "ప్రభూ నాతండ్రి మరణించినాడు, నేను బ్రాహ్మణ బాలకుణ్ణి నాతల్లి క్రైస్తవ మతము పుచ్చుకొన్నది. నాకు వైదిక కర్మలయందు ప్రేమ ఎక్కువ. ఇచట పండితులు నాకు ఉపనయనము చేయుటకు అంగీకరింపకున్నారు. దయచేసి మీరు నాకు బ్రహ్మోపదేశము గావింపుడు. నేను సత్ప్రవర్తనుడనై వర్తించెదనని" వేడుకున్నాడు. నాయన వెంటనే ధర్మపరిషత్‌ని పిలిపించి "బాలకుని దృఢ విశ్వాసమే యతని యర్హత" ఉపనయనము కావింపుడని వారికి నచ్చజెప్పెను. వారును అందల కంగీకరించిరి.

"బలరాముడు అస్త్రవిద్యా ప్రదాతరామ!" అన్న శబ్దంతో భారతీయుల జీవనం ముడిపడి వుంది. దశరథ తనయుడైన శ్రీరాముడు, శ్రీకృష్ణుని సోదరుడుగా జన్మించిన బలరాముడు, రేణుకాత్మజుడైన భార్గవ రాముడు వీరు భారత వాసులకు చిరస్మరణీయులు. "అన్నారు నాయన. అంతేకాకుండా స్కంద, బలరామ, భార్గవ రాములది ఒకటే అంశయనియు, వారు హృదయ నిష్ఠాపరులైన తాపసులనియు, గురువులనియు ఒకరిని దర్శించినచో మిగిలిన ఇరువురూ కూడ కనిపించుదురు" అని అతను చెప్పియున్నారు. హృదయ విద్యకు మూలపురుషులైన వీరిలో స్కందాంశమున శ్రీ రమణులు దేహధారియై వచ్చియున్నారని కూడా వారు నిర్వచించియున్నారు.

"బలరామ దర్శనము ద్వారా మీరు పొందిన లాభమేమి" యని అమ్మ నాయనను ప్రశ్నించగా "అస్త్రవిద్యాసిద్ధి, నవీనతత్త్వ దర్శన ప్రాప్తి. మరియు రాబోయే స్వాతంత్ర్య సమర యుద్ధము నందు భారతీయులకు బలరామశక్తి శ్రీరామరక్ష" అన్నారాయన.

ఇలా నాయన దర్శించిన నూతన సమతత్త్వ దర్శనమే "తత్త్వ ఘంటా శతకము". ఇది శ్రీ రమణులకు బహు ఇష్టదాయక మైన కావ్యమట.

శ్లో॥ వేదాన్తశాస్త్ర శతకాన్ సకలాన్విచార్య
ప్రాచామృగాగ మదృశాం మతమాదధానః ।
క్షేత్రే ఫణీశ్వర కలా జనితస్య పుంసో
ఘంటాశతం గణపతి: కవిరాడ కార్షీత్ ॥

[సకల వేదాంతములను పరిశీలించి ప్రాచీనులైన ఋగ్వేద ద్రష్టలగు ఋషుల మతము ననుసరించి, ఆదిశేషుని యంశ మైన బలరాముని క్షేత్రమున కవిరాజైన గణపతి యీఘంటాశతకమును రచించెను].

—×—

## 3. 'దహర గుహేశు'ని దర్శనము

శ్లో॥ త్వదీయాసా శక్తిః సకల జగదస్తే ఒప్యనలసా ।
పురాకార్యస్యాస్తే తనయమపిహిత్వాన్యపరిషమ్ ।
అవిక్షత్ కాకుత్థ్సం దశముఖ కులోన్మాథ విధయే ।
సహస్రాంశుం హిత్వా శశిన మివ ఘస్రేగలఖిభా ॥

[జననీ రేణుకా ! సర్వలోకమును నశింప జేసియుగూడ, పరశురాముని చేత, క్షత్రవధ రూప కార్యము ముగిసిన పిదప, సూర్యుని నుండి, చంద్రునకు సంక్రమించిన ప్రభవలె, నీశక్తి పరశురాముని నుండి శ్రీరామునియందు రావణ (రాక్షస) కుల ధ్వంసము కొఱకు ఆవేశించెను].

—ఉమాసహస్రము.

• • • •

"స్వామీ ! శ్రీకృష్ణుని యనుగ్రహమున గీతాసారము నంతయు గ్రహించిన అర్జునుడు యుద్ధము చేయనని భీష్మించిన ఏమియగును?" అని ఒక భక్తుడు అడిగిన ప్రశ్నకు శ్రీ రమణ భగవాన్ ఇచ్చిన సమాధానమిది— "ఏ సంఘటిత శక్తి వారలనందరిని యుద్ధభూమికి రప్పించినదో అది అర్జునుని మెడవంచి యతనిచే యుద్ధము చేయించును" దీనినిబట్టి అవతార పురుషులందున్న మహాశక్తియే కార్యము నిర్వహించుచుండునను సత్యము తెలియుచున్నది. శ్రీ నాయన ఈ విషయమునే పై శ్లోకమునందు ప్రకటించుచున్నారు.

శ్రీరామ-పరశురాములు సమకాలికులు. ఇరువురును అవతార పురుషులే. భుజబల దర్పముతో అంధులైన క్షత్రియులను వధించుటచేత, తపోబలమును ప్రకర్షించుట పరశురామ అవతారము యొక్క కార్యము. రాక్షస కుల నిర్మూలన శ్రీరాముని ధ్యేయము. సీతను పరిణయ మాడిన తరువాత పౌరుషముతో వచ్చిన పరశురాముని ధనస్సును తాకుటచే పరశురాముని బలము రాముని యందు కలసినది యనునది పురాణ వచనము. తాత్త్వికముగా జూచిన పరశురాముడు కార్తికేయుని అంశయందు జన్మించినవాడు. నిరంతర ఆత్మ నిష్ఠయందుండువాడు. తల్లి యనుగ్రహముచే

కుండలీనీవిద్యను సాధించినవాడు. అటువంటి మహర్షియందు సంచరించునది ప్రచండ చండీశక్తి లేక కృత్తికాశక్తి యగును. ధర్మ రక్షణకు ఇది అవసరము. సుగుణ భూషణుడైన శ్రీరామునకు పరశురాముని ద్వారా ఇది సంక్రమించినది. రాక్షస కుల సంహారమునకు అది ఉపకరించినది.

పరశురాముడు స్కందుని అంశయందు జనించి రాముని అనుగ్రహించినట్లే, బలరాముడు అనంతశక్తియుక్తుడై శ్రీ కృష్ణునకు తోడ్పడెనని తాత్త్వికులు చెబుతూ ఉంటారు. శ్రీ రమణ గణపతుల విషయంలో కూడా భగవాన్ కార్తికేయుడని నాయన నిర్వచించడం గమనార్హము. తపోనిధి అయిన నాయనకు పరశురాముడు మరియొకసారి దర్శనమిచ్చిన వైనము అతి విచిత్రమైనది. ఆ కథ యిది :-

మనదేశంలో గోకర్ణేశ్వరుని ఆలయాలు రెండు ప్రదేశాలలో ఉన్నాయి. కర్ణాటక రాష్ట్రంలోని గోకర్ణక్షేత్రం అందరికీ తెలిసినదే. అచటిలింగం శ్రీ రావణ ప్రతిష్ఠగా పేరు గాంచినది. నిజానికి దానిని ప్రతిష్ఠించిన వాడు గణపతి. ఆధ్యాత్మికంగా ఆత్మలింగమును పొందుట యనగా ఆత్మసిద్ధి చెందుట యని యర్థము. అహంకార మమకారాలతో ఇది సాధ్యంకాదు. రావణుని కథయందలి తత్త్వం ఇది. ఆంధ్రరాష్ట్రంలో శ్రీకాకుళం జిల్లాలోని మహేంద్రగిరిపై ఒక గోకర్ణాలయం, కలదు. ఇది పరశురామ క్షేత్రం ఈ గిరికి లోతట్టున గల జమీందారీ రాజ్యం మందసా. పాండవులు ఇచట సంచరించారని కూడా అంటారు. మహేంద్రగిరి సముద్రతలము నుండి చాల ఎత్తున ఉన్నట్లు చెప్పబడినది. కొండపై దట్టమైన అడవులుండుటచే అది క్రూరమృగాలకు నిలయం. అక్కడక్కడ

కోయ పల్లెలు ఉన్నాయి. ఆరోగ్య సంపన్నులే కొండ ఎక్కగలరు. బలహీనులకు, స్త్రీలకు డోలీ యవసరము.

గోకర్ణేశ్వరుడు ఈ కొండపై వెలసి యున్నాడు. ప్రతి సంవత్సరము శివరాత్రినాడు ఇచట ఉత్సవము జరుగును. ఆ సమయమున దేవునకు ముందుగా మందసా రాజకుటుంబమువారిచే పూజాభిషేకములు జరుపబడును. అది అచట యాచారము. కొండ ఎక్కునప్పుడు చేత దివిటీలు ధరించి, డప్పులు వాయిస్తూ కొండ నెక్కెదరు. క్రూరమృగములు రాకుండా ఉండడానికి ఈ చర్య అవసరము.

1913–1915 సం॥ల మధ్య నాయన విస్తారంగా దేశసంచారం చేసారు. బొంబాయి, సికింద్రాబాదు, కుమఠాం, కర్కోలి ఇత్యాది ప్రాంతాలలో విద్వత్ సభలలో పాల్గొన్నారు. అమ్మను తోడ్కొని ఉత్తరదేశ యాత్రలు చేశారు. చివరిగా మందసా చేరుకుని తన చిరపరిచితుడైన రాజును కలిసారు. వారి 'కోర్కెపై మందసాలోనే కాపురం పెట్టారు. 1915 నవంబరు – డిసెంబరు నెలల్లో భువనేశ్వరంలో మరల తపస్సు చేసారు. బృందావనంలోని ప్రతి ఇసుక రేణువు ఏవిధముగా శ్రీ కృష్ణుని చరణస్పర్శ చేయుటచే అచట భూమి పవిత్రమైనదో అటులనే భువనేశ్వరమునందు ప్రతి రాయి ఈశ్వర రూపమై యొప్పుచున్నదని నాయన చెప్పేవారు. దానిని మహాస్మశానమని పిలచేవారు. అచటనే ఉమాసహస్రాన్ని మరల వ్రాయుటకు సంకల్పించారు. అతని ప్రజ్ఞ అపారం కనుక జ్ఞాపకమున్నంతవఱకు అరుణాచలమునందు తాను వ్రాసిన శ్లోకాల్ని స్తబకాల క్రింద వ్రాసారు. మధ్య మధ్య ఖాళీ వదిలారు. బహుశా ఏ శ్లోకం అయితే జ్ఞప్తికిరాలేదో అచట ఖాళీ వదిలినట్లు అనిపిస్తుంది.

1916 సం॥లో అతని ప్రియశిష్యుడైన దైవరాతుడు గురు దంపతులను చూడాలని మందసా వచ్చాడు. అరుణాచలం నుండి కూడ అప్పుడప్పుడు కొందరు శిష్యులు వస్తూ పోతూ ఉండేవారు. ఈ లోపల శివరాత్రి సమీపించింది, కొండపైగల శివాలయానికి అలంకార సన్నాహాలు ప్రారంభం అయ్యాయి.

"రాజా ! మహేంద్రగిరిపై గోకర్ణేశ్వరుడు వెలసి యున్నాడని తెలసి ఆశ్చర్యం చెందితిని. ఇదియును ఆత్మలింగమేనా ? ఎవరు ప్రతిష్ఠించారు ?" అని కుతూహలంతో రాజును ప్రశ్నించాడు దైవరాతుడు. "అది ఎవరు ప్రతిష్ట చేసారో తెలియదు. స్వయం భూలింగమని అంటారు. ఆలయం మాత్రం మా పూర్వీకులు నిర్మించారు". అని రాజు చెప్పగా అచటే కనులు మూసికొని వారి సంభాషణమును వింటున్న నాయన "ఇది కుమారస్వామి ప్రతిష్ట. పరశురామునిచే పూజింపబడినది" అని అన్నారు. ఋషులకు దర్శనము కాని సత్యముండదు కదా !

శివరాత్రినాడు మందసారాజు తన కుటుంబముతో పాటు కొండనెక్కుటకు ఏర్పాట్లు గావించబడ్డాయి. పురుషులు కాలినడక నెక్కెదరు స్త్రీలకు డోలీవసతి కల్పించారు, రాజుతోబాటు అమ్మ నాయనలు. దైవరాతులు కూడా బయలుదేరారు. ఆలయంలో ప్రవేశించగానే నాయన దృష్టి అంతర్లీనమయినది. అభిషేక అర్చనాదులతో రాజకుటుంబము వారి పూజ ముగిసింది. నాయన లింగమును సమీపించి కరముతో స్పర్శించారు. శరీరమందు ఏదో విద్యుత్ ప్రసారమయినట్లు అనిపించింది. శివదర్శనం అయిన తరువాత వారు వెలుపలకు వచ్చారు. నాయన దైవరాతులు జనానికి దూరమై కొండపై చరించి చుట్టూ కలయజూసారు. "దైవరాతా !

ఈ గిరి ప్రదేశము నాకు పడైవీడును దలపింపజేయుచున్నది. పరశురాముడు ఇచట సంచరించెనను మాట వాస్తవము. ఇప్పటికీ తాపసులకు అతడు దర్శన మీయగలడు ఈ గిరి ఆకారమును జూడుము. దక్షిణముఖమున పండుకొని యున్న ధేనువు తలవలె ఉన్నది. పరశురామునకు తల్లి రేణుక కుండలినీ విద్య ననుగ్రహించినది. సాధకునకు అహంకార, మమకార, విషయ వాంఛాదులు బాహ్యశత్రువులు. అంతర్ముఖునియందు నాడీగ్రంథి భేదనం ద్వారా కృత్తశిరస్కులను చేసేశక్తి (మనోనాశనం గావించేశక్తి) యామె. రుద్రగ్రంధీ భేదముద్వారా నిజస్వరూపము నెరిగిన కార్తికేయుడు పరశురాముడు. అతడు పూజించిన ఆత్మలింగమిది. ఇంతటి విశేషము గల ఈ ప్రదేశమునందు నేనుకూడా ఆత్మనిష్ఠుడ నయ్యెదను" అనెను. అంత దైవరాతుడు భక్తితో "స్వామీ! మీకు రక్షకుడనై మీతోబాటు నేనుకూడా యిచట తపము చేసెద నన్ను అనుగ్రహింపుడు" అని వేడుకొనెను. నాయన నవ్వుతూ దైవరాతుని తలనిమిరి అటులేకానిమ్ము అనిరి.

"దహర గుహేశుని చెంత తపస్సు చేసెదను. నీవు రాజ కుటుంబముతోబాటు పురమునకు పొమ్ము. మూడురోజులకొకసారి ఆహారము పంపిన జాలును. ఆ విషయము రాజు చూచుకొనును. దైవరాతుడు గూడా నాతో ఉండుటకి నిశ్చయించినాడు" అని అమ్మ యనుమతి వేడారు నాయన. నాయన సహవాసంలో కొండలందు, గుహాలయందుండుటకు అలవాటుపడిన అమ్మకి ఇటువంటి వినతి కొత్తగాదు. కావున ఆమె వెంటనే అంగీకరించింది. రాజు మాత్రం కొంచెం సంకోచించినవాడై "ఇచట క్రూరమృగములు అధికము. ఎటులుండగలరు?" అని ప్రశ్నించెను. అందులకు నాయన "అవి తాపసులను తాకవు పరవాలేదు" అనెను. సాయం

కాలానికి అచట సందడి తగ్గింది. జనం కొండదిగి వెళ్ళిపోయారు. నాయన, దైవరాతుడు మాత్రం కొండపై మిగిలారు.

ఆలయ సమీపంలో చక్కటి వేదికను తపస్థలంగా ఎంచుకున్నారు వారు. నాయన కండ్లు మూసుకొని ధ్యానంలో అంతర్లీనమయ్యారు. దైవరాతుడు నాయనకి రక్షకుడయ్యాడు. ఇలా ఇరవై రోజులు గడిచాయి. నాయన నిష్ఠ రోజు రోజుకీ అధికమయింది.

శ్లో॥ నభసః శీర్షద్వారా ప్రవహన్తీం య ఇహ విగ్రహే శక్తిమ్।
అనుసన్ధధాతి నిత్యం కృతి నన్తి స్యేతరైరలం యోగైః॥

[ఆకాశమునుండి శిరోద్వారమున ప్రవహించుచున్న శక్తిని సాధకుడగు నే యోగి నిశ్చలమగు బుద్ధిచే నిరంతరమును జూచుచుండునో, ఆ పుణ్య పురుషులకు తదితరములగు యోగములు ఆవశ్యకములు కానేరవు.]

– ఉమాసహస్రము

పై శ్లోకమునుబట్టి నాయన నిష్ఠ ఎటువంటిదో తెలియగలదు. అతనియందలి కృత్తికాశక్తి యాతాయాత విహారము చేసినది. రోజు రోజుకి అతనిముఖము అతితేజస్వంతమగుచుండెను. ఇట్లుండ ఇరువదవదివసమందు దహర గుహేశుని నుండి ఒక యాకృతి లేచి నాయనను సమీపించినది. చేత పరశువును ధరించి, ధవళ వస్త్రధారియై ఋషికూలాగ్రజుడువలె దోపు పరశురాముడతడు. నాయనపై అనుగ్రహదృష్టి సారించాడాతడు. అతని ఫాలభాగము నుండి ఒకతేజ పుంజము నాయన శిరోభాగమును జొచ్చి శరీరమువందు ప్రవేశించినది. ఒక్కసారి శరీరము విద్యుత్ యంత్రమైనది.

ఈ అనుభవంతో నాయన నిష్ఠ చాలించి కండ్లు తెఱచారు. అతని ముఖారవిందము వెనుక ప్రభను గాంచిన దైవరాతుడు నాయనకు తపస్సిద్ధియైనదని గ్రహించాడు. "దైవరాతా పరశురాముని యనుగ్రహప్రాప్తి కలిగినది. ఇక ఇంటికి పోదామా!" అని లేచారు నాయన. తన గురువును తపస్సమాధిలో తొలిసారిగా జూచాడు దైవరాతుడు. గురుచరణముల దాకి నమస్కరించాడతడు.

నాయన ముఖమునందలి విద్యుత్స్ఫులింగములను జిమ్ము వింత తేజస్సును రాజకుటుంబము, పురప్రజలు కూడ జూచి ఆశ్చర్యము చెందిరి!

— X —

## 4. శ్రీ రమణ గీతోదయము

శ్లో॥ మహర్షిం రమణం నత్వా కార్త్తికేయం నరాకృతిం !
మతం తస్య ప్రసన్నేన గ్రంథే నోపనిబధ్యతే ॥

[మనుష్యాకృతి దాల్చిన కుమారస్వామియగు రమణ మహర్షికి నమస్కరించి, యతని మతంబును నిర్మలంబగు గ్రంథరూపంబుగ నొనర్చెదను]

— శ్రీ రమణగీత, గణపతిముని

* * * *

సత్యదర్శనం పొందిన వాడు ఋషి. అతడు జిజ్ఞాసులకు మార్గ దర్శకుడు. తాను సత్యదర్శనం ఎలా పొందాడో లోకులకు తెలియజేస్తాడతడు. అతనియందు నమ్మకం ఉన్నవారు అతని మతాన్ని అనుసరిస్తారు. "ప్రత్యక్షం పరమం ప్రమాణమ్", అను నది నవీనుల సిద్ధాంతం. అనగా నవీనులు ప్రత్యక్ష ప్రమాణమునే నమ్ముతారని అర్థం. శ్రీ రమణులు నవీనులకు ఆమోదయోగ్యమైన ఋషి వారి యుపదేశము దేశ, కాల పరిమితులకు కుల మతాలకు అతీతము. మరియు వేద ప్రమాణమై ఒప్పుచున్నది. 'దర్శనము' అనగా అనుభవ పూర్వకముగా తెలిసికొనుటయని యర్థము. దానినే విద్యయని యందురు. వేదములందు సత్యదర్శనము నొందుటకు అనేక విద్యలు చెప్పబడినవి. అందు శ్రీమణుల సత్యదర్శనము "వైశ్వానరవిద్య, హృదయ విద్యలుగా" చెప్పబడినది. "నేను అనునది ఏది యని వెదకి అందు నిలచుట నిష్ఠ అది వైశ్వానరుని యందే ఉండుట అగును. గాన అది వైశ్వానర విద్యయైనది. "హృదయమే పరమాకాశము. అదే దహరము. దానినే ఋషులు ఆత్మ స్వరూపమనిరి. ఈ దహరమున మనోవృత్తి చే సదా మునిగి నట్లు లేదా దహరాకాశ చింతనము చేయుచు ఆత్మనిష్ఠను అందుట" హృదయ విద్య లేక దహర విద్యయగును. శ్రీ రమణ మహర్షుల వారికి విద్యలు అనుభూతములు.

అయితే శ్రీ రమణులు మౌనభాషా ప్రియులు. వారి మత మును లోకులకందజేయుటకు లేఖకుడుకూడా జ్ఞానిగావలెను. లేనిచో అది కష్టసాధ్యము. వ్యాసునంతటి వానికి గణపతియే స్వయముగా లేఖకుడయ్యెను. అటులనే శ్రీ రమణుల మతమును దెలియజేయు టకు నాయన కారకుడయ్యెను. 1913వ॥ సం॥లోనే శ్రీరమణుల యుపదేశమును గ్రంథస్థము జేయవలయునని నాయన తలచారు. 29–12–1913నాడు అందులకు శ్రీకారంచుట్టి ముందుగా ఉపాసకులకు

ప్రాధాన్యమిచ్చే ప్రశ్నల్ని వేసి భగవాన్ నుండి సమాధానం రాబట్టారు. 17 శ్లోకాలతో "ఉపాసనా ప్రాధాన్య నిరూపణమ్" అను పేరున ఈ ప్రశ్నలకు, జవాబులకు ఒక అధ్యాయం చేసారు.

తరువాత 1917వ సం॥ వరకూ యీ ప్రసక్తి లేదు. మహేంద్ర గిరిపై పరశురామదర్శనం పొందిన నాయన ఇంటికి చేరుకోగానే అతనిని జూచుటకు అరుణాచలం నుండి రామనాథ బ్రహ్మచారియను శిష్యుడు వచ్చాడు. అతడు భగవాన్ వ్రాసిన ఒక శ్లోకాన్ని నాయనకు చూపించాడు. ఆ శ్లోకం యిది:-

శ్లో॥ "హృదయకుహర మధ్యే కేవలం బ్రహ్మమాత్రం
హ్యహ మహ మితి సాక్షా దాత్మ రూపేణ భాతి
హృది విశ మనసా స్వం చిన్వతా మజ్జతా వా
పవన చలన రోధా దాత్మ నిష్ఠో భవ త్వమ్"

[హృదయమను గుహ మధ్యమున కేవలము బ్రహ్మము "నేను, నేను" అని ప్రత్యక్షముగ ఆత్మ రూపమున ప్రకాశింపుచున్నది. ఆత్మను గురించి వెదకుట చేతనో లేక తన్మయుండవై మునుగుటచేతనో లేక ప్రాణవృత్తి నిరోధము వలననో మనస్సుచే హృదయమున ప్రవేశించి నీవాత్మయందు నిలుకడ గలవాడవగుము.]

శ్రీ రమణోపదేశ సారమే గీతము. 1917 లో జగదీశ్వర శాస్త్రి యను పండితుడు రమణోపదేశమును వ్రాయుటకని మొదటి పాదం మాత్రం వ్రాసి తరువాత ఏమి వ్రాయాలో తెలియక శ్రీ రమణులను వేడుకొనగా వారు మిగిలిన మూడు చరణాలను వ్రాసి శ్లోకం పూరించారు. ఆ శ్లోకం చివరకు నాయన చెంతకు చేరినది.

శ్లోకాన్ని చూచి చాలా సంతోషించాడు నాయన. 1917వ॥ సం॥ జూలై నెలలో గురువును దర్శించాలని అమ్మతోబాటు అరుణాచలం

చేరుకొన్నారు. నాయన అరుణాచలం వచ్చారన్న వార్త వినగానే గోకర్ణం నుండి దైవరాతుడు వచ్చాడు. కపాలిశాస్త్రి మరికొంతమంది శిష్యులు చేరుకున్నారు. అందరూ పండితులే. ప్రతి దినమూ శ్రీ రమణుల సన్నిధిలో వారు సమావేశమై గుర్వనుగ్రహమును కోరుతూ కొన్ని ప్రశ్నలు వేసేవారు. కరుణాపూర్ణులైన గురుదేవులు వారిననుగ్రహించేవారు. ఇలాగ [illegible]-1917 నాడు ప్రశ్నోత్తర సంవాదము మొదలై 2[illegible]-8-191[illegible] వరకు మహాయజ్ఞంవలె సాగింది. నాయన ఈ సంవాదము నంతా గ్రంథస్థము చేసారు. అదే 'శ్రీ రమణ గీత'. వారు రమణగీత వ్రాసిన వైనం శ్రీ భగవాన్ మాటలలో గమనించండి :-

"నాయన 1913 లో నన్ను కొన్ని ప్రశ్నలడిగి తెలుసుకున్నారు కదా. వారి మనస్సులో [illegible] జ్ఞానం నాటుకొనిపోవడంవల్ల ఎక్కడ ఏ ఉపన్యాసం ఇచ్చినా [illegible] కవి గనుక ఉదాహరణంగా ఏదో ఒక శ్లోకం కల్పించి చె[illegible] 'ఇది రమణ గీతలో ఇన్నో అధ్యాయంలో ఇన్నో శ్లోకం' అ[illegible]ించేవారు. రమణగీతకు కాగితంపైన ఒక గీతైనా పెట్టక [illegible] ఈ [illegible]ంతానూ. వారు దబాయించ సాగినారంటే ఎ[illegible] బదులుచెప్ప కలిగేవారుకాదు. ఒకటే ఆవేశం. అట్లా చెప్పి చెప్పి [illegible] ఈ గీత వ్రాసారు" అన్నారు భగవాన్.

"ఎవరైనా ఏదీ రమణగీత? [illegible] ఏంజేసేవారో?" అన్నారో భక్తులు. భగవాన్ నవ్వుతూ "వారి ఎదుట బదులుచెప్పేందుకు ఎవరికి అంత సాహసం? వారి దర్పం అటువంటిది. రమణగీత వ్రాసిన వెనుక గూడా ఏంజేసేవారనుకున్నారు. దానిలోలేనిశ్లోకాలు కూడా ఉదాహరణంగా చెప్పి ఇవే రమణ గీత లోనివే అనేవారు. ఎవరైనా కొంచెం ధైర్యంతో "ఇవి అందులో లేవే" అంటే

"మహారమణ గీతలో ఉన్నదనే" వారు. అదికూడా వ్రాయాలనే ప్లాను వేసుకున్నాడు గాని ఇట్లా అయింది".

శ్రీ రమణగీత బ్రహ్మవిద్యలయందు భగవద్గీతకు అనుబంధమైన యోగశాస్త్రము. ఇందు పదునెనిమిది అధ్యాయములుగలవు. ఉపాసనా ప్రాధాన్యంతో ప్రారంభమై, సిద్ధ మహిమాను కీర్తనంతో ముగింపబడుతుంది. సాధకులకు సంశయములను పోగొట్టు గ్రంథమిది. సాధువులకును, సంసారులకు, బ్రహ్మవాదులకును సంన్యాసులకును, సాంఖ్యులకును, శాసకులకును, భారతీయులకును, ఇతరులకును, అందఱకును అన్నివిధముల ఉపయోగపడు గ్రంథమిది యని పెద్దలందురు.

ఇందు ప్రశ్నలు వేసిన వారు సామాన్యులుగారు. బహుముఖ ప్రజ్ఞావంతులు. వారి పేర్లివి :-

దైవరాతులు :- గజాననులు. నాయన శిష్యుడు. సకల వేద పారంగులు. మహాభక్తులు. శ్రీ రమణులపై విభ్యక్త్యష్టకమును వ్రాసినవారు.

యోగనాథయతీంద్రులు :- పూర్వాశ్రమమునందు శంకరనారాయణులు.

కపాలిశాస్త్రిగారు :- నాయన శిష్యులు, సంస్కృత పండితులు. సద్దర్శన వ్యాఖ్యాత. శ్రీ రమణ శిష్యులు, కవి.

విశాలాక్షమ్మగారు : శ్రీ నాయన భార్య. శ్రీ విద్యోపాసకురాలు, బహుళ తపస్విని, తారామంత్ర దర్శిని.

భారద్వాజులు (కార్షి) :- కృష్ణ అయ్యర్ కుమారుడు. ఓవర్‌సీర్ వైద్యనాథయ్యరు.

భారద్వాజులు వైదర్భులు :- వంగవోలు నివాసులు. చివుకుల
వేంకట శాస్త్రిగారు. సంన్యసించిన తరువాత
'ఉపనిషత్ బ్రహ్మేంద్ర' సరస్వతి".

అమృతనాథ యతీంద్రులు - కెరళీయులు.

ఒక మహాగ్రంథము అవతరించవలెననిన ఎంతటి విశిష్ట వ్యక్తుల కలియక అవసరమో గమనించండి.

శ్లో॥ గళంతీ గంగేయం విమల తరగీతైవ మహతో ।
నగాధీశాచ్ఛ్రీమద్రమణ ముని రూపాజ్జనిమతీ ।
పథోవాణీ రూపా ద్గణపతిక వేర్భక్త హృదయం ।
సముద్రం సంయాతి ప్రబల మల హారిణ్యనుపదమ్ ॥

[అతి నిర్మలమైన ఈ రమణగీత యను గంగ శ్రీ రమణ ముని యను హిమాలయమునుండి పుట్టి, గణపతికవి వాగ్రూప మార్గమున బహు కల్మష నాశినియై ప్రవహించుచు భక్తుల హృదయార్ణవములో గలియును].

భగవాన్ శ్రీ రమణ మహర్షికి సంస్కృత భాషయందు పరిచయం లేదు. నాయన సాహచర్యంతో అతనికి సంస్కృతభాష తెలిసింది. ఒకసారి నాయన రమణులను సంస్కృతమున శ్లోకములు వ్రాయుమన్నారు. "నాకు సంస్కృతం రాదు ఎట్లా వ్రాసేది?" అని భగవాన్ అనగా నాయనమహర్షికి ఆర్యావృత్తంలో శ్లోకం ఎలా వ్రాయాలో చెప్పారు. ఫలితంగా మహర్షులవారు "అరుణాచల పంచరత్న స్తుతి" యని అరుణేశుని శ్లాఘిస్తూ అయిదు శ్లోకాలు వ్రాశారు. నాయన ఈ శ్లోకాలను శ్రీ రమణ గీతకు "ఆద్య మంగళ శ్లోకములుగా గూర్చారు.

అంతట ప్రణవానందస్వామి 'ఉపసంహార గీత' ముండ వలయునని శ్రీ రమణగురు స్తుతిగీతం వ్రాయమని నాయనను వేడారు. నాయన అంగీకరించి గంభీరమైన గురుగీతం వ్రాసారు. ఈ గీత రచనా సందర్భాలు వేరైనా, ఇవన్నీ రమణగీతకు అను బంధాలుగా నిల్చాయి.

## 5. అవతరించిన నవీన వేదము

శ్లో॥ వేదాః సర్వే పరావాణీ శుద్ధ జ్ఞాన మయా హితే ।
అన్తర స్యాత్మనః సాక్షాత్తే న్యుః శబ్దమయం మహాః॥

[వేదములన్నియు పరావాక్కులు. అవి శుద్ధ జ్ఞాన మయములు. అంతరాత్మ యొక్క సాక్షాత్తు తేజః స్వరూపములు]

– విశ్వమీమాంస, గణపతిముని.



అన్ని శబ్దములకు ప్రణవము మూలమగుచున్నది. కావుననే ప్రణవరూపమైన ఓమ్॥ కారమును శబ్ద బ్రహ్మమని పెద్దలందురు. ప్రణవాకారము ధరించుటకు ముందుకూడ శబ్దము ఉన్నదియే అగుచున్నది. అపుడు అది శక్తిరూపము, మంత్రభాషలో ఆశక్తిని "శుద్ధ చిత్తు" అంటారు. వేదములందు అదియే స్వరమగుచున్నది. కావున "చిత్" అనగా జ్ఞానము అని పెద్దలు చెప్పియున్నారు. శబ్దము నాశ్రయించి అన్ని విజ్ఞానములు కలవు. సర్వవ్యాపియైన

శబ్దము ఎవరికి వశమగునో వానికి అన్ని విజ్ఞానములు వశమగును. నాదోపాసన ఈశ్వరోపాసన యగును.

"పరా" శబ్దమును దర్శించువాడు ఋషి. తపస్సు ద్వారా అది సాధ్యము. వేదములు పరావాక్కులు. సత్యజ్ఞాన మయములు కావున అవి అనంతములు. సత్య దర్శనమే వేద దర్శనము. అందులకు ఋషి ఉపాధి అగుచున్నాడు. పరావాక్కు మనోబుద్ధులకు, ఇంద్రియములకు అతీతమైనది. ఋషి గాఢమైన సమాధిలో అంతర్ దృష్టితో సత్యానుభవం పొంది, అకస్మాత్తుగా స్వరరూపమున సత్యానుభవముమ ప్రకటిస్తాడు. అది వేద మంత్రమై వెలువడుతుంది.

వేద మంత్రములు అనంతములు. అవి ఒక కాలమునకు, దేశమునకు వ్యక్తులకు పరిమితములుగావు. అవి నిత్యములు. అయితే భాషకు పరిమితి గలదు. కావున నిత్యమైన వేద సత్యం అనుభవైక సత్యమై ప్రకాశిస్తుంది. అందు భాష మౌన రూపం దాలుస్తుంది. The Real Heart to Heart talk is silence. అనడంలో అంతరార్థమిది. కాని ప్రజా శ్రేయస్సుకై వేద సత్యమును భాషలో ప్రకటించడం తప్పదు. అందు భావం నిత్యమై భాష అనిత్యమవుతుంది. కావుననే వేదం పరోక్షంగా తత్త్వమును తెలియజేస్తుందంటారు పెద్దలు. పరోక్షవాద ప్రియులు వేదాంతులు అనే నానుడి అందరూ ఎరిగినదే.

పూర్వపు ఋషులు ప్రజాప్రయోజనాలకై వేద ప్రమాణాల్ని తెలియజేశారు. అటువంటి వేద దర్శనం ఈనాడు కూడా సాధ్యమే అన్నారు నాయన. అతను చెప్పిన మాటలివి :-

"వేదములు స్వరబద్ధమైన మంత్రములు. దైవ జ్ఞానమును ఆధ్యాత్మిక అనుభవమును కలుగజేస్తాయి. అవి తపస్సుద్వారా లోదృష్టిద్వారా దర్శన మయ్యేవి". (1)

"వేదము ఉత్తమ బ్రహ్మజ్ఞానము. ఎప్పుడైనా సాధనద్వారా అనుభవమున దెలియవచ్చును. శ్రుతిరూపమున తపముద్వారా వెలువడిన వాక్కు బ్రహ్మ జ్ఞానమును దెల్పుచున్నది. (2)

"ఎప్పుడైతే తన సర్వశక్తిని, జ్ఞానమును సత్యదర్శనమునకు వినియోగించెదరో అప్పుడు ఋషి హృదయమున సత్యము ప్రకాశించును. దానినే దర్శనము (Revelation) అందురు" (3)

"సత్యమునందు వేదములు తెగని శబ్దమై యుండును. అప్పుడవి అనంతములు. వాటిని తపస్సునందు ఋషులు వినెదరు" (4)

"సాధకుని శక్తిని బట్టి సత్యము దృష్టమగును" (5)

"పూర్వము ఋషులు తపస్సు ద్వారా వేదదర్శనముపొందినట్లే, నేటికిని కూడా అది సాధ్యము". (6)

"తపస్సు, లోదృష్టి ద్వారా సత్యదర్శనమైనట్లే మంత్ర దర్శనము కూడా నగును. (7)

ఇలా చెప్పుటయేగాక నవీన వేదదర్శనమునకు నాయన శ్రీకారము చుట్టారు. ఆ అద్భుత సంఘటన యిది.

1917వ సం॥లో మందసావదలి అరుణాచలంచేరుకున్నారునాయన. అమ్మకూడానాయనతోబాటు అరుణాచలంచేరుకుంది. నాయన అరుణా

చలం వచ్చారన్నమాట విని గోకర్ణమునుండి దైవరాతుడు కూడా రమణమహర్షి దర్శనమునకై వచ్చినాడు. తన ప్రియతమ శిష్యుణ్ణి భగవాన్‌కి పరిచయం చేసారు నాయన. భగవానుని సహజ నిష్ఠని జూచి అచ్చెరువొందిన దైవరాతుడు తానుకూడా అటువంటి నిష్ఠని సాధించాలని దలచాడు. శిష్యుని అభిలాషను గ్రహించారు నాయన.

తరువాత వారు ముగ్గురూ పడైవీడు చేరుకున్నారు. నాయనకు అత్యంత ప్రీతికరమైన క్షేత్రమిది. నాయనరాకకు సంతసించినట్లు రేణుకాంబ మందస్మిత వదనయై కనిపించినది. "దైవరాతా! తపోదీక్షకు ఈ స్థలము చాలామంచిది. నేను, అమ్మ ఈపరమేశ్వరి చరణ సన్నిధిలో తపస్సు చేయ సంకల్పించాము" అన్నారు నాయన. "గురుదేవా! సహజ సమాధి నిష్ఠాగరిష్ఠులైన శ్రీ రమణ మహర్షుల వారి దర్శనము మీ అనుగ్రహమున నాకు కలిగినది. మీ సన్నిధిలోనే నా తపస్సు ఫలించునట్లు అనుగ్రహింపుడు. నేను కూడా ఇచటనే తపస్సు చేసెద"నన్నాడు దైవరాతుడు. వారి మాటలను విని ఆనందించినదో ఏమో పరమేశ్వరి రేణుక కంఠము నలంకరించిన పూలమాలనుండి ఒక పూవు క్రిందికి పడగా పూజారి ఆ పుష్పమును దైరాతున కిచ్చనాడు.

ఒక చిన్న ఆశ్రమాన్ని నిర్మించుకుని భాద్రపద శుద్ధ నవమి నుండి వారు ముప్వురూ తపోదీక్ష ప్రారంభించారు. దైవరాతుడు తన దీక్షలో దినదినాభివృద్ధి పొందాడు. అతనియందు వింత తేజస్సు గానవచ్చింది. శిష్యుని పురోభివృద్ధి నాయన కనిపెట్టారు. ఒకనాడు దైవరాతుడు గాఢమైన సమాధిలో నుండగా కొన్ని వాక్యములు ఆతని పెదవులునుండి అస్పష్టంగా విన వచ్చాయి. నాయన అది గ్రహించి నప్పటికి పెద్దగా శ్రద్ధ జూపలేదు. కాని

రెండవరోజున కూడా అలాగే మంత్రశబ్దాలు దైవరాతుని నుండి వెలువడ్డాయి. ఇది వింతగా దోచి నాయన శిష్యుని సమీపించి జాగ్రత్తగా వాటిని విన్నారు. అవి వేదమంత్రములవలె అనిపించింది. అంత ఆశ్చర్యం చెందిన వారై రేణుకా పదసన్నిధికి చేరి "అమ్మా ఎందులకిలా సంకల్పించావు? అని అడిగారు.

అప్పుడతని దృష్టికి రేణుకాంబ వేద మాతగా గాన వచ్చింది. ఆమె యొక్క సమష్టి శక్తియే దైవరాతుని అనుగ్రహించుచున్నట్లు గ్రహించారు. అంతేకాదు ఆ భగవతి ముఖంలో ఏదో ఆదేశం కాన వచ్చింది. హృదయ దృష్టితో విషయాన్ని గ్రహించిన నాయన నూతన వేద తత్త్వము వ్రాయుటకు సిద్ధమై అమ్మను ఇలా స్తుతించారు.

శ్లో॥ వేదమాతా భగవతీ శబ్దబ్రహ్మాత్మికా పరా!
తత్త్వం ప్రబోదయత్వాశు లేఖనీ బ్రహ్మచోదనీ ॥

[మహా భగవతియైన వేదమాత శబ్దబ్రహ్మమై బ్రహ్మ తత్త్వమును వ్రాయుటకు ఆదేశించుచున్నది. ఆమె మమ్ములను త్వరితముగ సత్యదర్శనము పొందుటకు అనుగ్రహించుగాక]

వెంటనే దైవరాతుని నుండి వెలువడుతున్న మంత్రాలను వ్రాయనారంభించారు. ఈ మహాయజ్ఞ నిర్వహణ ఎలా జరిగింది నాయన మాటలలో విందాం:-

"విలువైన మాటలు బాలురు పల్కినను లిఖింపదగినవి. అనునది నానుడి. నాకు వేదముపై గల అత్యంత గౌరవముచేతను శిష్యవాత్సల్యము చేతను దైవరాతుని నుండి వెలువడుతున్న వేద మంత్రములను ఛందోదర్శనముగా నెరిగి వ్రాయబూనితిని,

కొన్ని మాటలు అతని పెదవుల నుండి త్వరితముగా వచ్చినవి. మరికొన్ని అస్పష్టముగ నున్నవి. కొన్ని అసంపూర్ణములు. అటువంటి వానిని వదలి ఏవి స్పష్టముగాను సంపూర్ణముగాను వచ్చినవో వాటినే వ్రాసితిని. ఈ మంత్రములు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగ పడవలెనని యోచించి అందు వర్ణింపబడ్డ దేవతల వర్ణనను క్రమబద్ధంచేసి, మంత్రము, సూక్తము, అనువాకము అని విభజన జేసి సంపూర్ణమైన అన్వయ భాష్యమును వ్రాసితిని.

దైవరాతుడు పాతిక సంవత్సరములు వయస్సు గలవాడు. సంస్కృతమున పెద్ద ప్రావీణ్యములేదు. కాని చిన్ననాటి నుండి యోగాభ్యాసము పొందియున్నాడు. యోగనిష్ఠ తపోదీక్షకుపకరించినది. ఆ దీక్ష ఫలితంగా "ఛందోదర్శనము" అవతరించినది. పూర్వము ఋషులకు వేద దర్శనమయినట్లే ఇపుడు దైవరాతునకు దర్శనమగుట విశేషము. ఇవి ఋగ్వేద మంత్రములను బోలియున్నవి. విజ్ఞులు ఇందలి స్వరమును, ఋక్కులను, తత్త్వమును పరిశీలించవచ్చును. బుధులకు, తాత్త్వికులకు, విమర్శకులకు ఇది ఆదరణీయ గ్రంథమని విన్నవించెదను.

నాకు దైవరాతునిపై అత్యంత ప్రేమగలదు. అతను యోగి, తాపసి, తత్త్వవేత్త, మరియు వేదమంత్ర ద్రష్ట. అతడు వినయశీలుడు. అతని ప్రవర్తన, చదువు, తపస్సు, యోగము పూర్వ ఋషులను దలపించుచున్నది. కావున అతడు "బ్రహ్మర్షి" యని దెలియజేయుచున్నాను"–

ఈ మహాయజ్ఞం కార్తీక పూర్ణిమనాడు మొదలై పదహారు రోజులపాటు జరిగినది. నాయన అన్వయ భాష్యం కార్తీక పూర్ణిమ నాటినుండి ప్రారంభించి మాఘ పూర్ణిమ నాటికి ముగించారు.

ఈ 'ఛందోదర్శనమ్' నేడు నవీన వేదముగా పరిగణింప బడుతోంది. భారతీయ విద్యాభవన్ వారు ఈ గ్రంథమును ప్రచురించి యున్నారు. ఆంగ్లానువాదము కూడా చేయబడినది. తన నుండి వేదమంత్రములను పలికించినది నాయనే అని సవినయంగా గురుభక్తిని చాటుకున్నారు దైవరాతులు.

తన గురువైన శ్రీ రమణుల వారిని నాయన 'మహర్షి' అన్నారు. శిష్యుడైన దైవరాతుని బ్రహ్మర్షి" అన్నారు. చరిత్రలో గురువుని శిష్యుడు పొగడుట వినియున్నాము. కాని శిష్యుని శ్లాఘించిన ఘనత నాయనకే దక్కుతుంది. ఇందు అతని మహనీయతగానవస్తుంది. అందుకేగాబోలు జ్ఞానుల మనస్సు బ్రహ్మము" అన్నారు శ్రీ రమణులు. గురువైనా శిష్యుడైనా జ్ఞాని అందరి యందు జూచునది బ్రహ్మమే.

శ్లో॥ వేద ద్రష్టా స భగవాన్ బ్రహ్మర్షిః బ్రహ్మణస్పతిః।
వాచం సంచోదయత్వాను వేదార్థస్య ప్రకాశతే॥

[బ్రహ్మర్షియై వేదములను చూచిన భగవాన్ బ్రహ్మణస్పతి వేదార్థ తత్వమును దెల్పుటకై నా వాక్ శక్తియందు ప్రకాశించుగాక :]

ఈ శ్లోకాన్ని గమనించిన ఛందోదర్శన గ్రంథ నిర్మాణంలో నాయన బ్రహ్మణ స్పతిగా వెల్గెనని అనిపిస్తుంది.

—X—

# 6. అస్త్రవిద్యా ప్రదర్శనము

శ్లో॥ అస్త్రం మమ భవధ్వంసాయ రటతాం ।
సుత్రామ తరుణి శ్రీమాతర సతామ్ ॥

[ఓ ఇంద్రాణీ ! శ్రీమాతా ! దుర్జనుల నాశనమునకై నీవు నా అస్త్రముగా ప్రకాశింపుము] (లేక) నీవు నాకు అస్త్రముగా పనిచేయుము.

– ఇంద్రాణీ సప్తసతి,
గణపతిముని.

• • • •

అణుయుగం మనది. అణ్వాయుధములను నింగిలో నిక్షిప్తం జేసి అవసరమైనపుడు శత్రురాజ్యములపై ప్రయోగించు ఆలోచన అగ్ర రాజ్యాలలో కానవస్తున్నది. తదను గుణంగా విమర్శకులు కూడా ఈ ఆలోచల్ని త్రోసిపుచ్చి శాంతి వచనాలు పల్కుచున్నారు. Space War అని Sky War అని అనేకమార్లు పత్రికలలో వ్యాస ములు ప్రకటింప బడ్డాయి. మారణాయుధములందు ముఖ్యంగా ఉండేది శక్తి. ఆ శక్తి జడపదార్థములలో ఉన్నంతకాలం ముప్పు తప్పదు. కావుననే మన పూర్వీకులు అటువంటి శక్తిని లోన నిక్షిప్తం చేశారు. అణు విజ్ఞానం మన పూర్వీకులకు తెలియనిది గాదు. వారు తపస్సు ద్వారా శక్తిని పొంది శాంతి కార్యములలోనే వినియో గించేవారు. తమ సంకల్ప బలంతో దేశాల్ని భస్మీపటలం చేసే శక్తి వారికున్నప్పటికి ప్రకృతితో రాజీపడి వారు జీవించారు. శ్రీరాముని చరితమును మానవులకందించిన వాల్మీకి నారద మహర్షి నడిగిన ప్రశ్నలలో ఇది యొకటి !

శ్లో॥ ఆత్మవాన్ కో జిత క్రోధో
ద్యుతిమాన్ కో, నసూయకః ।
కస్య బిభ్యతి దేవాశ్చ
జాత రోషస్య సంయుగే ॥

[మనో నిగ్రహము కలవాడు, కోపమును జయించినవాడు. కాంతిమంతుడు అసూయలేనివాడు కోపమువచ్చినచో యుద్ధమున కుపితుడైన ఎవనిని జూచి దేవతలు కూడా భయపడుదురో అతడెవ్వడు?]

దీనినిబట్టి కోపము జయించుట యనగా వివేకముగ కోపము ప్రదర్శించుట అని దెలియుచున్నది. శాంతి కాముకులు కోపమును ప్రదర్శించినను అది దేశక్షేమమునకే గాని వినాశనమునకుగాదు. విశ్వామిత్ర, దూర్వాసాది మహర్షులు ప్రకటించిన కోపములు, శాపములు ఇందులకు నిదర్శనములు. భీష్ముని శరఘాతములకు కోపించి చక్రము బట్టిన శ్రీకృష్ణుని చేష్టయందు ధర్మసంరక్షణపై అతనికి గల మక్కువను జాటుచున్నది.

ఇటువంటి తపోధనుల కోవన పయనించిన నాయన తన తపోబలంతో అస్త్రసంపత్తిని తన అధీనం చేసుకున్నారు. దేశ స్వాతంత్ర్య సంపాదన అతని ధ్యేయం. సుస్థిర వేద సంస్కృతిని స్థాపించాలని తలచారాయన. భగవంతుడు అతనిని అనుగ్రహించి అటువంటి గురువుని అతనికి ప్రసాదించాడు. ఫలితంగా సర్వ వేదాంత సారమై, సర్వమత ఆమోదయోగ్యమై యొప్పు శ్రీరమణ గీతను వ్రాసి సమాజానికి సమర్పించారు. ఆయితే తరతరాలుగా శాస్త్రం పేరున మూర్ఖమైన నమ్మకాలకు, ఆచారాలకు అలవాటుపడిన ప్రజానీకంలో ఒక్కసారి చైతన్యం వస్తుందా? అలా వచ్చినట్లైతే

ఇన్ని మతాలు, కులాలు ఈదేశంలో పుట్టి ఉండేవి కావు. అయితే తపవంతుగా మత మౌఢ్య నివారణకు, అనూహ్యంగా అస్త్రం ప్రయోగించారు నాయన. ఆ విచిత్ర సంఘటన శ్రీ రమణుల సన్నిధిలో జరగడం విశేషం.

శ్రీ రమణ మహర్షి సన్నిధిలో చిరకాలంగా ఉంటున్న మళయాళ దేశీయుడు ఫలనిస్వామి. అతడొక సంన్యాసి. పెద్దగా చదువురాదు. భగవాన్ అరుణాచలంలో బ్రాహ్మణస్వామి యని పిలువబడే రోజులలో వారిని జేరి సేవలు చేసేవాడు. తత్త్వం తెలిసికోవాలనే తాపత్రయం ఆతనిలో ఉండేది. ఫలితంగా టౌనులో నున్న గ్రంథాలయం నుండి కొన్ని పుస్తకాలను దెచ్చి తప్పులు తడకలతో చదువుతూ ఉండేవాడు. శ్రీ భగవాన్ ఇది గ్రహించి ఆ పుస్తకములను తాను పుచ్చుకొని చదివి అందలి విషయాల్ని ఫలనిస్వామికి జెప్పేవారు. తత్త్వ గ్రంథాలలో పరిచయం శ్రీ రమణుల వారికి గూడా అప్పుడే కలిగిందట! ఈ ఫలనికి కొన్ని మూర్ఖమైన అభిప్రాయాలు ఉండేవి. అవి అప్పుడప్పుడు ఉపద్రవాలను తెచ్చిపెడుతూ ఉండేవి.

1914 వ॥ సం॥ లో ఒకసారి శేషాద్రిస్వామి రమణుల సన్నిధికి వచ్చారు. మహర్షితోపాటు భోజనం చేసారు. చేస్తున్నప్పుడు కొన్ని మెతుకులు ఇటూ అటూ చిందర వందరగా విసిరారు. రమణుల శిష్యుడైన కందస్వామికి కోపంవచ్చింది. "మీరు ఇలా ఆహారం పారేస్తే నేను మరి మీకు ఆహారం ఇవ్వను" అని అన్నాడు. శేషాద్రిస్వామి ఆ మాటల్ని పట్టించుకోలేదు. కాని ఫలని "శేషాద్రి జ్ఞానికాడు" అనిపలికాడు చలించని శేషాద్రి అటనుండి వెళిపోయారు. మరల ఎప్పుడును తిండికై అచటకు రాలేదు. ఫలనిస్వామి అవివేకం అందరికిని బాధ కలిగించింది.

పడై వీడులో శిష్యుడైన దైవరాతుని నుండి నవీన వేదం వెలువడగా భాష్యం వ్రాసిన గణపతిముని 1918 సం॥ మాఘ మాసంలో (అనగా Feb-1918) శ్రీరమణుల దర్శనమునకై మరల అరుణాచలం వచ్చారు. విశాలాక్షమ్మ కూడా వారితో వచ్చినది. పురమును చేరుకున్న వెంటనే వారిరువురూ తిన్నగా కొండెక్కి స్కందాశ్రమం చేరుకున్నారు. ఛందోదర్శనము యొక్క విశేషాలను నాయన రమణులతో ముచ్చటించారు. అందరూ వింతగా నాయన మాటల్ని విన్నారు. అలా ఎన్నో విషయాలు మాట్లాడు కొంటూ ఉండగా చీకటి పడింది.

గురు దర్శనముతో ఆతని సన్నిధిలో తన్మయత్వం పొందిన నాయనకు పొద్దుపోయిన సంగతి తెలియదు. కాని మహర్షి యిది గమనించి ఫలని స్వామితో "పొద్దుపోయింది. అమ్మా నాయినా ఈ రాత్రి విరూపాక్ష గుహలో ఉంటారు. తాళంతీసి, తుడిచి శుభ్రం చేసి ఉంచు" అన్నారు. భగవాన్ స్కందాశ్రమంలో ఉంటున్న సమయంలో ఫలని విరూపాక్ష గుహలో ఉండేవాడు. అమ్మ, నాయన బస ఆ గుహలో ఏర్పాటు చేయడం అతనికి నచ్చలేదు. కాని మహర్షి మాటల్ని కాదనలేడు. కావున మాట్లాడకుండా అచట నుండి బయలుదేరి పురంలోనికి వెళ్ళిపోయాడు

బాగా చీకటి పడేసరికి అమ్మ, నాయనల్ని దిగపెడుతూ మహర్షి కూడా విరూపాక్ష గుహకి వచ్చారు. కాని గుహ తలుపులకి పెద్ద తాళం వేసి ఉంది. ఫలని అచట కానరాలేదు. కొంతసేపు వేచి చూచారు. ఫలని రాలేదు. ఆ మత ఛాందసుడి మూర్ఖత్వం నాయిన గ్రహించారు. 'గృహస్థులు గుహలయందుండరాదు. ఇదే వాని మతము. మనదేశ పతనావస్థకి ఈ మూర్ఖపు ఛాందసవాదులే

కారణమని అతను విచారించారు. ఛాందసవాద నిర్మూలమునకు అ దేవిని ఇలా ప్రార్థించారు.

శ్లో॥ అద్య క్రోధం విమోక్ష్యామి ఖాండవేగ్ని మివార్జునః ।
భువనే ప్రాణిభిః పూర్ణే పరితోపిచ విస్తృతే ॥

[ఖాండవ వనమునందు అర్జునుడెట్లు అగ్నిని విడచెనో, ప్రాణి కోట్లతో నిండి సర్వ దిక్కులు వ్యాపించి యున్న యీభువన మందు నేనిప్పుడు క్రోధాగ్నిని (అగ్నేయాస్త్రమును) విడుచు చుంటిని].

అంతటితో నాగక ఒక చిన్నరాయిని తీసి తాళం కప్పపై విసిరారు. "టప్" అనే శబ్దంతో తాళంకప్ప విరిగి క్రిందపడింది. తలుపు తెఱచుకొని అమ్మ గుహలోకి ప్రవేశించినది. నాయన విస రిన రాయి కొండను రంధ్రం చేసూకుంటూ లోనికి ప్రవేశింప సాగినది. నాయన దానినిజూచి వెంటనే అచటగల రాతిపైగూర్చొని ధ్యానం ప్రారంభించారు.

శ్లో॥ సలిలం క్షిపతశ్చాపి ధున్వతశ్చాపి పర్వతాన్
యథేంద్రస్య తథేశస్య పుత్రస్య మమవై మహః

[నీటిని వర్షింప జేయువాడును, పర్వతములను చెండాడు వాడును అగు ఇంద్రుని తేజస్సెట్లో అట్లే యీశ్వర పుత్రుడనైన నాతేజస్సు గూడ ఫలించుగాక] (వారుణాస్త్రమిది)

పదిహేను నిముషాలలో అకస్మాత్తుగా అరుణాచలంపై గాఢ మైన మేఘాలు క్రమ్మాయి. ఉరుములు, మెరుపులతో వర్షం కుండ పోతగ కురువసాగింది. ఈ అనుకోని మార్పునకు ప్రజలు ఆశ్చర్యం చెందారు. అంతట ఊహించని పెద్దశబ్దంతో పిడుగు పడినది. అప్పుడు నాయన కండ్లు తెఱచారు. ఎదురుగా ప్రశాంత వదనుడై యున్న గురువును జూచారు,

"నాయనా! విచారించకుము! నీవు వదలిన యస్త్రము స్వాతంత్ర్య విప్లవ జ్యోతియై ప్రకాశిస్తుంది. ధర్మ రక్షకులయందది యంతర్లీన శక్తియై మానవ పురోగతికి శ్రీకారం చుడుతుంది"-అని తన గురువు తనకి చెప్పినట్లుగా భావించారు నాయన.

శ్లో॥ దూరం యాహికువాద! ధర్మవృష! తే
నేత! పరం పంగుతా
దుర్భ్రాంతే! భువనం జహీహి పరితో
వర్ధస్వ సంసత్సతామ్
సోదర్యేణ సమన్వితో భువమిమాం
ప్రాప్తో గురు గ్రామణీః
శూరాంతః పురనేత్రవిభ్రమహరో
దేవో భవానీ సుతః॥

[కువాదమా! దూరముగా పొమ్ము. ధర్మ వృషభమా! యికమీద నీకు గుంటువలదు. దుర్భ్రాంతీ! నీవు పుడమినివీడుము. సజ్జనుల కూటమా! వర్ధిల్లుము. ఏలయన శూరాసురుని హరించిన దేవుడు కుమారస్వామి, గురూత్తముడు తన సోదరునితో గలసికొని యీ భూమిని చేరుకున్నాడు.] – యని ప్రస్తుతించిన నాయనకు స్వయంగా తానే పెరుగూ అన్నం కలిపి తినిపించారు మహర్షి.

మర్నాడు ఆలయంలో పాడుపడిన రథముపై పిడుగుపడి కాలిపోయినట్లు వార్త అందరికీ తెలిసినది. తాను వదలిన యస్త్రమును తానే యుపసంహరింప జేసిన నాయన ఈ వార్త విని ఆ పరాశక్తి యనుగ్రహానికి అంజలి ఘటించారు.

తన గురువు తనకూ ప్రతిసారి కార్తికేయుని రూపంలోనే కనిపిస్తూ ఉండటంవల్ల తన రచనలలో మహర్షిని కార్తికేయాంశగా పొగిడియున్నారునాయనఇదిఎంతవరకుసమంజసం అనేఅనుమానం

వారికివచ్చి మహర్షినడిగారు, మహర్షి జవాబు చెప్ప లేదు. అమర్నాడు నాయన వారి వద్దకు వెళ్ళగా మహర్షి "ఈశ్వరస్వామి విరూపాక్షు గుహలో ఉన్న వినాయకునిపై వెణ్బా వ్రాసి యున్నారు. అతని కోరికపై నేను కూడా వ్రాసాను చూడండి యని తాను వ్రాసిన వెణ్బా (తమిళపద్యం) చదివి వినిపించారు. అందు గణపతి నా సోదరుడు వానిని రక్షింపుము, అని వ్రాసియుండె. తనపై మహర్షికి గల యభిమానమునకు అతని కండ్లు చెమర్చాయి. మహర్షులు స్కందావతారులే యనుటకు ఇదియే నిదర్శనమని సంతోషించా రాయన.

— × —

## 7. అళగమ్మ నిర్యాణము

గీ॥ అళకు సుందరంబోల్ అగముమ్ నీయుమట్రు
అభిన్న మా యిరుప్పోమ్ అరుణాచలా.

– అక్షరమణమాల (తమిళము)
శ్రీ రమణ మహర్షి.

[అరుణాచలాస్వామీ ! ఆళగు సుందరులవలె నీవును, నేనును గలసి భేదం లేకుండా నుందము].

• • • •

శక్తీశ్వరులు ఏక దేహులు. వారిది లీలా శరీరము. అందు 'శక్తి' యను పదము స్త్రీ వాచకమైతే ఈశ్వరుడు పురుషుడుగా కీర్తింపబడ్డాడు. ఇది వ్యావహారికము. వారి అభేదమును సాధకులు తాత్వికులు తెలిసికొనగలరు. మహర్షి తాను వ్రాసిన "అక్షరమణ మాల"యను తమిళగీతిక యందు తనతల్లిదండ్రుల బాంధవ్యము నందలి ఏకత్వమును పై చరణంలో తెలియజేసియున్నారు. వారి తండ్రిపేరు సుందరంఅయ్యర్, తల్లి అళగమ్మ. వారిదాంపత్యము ఆదర్శమైనది. శ్రీ రమణుల వంటి కుమారునకు జన్మనిచ్చుటయే

ఇందులకు నిదర్శనము. తమిళమున "సుందరమ్" అనగా 'అందము' అని యర్థము. "అళగు" అన్నను ఇదే అర్థము. ఇలా నామమునందలి ఏకత్వమునకు, సౌందర్యమునకు, సౌశీల్యమునకు వారు ఆదర్శ దంపతులు. మహర్షి బాల్యమునందే తండ్రిని పోగొట్టుకొన్నారు. కావున తల్లికి సేవ చేసి ఋణవిముక్తి దీర్చుకునే మహా భాగ్యము అతనికి కలిగినది.

కుటుంబ పరిస్థితుల రీత్యా మరియు వయస్సు మళ్ళుటచే ఆమె 1916 సం॥లో రమణుల సన్నిధిని చేరుకున్నది. యతియై గుహలలో నుండే తనయుడు తన్ను ఆదరిస్తాడా అందులకు శిష్యులు అంగీకరిస్తారా అను సంశయం ఆమెకు మొదట కలిగింది. కాని కరుణాపూర్ణులైన భగవాన్ ఆమె అనుమానాల్ని పటాపంచలు చేసారు. "రా అమ్మా! పోదాం!" అని ఎంతో ఆప్యాయంగా అమ్మని విరూపాక్ష గుహకి తీసుకుని వెళ్ళారాయన. అప్పట్లో ప్రసాదాలు దండిగా వస్తూ ఉండడం వల్ల వచ్చినదాన్ని అందరూ పంచుకుతినేవారు. కావున వంట అవసరము లేకపోయింది. మహర్షి సోదరుడైన నాగసుందరం కూడా భార్య చనిపోయిన తరువాత అరుణాచలం చేరుకున్నారు. అచటనే సంన్యాసం పుచ్చుకొని "నిరంజనానందస్వామి"గా పేరు పొందారు. విరూపాక్ష గుహ చిన్నది కావడంతో స్కందాశ్రమానికి మకాము మార్చారు. తనయునిపై గల ప్రేమతో ఆచట వంట ప్రారంభించింది అళయమ్మ.

మహర్షి జూపే సమానత్వాన్ని వ్రాతలలో తెలియజేయడం కష్టం. పశువులు, పక్షులు, మనుషులు అందరూ సమానులే. అందరినీ సమదృష్టితోనే జూచేవారు భగవాన్. సనాతన కుటుంబంలోని కొన్ని ఆచారాలు అళగమ్మ మొదట్లో వదలుకోలేకపోయింది, మడి, తడి,

ఉల్లిపాయలు తినకపోవడం, కుమారునిపై ప్రత్యేక వ్యామోహం ఇలాంటి కొన్ని వాసనలు ఆమెకు ఉండేవి. సహజంగా నిర్మల మనస్కురాలు ఆమె. అంతే కాకుండా భక్తురాలు. మంచి బాగా తత్త్వగీతాలు పాడేది. పులుసుపాట, చారుపాట అని వంటకుచెందిన పనులలో తత్త్వం తెలిపే పాటలు పాడేది ఆమె నిత్యముక్త జీవనమునకు ఐహిక వాసనలుండకూడదు కదా! కావున ఆముష్మిక విద్యాభ్యాసం ప్రారంభించారు భగవాన్.

"ఈ వస్త్రమును ఇంకెవరో తాకినారే! ఇంక మడి ఎట్లు? ఈ దినమున ఉల్లిపాయలు ఎఱ్ఱగడ్డలు తప్ప మరేమియు లేవు, ఈ పాత్రను పలానవాడు తాకినాడు ఎలా?"– అని పలువిధముల నయాన, భయాన అమ్మనుండి వాసనల్ని తొలగింప చేశారు భగవాన్. స్వామి మహామహిమడన్న నమ్మిక ఆమెకుండెడిది. అమె నమ్మినట్లుగానే ఒకసారి జ్యోతి రూపంలోను మరోసారి నాగ భూషణుడుగను దర్శన మిచ్చారు భగవాన్.

శ్రీ రమణుల ఆదరణలో వాసనాక్షయం చెందిన అళగమ్మ జ్ఞానము పొందినదై వచ్చిపోవు వారికి వండిపెడుతూ భక్తజనసేవ చేసేది. అంతేకాకుండా కాషాయం ధరించి యతి ధర్మాన్ని పాటించింది.

1922 లో ఆమె ఆరోగ్యం క్రమంగా క్షీణించ సాగింది. స్వామియే ఆమెకు పరిచర్య చేయుచుండెను. 19–5–1922 నాడు ఆమెకు చరమకాల మాసన్నమైనది మందులు పనిచేయలేదు. ఆమె బ్రతుకదు అని అందరికీ తెలిసినవి. ఆనాడు వైశాఖ బహుళ నవమి. ఊర్ధ్వశ్వాసము ప్రారంభము కాగానే మహర్షి తమ దక్షిణ హస్తమును తల్లి హృదయము పైనను, వామహస్తమును శిరము

నను ఉంచిరి. ఏకాగ్ర దృష్టితో తల్లిని గమనించు చుండిరి. శ్రీ రమణుల మాటలో ఆ రోజు ఆమె పరిస్థితి యిది.

"లోపల ఉండే ప్రవృత్తులు, పూర్వ జన్మ వాసనలు రాబోయే జన్మకు కారణములగునవి మిక్కిలి ప్రకోపించినవి. బాహ్యస్మృతి అడంగి పోయినది. కావున సూక్ష్మ లోకములలో సూక్ష్మశరీరమున నామె యెదుట దృశ్యము వెంట దృశ్యము సాగిపోవుచుండెను". ఇలా వాసనలతో ప్రయాణమగుతున్న ఆమెను వాసనాక్షయము గావించుచూ ముక్తినొందుటకు శ్రీ భగవాన్ తన యాత్మశక్తితో యుద్ధము జరుపుచు చివరకు అంతర్యాగమున వాసనలు నశించి మనస్సు ఆత్మయందు లయమగునట్లు చేసి రాత్రి 8 గం॥లకు ఆమె సంపూర్ణశాంతి చెందునట్లు జేసి ముక్తి ప్రసాదించెను. చుట్టు నున్న వారిలో నిరంజనా నందులను, గణపతి మునీంద్రులును మరణ సూచకమగు సన్నని ధ్వనిని వినిరట.

ఇలా శ్రీ భగవాన్ చేతులలో మహా నిర్వాణాన్ని పొందింది ఆమె. కొందరు ప్రసంగ వశమున "అమ్మ పోయినది" అనగానే మహర్షి వెంటనే "కాదు పోలేదు: లీనమైనది" అని అన్నారు. ఇక శరీరమును ఏమిచేయవలయును? దహనమా, సమాధియా ? అను ప్రశ్న అందరిలో కలిగెను. రమణ గీతలో ఈ ప్రశ్నకు 12 వ॥ అధ్యాయనమున సమాధానము కలదు. "ముక్తురాలి దేహమునకు దహనము కూడదు సమాధియే" తగును అని మహర్షి చెప్పియు న్నారు. కాన గణపతిముని ఆమె శరీరమును సమాధి జేయుట యుత్తమమని చెప్పగా చివరికి అశ్వత్థవృక్షపు నీడయందు ఆ శరీరమును సమాధి చేసారు.

మహాపూజాదివసమునాడు ముక్తిపొందిన అళగమ్మపై సౌందర్యాంబా షట్కమును రచించి శ్రద్ధాంజలి ఘటించారునాయన.

శ్లో॥ దుందుభివర్షే వృష షష్ఠదినే
మాధవ కృష్ణదలీయ నవమ్యాం ।
భార్గవ వాసర నిశి శతతారా
సం యుక్తాయాం ప్రథమే యామే ॥

[దుందుభి సంవత్సరమున వృషభ మాసమున నాఱవ దినమున వైశాఖ బహుళ నవమియందు శుక్రవారము రాత్రి శతభిషా నక్షత్రయుక్తమైన తొలిజామునందు.]

శ్లో॥ భారద్వాజీ పారాశర్య
శ్రేష్ఠ కులోద్భవ సుందరపత్నీ ।
గురుగుహ భాగజ రమణ మహర్షే
ర్మాతా పూతా చారిత్రేణ ॥

[భారద్వాజ గోత్రమున, పారాశర్యుని కులము నందు పుట్టిన సుందరార్యుని పత్నియు గురు గుహాంశమున పుట్టిన రమణ మహర్షి యొక్క తల్లియు, పావన చరితయు,]

శ్లో॥ త్యాజిత మానస సింగా హంసీ
శివపద భక్తి క్షాలిత పంకా ।
గుహకర శక్త్యా రుద్ధ ప్రాణా
తత్క్షణ ధూత సమస్త వికల్పా ॥

[మానస రాగము లేని హంసి యును, శివుని చరణ భక్తిచే పాపములను కడగివైచినదియు, గుహుని చేతి శక్తిచేత నిరుద్ధములైన ప్రాణములు కలిదియు, ఆ క్షణమందే పోగొట్టబడిన అన్ని వికల్పములు కలదియును.]

శ్లో॥ నిగమాంతవతో వేదం జ్యోతిః
సర్వ జగత్సు వ్యాప్తం జ్యోతిః ।
సుత గుహ దృష్ట్యా వ్యక్తం జ్యోతిః
సౌందర్యాంబా సమ భూజ్జ్యోతిః ॥

[అగు సౌందర్యాంబ, ఏ జ్యోతి వేదాంత వాక్యములచే తెలియనగునో, ఏ జ్యోతి జగములందు వ్యాపించి యుండునో, ఏది కుమారుడైన కుమారుని దృష్టిచే తెల్పబడెనో ఆ జ్యోతి యాయెను]

శ్లో॥ రమణ మహర్షేః కరసరసీజ
ద్వయ మకరంద స్ఫుట ధారేవ ।
అత్ర సమాధౌ సౌందర్యాం బా
దేవ్యాస్తీర్థం నవమఘ శమనమ్ ॥

[రమణ మహర్షి కర సరోజ యుగళమందు జనించిన మక రంద ధారవలె సౌందర్యాంబాదేవి సమాధి యందలి తీర్థము "అఘ శమన" పాపనాశమయ్యేను.]

శ్లో॥ జయతు మహర్షే రాత్మా పూతా
జయతు సమాధిః కోపి తదీయః
జయతు మహర్షి స్థాపిత లింగం
జయతు చతీర్థం నవ "మఘశమనమ్ ॥

[పావనమైన మహర్షి జనని జయించునుగాక ఆమె సమాధి జయించునుగాక, మహర్షిచే స్థాపించ బడిన లింగము జయించును గాక, క్రొత్తదైన "అఘశమన" తీర్థం జయించునుగాక].

తరువాత గణపతి మునీంద్రులు వేదమంత్రాలు చదువు తుండగా రమణ మహర్షి లింగ ప్రతిష్ఠ చేశారు. అచట వేద విద్యకు

చెందిన విశ్వవిద్యాలయము స్థాపించాలని నాయన తలచారు. కాని మహర్షితమ్ముడైన నిరంజనానందస్వామిగుడికట్టవలయుననని తలచారు.అందులకతడు ప్రయత్నముసాగించగా ప్రోత్సాహముదొరకలేదు. విఫలమనస్కుడై అతను ఒకరోజు మహర్షినిసమీపించి"అమ్మ సమాధిపై గుడి కట్టవలయుననని ఉంది. ప్రయత్నము సాగడం లేదు" అన్నారు. అందులకు మహర్షి "నాయనను సంప్రదించు. అతని సంకల్పం లేనిదే పని నెరవేరదు" అన్నారట. నాయనకిది తెలియజేయగా అతను సంతోషించి "భగవాన్ అలా అన్నారా! అయితే కానివ్వండి" అన్నారట. ఫలితంగా మాతృభూతేశ్వరుని ఆలయం సమాధిపై వెలసింది.

సమానత్వానికి ప్రతిరూపమైన మహర్షి నాయన కోరికను కూడా విచిత్రంగా తీర్చారా! అని అనిపిస్తుంది. ఒకనాడు మహర్షి కొండపైనుండి క్రిందకి దిగి సమాధి చెంతకు వచ్చి అచటనే ఉండి పోయిరి. ఏదియోశక్తి వారిని అట్లు ఈడ్చుకొని వచ్చినదనియు పరేచ్ఛ చేతనే తాను అచటికి వచ్చాననియు చెప్పారు. తరువాత అదియే రమణాశ్రమము అయినది. సాక్షాత్తు వేదపురుషుడే అచటకు దిగి వచ్చుటచే నిరంతర బ్రహ్మవిద్యాది చర్చలు అచట సాగుతూ ఉండేవి. కాగా వేదవిద్య వేదవిమర్శ ఇత్యాది సత్కార్యములకు నిలయమై, నాయన కోరినట్లు వేద విద్యకు చెందిన విశ్వవిద్యాలయమువలె ప్రపంచఖ్యాతి నార్జించినది.

— X —

# 8. కపాల మోక్షము

శ్లో ॥ ఆత్మస్థస్య సహస్రారం శుద్ధం జ్యోతిర్మయం భవేత్।
తత్రజీవేన్న సంకల్పో యదిసాంనిధ్యతః పతేత్ ॥

[ఆత్మయందు నిలకడ జెందిన వానియొక్క సహస్రారము శుద్ధమై జ్యోతి స్వరూపమగును. సాన్నిధ్య బలమువలన దాని యందు పడిన సంకల్పము జీవించదు]- శ్రీ రమణగీత.

• • • •

సృష్టి నిర్మాణమునకు మూలమైనది పరమేశ్వరీశక్తి. ఇది ప్రాణులందుగూడ సంచరించుట విశేషము. దేహము నందలి శక్తిని కుండలినీ శక్తియని యందురు. ఇది మూలాధారము నుండి లేచి హృదయముచేరినదై అచటినుండి సహస్రారమునకు (శిరస్సునకు) ప్రాకి తదుపరి శరీరము నందంతను వ్యాపించుచున్నది. ప్రాణుల యందలి చలన గమనాదులకు ఇదియే కారణము. కాని దేహమును నేను అను సంకల్పముతో జీవించువారలందు అది అజ్ఞాన స్వరూపమున వర్తించును. సంకల్పరహితులైన జ్ఞానులందు అది శుద్ధమైన కుండలినీశక్తి. హృదయ స్థానమందు "నేను"గా ప్రకాశించి 'సత్' పురుషునితో ఈ 'చిత్' శక్తిగలయుటచే ఆయోగి ఆత్మనిష్ఠుడై నిలకడ చెందుచున్నాడు. తపస్సమాధిలో యోగులకు ఈ తత్త్వ దర్శన చిత్త్వదర్శనభాగ్యములు కలుగుచున్నవి. దీనినే కుండలినీ విద్య అని అంటారు.

ఈ విద్యయొక్క తత్త్వార్థము రేణుకా జమదగ్నుల గాథ యందు గానవచ్చుచున్నది. తండ్రియాజ్ఞ ననుసరించి జమదగ్ని మహర్షియొక్క కుమారుడైన పరశురాముడు తల్లియొక్క అనగా

రేణుక యొక్క శిరమును ఖండించు వైనము అందరికీ తెలిసినదే. కుమారుడు తల్లియొక్క తలను నరకుటయను ప్రక్రియ కొంచెం ఆశ్చర్యం కలిగించడంతోబాటు కఠినమైన చర్యగా గానవస్తుంది. కాని తాత్త్వికులు దీనిని ఒకానొక విద్యారహస్యంగా పరిగణిస్తారు.

"వ్యపోహ్య శీర్షకపాలే" అనే శృతి వాక్యము తైత్తరీయ ఉపనిషత్‌లో గానవస్తుంది. ఇందలి అనువాకాన్ని చదివినప్పుడు యోగి తనయందు సంచరిస్తున్న విద్యుత్ శక్తిని శీర్షమునకు లేపువాడై యోగమందున్నపుడు ఆశక్తి కపాలములను విడదీసి బహిర్గతమున గల మహావిద్యుత్ శక్తితో కలసి లోపల, వెలుపల యాతాయాత విహారముజేయును అని జెప్పబడియున్నది అంతేగాకుండా అటువంటి యోగమును పొందిన యోగి స్థితి ఇలా వర్ణింపబడియున్నది.

''He himself gets independant sovereignty; he attains the LORD of the mind; he becomes ruler of the speech; the ruler of the eyes; the ruler of the ears; and the ruler of knowledge·Over and above all these he becomes BRAHMAN Which is embodied in ·AKASA which is identified with the gross and–subtle and has truth as its real nature, which reveals in life under whose possession the mind is a source of bliss which is enriched with peace and is immortal''

ఈ ఉపనిషత్ వాక్యాలను ఆధారముగా జేసికొని తలనుండి ప్రాణముపోయిన బ్రహ్మలోకగతి చెందునను విశ్వాసముతో, సంన్యాసులు మరణించు సమయమున వారి తలపై కొబ్బరికాయ కొట్టు ఆచారము వచ్చినది. చరిత్రను గమనించిన కుండలినీ విద్యతో కొంత సాధన చెందిన యోగులు కానవస్తారు గాని కపాల మోక్షము చెందిన తరువాత జీవించిన యోగులు గానరారు.

పరశురాముడు తనతల్లి తలను నరికిన విధము గమనింపగా అతడు తన యోగసాధనలో మనోబుద్ధులకు మూలమై సంకల్ప వికల్పాలకు పీఠమైన శిరస్సునందు మనశ్ఛేదనము గావించి అంతటితో నాగక తనయందు కుండలినీశక్తి రూజమున చరించు జగన్మాత యను గ్రహముతో కపాలము విడువడగా శక్తి యొక్క విహారము శరీరమునందున బయటకూడ నిర్విరామంగా సాగుతూ ఉంటుంది. అటువంటప్పుడు యోగియొక్క శరీరము విద్యుత్ యంత్రమౌతుందని నాయన ఉమాసహస్రము నందు వివరించి యున్నారు. ఆ శ్లోకమిది :-

శ్లో॥ అవతరణం ధ్యాతంచే, దారోహణ ముద్భుతం భవేచ్ఛక్తేః ।
యస్మిన్నిదం శరీరంభవతి మహావైద్యుతాగ్ని యన్త్రమివ॥

[ఆకాశమునుండి శిరోమార్గమున శరీరమునందు ప్రవేశించు చున్న శక్తియొక్క యవతరణమును ఎవ్వడు అనుభవ పూర్వకముగా దెలిసికొనుచుండునో, వాని మూలాధారము నుండి ఈశక్తి మిక్కిలి వడిగా నారోహించుచుండును (మీదికెక్కుచుండును). అట్లు అరోహించునపుడు భౌతికమగు శరీరము మహావిద్యుత్ అగ్నియంత్రమువలె నాశ్చర్యకరమగుచుండును.]

ఈ శ్లోక రహస్యమును గమనించిన కపాలమోక్ష ప్రక్రియనే రేణుకా శిరశ్ఛేదనముగా వర్ణించిరని, నిజానికి మాత యొక్క అనుగ్రహము ద్వారా పరశురామునికి కపాల భేధసిద్ధి కలిగినదని తెలియుచున్నది. అంతేకాకుండా "చిత్" అనగా 'జ్ఞానము' అని భగవాన్ చెప్పియున్నారు. 'కరతలామలకము' అనే మాటయందు ఈ అర్థము గానవచ్చుచున్నది. కావున అవిద్యాచ్ఛేదనమే శిరచ్ఛేదమను భావమును రేణుకగాథ చెప్పుచున్నది. బహుశా అందుచేతనే ప్రజలుఅశిరమ్మను(అనగాశిరములేని అమ్మను)పూజిస్తారుగాబోలు.

పరశురాముని తరువాత కపాల మోక్షము నొందిన యోగిగా నవీన కాలంలో నాయన గానవస్తారు. పడైవీడులో రేణుకా దర్శనము అయిన కాలమునుండి అతని శరీరమునందు హోమము సాగుచునే యుండెను. తనయందు కుండలినీశక్తి యాతాయాత విహారము చేయుచుండెనని అతను ఉమాసహస్రమునందు కొన్ని శ్లోకములలో వివరించియున్నారు. తన శరీరమునందు ఆత్మ చైతన్యము, జడ మగు భాగము వేరుగా గ్రహింపబడునట్లు ఆయన తెల్పియున్నారు

శ్లో॥ కాపిమోదల హరీతవవీచి
ర్నిర్గతాదశ శతార సుధాబ్ధేః ।
పూరయత్యఖిల మమ్బ ! శరీరం
నేహవేద్మి పరమే జడభాగమ్ ॥

[ఉత్తమురాలవైన అమ్మా ! సహస్రారమను సుధా సాగరము నుండి వెలికి వచ్చిన నీయొక్క ఆనందలహరియగు నొకానొక తరంగము నాశరీరమునందు అఖిలమును ఆత్మ చేనిండించుచున్నది. జడభాగము నాకు స్ఫురించుటలేదు.]

శ్లో॥ సేయముత్తమ తమానిపతన్తీ
శీతలాత్ దశశతారపయోదాత్ ।
ప్రేరితాదఖిలరాజ్ఞి ! భవ్యతా
బుద్ధి సస్య మవతాద్రస వృష్టిః ॥

[అఖిల రాజ్ఞీ ! నాచేత నిప్పుడనుభవింపబడుచున్న ఉత్తమ మగు రసవృష్టి భగవతివగు నీచేత ప్రేరణము చేయబడినదై శీతల మగు సహస్రారపయోదము నుండి క్రిందికి ప్రసరించుచున్నది. ఈ రసవృష్టి బోధమను ధాన్యమును రక్షించుగాత !]

ఇంతటి రసవత్తరమగు యోగవిద్యా రహస్యమును అనుభవములేనిదే చెప్పుటకు వీలుకాదు. అటువంటి మహాయోగము నాయనకు అరుణాచలమునందు అనుభూతమైనది. అరుణాచలముపై మామిడిచెట్టు గుహయందు కుటుంబముతో వాసముచేయు రోజులవి. తరచు ధ్యానమునందే నిమగ్నమై ఉంటున్న నాయనయందు శక్తి ప్రవాహ ధురి తేది 20-8-22 నాటి నుండి మరీ అధికమై కపాల మోక్ష సిద్ధికి దారితీసినది. ఆనాటి అనుభవమును గణపతిముని స్వయముగా తన పినతండ్రియైన ప్రకాశశాస్త్రికి లేఖద్వారా వివరించియున్నారు. ఆ లేఖయిది :-

గొప్ప సువార్త : కపాలమోక్షము

తిరువణ్ణామలై
మంగళవారము
22-8-22

తండ్రీ,

నీజాబు చేరినది. ఆదివారం పగలు 3 గంటలు మొదలు రాత్రివరకు కుండలినీశక్తి ఉద్రేకించి సహస్రారమును పూరింపజేసి విద్యుచ్ఛక్తి సముద్రంలో ముంచివేసినది. నాకేమియు తోచలేదు. శరీరము నిలుచునని ధైర్యములేకపోయినది. మాట్లాడుటకు కూడా శక్తిలేకుండా పోయింది. ఇట్లుండ రాత్రి 8 గంటలకు గుహలో శిరః కపాలములు రెండూ పాకబలముచే కొంచెము సందు ఇచ్చినట్లు పట్టులో "లూజు" అయిపోయినది. బద్దలు అయినట్లు చెప్పినను చెప్పవచ్చును. ఇదియే కపాల మోక్షము. ఇదియొక గ్రంధి భేదము వంటిది. ఇదియే ఛిన్నమస్తాతత్త్వమని తలంచెదను. తరువాత శక్తి ధార "గ్యాసు" వలె శిరస్సు నుండి బయటకు మూడు నిముషముల వరకు వచ్చినది స్వస్థుడనైతిని. ఇప్పుడు విద్యుచ్ఛక్తి ధారాళముగా త్యాగగతులు చేయుచున్నది. తలవద్ద మీదుగా

తగలకుండా చేయి ఉంచిన శక్తి ప్రవాహము "గ్యాసు" వలె తెలియుచున్నది. భౌతిక విద్యుచ్ఛక్తితో శారీరక విద్యుచ్ఛక్తి కలసినది

నాయన

నాయనకు కపాలమోక్షమగు సమయమున అతని కుటుంబస్తులు చెంతనే ఉండిరి. శక్తి బహిర్గతమగు సమయమున చంద్ర కాంతివంటి జ్యోతి ఒకటి శిరస్సునుండి వెడలి గుహయొక్క లోపలి కప్పుపై బింబాకారము పడుచు గుహనంతనీ వెల్తురుతో నింపెనట. వారు కొంత భయము చెందినవారై విషయమును రమణమహర్షి కెరిగింపగా వారు వచ్చి నాయనతలపైన చిట్టి ఆముదమునువ్రాసి చేయి ఉంచి తాపమును శాంతింపజేశారు. తరువాత బజారునుండి పాదుకలజత తెప్పించి నాయనను వట్టి పాదములతో నడవరాదని చెప్పినారు. మహర్షి చేతులనుండి పాదుకలందుకుంటూ నాయన "గుర్వనుగ్రహముచే పాదుకాదీక్షను గ్రహించుచున్నాను" అని పలుకగా అందరునూ నవ్విరి.

శ్లో॥ తవచ్ఛిన్నం శీర్షం విదురఖిలమిత్యాగమ విదో
మనుష్యాణాం మస్తే బహుల తపసాయద్ విదలితే।
సుషుమ్నాయాం నాడ్యాంతను కరణ సంపర్కరహితా
బహుశ్శక్త్యాయుక్తా విగతచర నిద్రా విలసతి ॥

అమ్మా ! విశ్వమాతా ! బహుళ తపోబలముతో మనుష్యుల (యోగుల) తల రెండుగా చీల్చబడునప్పుడు జ్యోతిర్వాహినియైన శక్తిసుషుమ్నయనేమధ్య నాడియందు దేహేంద్రియ సంపర్కము విడచి, బ్రహ్మాండమునందుండు మహాశక్తితో కలయుదానవు. నిద్రనుండి మేల్కొనుదానవు అగు కుండలినీశక్తివై నీవు విలసిల్లుదువు. అందుచేతను ఆగమ విదులైన తాంత్రికులు నిన్ను శిరము లేని దానవని (ఛిన్నమస్తవని) తెలుసుకొనుచున్నారు.]

# 9. అమృత ధారావర్షిణి "ఇంద్రాణి"

శ్లో॥ రక్షితుం భరత విషయం శక్తిమింద్రహృదయసఖీ ।
చంద్రబింబ రుచిరముఖీ సా క్రియాద్భువి గణపతిమ్ ॥

[చంద్రబింబముఖియైన ఇంద్రాణి భరతభూమిని రక్షించు టకు గణపతిని భూలోకమునందు శక్తిమంతునిగా జేయుగాక:]

ఇంద్రాణీ సప్తశతి. గణపతిము ని.

• • •

కపాలమోక్షమైన తడువాత నాయనకు అన్ని సిద్ధులూ వశమయ్యాయి. అతనిని జూచుటకని చాలామంది వస్తూ ఉండేవారు. చూతగుహ చాలా చిన్నది కావడంతో వచ్చే పోయేవారి సదుపాయమునకని వెలుపల చిన్నతిన్నె (అరుగు) నిర్మించి పాకవేశారు. మహర్షికి సమీపాన ఉండవలయునన్న తలంపుతో నాయన చూతగుహను వదలలేదు. 1917 నుండి 1926 వరకు అచటనే నివసించారు కుటుంబము కూడ వారితోనే ఉండసాగింది. చదువు నిమిత్తం కుమారుడు అప్పశాస్త్రివద్ద ఉండేవాడు. అప్పుడప్పుడు శలవులలో అరుణాచలం వచ్చేవాడు. కుమార్తె వజ్రేశ్వరికి వివాహము జరిపించుటచే ఆమె తరచు వస్తూ పోతూ ఉండేది. మహాదేవునికి కూడ వివాహము 1918 లో జరిపించినారు.

కపాల భేదసిద్ధి తరువాత నాయన Constitution (శరీర తత్త్వం) లో కూడ కొంత మార్పు వచ్చింది. ముఖ్యంగా అతను లోహమును తాకినట్లైతే ఆలోహమునకు బంగారపు రంగు వచ్చేది. కావున అతను లోహం ముట్టుకోవడం మానివేశారు. కొయ్యపాదుకలు ధరించేవారు. మేజాబల్లపై కూర్చునేవారు. సాధారణంగా అతనికి

పళ్ళెరములో భోజనంచేసి అందులో చేయికడుగుకొనడం అలవాటు. కాని స్వర్ణసిద్ధి వచ్చినతరువాత విస్తరిభోజనానికి అలవాటు పడ్డారు. ఒకరోజు నాయన మహర్షితో బాటు కూర్చుని పంక్తిభోజనం చేస్తూ ఉంటగా అతను తన పాత అలవాటు ప్రకారం విస్తరిలో చేయి కడుక్కున్నారు. వెంటనే నీరు ప్రక్కన కూర్చున్నవారి విస్తర్ల క్రింద నుండి పారినవి. వారందరూ భోజనం చేస్తూ నీరు విస్తర్ల క్రిందకి రావడంతో విస్తుపోయారు. పరిస్థితి గమనించిన మహర్షి వెంటనే వారిని జూచి "గణపతి ప్రసాదం అది ఫరవాలేదు తినండి" అన్నారట.

మద్రాసులో చందమామవారి ప్రెస్‌లో పనిచేయుచున్న B. S. Rama Rao గారు ఒకసారి నాయన స్వర్ణసిద్ధి మహిమను గురించి ఇలా తెలియజేసారు– "నేను ఇంటర్‌మీడియేట్ చదువు రోజులవి. నాయన ప్రసంగం మద్రాసులో ఏర్పాటు చేశారు. అతనికి స్వర్ణసిద్ధి ఉందని నాకు తెలుసు. నేను ఎవరికీ తెలియకుండా రెండణాలకాసును నాయన కూర్చునే ఆసనంపై దుప్పటిక్రింద పెట్టాను. నాయనవచ్చి కూర్చుని వెంటనే షాక్‌కొట్టినవారిలా నిలిచి దుప్పటి ఎత్తి బేడకాసును పట్టి విసిరివేసారు. నేను వెంటనే బేడకాసును తీసి చూడగా అది పసుపుపచ్చని రంగుతో గానవచ్చింది" అని చెప్పి మొన్న మొన్నటి వరకు ఆ కాసును అందరికీ చూపించి యున్నారు. ఒక మహాసిద్ధుని మహిమలను ఎన్నని వర్ణింపగలము !

నాయన గుహనుండి వెలుపలకివచ్చినచో అతనిపైమాత్రము వర్షపుజల్లు కురిసేది. అది దేవతానుగ్రహం అనేవారు వారు. అటువంటి అమృత ధారా వర్షమును అతనిపై మాటిమాటికి కురిపించిన దేవత ఇంద్రాణి. ఇంద్రుని (ఈశుని) పట్టపురాణి ఈమె ! నాయన ప్రతిఫలమాశించని కవిరాజు ! అమృత వర్షం కురిపించిన అమ్మను

వారు వదులుతారా! అదీగాకుండా ఆమె వజ్ర వైరోచనీదేవి! ఇంతటి శక్తిని ఆమె భూవాసులకిచ్చిన చాలును, భరతవర్షం భోగ భాగ్యాలతో వర్ధిల్లుతుంది. విప్లవనాయకుల భుజములందు వీరతేజం ప్రకాశిస్తుంది అని ఎంచి గణపతి "అమ్మా! నాపై అనురాగ సుధ లను కురిపిస్తున్నావు ప్రతిఫలముగా నేను నీకేమి ఈయగలను ? నీవనుగ్రహించిన కవిత్వధారలతో శ్లోకమాలా వృత్తములను నీకు సమర్పింతును. వాటిని స్వీకరింపుము. అంగీకార చిహ్నముగా నీమోవలహరిని ప్రకటింపుము. నీ మెఱుపుల మందహాస వీచికలు ఇంద్రాణీ స్తుతిగీతములందు బలము చేకూర్చగా వాటిని పఠించు భక్తజనులకవి సర్వసంపదలను జేకూర్చుగాక!" అని వినయముగా అభ్యర్థించి ఇందాణీ స్తుతి శ్లోకములను వ్రాయ నారంభించారు.

ప్రతి దినము వారు శ్లోకములను వ్రాసి పఠించగా నిర్మల మగు ఆకాశమునందు అప్పటికప్పుడు చిన్న మేఘముపట్టి అందుండి ఇంద్రాణి ముఖారవిందము మందహాస వీచికలా యనునట్లు తళుక్కు మని మెఱుపు మెరిసేది. "అదిగో అమ్మ అంగీకరించింది" అనేవారు నాయన. ఇలా అతను వ్రాసిన శ్లోకాలు అనేకం. సాధారణంగా ఇటువంటి కావ్యాలలో భక్తితత్త్వం శరణాగతి ఇత్యాదులు కాన వస్తాయి. కాని నాయన వీటితోబాటు అలనాటి భారతదేశ దుస్థితి, అందులకు కారణాలు, కావలసిన చర్య ఇత్యాదులను గూడా వ్రాసారు.

శ్లో॥ అగతి మవీర్యాదపగత ధైర్యాం ।
అవతు శచీమేజనిభువమార్యాం ॥

[గతిచెడి, వీర్యము కోల్పోయి అధైర్యము జెందిన నా పవిత్ర జన్మభూమిని శచీదేవి రక్షించుగాక]

శ్లో॥ భిన్నాం సంఘ సహస్రైః ఖిన్నాం శత్రుభరేణ ।
పాతుం భారత భూమిం మాతర్దేహి బలంనః ॥

[ఓ తల్లీ వేలకొలది సంఘములుగా విచ్ఛిన్నమై శత్రు భారముచే ఖిన్నురాలైన భారతదేశమును కాపాడుటకు మాకు బలమిమ్ము]

శ్లో॥ అధ్వనోగళిత చరణా మధ్వరక్షితిమవి భవామ్ ।
ఆదదాతు పథివిమలే వైభవే చహరి తరుణీ ॥

[మార్గమునుండి చరణములు జారి, వైభవమును గోల్పోయిన ఈయజ్ఞభూమిని తిరుగ ఆమార్గమునను వైభవమునను గూడ ఇంద్రాణి తెచ్చుగాక]

శ్లో॥ ఛిన్నాం భిన్నాం సుతరాం సన్నా
మన్నా భావాదభితః ఖిన్నాం ।
ఏతాం పాతుం భరతక్షోణీం
జాయే జిష్ణోః కురుమాం శక్తామ్ ॥

[ఓ దేవీ భిన్నభిన్నమై క్షీణించుచు, అన్నములేక అంతటను దుఃఖించుచున్న భారతభూమిని రక్షించుటకు నాకు శక్తినిమ్ము]

ఇలా వ్రాసినటువంటి శ్లోకాలలో మనదేశం ఎందుకు క్షీణించిందో కారణం చెప్తూ అటువంటి చరిత్ర పునారావృత్తం కాకుండా ఎలా ఉండాలో కూడ సూచనలు కానవస్తాయి.

అంతేకాకుండా అలనాటి జాతీయ నాయకులలో ఇంద్రాణీ శక్తిని ఉద్దీపింపజేస్తూ వ్రాసిన శ్లోకాలు ఇలా ఉన్నాయి.

శ్లో॥ జగతాం చక్రవర్తి న్యసితకటాక్షః ।
జలదః భక్తిభాజాం శిఖినాం నర్తనాయ ॥
సుకృతీ కోపినాట్యే బహుళేత త్రమాతః
జగతీసార భూతానుపదేశాన్కరోతి ॥

[అమ్మా జగములరాణీ! నీనల్లనైన (అదృశ్యమైకురిపించు) కటాక్షము భక్తులనెడి నెమళ్ళయొక్క నాట్యము కొరకు మేఘమగు చున్నది (వర్షమువలె అనుగ్రహించుటకు) అమ్మా వివిధములైన ఆ నాట్యములలో నొక పుణ్యపురుషుడు (రమణమహర్షి) జగత్తు కొరకు శ్రేష్ఠమైన యుపదేశములను జేయుచున్నాడు. (అతనిని అనుగ్రహింపుము].

శ్లో॥ అపరో నవ్యకావ్యాన్యన వద్యానిధన్యః ।
విదధాత్య ప్రయత్నా ద్బుధభోగక్షమాణి ॥

[ధన్యుడైన మరియొకడు పండితుల ఆనందము కొరకు అనింద్యమగు నూత్న కావ్యములను సృష్టించుచున్నాడు (గణపతి ముని) వారిని ఆదుకొనుము]

శ్లో॥ ఇతరోభాగ్యశాలీ రమణీయైః ప్రసంగైః ।
వితనోతి స్వజాతిం జగతి శ్రేష్ఠనీతిమ్ ॥

[మరియొక భాగ్యశాలి రమ్యమైన ప్రసంగములతో శ్రేష్ఠమైన నీతిని బోధిస్తూ తన జాతిని మేల్కొలుపుతున్నాడు. (వారిని కరుణింపుము) "ఆల్కాటు" దొరకు ఇది వర్తించునను భావము కలదు]

శ్లో॥ జగతాం మాతరేకో మహసా పుణ్యశాలీ ।
విధుతారిం స్వదేశం కురుతే వీతపాశమ్ ॥

[జగన్మాతా! మరియొక పుణ్యవంతుడు తన తేజస్సుచే శత్రువులనోడించి నిజదేశమును బంధమునుండి విడిపించుచున్నాడు (గాంధీ) వారికి నీశక్తి నిమ్ము]

శ్లో॥ పర ఇంద్రాణి! సాధుర్భత విస్మృత విశ్వః
రమతేసిక్తగండః ప్రమదాశ్రుప్రతానైః ॥

[ఇంద్రాణీ! సాధువైన ఇంకొకరు (అరవిందుడు) విశ్వమునుమరచి ఆనంద బాష్పముల క్రీడించుచున్నాడు. ఆశ్చర్యము! వారిని కాపాడుము].

ఇలా తాను వ్రాసిన శ్లోకాలలో ఏడువందల (700) శ్లోకాలను కలిపి "ఇంద్రాణీ సప్తశతి" పేరిట మహాకావ్యం చేశారు నాయన. ఇందు 7 శతకములు కానవస్తాయి. ప్రతీ శతకములోనూ 25 శ్లోకాలు గల నాలుగు స్తబకాలుంటాయి. ప్రతీ స్తబకమునందు రెండవది మరియు 24వ శ్లోకము దేశభక్తికి చెందినవిగా కానవస్తాయి. ఇక ఛందస్సు, వృత్తము ఇత్యాదులను గమనిస్తే మొదటిశతకములో ప్రతీచరణము 12 అక్షరాలతో ఉండగా రెండవ శతకము నందు 14 అక్షరాలు కానవస్తాయి. ఇలా ప్రతి శతకమునకు రెండేసి అక్షరాలు అదనంగా జోడిస్తూ చివరి స్తబకమును 24 అక్షరములతో వ్రాయుట విశేషం.

మరో ఆరువందల శ్లోకాలను ఉమాసహస్రము నందు చేర్చి ఆకావ్యమునుకూడా సంపూర్ణంగా సంస్కరించారు నాయన.

— X —

# 10. రాజకీయం పిలిచింది

శ్లో॥ నమమపరమే ముక్తావాశానవా విభవాష్టకే ।
నచగజఘటాపూర్ణాయాం వామహేశ్వరిః సమ్పది ।
నచమధుముచాం వాచాం సర్గే నిరర్గళ వైభవే
ముని భువికుతో జాతః సోహంతదేవ సమీర్యతామ్

[నాకు ముక్తియందాశలేదు. అష్టైశ్వర్యాలు నన్ను లోభ పెట్టలేదు. మధుర కవితాధార నాకు తృప్తి కలిగించలేదు. నాది ఒక్కటే ప్రశ్న ? నేను ఈలోకానికి ఎందుకువచ్చాను? అది నీవు (పరమేశ్వరి) తెలిపి నాచేత కావలసిన పనులు చేయింపుము]

—ఉమాసహస్రము, గణపతిముని.



అలనాటి రాజకీయ సాంఘిక వాతావరణంలో స్త్రీ స్వాతంత్ర్యము, అంటరానితనము అనేవి పెద్ద సామాజిక సమస్యలుగా ఉండేవి. శాస్త్రీయమైన పరిష్కారంకోసం నాయకులు మతాచార్యులను, పండితులను, సాధువులను ఆశ్రయించి వారి యభిప్రాయములను కోరెడివారు. కారణం ప్రజలకు మతముపై గల విశ్వాసము కులమత వర్గీకరణపై మతములపై బురదజల్లే ప్రయత్నాలుకూడా సాగేయి. వాద ప్రతివాదములతో సమస్య ఊగిసలాడుతూ ఉండేది. ఒక ప్రక్క సంస్కరణ పేరిట ప్రజా ఉద్యమములు సాగుచుండగా మరియొకచోట అందులకు వ్యతిరేకధోరణులు గానవచ్చేవి. అటువంటి రాజకీయ మేఘాలు అరుణాచలమును గూడ చుట్టుముట్టాయి.

1916వ సం॥లో కీ. శే. బయ్యా నరసింహంగారి అధ్యక్షతను జరిగిన రాష్ట్ర కాంగ్రెసు సభలలో నాయన పాల్గొన్నారు. తరువాత మరల 1923 లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభకు నాయన ఆహ్వానింపబడ్డారు. వేదకాలంనాటి స్త్రీ స్వాతంత్ర్యముపై వారు అచట ఉపన్యసించారు. ఫలితంగా నాయన కాంగ్రెసు పార్టీయందు సభ్యుడయ్యారు. 1924వ సం॥లో తిరువణ్ణామలై పురమునందు అఖిల భారత కాంగ్రెసు మహాసభలు నిర్వహింపబడ్డాయి. మహాత్మా గాంధీ. మాలవ్యా, బీసెంటు మొదలగు ప్రముఖులు సభకు విచ్చే శారు. అందు నాయన స్వాగతోపన్యాసము పలువురను ఆకర్షిం చింది. డిశంబరు మాసమునందు బెల్గాంలో గాంధీ అధ్యక్షతన సభలు జరిగాయి. అచట దేశభాష 'హిందీ' కావలయునని గాంధీ గారు ప్రతిపాదన చేశారు. నాయన దానిని వ్యతిరేకించారు. సంస్కృతము దేశభాష కావలయునని వారు వాదించారు. హైందవ సంస్కృతి సంస్కృత భాషలో ఇమిడియున్నదని, సంస్కృతభాషను పోషించుటద్వారానే సంస్కృతి నిలబడగలదని లేనిచో అధోగతి తప్పదని నాయన వాదించగా అది ఒక వర్గమువారికే పరిమితమైన దని కావున దానిని రాష్ట్రభాష గావించుట క్లిష్టమని గాంధీ అభి ప్రాయపడ్డారు. వెంటనే నాయన మన సంస్కృతి పరమ పురాతన మైనదని, సంస్కృతము అన్నిజాతులందును వాడుక భాషగా ఉండేదని జవాబిచ్చారు. ఎట్టకేలకు నాయన వాదన నిలబడలేదు. అయినప్పటికీ సంస్కృతమును సులభతరం జేసి "లాలిభాష" వ్రాయుటకు ఈ సమావేశముపకరించినది.

నాయన హైందవ మతమునందు గల వర్ణాశ్రమ ధర్మము లను వ్యతిరేకించలేదు. జాతులు జన్మవలనగాని, వృత్తివలనగాని అంతస్తుచేతనుగాని రాలేదు. మనిషియొక్క మనః ప్రవృత్తి వాని వర్గమును నిర్ణయిస్తుంది. మనిషియందు సత్త్వగుణము అధికమై యుండి, తక్కువగా రజోగుణము కలిగి, నామమాత్రపు తమో గుణం గలవారు బ్రాహ్మణులు, వారు నిరంతర బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై ప్రజలకు సన్మార్గము జూపువారై యుందురు.

క్షాత్రతేజము నాయకులందు గానవగును. విప్లవాత్మకమైన రాజ సగుణము వారి యందు అధికముగా నుండును. సత్త్వతమో గుణముల పరిమాణము తక్కువగా నుండును. అటు వంటి క్షాత్రము గలవారు క్షత్రియులు. అధిక తామసము గలిగి సత్త్వరజో గుణములు తక్కువగా నున్నవారు వైశ్యులు. పూర్తిగా తమోగుణముతో వర్తించువారు శూద్రులు. ఇందు ఒక వర్గమువారు మరోవర్గమునందు పరిగణింపబడుటకు అవరోధములు హిందూ మతమునందు లేవు. వారి మనోవిశ్లేషణ, వికాసము ననుసరించి సమాజము వారిని గౌరవించుచుండును. అలనాటి వేద సంస్కృతి యిది. నాయన ఇటువంటి వేద సంస్కృతీ ధర్మమునకు కట్టుబడి యుండేవారు.

1927 వ సం॥ లో అంటరానితనముపై కాంగ్రెసు వారు హైదరాబాదు, మచిలీపట్నం ఇత్యాది ప్రదేశములలో అనేక సభలు నిర్వహించారు. నాయన ఆ సభలందు పాల్గొన్నారు. 25-2-1927 నాడు శ్రీ మాడపాటి హనుమంతరావుగారి ఇంటిలో హైందవముపై, జరిగిన సంభాషణ వివరములివి. అందు పృచ్ఛకులు అనేకులుకాగా జవాబులు నాయనచే చెప్పబడినవి.

ప్రశ్న : హిందువులకు సామాన్యధర్మములేవి ?

జ : వేదములను నమ్ముట. వానిలో నందరికిని సమానాధికార మిచ్చుట. ఈరెండూ సమకూడిననే గాని అందరికీ విశ్వాసము కలుగదు. క్రైస్తవులు బైబిలు నెట్లు భావింతురో హిందువులు సహితము వేదమునట్లు భావించవలయును.

ప్ర : ఇది ఆదర్శము. అందరును హిందువులని వ్యవహరింపబడు చున్నారు. ఎవ్వరు హిందువులు ?

జ : చాతుర్వర్ణ్య వ్యవస్థను నమ్మువారందరూ హిందువులు. నాస్తికుడైనను వేదప్రమాణమును ఒప్పుకొనిన హిందువే. ఉదా :- సాంఖ్యులు నాస్తికులే యైనను వేద ప్రామాణ్యము నొప్పుకొనుటచే హిందువులుగా పరిగణింపబడుచున్నారు.

ప్ర : వేదముల నెట్లు ప్రచారము చేయవలయును ?

జ : వేదములలోని ముఖ్య భాగములను దేశ భాషలలోనికి పరి వర్తనము చేయవలయును.

ప్ర : బౌద్ధులు హిందువులేనా ?

జ : బౌద్ధులు, జైనులు, బ్రహ్మ సమాజము వారు వేదాధికారము నొప్పకుండుటచే హిందువులు కారు. ఆర్యసమాజము వారు హిందువులే.

ప్ర : కుల భేదము లుండవలయునా ?

జ : అందరు బ్రాహ్మణులే కావలయును. అట్లగువరకు చతు ర్వర్ణములలో అంతశ్శాఖాభేదములు పూర్తిగా పోవలయును ఇందు హెచ్చుతగ్గులు పాటింపకూడదు. ఆచారములయొక్క సామ్యముండిననే బ్రాహ్మణత్వము కలుగును "సిద్ధ్యత్యేవం అపాణి నీయంతు భవతి" అనునటు ఈశ్వరసేవ సిద్ధించిన

మహాశయులు నియమించిన సంప్రదాయము ననుస రించుట భావ్యము. సమానత్వమనగా ఉపనయనాది సంస్కారములందు సామ్యము పాటించుట. భేదముండ గూడదనగా భోజనాద్యాచారములందు తప్పు అని భావము. ఉదా :- మాంసభక్షకునికి శాకాహారునికి భేదమున్నది. (ఇటువంటి భేదములు తప్పవు)

ప్ర : అన్ని మతస్థులను హిందూమతములోనికి తీసికొనవచ్చునా? అపుడు హిందూమతములో వారి స్థానమేది?

జ : హిందూమతమునందుండి అన్యమతమందు జేరి హిందూ మత పునః స్వీకార మొనరించినవారు పూర్వమే వర్ణమం దుండిరో దానిలోనికి చేర్చుకొనవచ్చును. ఇట్లు చేరినవారిని "అవిశేషు" లని చెప్పవచ్చును.

ప్ర : కులములు మంచివేనా ?

జ : తారతమ్యముల నెంచుచో చెడ్డవి.

ప్ర : స్మృతులిప్పుడు వ్రాయవచ్చునా ?

జ : వ్రాయవచ్చును.

ప్ర : వానినాచరణలోనుంచుటెట్లు ?

జ : ఒకపరిషత్తు ఏర్పడవలయును. అదియే శాశింపవలయును.

ప్ర : అస్పృశ్యులనబడువారెట్లు పరిగణింపబడవలయును?

జ : వారు శూద్రులు.

ప్ర : సంఘ సంస్కారము వలన నేమి ఫలము ?

జ : సంఘ సంస్కారులు స్వచ్ఛందతను బోధింపగలరు. కాని, ధర్మ సంస్కారము చేయజాలరు. ఇప్పటి సంఘములోని లోపముల పోగొట్టనెంచుచున్నారు.

ఉదా :- వివాహలోపములు.

ప్ర : చతురాశ్రమములను పునరుద్ధరింపవచ్చునా ?

జ : ఇప్పటి కాలమున కనుగుణ్యముగా నుండవలయును. ఇప్పుడుండు హాస్టలువంటి వసతి గృహములను గురుకుల పద్ధతులపై నుంచవచ్చును. స్త్రీలకును గురుకులము లుండవచ్చును. స్త్రీలకు గూడ ఉపనయనముచేయువచ్చును. ఋగ్వేద కాలమందు స్త్రీలకు మౌంజీబంధన ముండినది. రజస్వలకాక పూర్వమే స్త్రీలకు ఉపనయనము చేయవల యును, స్త్రీలు వానప్రస్థులుగాకూడ ఉండవచ్చును.

ప్ర : బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సమస్యను పరిష్కరించుటెట్లు ?

జ : అందరికినీ వేదాధికారము నిచ్చుట చేతనే

ప్ర : శూద్రుల విషయమై కొన్ని స్మృతులలో వేదాధికారాలు లేనట్లు వ్రాసియున్నారు. దీనినెట్లు సమన్వయింతురు ?

జ : అట్టివానియందలి ధర్మములు సమయాచార ధర్మములు. రాగద్వేషములతో గూడినట్టి స్మృతులు ప్రమాణములు కానేరవు. శ్రుతికి విరుద్ధమైన స్మృతులు ప్రమాణములుకావు. వేదాధికారము లేదని వ్రాయుసూత్రములు ద్వేషయుక్తము లయినవి. మరియు వేద విరుద్ధములగుటచే అప్రమాణము లయినవి.

ప్ర : అస్పృశ్యులకు శూద్రులకు భేదమేమి ?

జ ॥ కొద్దిగనే. తాము భోజనము చేయు పాత్రలందు వారికి భుజింపబెట్టరు.

ప్ర : పంచములు ఆర్యులనుండి పతితులైనవారేనా ?

జ : కారు. వారు ఆటవికులుగా (Aborignaltribes) నుండునట్టి వారు. కాని ఆర్యులనుండి భ్రష్టులైనవారు కారు.

ప్ర : భోజనములందు అందరును కలసి భుజించవచ్చునా ? (Inter-Dining)

జ : శాస్త్రాక్షేపము ఈవిషయమునలేదు. ఆచారమే ఆటంకము కలిగించుచున్నది. దాక్షిణాత్యులలో ఈఆచారము తీక్షణముగ నున్నది. వారు తాంత్రికులై నుండినందున దృష్టి దోషము విశేషము. శాస్త్రములందు పైమూడు వర్ణములవారి ఇండ్లలో వంటచేయవచ్చునని యున్నది. శూద్రులు పాంక్తేయులు మాత్రమే.

ప్ర : మ్లేచ్ఛుడనగా నెవ్వడు ?

జ : అపభ్రంశముల మాట్లాడువారు మ్లేచ్ఛులు గాని ఇతరు లెవ్వరునూగారు.

ప్ర : రజస్వలా వివాహములు శాస్త్రప్రతిషిద్ధములేనా ?

జ : అవును. అయితే రజస్వల ఆయిన తర్వాత వివాహిత అయిన స్త్రీ దూషితకాదు. అట్టివారికి ప్రాయశ్చిత్తము వివరింపబడినది. బాల్య వివాహములు చెడ్డవికావు. కాని పునస్సంధానము మాత్రము తప్పక ఆలస్యముగనే చేయవలయును.

ప్ర : స్త్రీలు నిత్య బ్రహ్మచారిణులుగా నుండవచ్చునా ?

జ : ఉండవచ్చును.

ప్ర : పాశ్చాత్య పద్ధతిలో మనలోకూడ వివాహము లేల నుండకూడదు ?

జ : దేశభేదమునుబట్టి ఆచారములుండును. మనదేశములో అట్టి గాంధర్వ వివాహములు జరుపుకొను వారిలో విశేషముగా ఘోషాపద్ధతి ప్రబలినది. మరియు మనదేశము నందును అరేబియావంటి ఉష్ణప్రదేశము లందును భావోద్రేకము (Emotion) విశేషం. ఇంగ్లండువంటి శీతల ప్రదేశ మందు చాల తక్కువ. ఒక దేశాచారములు ఇంకొక దేశమునకు పథ్యములు కావు.

ప్ర : హిందూ సంఘము యొక్క పరమావధి యెట్లుండును ?

జ : అందరునూ వేదములు చదివి, యజ్ఞోపవీత ధారణ మొనర్చుటయే పరమావధి.

ప్ర : వయో నిర్ణయము (Age Consent) విషయమై తమ యభిప్రాయమేమి ?

జ : అందు నేను తటస్థుడను.

ప్ర : సర్వమత ఐక్యము ప్రపంచమందు సాధ్యమా ?

జ : సాధ్యముకాదు. కాని హిందూమతమందలి సాంఘిక బంధములు తీసివేసిన వేదమతమే ప్రపంచైక్యమును కలిగించు శక్తి కలది.

ప్ర : స్త్రీలు పునర్వివాహములు చేసికొనవచ్చునా ?

జ : చేసికొనవచ్చును. శాస్త్రములందనుజ్ఞగలదు. పురాణములు చరిత్రాంశములందునూ యయాతి చరిత్రము నందును నిదర్శనములు కలవు.

ప్ర : పామరజనులకు సహితము విగ్రహారాధనను ఈశ్వరభక్తిని బోధించుటెట్లు ?

ఋ : సూర్యమండలమందలి తేజస్సును, భూమండలమందలి అగ్నిని, ఆకాశమునందలి రుద్రుని, శక్తిని, ఈ మూడింటిని పూజింపవలయును. సూర్యోపాసన పండిత పామరులకు ఉత్తమమైనది.

ఆ సాయంత్రము 5 గంటలకు సుమారు రెండువందలకు పైగా ఆదిహిందువులు నాయనను పల్లకిలో ఊరేగించి "ముని" బిరుదమునిచ్చి సన్మానించిరి. "అంధ్ర సంవర్ధిని గ్రంథాలయము" సికిందాబాదు సంస్థవారు కూడా అతనిని సన్మానించారు.

నాయన ఈ ఉద్యమంలో అనేక ప్రతికూల విమర్శలను ఎదుర్కొనవలసివచ్చింది. కొందరు వారి యభిప్రాయములకు వంతపాడగా కొందరు వ్యతిరేకించారు. అయితే నాయన ఎదుట నిలబడి వాదించుటకుగాని, ప్రసంగించుటకుగాని ఎవరికిని ధైర్యము చాలినది కాదు.

చివరిగా నాయన "రాజ్యాంగ నిబంధనము" "పంచమ మీమాంస" "పంచజన చర్చ" ఇత్యాది పుస్తకములను వ్రాసి. రాజకీయాలకి స్వస్తి పలికారు.

## 11. మహిమాన్విత వ్యక్తిత్వము

శ్లో॥ పరిపాకేన కాలేస్యుః సిద్ధయస్తాన్త పస్యతః ।
ప్రారబ్ధం యదితాభిస్స్యాద్విహరోజ్ఞానినోపిచ ॥

[నిత్యమైన ఆత్మ దృష్టిగలవానికి తపః పరిపాకముచే సిద్ధులు కలుగును. ప్రారబ్ధమున్న యెడల జ్ఞానికూడా వాటితో విహరించును]

శ్రీ రమణగీతా

• • • •

భక్తుడు : ఆధ్యాత్మిక పురోభివృద్ధికి శరీరమును అదృశ్యము గావించెడి సిద్ధులు ఆవశ్యకముకాదా ?

మహర్షి : అనగా నీయభిప్రాయము ఏమి ? నీవు శరీరానివా ?

భక్తుడు : కాదు. కాని ఆధ్యాత్మిక పురోగతిలో శరీరమునందు మార్పులు సంభవము. అంతేనా ?

మహర్షి : ఎటువంటి మార్పులు నీవుశరీరమునందు కోరుకుంటు న్నావు ? ఎందుకు ?

భక్తుడు : శరీర అదృశ్యమగుట పురోగతికి ప్రమాణముకాదా ?

మహర్షి : అలా అయితే ఎవరైతే మాట్లాడుతూ, వ్రాస్తూ ప్రజలకు కనిపిస్తూ ఉంటారో వారు అజ్ఞానులన్నమాట.

భక్తుడు : అలా అనికాదు. వశిష్ఠవాల్మీకాది మహర్షులు అటువంటి శక్తులు కలిగియున్నారుకదా ?

మహర్షి : అది వారి ప్రారబ్ధమైయుంటుంది. ప్రారబ్ధముచే సిద్ధులను పొంది, వాటితోపాటు జ్ఞానమును గూడ పొంది యుండవచ్చును. జ్ఞానమునకు ప్రతిబంధకములయ్యే అటువంటి సిద్ధులకై నీవేల తపించెదవు, జ్ఞాని తన స్థూల దేహమును ప్రతిబంధకమని తలుస్తాడా ?

చాలామంది రమణమహర్షుల వారిని శక్తుల గురించి సిద్ధుల గురించి ప్రశ్నిస్తూ ఉండేవారు. అందులకు వారి సమాధానము ఈ విధముగా ఉంటూ ఉండేది. 'సిద్ధి' అనగా Achievement అని అర్ధం. దానిని మహిమలతో ముడిపెట్టుట సరిగాదు. కపాల మోక్షము తరువాత అనేక సిద్ధులు పొందిన నాయనకూడా వాటిని ప్రకటించుటకు విముఖత చూపేవారు. అయితే మహిమలను చూచి సంతోషించే లోకం వారిని వదిలిపెడుతుందా !

1925 వ సం॥ డిశంబరు మాసమునందు విజయవాడలో జరిగిన రాజకీయ సమావేశమునకు నాయన వచ్చారు. అలనాటి సాంఘిక దురవస్థలను రూపుమాపుటకు చేయు సంస్కారణలపై వారు ఉపన్యసించారు. నాయన నవీన ధృక్పథం సనాతనులకు నచ్చేది కాదు. కాని యువకులు వారి ఉపన్యాసాలను విని ఉత్తేజం చెందేవారు. చెరువు రామకృష్ణయ్య అను విధ్యార్థి నాయన ఆశయాలకు ప్రభావితుడై అతనిని తన ఇంటికి విందుకని ఆహ్వానించాడు. ఆ యువకుని తండ్రి బహుసనాతనుడు. అతని ఇంట నిత్య అగ్నిహోత్ర కర్మానుష్ఠానములు జరుగుతూ ఉండేవి. నాయనకి మడీ తడీ లేదని ఆముదుసలికి తెలుసు కావున పెరటి అరుగుపై కుర్చీ వేసి అగ్నిహోత్రకర్మ అయ్యేవరకు నాయనను అచట కూర్చోపెట్టుమని తండ్రి తనయుని ఆదేశించాడు. పాపం! రామకృష్ణయ్యకు ఏంచేయాలో తోచలేదు. నాయన వాని స్థితి గ్రహించి "పెద్దవారు వారిమాట వినడం మన కర్తవ్యం" అని పెరట్లో కూర్చున్నారు. కాలక్షేపానికని దినపత్రిక అతనికీయబడినది.

అగ్నిహోత్ర కర్మకి భార్య నిప్పు రాజేసి తీసుకురావడం ఆచారం. ఆయింటి ఇల్లాలు పెరట్లో నిప్పుజేసి గరిటతో నిప్పుదెస్తూ నాయనవైపు చూసింది. ఆశ్చర్యం! పెద్ద తొండంకల, ఏనుగు చెవ్వులు. చిరుబొజ్జతో సాక్షాత్తూ గణపతే అచట పేపరు చదువుతూ కానవచ్చాడు. ఆమె చేతిలోని గరిటె క్రిందపడిపోయింది. సంభ్రమాశ్చర్యాల మధ్య ఆమెకేంచేయాలో తెలియలేదు ఒక్కక్షణం విస్తుపోయితరువాతతేరుకుని ఆమెగబగబాఇంట్లోకివెళ్ళి "దేవుణ్ణిపెరట్లో కూర్చోబెట్టి ఇచట గణపతి హోమం ఏమిటండీ! ఒక్కసారి పెరట్లోకి వచ్చి చూడండి" అని భర్తను చేయిపట్టుకొని లేపింది. అంతట అతడు పెరట్లోకి వచ్చి సాక్షాత్తు గణపతిని అచట జూచి విస్తుపోయి, సాష్టాంగ నమస్కారంజేసి తన్ను క్షమింపమని వేడుకొని నాయనను

ఇంటిలోనికి పిలచారు. తర్వాత నాయనే స్వయంగా మంత్రం చదువగా అగ్నికార్యము అచట జరిగినది.

మహర్షిని చూడవచ్చే శిష్యులందరూ చూత గుహలోని నాయనని చూడనిదే వెళ్ళేవారుకాదు. ఒకసారి ఒకభక్తుడు మహర్షిని సమీపించి "స్వామీ ! మిమ్ము వైష్ణవ స్వామిగా చూడాలని ఉంది. మీరు అంగీకరిస్తే నామాలు పెడతా" నన్నాడట. అందులకు మహర్షి నవ్వుతూ "చూతగుహలో నాయన ఉన్నారు. వారికి నామాలు పెట్టండి" అన్నారట. నిజానికి ఇందులో గూడార్ధం ఉంది. గణపతి విష్ణు అంశకు చెందినవాడు. అందుచే వైష్ణవ సాంప్రదాయానికి అతను అర్హుడౌతాడు. మహర్షి మాట విన్న భక్తుడు చూత గుహకి వెళ్ళగా అచటనాయన ఏకాంతంలో ధ్యానంలో కనిపించారు. చడీచప్పుడు లేకుండా నామాలు పెట్టి తన సరదా తీర్చుకున్నాడా భక్తుడు. కాని భోజనసమయంలో నాయన నామాల్ని చూసి భగవాన్ నవ్వేసారు. "నాయనా ఏమిటిది" అన్నారు మహర్షి. నాయనకి విషయం తెలియలేదు. అంతలో ఒకభక్తుడు అద్దంతెచ్చి నాయనకిచ్చాడు. అద్దంలో తన ముఖంపై గల నామాల్ని జూచారు నాయన. వారికి కూడా నవ్వువచ్చింది. మహర్షి నుదిటిపై పట్టి వర్ధనాలు (విభూతి) ఉన్నాయి అది జూచిన నాయన "భగవాన్ అది ఏమిటో ఇదీ అదే" అన్నారు. కుటీరమంతా నవ్వుల జల్లయింది. ఆహా ! మహనీయుల ఉదారత ఎంతగొప్పది.

కుమారునకు వివాహమై ఇంటికి కొత్తకోడలు రావడంతో నాయన చూతగుహవదలి పురములో ఇల్లు అద్దెకు తీసుకుని అచటికి మకాం మార్చారు. సాంఘిక ఆధ్యాత్మిక రాజకీయ సీమలందు స్త్రీలకు కూడ పురుషులతోపాటి సమానమైన హక్కులున్నాయని తెలియజేస్తూ అలనాటి హైందవ సంస్కృతిని తలపింపజేసే చారి

త్రాత్మక నవల వ్రాయాలని సంకల్పించారు నాయన. సంస్కృతంలోనూ తెలుగులోనూ కూడా వ్రాయాలన్నది వారి సంకల్పము ఆనవలకు "పూర్ణ" అని పేరుపెట్టారు. సుమారు 200 ప్రకరణాలతో ఆంధ్రమహావిష్ణువు చరిత్ర కాలాన్ని తీసుకొని రూపొందించాలని వారి ప్రయత్నం. అందుకని ఒక ప్రణాళిక ప్రకారం పాత్రలను రూపుదిద్దారు. కాని ఇవన్నీ కాగితంమీదకాదు భగవాన్ మహర్షి చెప్పినట్లు అతని మెదడులోనే ఇవన్నీ నిర్మింపబడ్డాయి. ఫలితంగా ప్రతిరోజు తన శిష్యులకు కథావృత్తాంతాన్ని చెబుతూ ఉండేవారు. నాయన వాక్కు అతి మధురము అందుతోబాటు చెప్ప బోయేది కథ. ఇంక అడగాలా! అరుణాచలుని ఆలయ ప్రాకారం వారికి కథావేదిక అయింది. ప్రతిరోజూ అచట తన కుమారునితో బాటు కొందరు శిష్యులు గుమిగూడేవారు. నాయన వారికి కథాంశం వినిపించేవారు.

ఇలా ఉంటూ ఉండగా 1926 లో కుమార్తె వజ్రేశ్వరి పురిటి కని ఇంటికి వచ్చింది. ఆమె ఏడు నెలల గర్భవతి. ఒకరోజు అక స్మాత్తుగా ఆమెకు కడుపునొప్పి వచ్చింది. విరోచనాలు కూడా అధిక మయ్యాయి. ఆమె తట్టుకోలేని పరిస్థితి వచ్చింది. అంతట ఊరిలోని వైద్యుని పిలిపించారు. అతడు మందునిచ్చి, కొండ అరటిపండును (పేవాళప్పళం) అనుపానంగా ఇమ్మన్నాడు. అది సీజను కాకపోవు టచే పురమునందు "పేవాళప్పళం" దొరకలేదు. నాయన చేసేది లేక కుమారునితోబాటు ఆలయం జొచ్చి తమ కథావేదికవద్ద కూర్చు న్నారు. మరికొందరు శిష్యులు కూడా అచట చేరారు. వెంటనే కథ ప్రారంభించారు నాయన. అంతలో కావడి రెండువైపులా తట్టల్లో అరటిపళ్ళతో ఒకడు నాయనను సమీపించి "గణపతిశాస్త్రి గారు మీరేనా? మీకీఅరటిపళ్ళు ఇమ్మన్నారు" అబుతూచెని

తానెవరో ఏమిటో చెప్పకుండా ఒక పెద్ద "పేవాళప్పళం" అచటపెట్టి గబగబా వెనుదిరిగి వెళ్ళిపోసాగాడు. నాయన వెంటనే మహాదేవు నితో" నీవు అతనివెంటవెళ్ళి గమనించు" అన్నారు.

మహాదేవుడు ఆకావిటివాని వెనుక పరుగెట్టాడు. కాని యీ యాగంతకుడు తన అడుగులను మరీ వడి వడిగా వేస్తూ గోపురంలోకి జొరబడ్డాడు మహాదేవుడు కూడా గోపురంలోనికి జొరబడి అంతటా వెదికాడు. కావటివాని జాడ గానరాలేదు. విషయం తెలుసుకున్న నాయన కుమారునితో "అరుణాచలుడే అతడు" అన్నారు. అందరూ విస్మయంజెందారు.

## 12. విశాలాక్షమ్మ నిర్యాణము

శ్లో॥ స్వరూపే వర్తమానానాం పక్వానాం యోషితామపి ।
నివృత్తత్వా న్నిషేధస్య హంసీత్వం నైవ దుష్యతి ॥

[స్త్రీలైనను పరిపాకము చెందిన వారై ఆత్మరూపమున నిలకడ చెందిన వారికి నిషేధము లేనందున హంసినులుగ నుండుట తప్పుగాదు]

—శ్రీ రమణఋషి రమణగీతా.

• • • •

శ్రీ రమణ భగవాన్ విరూపాక్ష గుహలో ఉండేరోజులవి. ఒక రోజు శ్రీ విద్యారణ్యులవారు వ్రాసిన "శంకర విజయం" గురించి ప్రసక్తి వచ్చింది. అప్పుడు భగవాన్ "వారు శ్రీ విద్యోపాసకులు గదా శ్రీ చక్రాకారంగా పట్నం నిర్మించాలని హంపీలో ప్రారంభించి విఫలమనోరథులై భవిష్యత్తున ఒక చక్రవర్తి రాగలరనీ, వారు శ్రీ చక్రాకారంగా పట్నం నిర్మించగలరనీ, వ్రాశారు" అని అన్నారు. వెంటనే నాయన "శ్రీ చక్రాకృతి శోణశైలవపుషం శ్రీ షోడశారాత్మకం అని అరుణాష్టకం (శంకరాచార్య విరచితం) స్తోత్రంలో ఉంది. అదేగాక అరుణాచల పురాణంలో ఈగిరి శ్రీ చక్రా

కారమని ప్రసిద్ధి. అందువల్ల వెతక్కుండానే మనకి శ్రీచక్రాకృతిగల స్థానం లభించింది. భగవాన్ చక్రవర్తి, గిరిచుట్టూ పది ఇళ్లు కడితే ఇదే మహాసామ్రాజ్యం. వారు భవిష్యత్తు గురించి వ్రాసింది ఇదే అయి ఉంటుంది" అని వ్యాఖ్యానించి "ఇదిగో వీడు సేనాధిపతి, వాడు కోశాధ్యక్షుడు" అని రాజ్యాంగం అంతా ఏర్పాటు చేశారట. శ్రీ చక్రానికి తాత్త్వికంగా ఎంతటి ప్రాధాన్యం ఉందో తెలుస్తోంది.

అటువంటి శ్రీ చక్రాన్ని నిరంతరం పూజచేసిన మహా ఇల్లాలు విశాలాక్షమ్మ. ఆమె గణపతిముని భార్య. అరుంధతీ వసిష్ఠులను పోలిన ఋషిదంపతులు వీరు. "నేను పద్మావతీ చరణ చారణ చక్రవర్తి"నని సగర్వంగా చెప్పుకున్నాడు భక్తజయదేవుడు. పద్మావతి అతని భార్య. ఆమె అందెల సవ్వడిలో, పద విన్యాసాలలో రాధా మాధవుల ప్రేమ తత్త్వాన్ని దర్శించాడా మహాకవి. అంతేకాదు ఈ నాటికి మనచేత దర్శింపజేస్తున్నాడు. అనుకూలమైన దాంపత్యం కుదరాలిగాని గృహస్థాశ్రమాన్ని మించిన ఆశ్రమం లేదనిపిస్తుంది "నీవు లేని తపస్సు నాకు అరణ్య రోదనముగా నున్నది" అని వాపోయారు ఒకసారి గణపతిముని తన భార్య పిల్లల చెంతకు వెళ్ళి నప్పుడు. పదహారువేల గోపికలను పెండ్లి యాడిన శ్రీకృష్ణుడు తాను అస్ఖలిత, బ్రహ్మచారినని నిర్భయముగా చెప్పుకున్నాడు కాని నిత్యతపోధనుడు, అవివాహితుడు ఆయన శుకమహర్షికి తన బ్రహ్మచర్యంపై సందేహం ఉండేదట. అనుకూల దంపతుల ప్రేమ అమర ప్రేమ. అది దైవీకమైనది. నాటి ఋషికుల వాతావరణం మనకి విషయాన్ని దలపింపజేస్తుంది.

1922 వ॥ సం॥లో భగవాన్ అళగమ్మ సమాధి వద్దకు వచ్చి అచట స్థిరంగా ఉండిపోయారు. ఫలితంగా భక్తజనులకై అచట ఒక చిన్న పాకవేసారు. అదే క్రమంగా పెరిగి పెద్దదై ఈనాడు

శ్రీ రమణాశ్రమముగా మనకి కనిపిస్తున్నది. విశాలాక్షమ్మ ముందు చూపు ఎంతటిదంటే ఆమె ఆశ్రమమునందు శ్రీ చక్ర ప్రతిష్ఠ చేయించుమని భగవాన్‌తో అన్నదట. ఆమె మాటకు విలువిచ్చిన భగవాన్ అచట ఆలయనిర్మాణ సమయమునందు శ్రీచక్ర ప్రతిష్ఠకు నిర్మాణ సమయమునుండి ఎంతో శ్రద్ధ చూపించారు. నాయన వర్ణించిన శ్రీ చక్రపురమే యిది అని అనవచ్చును.

సాధారణముగా ప్రతి ఇల్లాలు ఇల్లూ, వాకలి, పిల్లలు, ఆస్తి, ఇలా ప్రాపంచిక భోగాల్ని కోరుకుంటుంది. అడవులలోను, గుహల లోను ఉండుటకు ఇచ్ఛగించదు. కాని విశాలాక్షమ్మ ఇందులకు విలక్షణమైన ప్రవృత్తితో భర్తతోపాటు గుహావాసాన్ని కోరుకుంది. అంతేగాకుండా నాయనతోపాటు సమానంగా తపస్సు చేసింది.

నాయనతోపాటు అరుణాచలంలో అడుగుపెట్టగానే శ్రీభగవాన్ "అమ్మ వచ్చింది" అన్నారట. ఆనాటినుండి ఆమె అందరికీ 'అమ్మ' అయింది. నాయన శిష్యులందరూ ఆమెకు బిడ్డలవంటి వారే! అందరిని ఆధరించిన అన్నపూర్ణయామె. ఒక వినాయక చవితినాడు జిల్లేడుకాయలు (మోదకాలు) వండిందామె. అందు గణపతి ఆకారంతో ఒక మోదకం ఉంది. సాధారణంగా దానిని చాకలికి వేయుట, ఆచారము ఏలయన అవి తింటే చదువురాదనే నమ్మకం ఆచారంగా ఉండేది. అమ్మ ఆ వినాయకుని మోదకాన్ని నాయనకి వడ్డించింది. అమ్మా! అదేమిటి! దానిని తినకూడదు కదా! అని ఒక శిష్యుడడిగాడట. వెంటనే అమ్మ "దానిని అతను (నాయన) తినడమే మంచిది. ఇప్పటికే చదువు ఎక్కువై అవస్థ పడుతున్నాం" అందట. అందరూ ఘొల్లుమని నవ్వారు. ఇలా ఆమె మాటలలోని చతురత అందరికీ నచ్చేది.

స్త్రీలు వంటింటి కుందేళ్ళు కాకూడదంటుంది ఆమె. పురుషులతోబాటు తపోధికారము స్త్రీలకు గూడా గలదు. వారు కూడా హంసినులై జీవించవచ్చునని చెప్పేదామె. ఈ విషయములో నాయన ద్వారా రమణ ఋషిని రెండు ప్రశ్నలడిగించిందామె.

(1) ఆత్మయందు నిలకడ చెందిన స్త్రీలు ప్రతిబంధకమున్న యెడల ఇల్లు విడచి పరమ హంసినులుగ యుండుట శాస్త్ర సమ్మతమగునా ?

(2) జీవన్ముక్తురాలికి దేహపతనము సంభవించిన తరువాత దహనమొనర్చ వలయునా, సమాధి నాచరించ వలయునా, యుక్తమెద్ది ?

భగవాన్ రమణులు అనుగ్రహించిన జవాబులివి.

(1) స్త్రీలైనను పరిపక్వము చెందినవారై, ఆత్మరూపమున నిలకడ చెందిన వారికి నిషేధము లేనందున 'హంసి' నులుగ నుండుట తప్పుగాదు.

(2) ముక్తియు, జ్ఞానమును స్త్రీ పురుషులకు సమానము. కావున జీవన్ముక్తురాలిని దహింప గూడదు. ఆమె దేహము దేవాలయముగా నున్నది. ముక్తుడగు పురుషునియొక్క దేహ దహనమున కెన్ని దోషములున్నవో స్త్రీయొక్క దేహదహన మొనర్చినను అన్ని దోషములున్నవి.

నాయనకు కపాలమోక్షము సిద్ధించిన రోజులలోనే అనగా 1922 లో విశాలాక్షమ్మ కూడా కుండలినీవిద్య సాధనలో చాల పురోగతిని సాధించినది. ఈ విషయాన్ని నాయన తన పుత్రునకు వ్రాసిన ఉత్తరంలో తెలియజేసారు.

"ఆమె (విశాలాక్షమ్మ) భగవతి యోగేశ్వరి" సార్ధక నామ ధేయురాలైనది. ప్రచండ చండికైకాక్షరిని దినమునకు 12 వేలు

జపించుటయేగాక తీవ్ర ధ్యానములకు అలవాటయినది. ఆమె ధ్యానము ప్రయత్న పూర్వకముగా వచ్చినది కాదు. అనుగ్రహము వల్ల కలిగినదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఎంతసేపైనను అర్ధనిమీలిత నిశ్చల దృష్టితో ఆమె ఉండగలుగుచున్నది. అట్టి స్థితి నిన్న (14-1-1922) ఆరంభమైనదని చెప్పవచ్చును. అట్టి సమయములో శరీరము విద్యుచ్ఛక్తి పూరితమగుచున్నట్లుండునని ఆమె చెప్పుచున్నది. చూచువారికి ఆమె దివ్యముఖమునందు గొప్ప సూక్ష్మతేజస్సు మాత్రము తెలియుచున్నది. కొత్త యోగ నిష్ఠాసిద్ధిని పొందిన మీతల్లిని మీరు పత్రములద్వారా సేవించు కొనవలెను".

1926 నుండి ఆమె ఆరోగ్యము క్రమముగా క్షీణించసాగింది. రక్తక్షీణత, అజీర్ణము వల్ల ఆమె శరీరం క్రుంగిపోసాగింది. అయినప్పటికీ ఆమెయందలి తపస్సాధనదృఢతరంకాసాగింది. ముఖమునందలి తేజస్సు పలువురిని ఆకర్షించింది. భర్తతోడ్పాటు, మహర్షుల అనుగ్రహము వల్ల ఆత్మనిష్ఠను చెందిన ఆ పుణ్యవనిత 26-7-1926 నాడు అనగా ఆషాడ బహుల విదియా సోమవారంనాడు అరుణాచలమునందే దేహత్యాగము జేసినదై ముక్తిధామమునుచేరుకున్నది.

నాయన మాటలలో చెప్పాలంటే "ఆత్రేయుల వంశమునకు వెన్నెలయు, వాసిష్ఠ కులమునకు కోడలును ధీరుడు, బ్రహ్మవేత్త అయిన మహాదేవునకు తల్లియు, ప్రతివ్రతలలో శ్రేష్ఠురాలును, లోకసేవయను వ్రతమునందు ప్రీతిగలదియు, పంచదశీ మహావిద్యను ధరించునదియు, వింధ్యా దక్షిణ దేశమునందు తారిణీశక్తి మహావిద్యను బోధించుటయందు ఆదిమ గురువుగ ప్రసిద్ధి చెందినదియు, తపస్సఖియును అగు విశాలాక్షమ్మ "విశాలాక్షీమాత"గ భక్తుల హృదయాన్న చిరంజీవి అయినది.

# 13. శ్రీ రమణోపదేశ ప్రచారము

శ్లో॥ నవ కుంకుమరేణు పంకిలస్య
స్మరణాత్తే సతతం స్తనా చలస్య ।
స్వయ మప్య చలోబభూవ శోణ
శ్శశిధారీ జగతాం సవిత్రి ః శంకే ॥

[అమ్మా సవిత్రీ ! కుంకుమ రేణువులచే నిండిన నీ స్తనాగ్రములను సదా స్మరించి శివుడు శోణగిరి రూపమును పొంది నట్లున్నాడు].

నాయన ఈశ్లోకం చదవగానే రమణసన్నిధిలో ఉన్నవారంతా ఒక్కసారి ఫక్కుమని నవ్వారు. భగవాన్ కూడ మందహాసంతో "నాయన కవిత్వానికి అరుణేశుడు కూడా చలించిపోతాడు. నిర్గుణ రూపుడైన ఈశుని శృంగార రస పూరిత చమత్కారంతో వర్ణించడం నాయనకే సాటి" అన్నారు. అందులకు నాయన నవ్వుతూ "వారి నిర్గుణత్వాన్ని కళంకితం చేయనులెండి" అని మరికొన్ని శ్లోకాలు చదివారు.

శ్లో॥ కమలాసన కంజలోచనాదీన్
అవమత్య త్రిదశాన్నగేశ కన్యే ।
అగుణే రమసే నగేత్రి శోణే
క్వ గుణా న్పశ్యతి జాతి పక్షపాతః ।

కొండకూతురు కాబట్టి జాతిపక్షపాతంతో బ్రహ్మ విష్ణు మొదలైన దేవతలను కూడా విస్మరించి నిర్గుణమై యెప్పు ఈ అరుణ గిరిలో క్రీడించు చున్నావు అని చెబుతు పార్వతీదేవి పక్షపాతాన్ని చమత్కరించారీశ్లోకంలో

శ్లో॥ కుసుమాదపి కోమలం వపుస్తే
హృదయేశ స్త్వరుణోగిరిః కఠోరః
ప్రచలా౽౽ఖు తురంగ మస్య మాతః
సమనుధ్యాయ బిభేమి చేతసేదమ్ ॥

[అమ్మా ! నీ శరీరము కుసుమము కన్న కోమలము. నీ భర్త దేహము అరుణగిరి గాన కఠోరము, నీ కుమారుని వాహనమా అతి చపలమైన ఎలుక. అట్టి వినాయకుని తల్లీ ఇవన్నియు తలచి నేను భీతిల్లు చున్నాను]

ఇలా ప్రతిరోజు కావ్య మాధుర్య చమత్కారములతో కళకళలాడుతూ ఉండేది శ్రీరమణ సన్నిధి. అటువంటి సుందరమైన వాతావరణంలో భక్తులకు, అళగమ్మ, విశాలాక్షమ్మలు లేనిలోటు స్పష్టంగా కనిపించేది. అమ్మ (విశాలాక్షమ్మ) నిర్యాణానంతరము శ్రీ రమణోపదేశ ప్రచారానికి శ్రీకారం చుట్టారు నాయన. ఒతను కన్నడ రాష్ట్రంలో కొన్నాళ్లు ఉన్న కారణంగా అనేకమంది కన్నడదేశవాసులకు రమణ దర్శన భాగ్యంలభించింది. తమిళనాడులోకూడా పలు ప్రాంతాలలో నాయన శ్రీ రమణుల గురించి ప్రసంగించియున్నారు. ఇక మిగిలినది ఆంధ్రదేశము మాత్రమే.

ముందుగా 'విశ్వమీమాంస' అనే గ్రంథ రచనను ప్రారంభించాతు.

శ్లో॥ రమణస్య గురోఃప్రాప్య కటాక్షం జ్యోతిరద్భుతమ్ ।
కుర్మో విశ్వస్యమీమాంసాం యథాబుద్ధం యథా శ్రుతమ్॥

[గురువైన భగవాన్ రమణ మహర్షి యొక్క అద్భుత కటాక్ష జ్యోతి లభించుటచేత మా బుద్ధికి ఎంతవరకు అవగత

మయ్యోనో, మేము ఇతరత్రా ఎంతవరకు విని తెలిసికొంటిమో అంతవరకు ఈ విశ్వమునుగూర్చి విమర్శను చేయుచున్నాము].

అని గురుస్తుతితో ప్రారంభమవుతుంది. ఈ కావ్యం. ఆది శంకరులవారు "శారీరక మీమాంస" అని వ్యక్తిని కేంద్రంగా చేసి ఆత్మబోధ చేయగా, నాయన విశ్వాన్ని కేంద్రంగా జేసి ఇందు ఆత్మబోధ జేసియున్నారు. ఇది "విశ్వమే వేదం పురుషః" అను వేదోక్త భావనకు వివరణ అని అనవచ్చును. శ్రీ రమణుల బోధనల ననుసరించి వ్రాసిన ఈ గ్రంథంలో కొన్ని విషయాలు 'రమణ గీత' లోను 'సద్దర్శనం' లోను కూడా చెప్పబడ్డాయి. ఇది ఒక స్వతంత్ర ప్రస్థానము. ముందు 37 శ్లోకాలతో వ్రాసి తరువాత విస్తరించి 394 శ్లోకాలతో ముగించారు. తాత్త్వికులు తప్పక చదువ వలసిన గ్రంథమిది.

ఇలా రచనా వ్యాసంగంలో పడిన నాయనకు సికింద్రాబాదు నుండి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము వారినుండి ఆహ్వానము వచ్చినది. 1927 సం॥ లో ఫిబ్రవరి 16, 17, 18 తేదీలలో జరుపబడు రజతోత్సవములకు రావలసినదిగా వ్రాస్తూ ఒకనెల ముందుగారమ్మని వారు నాయనను వేడుకొనిరి. నాయన అందుల కంగీకరించి జనవరి మాసంలోనే సికిందరాబాదు వెళ్ళుటకు నిశ్చయించినారు. కాని సంక్రాంతి పండుగులముందు అతిమూత్ర వ్యాధికి లోనై అస్వస్థులైనారు. ఇలా ఉండగా ఒకరోజు ఒకసాధువు అచటికివచ్చి వీధి యరుగుమీద కూర్చునియున్న నాయన యల్లుని (గంటి సోమయాజులు) జూచి "శాస్త్రిగారున్నారా ! కన్యాకుమారీ క్షేత్రమునుండి వారి దర్శనమునకై వచ్చినాను." అని అన్నాడు. అంతట సోమయాజులు "అరుగుపై కూర్చొండి వారిని పిలుస్తాను" అని జెప్పి ఇంటిలోనకేగి నాయనకివార్త చెప్పినాడు. నాయన

వెలుపలకివచ్చి చూడగా అచట సాధువు కనిపించలేదు. చుట్టుపక్కల రెండువీధులు తిరిగినను అతనిజాడ తెలియలేదు. "తన రోగమును మాపుటకు వచ్చిన యరుణేశుడే యతడు" అని నాయన గ్రహించెను. అతని రోగము కూడా మాయమయ్యెను. పండుగలవగానే నాయన సికిందారాబాదునకు పయనమయ్యారు.

నాయన వచ్చిన వార్త విని అనేకమంది పెద్దలు వారిచుట్టూ గుమిగూడారు. కొంతమంది మంత్రదీక్షలను పొందారు. నగరమునందు వారి ప్రసంగ కార్యక్రమాలనేకం ఏర్పాటు చేయబడ్డాయి. నగరమునందలి "జెమ్‌షెడ్" హాలులోను, మహబూబు కళాశాల యందును, ఆర్పర్టు రీడింగు రూములోను, తమిళ సిద్ధాంత సంఘము, చిత్రాటాకీసులలోను వేలాది శ్రోతలు వారి ప్రసంగములను విని తరించారు. నైజాము కళాశాలయందు రెండు వేదాంతోపన్యాసము లిచ్చారు.

"మహాత్ములు తఱచు జన్మిస్తూ ఉంటారు. ప్రతి 10 సం॥లకు ఒక మహాత్ముని జూడవచ్చును. కాని మహర్షులు జన్మించుట దుర్లభము. మన యదృష్ట ఫలముగా శ్రీ రమణ మహర్షి ఇపుడు మనకండ్ల ముందు కనిపిస్తున్నారు. వారిని దర్శించండి. మహర్షి దర్శనము ముక్తిదాయకము! అని జెప్పి రమణోపదేశమును విస్తృతముగా ప్రచారముజేసి ఎందరో ఆంధ్రులకు రమణ దర్శన భాగ్యం కలిగించారు,

రజతోత్సవ సభలు ఫిబ్రవరి 16, 17, 18 తేదీలలో గణపతి ముని యధ్యక్షతన జరిగాయి. వేలాది శ్రోతలు నాయన ఉపన్యాసములను విని సంతోషించారు.

"హఠయోగ, రాజయోగ, భక్తియోగ కర్మయోగముల వలెనే చదువుట కూడ ఒక యోగమే. దీనిని పెద్దలు స్వాధ్యాయ యోగమని చెప్పుదురు. యోగయుక్తముకాని కర్మ యెట్లు చిత్త శుద్ధికి హేతువు కాజాలదో, అట్లే యోగ యుక్తముకాని స్వాధ్యాయము విజ్ఞానాభివృద్ధికి దోడ్పడ జాలదు. ఫలాపేక్ష లేకుండా కర్మ చేయుట యోగయుక్తమయినట్లే, సవిమర్శత్వము స్వాధ్యాయమునకు యోగయుక్తము. గ్రంథము నవలోకించు ప్రతివాడును ఈ సూత్రమును గమనించవలయును"- ఇలా సాగిన నాయన ప్రసంగామృత సారమును, రజతోత్సవ కార్యవర్గము వారు 1928 సం॥లో వెలువడిన రజతోత్సవ సంచికలో ప్రచురించినారు. ఈనాటి యువతరానికి ప్రసంగ సారాంశము మేలుకొలుపు.

తరువాత "బొల్లారామ్" గద్వాల ప్రాంతాలలో కూడా నాయన సభలు ఏర్పాటు చేయబడ్డాయి. మూసీనదీ ప్రాంతమున శ్రీ తనికెళ్ళ వీరభద్రుని అధ్యక్షతను జరిగిన ద్రవిడ సమ్మేళనమునకు నాయనను పల్లకిలో ఊరేగిస్తూ తీసుకు వెళ్ళినారు.

సభలు ముగించగానే నాయన తన స్వగ్రామానికి వెళ్ళ యుచటనుండి పండితుల ఆహ్వానముపై సుంకి అగ్రహారము చేరుకున్నారు. ఇదియొక మునిపల్లె. పార్వతీపురమునకు 9 కి. మీ. దూరమున, నాగావళీ నదీ ప్రాంతమున, పచ్చటి తోటల మధ్యన గల చిన్ని గ్రామమిది. కుమారుడు మహాదేవుని యొక్క అత్తవారి ఇల్లు ఇచట ఉన్నది. నిరంతర వేదాధ్యయనముతోడను, జప, తప, హోమాదులతోడను పునీతమైన గడ్డయిది. ఈ నాటికిని నాగావళీ నదీ తరంగాలలో అలనాటి బుధజనుల వేదఘోష మనకి వినిపిస్తూ ఉంటుంది. శ్రీ విశ్వనాథరామసోమయాజులు అనే బుధజనుడు

ఇచటి వారికి వందనీయుడు. ఇతడు అపర ప్రవరాఖ్యుడు. కర్మిష్ఠి వేదవిద్యా పారంగతుడు. అతిథి సేవాతత్పరుడు. అన్నిటికిమించి సంఘసేవయందు ప్రీతిగలవాడు నాయనకు శివరామ శాస్త్రివలె రామసోమయాజులకి అతని సోదరుడు గోపాలకృష్ణ చయనులు చేదోడు వాదోడుగా అన్ని కార్యములందును సహకరించేవారు. తన కనిష్ఠ సోదరి యైన రాజేశ్వరిని గణపతిముని తనయుడగు మహదేవున కిచ్చి వివాహము జరిపించి యుండుటచే, వీరి ఇల్లు నాయనకు వియ్యాలవారి ఇల్లు అయినది.

సంఘసేవయందు ప్రీతి గలవాడగుటచే ఉపనయన, వివాహ ఆశౌచ నిర్ణయాది ధర్మములందు సరియైన విధానమును ప్రతిపాదించి ప్రజలకు తెలియజేయవలయునని యెంచి ఒక పండితసభను సుంకెయందు ఏర్పాటు చేసాడితడు. ఆ సభకు శ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, శ్రీ పేరి కాశీనాధ శాస్త్రిగారు ఆదిభట్ల నారాయణ దాసుగారు మొదలైన పండితులనేకులు విచ్చేశారు. గణపతి ముని వయస్సులో అందరికన్నా చిన్న గాన ప్రేక్షక స్థానమునందుండి సభాకార్య క్రమములను తిలకించారు. మూడురోజులపాటు సభలయందు అనేక సాంఘిక, తాత్త్విక విషయాలపై చర్చలు జరిగాయి ఆఖరి రోజున సభ ముగించే సమయానికి కాశీనాధశాస్త్రి దృష్టి నాయనపై బడింది. నాయన ఆ సమయమునందు ఏదో వ్రాస్తున్నారు. అతడు నాయనను సమీపించి వెనుకనుండి ఏమి వ్రాస్తున్నదీ గమనించాడు. మూడురోజుల చర్చా కార్యక్రమమును యథాతథంగా సూత్రరూపంలో వ్రాస్తున్నారు నాయన, "గణపతీ! నీవు నిజంగా గణపతివే, చల్లగా కూర్చుని సభాకార్యక్రమాలకి రూపం దిద్దావే!" అని కౌగలించుకున్నారు.

కొన్నాళ్ళు సుంకెలో ఉండి రామసోమయాజులుకి, మరి కొందరికి మంత్రదీక్షనిచ్చి, ధర్మానుశాసనం, దేవతాసిద్ధాంత తారావళీ అనే సూత్రకావ్యాలు వ్రాసి వారికిచ్చారు. ఆశౌచాకాండం అనే సభావృత్తాంత కథనమును గూడ సోమయాజులకి సమర్పించారు. తాను వ్రాయబోయే 'పూర్ణ' నవల కథా వృత్తాంతాన్ని ప్రతిరోజూ చెబుతూ ఉండేవారు.

రామసోమయాజులుగారు, వారి సోదరులు గోపాలకృష్ణయ్యగారు, నాయనయందు అత్యంత భక్తిగలవారై వారి సేవలను జేయుచుండిరి.



## 14. ఈశ్వర విలాసము

శ్లో॥ కేచిద్యోగ విదాం పురస్సర ఇతి
ప్రజ్ఞాని బుద్ధ్యాపరే
సాధుః కశ్చిది తీతరే గురుధియా
కేప్యంఘ్రి పద్మం తవ
సేవంతే రమణాభిధాన మనుజ
క్షేమాయ జాతిః క్షితః
ద్విత్రాస్త్వాం గిరిజాంక పీఠనిలయం
జానంతి దేవం గుహమ్ ॥

[యోగ విదులలో అగ్రేసరుడవని కొందరు, ప్రజ్ఞానివని మరికొందరు, సాధువని యితరులు తలంచెదరు. కొందరు గురువని

సేవించెదరు. ఓః రమణ నామధారీః నీవు మానవ వేషంలో అవత రించిన యుమాంక పీఠవాసియైన కుమారస్వామివని యిరువురో ముచ్చురో మాత్రమే ఎరుగుదురు].

చత్వారింశత్
గణపతిముని.

• • • •

దేహాత్మ భావానికి అతీతంగా దృష్టి ఎదిగిన నాడే 'గురు' అనే పదానికి సరియైన అర్థం తెలుస్తుంది. అందులకు సంపూర్ణమైన శరణాగతి యవసరము. "ఈశ్వరో గురురాత్మేతి" అనే పదభావం అప్పుడే అవగతం అవుతుంది. దేహాత్మ భావం గల వాడు ఎంతగా చదువుకున్నా, గురువు సాక్షాత్తు దైవస్వరూపమని తెలిసినా, తమ యందలి రాగద్వేష ప్రభావం వల్ల గురువుని వ్యక్తి స్వరూపానికి పరిమితంచేసి తమయొక్క ఇష్టా-నిష్టాలపై గురువులను ఎంచుతూ ఉంటారు. ఇది చాలా దోషం.

ఆత్మసిద్ధి చెందిన గురువుల యొక్క ఉపదేశం ఒక్కటే. అయినప్పటికి, వారి వారి సంస్కారాన్ని అనుసరించి వచ్చినవారు ఉపదేశసారం గ్రహిస్తారు. కొందరియందు నమ్మిక హెచ్చి తాను నమ్మిన గురువుని అతి భక్తితో పూజిస్తూ ఉంటారు. కొందరిలో ఈ పూజ అధికమై క్రమేపి గురువుయొక్క వ్యక్తిత్వంపై రాగాన్ని పెంచుతుంది. అంతవఱకు వారి భక్తి మెచ్చుకోదగినదే. కాని అటువంటి అనురాగం మరియొక మహాత్మునిపై ద్వేషం పుట్టించేదిగా ఉండరాదు. ఎందరో విజ్ఞులు వారి వారి నమ్మకములపై బలం పెంచుకొని రాగద్వేషముల మధ్య మూర్ఖులవడం మనం గమనిస్తూనే ఉంటాము.

నిజానికి ఏ గురువు యొక్క ఉపదేశమును గమనించినా "నేను దేహమును కాదు. నీవుకూడా దేహముకాదు. నీవు ఆత్మ స్వరూపుడవు" అనే చెబుతూ ఉంటారు. ఇక రమణమహర్షి ఉపదేశం అయితే సరేసరి అతను తన దేహాన్ని జడతుల్యంగానే చూసారు. ఎవరేనా పూజచేస్తానంటే వద్దన్నారు. మహర్షి అంటే కౌపీనం ధరించిన ఈశరీరం కాదన్నారు. ఎందరినో తన కరుణామృత రస ప్రవాహంలో తరింపజేశారు. ఇప్పటికీ తరింప చేస్తున్నారు. అందులకే అతడు నరవేషధారి నరుడు కాదు అన్నారు నాయన. తన చక్కని వాణీ మధురిమతో వచ్చిన వారిని మైమరపించే నాయన "భగవాన్ వద్ద కండ్లు మూసికొని కూర్చోకండి. సాక్షాత్తు భగవంతుని ముంగిట కన్నుమూతలేల ? అతనిని చక్కగాచూచి తరించండి" అనేవారు.

నాయన చెంత ఉండగా శ్రీ రమణ దర్శనం ఒక మహా భాగ్యంగా భావించేవారు అలనాటి భక్తులు. ఒక చక్కటి గురు-శిష్య పరంపర అచట కానవచ్చేది. హిమగిరిని వదలి శివకుటుంబం అరుణగిరి చేసుకుందా అనిపించేది. అరుణగిరి నిజంగా విజ్ఞానగిరిగా ప్రకాశించింది.

అయితే విజ్ఞానం ప్రక్కనే అజ్ఞానం ఉంటుందట. ఈశుని మాయ బహు జటిలమయినది. దానిని జయించుట అంత సులభం కాదు భక్తసందోహం రానురాను రమణాశ్రమంలో అధికమయింది. రాగద్వేషచ్ఛాయలు అచట క్రమ్ముకొన్నాయి. కొన్ని అసంతృప్తి కరమైన సంఘటనలు ఆశ్రమంలో చోటుచేసుకొన్నాయి. ఆశ్రమ ఆధిపత్యంపై తగవులాటలు ఏర్పడ్డాయి. పురమునందు రమణానంద నిలయం ఒకటి ఏర్పడింది. నాయన శిష్యులు, భగవాన్ శిష్యులు అనే వేర్పాటు వాదం కూడా అక్కడక్కడ కనిపించింది.

మందికూడితే మఠానికి చేటు అనే సామెత నిజం అయింది. ఫలితంగా నాయనద్వారా ఆశ్రమానికి వచ్చిన కపాలిశాస్త్రి, దొరైస్వామి అయ్యర్ (సుధన్వుడు) మొదలగువారు అరవిందాశ్రమానికి వెళ్ళిపోయారు. అయితే శ్రీ రమణుల దర్శనార్థము అప్పుడప్పుడు రమణాశ్రమం వస్తూ, పోతూ ఉండేవారు. రాగద్వేషాల మధ్య నాయన కూడా అప్పుడప్పుడు అవమానకరమైన సంఘటనలు ఎదుర్కొనవలసి వచ్చినది. దేహాత్మభావానికి అతీతమైనవారి వ్యక్తిత్వానికి, అచంచల గురుభక్తిముందు, ఇవి వారికి సమస్యకాలేదు.

శ్రీ భగవాన్ అనేవారు "ముందు భగవాన్ దర్శనానికి అని వస్తారు. తరువాత ఆశ్రమ నిర్వాకంలో తలదూర్చి అది తప్పు ఇది తప్పు అనివచ్చిన పని మఱచి ప్రవర్తిస్తారు" అని.

అరవిందాశ్రమంలోఅరవిందులవారు జనని (Mother) అనే పద్యకావ్యం వ్రాసారు. శక్తితత్త్వాన్ని చెప్పే పుస్తకం అది. నాయన శిష్యులు అచట చేరుకోవడంవల్ల "ఉమాసహస్రం" చదివే అవకాశం వారికి కలిగింది. "ఇది అద్భుత కావ్యము. రచయిత అతిమానుష వ్యక్తి. అతని దివ్యవాణి ప్రతిశ్లోకమునందును తాండవమాడు చున్నది." అని సంభ్రమాశ్చర్యాలను ప్రకటించారు వారు. "నాయనని నేను చూడగోరుతున్నాను" అని తన యభిలాష తెలియజేశారు.

• • • •

ఇట్లుండగా విశాలాక్షమ్మ యొక్క ప్రథమ సంవత్సర శ్రాద్ధ కార్యములను నిర్వర్తించుటకు నాయన సుంకి అగ్రహారం నుండి కలువరాయి చేరుకున్నారు. అచటనే "ఇంద్ర సహస్రనామ" రచనకు శ్రీకారం చుట్టారు. ఋగ్వేదమునుండి ఏరిన నూరు ఇంద్ర నామాల సంపుటి యిది. లలితా సహస్రము, విష్ణుసహస్రము మొ॥

గ్రంధముల కోవలో ఉంటుందిది. డిసెంబరు, 1927లో అరుణాచలం చేరుకున్న తరువాత రచన పూర్తి చేసి మహర్షికి చూపించారు. "అచ క్రయా, స్వధయా, వర్తమానః, అనీలః, సుపర్ణః, కిజః" అనే ఇంద్రుని నామాలను జూచిన రమణులు వినోదం ప్రకటించారు. నిత్య పూజా ప్రక్రియకుపకరించే ఈ రచనకు ఫలశ్రుతికూడా వ్రాశారు. చక్కని కావ్యమిది.

అతిముఖ్యమైన భగవాన్ శిష్యులలో మురుగనార్ ఒకరు. అతడు తమిళమున మంచి కవి. అతను శివలీలను వర్ణిస్తూ ఒక కావ్యం వ్రాసారు. అందు దారుకావనంలో యాగ నిర్వహణ చేసే ఋషులకు ఈశ్వరుడు స్వయంగా కనిపించి తత్త్వబోధజేసే ఘట్టం ఒకటి వ్రాయవలసి ఉంది. అది శ్రీ రమణులు వ్రాస్తేనే బాగుంటుందని మురుగనార్ తమకోర్కెను మహర్షికి విన్నవించారు. రమణులు అంగీకరించినవారై "ఉపదేశ ఉందియార్" అను పేర శివ తత్త్వాన్ని వ్రాసారు. దానినే "ఉపదేశ సారము" అను పేర సంస్కృతంతోకూడ వ్రాసారు. అంతటితోనాగక ఆకృతిని నాయన కిచ్చి భాష్యం వ్రాయుమన్నారు. నాయన అతి భక్తితో దాని నందుకొని చదివి తోటివారితో "మనము కూడా పండితులమైనట్లు భావింతుము. కాని ఇట్టిదొక శ్లోకమునైనా మనము వ్రాయగలమా" అనిగద్గదమైన స్వరంతో పల్కారు. ఎంతటి గురుభక్తి! ఆ పుస్తకాన్ని కళ్ళకద్దుకుని చక్కని భాష్యం వ్రాసారు.

ఇలా ఉండగా అరవిందాశ్రమం నుండి సుధన్యుడు అరవిందుని పిలుపును నాయన కెరింగించుటకై అరుణాచలం వచ్చాడు పిలుపు నందుకొన్న నాయన దివ్యదృష్టికి అరవిందుని రూపం కనిపించింది.

శ్లో॥ పర ఇంద్రాణీ ! సాధుర్భత విస్మృత్య విశ్వం ।
రమతే సిక్తగండః ప్రమోదాశ్రు పర్ణితానైః ॥

[ఆహా ! విశ్వమును మఱచిన యోగ నిద్రలో మౌనము నందు ఆనంద బాష్పములు గల చెక్కిళ్ళతో క్రీడించుచున్నాడు అరవిందుడు].

ఆ యోగ విద్యా ప్రవీణునకు హృదయమునందే నమస్కరించారు నాయన. భగవాన్ మహర్షి అనుమతినొంది 15-8-1928 నాటికి అరవిందాశ్రమం చేరుకున్నారు.

శ్రీమాత, అరవిందులు ఏకాంతముగా కూర్చున్నప్పుడు నాయన వారిని దర్శించారు. పదినిముషాలపాటు మౌనంగా వారు ఒకరి నొకరు జూచుకున్నారు. తరువాత అరవిందులు సుధన్వని "నాయన గణపతి ఉపాసకులా ? అని ప్రశ్నించారట. అతను గణపతి యవతారమే యని జవాబీయగా "అందులకే అతని పాలభాగమున గజాననాకృతిని" గాంచితిని అని వారన్నారట.

మర్నాడు సాయంత్రము శ్రీ మాత నాయనకి కబురు పంపినది. వారిరువురు 44 ని॥లు పాటు ఏకాంతమున ఒకరి ఎదురుగా మరి యొకరు కూర్చుని ధ్యానం చేసారు. ఆమె కన్నులు మూసుకొని యుండగా నాయన కండ్లు తెఱచి ధ్యానం చేశారు. తరువాత కపాలి శాస్త్రితో అమ్మ అన్నమాటలివి.

"ధ్యానము నారంభించిన మరుక్షణము నుండి మనస్సు అగాధములకు పోయినది. ఇంతలోతుగా వెళ్ళి నేనిదివఱకు ఎవరితోను ధ్యానము చేసి యుండలేదు".

తన గురువు అరవిందాశ్రమము లోనే ఉండిపోతే బాగుండునదే యభిలాష నాయన శిష్యులలో వ్యక్తమయింది.

అరవింద ప్రణీతమైన "జనని" గ్రంథమును కపాలిశాస్త్రి సంస్కృతమున తర్జుమా చేయుచుండెను. దానికి పీఠిక వ్రాయుమని అతడు నాయనను వేడుకొనెను. పీఠిక వ్రాసేముందు నాయన ఈ శ్లోకం కాగితంపై వ్రాసి చూపించారు.

శ్లో॥ వందే శ్రీ రమణర్షే రాచార్యస్య పదాబ్జమ్ ।
యోమే దర్శయదీశం భాంతం ధ్వాంతమతీత్య ॥

[అంధకారమున కావల ప్రకాశించు యీశ్వరునినాకు జూపిన ఆచార్య శ్రీ రమణుల పాదారవిందములకు మ్రొక్కెదును].

జీవితంలో గురు శరణాగతి ఒక్కసారే జరుగునని శరణాగతి చెందిన శిష్యునిలోని శక్తి గురుశక్తియేయనే భావమిందుగాన వస్తుంది. దీనితో నాయనను పుదుచ్చేరిలో ఉంచుదామన్న యభిప్రాయం అచటి వారిలో తొలగింది.

వారం రోజులయినప్పటికి నాయన అరుణాచలం రాకపోవుడంతో అచటి శిష్యులలో గుబులు పుట్టింది. ఆశ్రమ వాతావరణం అంతగా బాగుండగ పోవడంతో నాయన అచటనే ఉండిపోతారేమో అని వారి అనుమానం. చివరకి శ్రీ రమణులనే వారు ప్రశ్నించారు. అందులకు భగవాన్.

"వారు ఎచటికి పోయెదరు. పోవడానికి చోటేది? తప్పకుండా వస్తారు". అని చమత్కారంగా జవాబిచ్చారు. వారు చెప్పినట్లుగానే నాయన అరుణాచలం వారం రోజుల తరువాత వచ్చారు.

"నన్ను జూచి మిమ్ములను జూచినట్లు అక్కడి వారందరు ఎంతయో సంతోషించిరి" అని చెప్పగానే రమణుల ముఖము మందస్మితముచే వికసించినది. "వ్యక్తుల రూపము వేరైనను అందరియందున ప్రకాశించే గురుశక్తి యొక్కటే" అని శ్రీ భగవాన్

అంటూ ఉండేవారు. ఆ విధముగానే పుదుచ్చేరిలోకూడా శ్రీ రమణ దర్శనమునే చేసారు నాయన.

అతను గురుస్తుతిచేస్తూ వ్రాసిన శ్లోకాలు అనేకంఉన్నాయి. అనేక సందర్భాలలో శ్రీరమణులనుస్తోత్రంచేస్తూ వ్రాసారతను. భగవాన్ కడుజాగ్రత్తతో అవన్నీ సేకరించి వాటికి ఒకవరుసక్రమంకూర్చారు. అలాకూర్చిన శ్లోకాలు 40. దానికి శ్రీరమణ చత్వారింశత్ అని పేరు పెట్టారు. ప్రతిరోజూ భగవాన్ ముంగిట ఈశ్లోకాలు చదువటం రివాజు. కాబట్టి వాటిని పుస్తకం క్రింద ముద్రించారు. చాలాకాలం తరువాత నాయనయందు ప్రీతిగల కె. నటేశుడను శిష్యరత్నం అరవిందాశ్రమం వెళ్ళాడు. అచట నాయన వ్రాసిన "వందే శ్రీ రమణర్షే...." అనే శ్లోకం ఆశ్రమం వారు చూపించగా నటేశన్ దానిని తీసుకుని వచ్చి రమణ మహర్షికి చూపించాడు భగవాన్ అదిజూచి చాలబాగుందే అని చెప్పి "చత్వారింశత్" స్తుతి కావ్యంలో మకుటంగా చేర్చారు. ఇప్పటికీ ప్రతిదినము రమణాశ్రమ కార్యక్రమాలు ఈ శ్లోకంతో ప్రారంభం అవుతూ ఉంటాయి.

ఆ సంవత్సరం (1929) ఎండలు అధికంగా ఉన్నాయి. ఎండ యొక్క తాపాన్ని నాయన తట్టుకోలేకపోయారు. చూత గుహలో ఉండడం కష్టమయిపోయింది. పట్టువంటి శరీరం ఎండ తాపానికి కందిపోసాగింది. మురుగనార్ ఇది గ్రహించి వారిని తాము (మురుగనార్, విశ్వనాథము) ఉంటున్న పనసతోటలోనికి తీసుకుని వెళ్ళారు. ఉపదేశ సారమునకు వ్యాఖ్య వ్రాసిన నాయన ఆ గ్రంథానికి అనుబంధంగా ఉంటుందని "మనీషా సంగ్రహః" అనే సూత్ర కావ్యం వ్రాయుడం ప్రారంభించారు. సూత్ర రచన చాలా కష్టమయినది. అది సంక్షిప్తంగాను, సమగ్రంగాను స్పష్టంగాను, అల్పాక్షరములతోను వ్రాయాలి. నవీన కాలంలో ప్రాచీన

ఋషి సాంప్రదాయాన్ని అనుసరించి సూత్రకావ్య రచనకి శ్రీకారం చుట్టిన కవి నాయన. ఆత్మ, కాలము, లోకము, ప్రకృతి ఇత్యాదుల గురించి సమగ్రమైన అవగాహన కలిగేటట్లు నాయన ఈ గ్రంథంలో సూత్రాలను వ్రాసారు. అంతేకాకుండా అనేకులైన ఋషులు తత్త్వదృష్టి ద్వారా ప్రతిపాదించిన తత్త్వ విద్యలను కూడా ఇందు వివరించియున్నారు. అందరూ చదువవలసిన ఉత్తమ గ్రంథరాజమిది.

ఎండవేడిమికి నాయన ఆరోగ్యం రానురాను క్షీణిస్తూ ఉండడంతో, ఆశ్రమవాసులు గోకర్ణంలో ఉన్న దైవరాతునకీవిషయం తెలియజేసారు. అతడు భద్రానదీతీరానికి తపస్సుకై వెళ్తున్నందున ఇరువురు శిష్యుల్ని అరుణాచలం పంపి నాయనను వేసవి విశ్రాంతి స్థలమైన "శిరసి"కి తీసుకుని రావలసినదిగా చెప్పి, నాయనను లేఖద్వారా ఆహ్వానించి, ప్రణామములు సమర్పించుకున్నాడు. మహర్షి కూడా నాయనను "శిరసి"వెళ్ళుటమంచిదని నచ్చజెప్పారు.

ఇష్టంలేకపోయినప్పటికి ప్రయాణమునకు సిద్ధమైన నాయన ఆ సాయంత్రం అపీతకుచాంబ దర్శనం గావించి, భక్తితో ఇలా స్తుతించారు.

శ్లో॥ శోణనగార్ధతనోఽనిశమఙ్కే ధారయసేఽయి గుహం రమణాఖ్యమ్ ।
ఆగత మప్యయి హా! ముహురమ్బా చ్ఛాటయసే గణపం ననుకస్మాత్ ॥

[శోణగిరియందు అర్ధతనువు గల అంబా! నీ వడిలో రమణ మహర్షిని సదా నివసింప జేస్తున్నావు. వచ్చిన నన్ను మాటిమాటికి దూరం చేస్తున్నావు. ఎందులకో]

ఇలా అరుణాచలానికి తుది వీడ్కోలు పలికారు నాయన.

ఈశుని విలాసము చిత్ర విచిత్రముకదా!

# 15. నాయన ఆశీస్సులు

శ్లో॥ పుష్కరానుజన్మ వహ్ని శీతభాను పూర్వ జై
ర్నీలకంఠ బంధునాచ సంయుతై రుదేతియా ।
సా నృసింహశక్తి రుగ్రవిక్రమోగ్ర మానినీ
మంత్ర రాజ రూపిణీ మహేశ్వరీ గతిర్మమ ॥

వివిధ దేవతలతో కలిసి ఉదయించునది, మహోగ్రమైనది, మంత్రరాజస్వరూపముయినది, నృసింహశక్తి అయిన మహేశ్వరి నాకు (లక్ష్మీనృసింహ చంద్ర మౌళీశ్వర పీఠమునకు) గతి యగుగాక.

– దేవీ స్తోత్రం,
గణపతిముని.

• • • •

శ్రీ మహర్షి చరణార విందములకు నమస్కరించి, వారి యాశీస్సులను పొంది నాయన శిరసీపురమునకు ప్రయాణ మయ్యారు. కర్ణాటక రాష్ట్రమునందు గోకర్ణమునకు సమీపమున గల సహ్యాద్రి కొండలోయలందు కొన్ని గ్రామాలున్నాయి. పచ్చటి తోటలమధ్యగల యీ పల్లెలందు జన సమూహము తక్కువగా ఉన్నప్పటికి, ప్రకృతి వరఫలమా యని ఏలకులు, మిరియాలు, పోకలు మొదలగు పంటలధికముగా ఇచట పండుటచే వ్యాపార కేంద్రములై విరాజిల్లు చుండెడివి. సముద్రమునకు సుమారు 2000 అడుగుల ఎత్తున ఉండుటచే వేసవి విశ్రాంతి స్థలములుగా కూడ ఇచటి గ్రామములు ఖ్యాతినందాయి.

నాయన ముందుగా గోకర్ణం చేరుకుని దైవరాతుని యింట మూడురోజులుపాటు బసచేసారు. ప్రియతము శిష్యుడు భద్రానదీ

తీరమునందు తపస్సునకై వెడలుటచే నాయనకు ఉపచర్యలు అతని కుటుంబమువారు చేయుచుండిరి. దైవరాతుని సోదరుడైన సీతారామ భడతి మంచి ఆయుర్వేద వైద్యులు. శిరసిపురమునకు సమీపమున గల కుళువే గ్రామమునందు నివసించుచుండెను. దైవరాతుడు ముందుగానే నాయన రాకను తమ్మునకు లేఖద్వారా తెలిపియుండుటచే అతడు గోకర్ణము వచ్చి నాయనను కుళువే తీసుకొని పోవుటకు ఏర్పాటు చేసినాడు. నాల్గవనాటి ప్రాతః కాలమున వారిరువురు మోటారు కారునందు బయలుదేరిరి.

మధ్యాహ్నము పదకొండు గంటలయినది. ఉదయమునుండి కారులోనే ఉన్నందువల్ల నాయన కొంత అలసట చెందారు. "సీతా రామా ! ఎచ్చటైన కొంతసేపు సేదతీరట మంచిది" అన్నారు. వారికి త్రోవలో లక్ష్మీనృసింహచంద్ర మౌళీశ్వర పీఠము" కాన వచ్చినది. విశ్రాంతికి అది తగిన స్థలముని యెంచి వారచట బస చేసిరి.

శివ-కేశవుల నామముతో గల యీ పీఠము నిజానికి శంకర మఠము. ఇచట ఇరువురు దేవతలనూ ఆరాధించు చుందురు. విశ్వానంద సరస్వతీస్వామియను మహానుభావునిచే ఈపీఠము స్థాపింపబడినది. ప్రక్కన శాల్మలీనది పారుచున్నది. "సోందా-స్వర్ణవల్లీ" సంస్థానాధీశులు ధర్మకర్తలు, పోషకులై పీఠముయొక్క బాగోగులను చూచెడివారు.

నాయన అచటకు చేరునాటికి 'శ్రీ మత్సర్వజ్ఞేంద్ర సరస్వతి' పీఠాధిపతియై యున్నారు. వారు నాయన ఖ్యాతిని ఇదివరలో విని యుండుటచే వారి రాక నొక భాగ్యముగా దలచి వారికి పాదపూజ చేసి తగురీతిని ఉపచర్యలు చేసారు. కొంతసేపు సేదతీరిన తరువాత నాయన పీఠముయొక్క బాగోగులను విచారించారు.

పీఠాధిపతి విచార వదనంతో అన్నమాటలివి. "దీనికి బహు పురాతన వైభవము కలదు. రాజపోషకులందు కొన్ని వారసత్వ తగాదాలు వచ్చినాయి. ఫలితంగా వారు కోర్టుకెక్కారు. మూడు నాల్గు సంవత్సరముల నుండి ధూప దీపములకు కూడా కరువు వచ్చినది. భక్తులిచ్చేడి కానుకలతో ఏదోలోటులేకుండా కార్యక్రమాలను జరుపుతున్నాము".

అతడు అలా చెప్పగానే నాయన కండ్లు చెమర్చాయి. బలహీనులైన రాజవంశజులను తలచి ఆయన శోకించినవారై "ఈదేశమునకు పట్టిన దుర్గతి యిది. లేనిచో పరాయి వారి పాలనలో మనము బానిసలగుదుమా ?" అని కండ్లు మూసుకొన్నారు. అతని నుండి ఈ క్రింది శ్లోకములు వెలువడినవి.

శ్లో॥ ఉదిత విరోధా స్వయుతభిదాసు ।
చతసృషు జాతి ష్వబలత మాసు ॥

[నాలుగు జాతులందున అవాంతరభేదము లనంతములు. అందును పరస్పర విరోధము లనేకములు].

శ్లో॥ ముహ్మరపిలోకే క్షితిసురశీలే ।
అజగణకల్పే భుజభువ సంఘే ॥

[విప్రులు మోహవశమున శీలమును పోగొట్టుకున్నారు. రాజులు అజాయుద్ధ పరులైరి].

శ్లో॥ చతుర విరోధి వ్రితహృత సారాం ।
అవిరత నేత్ర స్రుత జలధారామ్ ॥
భరత ధరిత్రీం భువన నృపాలః ।
అవతు దయాళుః సితగిరి శాలః ॥

[నిపుణులైన శత్రువుల చర్యలవల్ల సారం పోయినది. సంతాశ్రుధారలచే నిండిన నేత్రములు గలదియు నగు నీభారతా వనిని దయావంతుడైన వెండికొండయందున్న దేవుడు రక్షించును గాక].

ఇలా నాయన ఈశుని ప్రార్థించారో లేదో అతనికి అరుణాచ లేశ్వరుడు కండ్లముందు నిలిచాడు. ఆలనాడు "నేను దేవుని దూతను, దేవుని వాక్కును చెప్పడానికి వచ్చాను" అని క్రీస్తు పలికినట్లే, నాయన "స్వామీ! నేను ఈ యావత్భారత ప్రజల నుండి దూతగా వచ్చి నిన్ను ప్రార్థిస్తున్నాను."–

శ్లో॥ అరుణ ధరిత్రీ ధర హరదూనాం।
భరత ధరిత్రీ మవ! శివ! దీనామ్ ॥

[దీపమైన ఈ భారత భూమిని అరుణాద్రివాసా రక్షింపుము]

శ్లో॥ హర! భరతక్ష్మా జనవర దూతం।
కురు చరితార్థం గణపతి మేతమ్ ॥

[భారత జనులనుండి దూతగవచ్చి నీకివార్త చెపుతున్నాను నామాటవిని దేశ రక్షణ గావించి నన్ను చరితార్థుని చేయుము]

నాయనిలా ప్రార్థన చేసినప్పుడు సాక్షాత్తు హర-కేశవులే ఈ రూపంలో వచ్చారా అనిపించింది పీఠాధిపతికి. దేశ సౌభిక్ష్యానికి అంకిత మయిన ఈ మహనీయునికి చిన్న పీఠము యొక్క బాధ లను చెప్పితినే! రక్షకులైన హర-కేశవులే అన్ని సమస్యలను పరిష్కరిస్తారని ఎరింగియు అజ్ఞానినైతిని. సమస్యలను పరిష్క రించడానికే వారిచటకు వచ్చారు. నాకు హితబోధ చేసారు. ఈశుని శరణమే సర్వ సమస్యలకు పరిష్కారమని దెల్పారు." అని వారు

తలంచారో ఏమో ! "ఆచార్యా : మీ ప్రార్థనా శ్లోకాలను ఆశీస్సులుగా భావిస్తున్నాను. ఆదిశంకరుల కోవలో దేశక్షేమ నిరతియే ధ్యేయంగా హైందవ తత్త్వబోధలను ప్రచారంచేసి ప్రజాసేవ చేస్తాను" అన్నారు వారు.

నాయన మందహాస ముఖారవిందముతో "ఆది శంకరుల ఆశయమే అది. అందుకే ఈ పీఠాలు వెలిసాయి" అన్నారు.

ఆ రాత్రి వారచటనే విశ్రమించినవారై మర్నాడు ఉదయం బయలుదేరేముందు ఒక కాగితంపై హర-కేశవస్తుతి ఒకటి వ్రాసి "దీనిని పూజాపీఠంలో ఉంచండి. సంస్థ అభివృద్ధి చెందుతుంది. అన్నారు.

కొలది దినములకు పోషకులు కోర్టులో వేసిన తగాదా తీరి పోయింది. వారు పీఠమును బాగుచేయవలయునని ఎంచి తగు ధనసహాయమును చేసిరి. పీఠము పూర్వవైభవమును మరల పొందినది. నాయన ఆశీస్సులే ఇందులకు కారణమని యెంచి అతను వ్రాసి యిచ్చిన శ్లోకమును అద్దమందుంచి గోడయందు స్థాపించిరి.

— × —

## 16. సోదరుని వియోగము

శ్లో॥ పోష విధానే శీతం దైవమ్

శోష విధానే తపనం దైవమ్ ।

సర్గ విధానే వికసద్దైవమ్

ప్రళయ విధానే మీలద్దైవమ్ ॥

[పోషణలో చల్లనైనది, శోషణలో వేడియైనని, సృష్టి విధానమున విస్తరించునది, ప్రళయమప్పుడు సంకుచిత మగునది అగు దైవము అంతటా విరాజిల్లు చున్నది]

– అంబికాగీతము.
గణపతిముని.

• • • •

గోకర్ణక్షేత్రంలో చాలా కాలం నాయన ఉన్నందున కర్ణాటక రాష్ట్రమందు, ముఖ్యంగా గోకర్ణ పరిసర ప్రాంతాలలో నాయనపై భక్తిగల శిష్యులు ఎక్కువగా ఉండిరి. అంతేకాకుండా అచటివారికి పూజ్యనీయుడైన దైవరాత గజానన నాయన శిష్యుడగుట కూడా ఒక కారణము. నాయన సాక్షాత్తు గణపతి యవతార మనునది వారి నమ్మకము. ఈనాటికీ కూడా వారి జయంతి, వర్ధంతి ఉత్సవాలను వారు జరుపుకుంటూ ఉంటారు.

సీతారామభడతితోపాటు నాయన కుశువే చేరుకోగానే అతన్ని దర్శించుటకు తండోపతండాలుగ జనం చుట్టుప్రక్కలు గ్రామాల నుండి వచ్చారు. స్థానిక ప్రజానీకం పూర్ణకుంభంతో నాయనకు స్వాగతం పలికింది. ప్రత్యేకముగ అతనికని ఒక పర్ణశాల వసతికై ఏర్పాటు చేసారు. ప్రతిరోజూ తీర్థప్రజ అతన్ని చూచుటకు వస్తూ ఉండేవారు. కొందరు తముకు గల రుగ్మతలను (రోగములను) వారికి చెప్పుకోగా వాసిష్ఠుడిచ్చే మంత్ర జలం వారికి ఉపశమనం కలిగించేది. కష్టాల్లో ఉన్నవారింటికి నాయనే స్వయంగా వెళ్ళి వారిని ఊరడించి, ధైర్యం చెప్పి, తీర్థ ప్రసాదాలను ఇచ్చేవారు. వారి కష్టాలు కాలక్రమంలో తొలగేవి. సాయం సమయాలలో నాయన ప్రసంగం వినడానికని అనేకులు వస్తూ ఉండేవారు. తన

గురువైన మహర్షి యుపదేశాన్ని వారికి తెలియజేసేవారు నాయన. అంతటా ప్రకాశించే దైవం మంచివారలందు సౌమ్యశక్తియని ప్రకృతియందు రమ్యశక్తియని, తెల్పుతూ అన్నివేళలా ఆ దేవతను గుర్తించగల్గే అంబికా గీత తత్త్వాన్ని చెల్పారు వారికి.

వాసిష్ఠుని తాత్త్వికోపన్యాస సభ ఒకటి ఏర్పాటు చేసారు పల్లెప్రజలు. వేదికను ఊరిబయట గల పంట పొలాల్లో ఏర్పాటు చేసారు. చుట్టూ గడ్డిమేటులు, మధ్య సభాస్థలం. నాయన మధురాతి మధురమైన ఉపన్యాసం చేస్తూ ఉండగా, అకస్మాత్తుగా నాలుగైదు గడ్డివాములు అంటుకొన్నాయి. మంటలు వేదిక వరకు వ్యాపించేలా ఎగసిపోతున్నాయి. ప్రజలలో అల్లకల్లోలం చెలరేగింది. నాయిన ఎవ్వరినీ కదలవద్దన్నారు. భయంలేదంటూ అగ్నిని చల్లార్చేటటువంటి అస్త్రాన్ని ప్రయోగించారు.

"వనేమ పూర్వీరర్యో మనీషా ।
అగ్నిః సుశోకో విశ్వాన్యశ్యాః ॥"

ఇది యొక వేదమంత్రము. నాయన ఈ మంత్రాన్ని చదువుతూ, గడ్డిపరకను మంటలవైపు విసిరారు. ఆశ్చర్యం ! అంటుకున్న గడ్డిని గాలి కొంతదూరముగా ఎగరవేయగా ఆ గడ్డి నేలపై విస్తరింపబడి మంటలు తగ్గుముఖం పట్టాయి. తరువాత నీళ్ళు జల్లి కొందరు మంటలనార్పి వేసారు. ఈ సన్నివేశంతో నాయనపై ప్రజలభక్తి మరింతగా పెరిగింది. అతనొక మంత్ర ద్రష్ట యని, ఋషియని వారు భావించారు. నాయనకి సంఘటన అశుభ సూచకంగా తోచింది.

వాసిష్ఠునకు ఆరోగ్యం బాగుగా లేక కుశువేకు ప్రయాణమై వెళ్ళారనువార్త కలువరాయిలోని బంధువర్గానికి తెలిసింది. వారు చాలా ఆందోళన చెందారు. నృసింహశాస్త్రి మరణానంతరము వారి యొక్క ఆస్తి. వ్యవసాయము ఇత్యాది విషయములను పినతండ్రి యైన ప్రకాశశాస్త్రి చూసుకొనేవారు. సోదరులైన భీమశాస్త్రి. శివరామశాస్త్రి పినతండ్రికి చేదోడు వాదోడుగా ఉండేవారు. ఆరోగ్యము బాగులేనప్పుడు ఇక్కడికి రావచ్చును కదా ! నేను వృద్ధుడ నవుతున్నాను. ఇంటి కార్యములను మహాదేవుడు చూచు కొనును. నాయన ఇచటనే ఆశ్రమం కట్టుకుని ఉంటే. అతని బాగో గులను అందరూ చూచుకోవచ్చు. ఏమిటో ! పిచ్చినాయన తపస్సు తపస్సని ఊర్లన్నీ తిరుగుతున్నాడు. ఆరోగ్యాన్ని చూసుకోడు" అని వాపోయారు ప్రకాశశాస్త్రిగారు.

శివరాముని రాక నాయనకు అత్యంత ఉత్సాహాన్ని కలి గించింది. తన చిననాటి తపస్సఖుడతడు. తనతోబాటు పెక్కు క్షేత్రాలు తిరిగి తపస్సు చేసిన విశిష్ట వ్యక్తి. ఇరువురు ఒకరినొకరు కౌగలించుకున్నారు. వారి కండ్లలో ఆనంద బాష్పాలు నిండాయి. చిన్ననాటి ముచ్చట్లను జ్ఞాపకం చేసుకున్నారు. "అన్నా ! ఆరోగ్యం బాగులేదుకదా ! ఇంటికి వచ్చేయి. అందరం కలసి ఉందాం, "అన్నాడు తమ్ముడు. "ఇక్కడ బాగానే ఉంది. ఇచటివారందరూ నావాళ్ళే. కొన్నాళ్ళు ఉండి వస్తాను" అన్నారు నాయన. ఆరాత్రి వారు నిశ్చింతగా నిద్రించారు.

మర్నాడు ఉదయం సోదరులిరువులు కాలోచితము తీర్చు కొని 9 గం॥ల వఱకు ధ్యాన నిమగ్నులై కూర్చుని యుండిరి. 9 గం॥ల ప్రాంతమున చిట్టికి (శివరామశాస్త్రికి) సాధారణమైన గుండెనొప్పి కలిగినది. అన్నకి విషయం తెలియజేసాడు.

మధ్యాహ్నం కొంచెం మజ్జిగా అన్నం తిన్న తరువాత హఠాత్తుగా నొప్పి అధికమైనది. గుండు ప్రేల్చినట్లు పెద్ద కేకవేసి మూడు ఘుర, ఘుర యుక్త శ్వాసలతో నాయన చేతిలో ప్రాణము వదలినాడతడు (7-2-1930)

"నా తమ్ముడిక శరీరంలోలేడు. నావద్దకు తపస్సు చేయు చునే వీరమరణ మందినాడు" అని వగచారు నాయన. తన చేతు లతో దహన క్రియలు జరిపాడు.

ఆ రాత్రి అయింటి యజమానుడగు వీరప్ప హెగ్డే భార్య యైన సీతమ్మకు ఒక కల వచ్చినదట. అందు ఆమె శ్మశానమునకు వెళ్ళినదట. అచట ఒక స్త్రీ కాష్ఠమును కదుపుచుండెనట. చిట్టీ (శివరామశాస్త్రి) లేచి కూర్చుండి తేజశ్శాలి యగు నవ యువకుడై కన్పట్టెనట. "మీరు బ్రతికినారా ?" అని ఆమె అడుగగా "ఔను ఇదుగో నర్మదాతీరమునకు తపస్సుకు పోవుచున్నాను అన్నాడట. ఈ కల నామె మర్నాడు నాయనకు తెల్పగా :

ఆ తపోవ్యసని
ఆ తీర్థ ప్రియుడు
నర్మదానదీ తీరమునకు
తపస్సాచరించుటకు
వెళ్ళినాడు.
భగవత్సంకల్ప మిట్లునది

అని గంభీరముగా పలికారు.

పినతండ్రి వియోగముతో అస్వస్థతగా ఉన్న తండ్రిని చూసుకొనే బాధ్యత మహాదేవునిపై బడినది. అతడు వెంటనే కుటుం బముతో ఉళువే చేరున్నాడు.

• • • •

# 17. 'సద్దర్శన' కావ్య రచనము

శ్లో॥ సత్తత్త్వసారం సరళం దధానా
ముముక్షు లోకాయ ముదం దధానా ।
అమానుష శ్రీ రమణీయ వాణీ
మయూఖ్య భిత్తిర్ ముని వాగ్విభాతి ॥

[మానవాతీతమైన శ్రీ రమణవాణి, సత్యసారమును వివరించునదై, సరళమై, ఆనందము కలిగించునదై, గణపతి వాక్సుధా గోడలనుండి కిరణ సంయుతమై విస్తరించి ప్రకాశించుగాక.

– సద్దర్శనమ్.

• • •

సత్య సోధన చేయాలనే ఉత్సాహం అందరిలోనూ సాధారణంగా ఉంటుంది. పూజ, జపం, తపం ఎన్నో సాధలను సాధకులు చేస్తూ ఉంటారు. ఫలితంగా కొందరిలో జిజ్ఞాస అధికం అవుతుంది. అది సాధకుల అర్హతకు చిహ్నం అటువంటి వారు తమ్ముతాము పరీక్ష చేసుకొనే కొన్ని ప్రశ్నలున్నాయి. అవి యివి :–

(ఎ) అవసరమయినప్పుడు నాకు ఇష్టమయిన పనులను వదలి అనిష్టమైన పనులను చేపట్టగలనా ?

(బి) సత్యమనేది నా ప్రస్తుత జీవనశైలిని మార్చివేస్తుందని ఎవరైనా చెప్పినపుడు, ప్రస్తుత జీవన విధానాన్ని వదలి సత్య సోధనకు సిద్ధము కాగలనా ?

(సి) సత్యదర్శనం అనేది కష్టసాధ్యమైనదనే అనుభవం కలిగినప్పుడు, నేను నా ప్రయత్నాన్ని నిరవధికంగా సాగిస్తానా ?

(డి) నచకేతునివలె మృత్యువును ఎదుర్కొను సమస్య వచ్చిననూ నేను సత్యసోధన గావించెదనా ?

పై ప్రశ్నలను సమాధానము సాధకునియందు అనుకూలముగా నుండెనేని అతడు తప్పక అందు కృతకృత్యుడగును.

అటువంటి జిజ్ఞాసులకు మార్గదర్శకమై యొప్పు గ్రంథము 'సద్దర్శనము'.... దీనిని భగవాన్ శ్రీ రమణమహర్షి తమిళంలో వ్రాసారు. దాని పేరు "ఉళ్ళదు నార్పదు" అనగా ఉన్నది 'నలుబది' యని అర్థం. అరవంలో నలభై పద్యాలు వ్రాసినప్పుడు భగవాన్ ఆకావ్యానికి ఏపేరూ పెట్టలేదట. అయితే క్రమేపీ ఉన్నది నలుబది శ్లోకాలని- ప్రస్తావనలో శిష్యులనగా అదే దాని పేరయిందని కొందరంటారు. ఇది సరళమైన వేదాంత గ్రంథము. బ్రహ్మసూత్రములు ఉపనిషత్తుల కోవలో ఈ గ్రంథమును చేర్చవచ్చును. అటువంటి యీ కావ్యమును సంస్కృతములో వ్రాయుమని మహర్షి నాయనకు కబురు పంపించినారు.

మహదేవునితోబాటు కలువరాయి చేరుకున్న నాయన అచట నాల్గు మాసములుండి శిరసీవాసులు ఉత్తరములపై ఉత్తరములు వ్రాసి అతనిని రమ్మనమని వేడుకోగా శిరసి చేరుకున్నారు.

(1931 సం॥ ఫిబ్రవరి మాసం)

పుండరీకరాయుడును మహనీయుడు విదేశాలలో కొన్నాళ్ళుండి, న్యాయవాద వృత్తి జేసి స్వదేశానికి వచ్చి ప్రశాంతముగ నుందామని చక్కని ఆశ్రమమును 'శిరసి' యందు నిర్మించి యుండెను. కాని పరిస్థితుల వలన అతను అందు ఉండలేకపోగా అది నాయన వసతికై ఏర్పాటు చేయబడినది. ఆ ఆశ్రమం పేరు "ఆనందాశ్రమము". శిరసి వాస్తవ్యులైన శ్రీ D. S. విశ్వామిత్ర,

S. P. పండిట్, సుందర పండిట్, మొదలగువారు నాయనకు కావలసిన వసతుల నేర్పాటు చేయుచుండిరి. తన గురువు రాక నెఱింగిన కపాలిశాస్త్రి, కుటుంబముతోబాటు అచటకు వచ్చెను. ప్రతిదినము కన్నడ భాషలో నాయన చక్కని ప్రసంగములుచేసి శిరసివాసులకు ముదము చేకూర్చుచుండిరి. అంతే కాకుండా వేదపారాయణము, జప, తప, హోమాదులచట జరుగుచుండెను. ఋష్యాశ్రమ కళ అచట వచ్చినది.

"ఉన్నది నలుబది" కావ్యమును విశ్వనాధ బ్రహ్మచారి స్వయముగా తెచ్చి నాయన కిచ్చినాడు. మహర్షి ఆగ్రంథమును సంస్కృతములో వ్రాయుమని తన్ను ఆదేశించినందుకు సంతోషించిన వారై శ్రీ భగవాన్ కటాక్షమును గోరుతూ 10-3-31 నాడు ఒక లేఖ వ్రాసినారు.

"భగవాన్ ! గుహావతార,

సుందర పండితుడు, విశ్వనాధుడు, కపాలిగార్ల లేఖల వలన నేననుచరులతో గూడి యిక్కడ తపస్సుచేయుచున్నట్లు భగవాన్‌కు విశదమై యుండును. అందరికి మూడు దినములనుండి- ముఖ్యముగా నాకు విశేషానందము బుట్టించుచున్నట్టి యనుభవము లగుచుండెను. పెక్కుమందికి స్వప్నమందు మహర్షి దర్శనమయ్యెను. ఈ యభివృద్ధికి భగవానుని కటాక్షమే కారణమని వారుదృఢముగా విశ్వసించియున్నారు.

ప్రభో ! భగవంతని కటాక్షమువలన నాకే నిష్ఠ ప్రాప్తించెనో, అది నాకిక్కడ విజ్ఞానాత్మకత మగుచున్నది. శరీరము కంటె భిన్నముగా నాత్మ నీ గుహయందనుభవించుచుంటిని. అట్లయినను ప్రపంచానుభవమునుండి యిది భిన్నత్వము బొందనందున పూర్ణ

నిష్ఠగాదని తలచు చుంటిని. అట్టి పూర్ణనిష్ఠకై బహుయోజినములు లంఘించగల్గు తమ కటాక్షమును బంప వేడుచుంటిని. నాయొక్క పూర్వపు లహరి మదభారముతో గూడి కేవల శక్తి ప్రవాహినియై యుండినను, ప్రస్తుత శక్తిలహరి మిగులి లఘువై తేజః ప్రవాహిని యైనట్లు గన్పట్టుచున్నది. మహాకార్యసిద్ధికై భగవన్మహర్షి యొక్క కటాక్షవశమున దేవతలు నాకొఱకు ప్రేరేపితులై నన్ను సంస్కరింతురని నేను విశ్వసింతును. దయాపూర్ణమగు కటాక్షమునే మీరు నాకు ప్రత్యుత్తరముగా బంపుదురు గాక.

ఇచ్చట మహాదేవము, విశ్వనాధము, రంగ, సీతారాముని పుత్రిక, భార్యతో గూడిన కపాలి యాశ్రమంలో నిత్యులు. సుందర పండితుని యక్కయు, దేవేంద్రశర్మయు సాయంత్రము లందు వచ్చుచుందురు. వీరందరు భగవాన్ రమణ కటాక్షము నర్థించువారే.

ఇట్లు, భగవంతుని కింకరుడైన

వాసిష్ఠ గణపతి.

మహర్షి వ్రాసిన తమిళ పద్యాల్ని చదువుతూ అందలి విశిష్టతను తెలియజేస్తూ, సరియైన అనువాద శ్లోకాన్ని సంస్కృతంలో వ్రాసి, విశ్వనాధుడు కపాలీ మహాదేవుడు మొదలగు వార్లకు అందలి కవిత్వ వైభవము తెలియజేస్తూ నాల్గు రోజులలో అనగా 14-3-1931 శనివారం నాటికి మహర్షి చెప్పిన కార్యం ముగించారు. "ఉళ్ళదు నార్పదు" అనే తమిళ రచనకి సంస్కృత అనువాదం తయారయింది. దానికి సద్దర్శనమ్" అని పేరు పెట్టారు. దానికి రెండు కాపీలు తయారుచేసి ఒక కాపీని మహాదేవునిద్వారా పంపుతూ మహర్షికి లేఖ వ్రాసారు.

ఆనందాశ్రమం, శిరసి.
17-3-31

భగవన్, విశ్వగురో,

ప్రతివార మొకలేఖ భగవత్సన్నిధికి పంపవలెనని హృదయము ప్రేరేపించుచున్నది. "సద్దర్శనము" శనివారము (14-3-31) నాడు ముగింపబడెను. అందులో భగవంతుని శుక్ల ఛందస్సు (అనగా యాజ్ఞవల్క్య సూత్ర) తాత్పర్యము యథాశక్తి నుపజాతి వృత్తములలో కూర్చబడెను. నా యనువాదమందు గుణమున్నచో, నది భగవానుని యనుగ్రహమే. ఆ శనివారము నుండి నా దృష్టి విలక్షణము కాబొచ్చెను. సర్వ పదార్థము నేక స్వరూపముగా జూచుచుంటిని. ఈ యభ్యాసము దృఢమై యనుభవరూపమున నుండుటకు భగవంతుని ప్రార్థించుచుంటిని. నీటియందు బుడగవలెనే యొక్క సద్వస్తువందీ రూప వికారములను తిలకించుచుంటిని. ఆ వికారములను విడచి శుద్ధ సద్రూపమును పొందుటకు యత్నించుచుంటిని.

ఇట్లు, మీ యనుగ్రహార్థి
వాసిష్ఠుడు.

మహాదేవుడు "సద్దర్శన" కావ్యంతో అరుణాచలం బయలుదేరాడు. కపాలి శాస్త్రికి ఆకావ్యానికి వ్యాఖ్య వ్రాయాలనే సంకల్పం కలిగింది. నాయనతో తన యభీష్టాన్ని చెప్పగా వారు సంతోషించి అంగీకరించారు. నాయన అప్పుడప్పుడు జేసిన దేవతా స్తుతులను క్రోడీకరించి "గీతమాల" యనుపేర ముద్రింప బడినది. మహర్షికిమ్మని ఒక అచ్చయిన పుస్తకమును నాయన మహదేవునకిచ్చినారు.

ఈ లోపల దైవరాతుని కుమారుని యుపనయనము గోకర్ణమునందు జరుపుటకు నిర్ణయింపబడెను. అతను స్వయముగా వచ్చి నాయనను గోకర్ణమున కాహ్వానించెను. తన గురువునకు వారమున కొక యుత్తరము వ్రాయవలయునని వ్రతము బూనిన నాయన గోకర్ణము నుండిలేఖద్వారా తన భక్తిని ప్రకటించారు.

గోకర్ణము
ది. 21-4-31

భగవన్, సర్వాంతరా,

చిరంజీవి దైవరాతుడు తన పుత్రుని యుపనయనమునకు నేనుండవలెనని యవరోధించినందున గోకర్ణము వచ్చితిని. ఇచ్చటి నుండి శనివారము బయలు దేరెదను. ఎవడు గుహావాసియో. స్వయముగా నెవడు సంసారుల దేహములందు శయనించుచు యోగులందు విజృంభించుచున్నాడో. యెవని యంతర్విజృంభణ మునే ద్వితీయ జన్మగా చెప్పుచున్నారో, మంత్రవేత్త లెవని వైశ్యానరునిగాను, శాస్త్రవేత్తలు విరాట్ పురుషుని గాను కీర్తించు చున్నారో యెవనికి జ్ఞానమే స్వరూపమో, జ్ఞానమే శరీరమో, జ్ఞానమే స్థానమో, జ్ఞానమే ఆయుధమో, నాకు కనిష్ఠుడైవ అతనికి నమస్కారము.

ఇట్లు,
మీ జ్యేష్ఠరాజు

అరుణాచలంలో మహదేవుడు 'సద్దర్శన' కావ్యాన్ని మహర్షి కందించాడు. నాయన మూలాన్ని యథాతథంగా గాక అనువాదంలో కొంత మార్పు చేసారు. మహర్షి ఈ మార్పును జూచి సంతోషించారట. ఈ విషయాన్ని మహదేవుడు లేఖద్వారా తండ్రికి తెలియజేయగానే నాయన అమితానందంతో మహర్షికి జవాబు వ్రాసారు.

ఆనందాశ్రమం, సిరసి.
ది, 28-4-31.

భగవన్, కరుణామయా,

వత్సలైన మహదేవ సుందరుల పత్రములు చేరగా నేను గోకర్ణమునుండి శనివారము వచ్చితిని. అప్పు దంపతులు వచ్చిరి. చిరంజీవి విశ్వనాధము గూడ నాతో గోకర్ణము నుండి మరలి వచ్చెను. వత్స కపాలి యొక్క సద్దర్శన భాష్యము సాగుచుండెను. సద్దర్శనములో నాచే జేయబడిన మార్పు మూలము యొక్క తాత్పర్యము ననుసరించియే యున్నట్లు మీరు చెప్పిరని మహాదేవుని నిజపత్రములో లిఖింపబడెను. అది నా కధికోత్సాహకరమయ్యెను. కపాలి భాష్యము పూర్తియైన పిదప నసాధారణ రామణీయకమును బొందును. గుహ గణపతుల తత్త్వ ప్రసంగములో నాచే నుదహరింపబడిన ద్రావిడ పద్యము మహర్షికి నవ్వు పుట్టించెనని మహదేవుడు వ్రాసెను. అట్టి నవ్వుతోకూడిన ముఖదర్శన భాగ్యము వానికైనది. మాకావార్తయే సంతోషము కొలుకయ్యెను. నాయొక్క పిల్లయైన "గీతమాల" భగవంతని హస్తముచే లాలింపబడుగాక యని కోరుచుంటిని.

ఇట్లు, మీయందేకాయుచిత్తుడైన
గణపతి.

మహర్షి వ్రాసిన "ఉపదేశసారము" తరువాత పేరు ప్రఖ్యాతి గాంచిన గ్రంథము "సద్దర్శనము" అనేక ఆశ్రమములందు ఈ గ్రంథము పాఠ్యపుస్తకమై సాధకులకు ఉపయోగపడుచున్నది. తాత్త్వికులకు ఇది తత్త్వరహస్యముల దెల్పు రచనగా ప్రకాశించుచున్నది.

—X—

# 18. భక్తి లేఖావళి

శ్లో॥ అతీత గుణ జాలాయ నైష్ఠిక బ్రహ్మచారిణే।
నమో మాయా మనుష్యాయ గురవే తారకారయే॥

[గుణములకు అతీతుడైన వాడు, నైష్ఠిక బ్రహ్మచారి, మాయా మానుష వేషధారి, తారకా సురవైరియైన కుమారస్వామి అయిన శ్రీ రమణ మహర్షి యను గురువునకు నమస్కారము.]

–చత్వారింశత్.

• • • •

మహర్షి వ్రాసిన రచనలలో "అక్షర మణమాల" విలక్షణ మయిన రచన. ఇందు నాయికా, నాయకభావం గాన వస్తుంది. ఈశ్వరుడు నాయకుడు, మహర్షి నాయిక. కాబోయే నాయకునకు నాయిక ప్రకటించే భక్తి, ప్రేమ, నివేదన ఈరచనలలో గాన వస్తాయి. వైరాగ్యం, తత్త్వం గోప్యంగా ఉంటాయి ఇరువురి మధ్య అరమరికలుండవు. భగవంతునికి భక్తునికి మధ్యగల బంధము అటువంటిది అని ఈ రచనలో మహర్షి తెలియజేస్తారు. అందు నిందాస్తుతిగూడ ఒక భాగమే. అటువంటిదే గురు–శిష్యుల బాంధవ్యమనే సత్యాన్ని నాయన వ్రాసిన లేఖలు గుర్తుచేస్తాయి, ప్రతీవారం మహర్షికి నాయన వ్రాసిన లేఖలు వారి అనుబంధ మెటు వంటిదో తెలియజేస్తాయి.

## (అ) సంకల్పం కావాలి :

మహర్షి సంకల్ప రహితులని అందరికీ తెలుసు. శేషాద్రి స్వామి వంటి యోగి పుంగవుడు అతనిలో కోరిక ఉందా అని తెలుసుకోవడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. అటువంటి మౌన

స్వామిలో స్పందన కలిగించినది నాయనే. అతనే లేకపోతే మహర్షి సందేశం జనుల కందేది కాదు. మౌనం వద్దని ఆచార్యత్వాన్ని ప్రకటించమని నాయన అనేకమార్లు మహర్షిని కోరియున్నారు.

శ్లో॥ యదిన జననీ స్తన్యందద్యా
చ్ఛిశోర్బ్రత కాగతిః ?
యది పశుపతిః క్రోధం కుర్యా
త్పశోరవనంకుతః ?
యది పద జుషాం మాచార్యత్వం
నిహంసిన సంశయం
భ్రమశత పరాభూతాఏతే
తరంతు భవం కథమ్॥ ?

[తల్లి చనుబాలీయనిచో అక్కటా ! బిడ్డగతి ఏమి కాగలదు ? పశుపతి కోపము బూనిన పశురక్షణ మెట్లు సాగును ? అటులనే ఓ ! ఆచార్యుడా నీవు నీ పదభక్తుల సంశయమును హతమార్పవేని లెక్కలేని భ్రమలలో జిక్కువడి పరువుగోల్పోయిన వీరి (శిష్యుల) జన్మము కడతేఱుటెట్లు ?

నాయన వినతికి మహర్షి స్పందించారనే చెప్పాలి. అటువంటి లేఖను గమనించండి.

ఆనందాశ్రమం శిరసి.
24-2-31.

భగవన్ ! కారణ గురో

భగవంతుని యనుగ్రహముచే మేము తేజస్వరూపమగు భగవత్కరుణయందు మునిగియుంటిమి. ఓ మాయాపుంజ సంహారీ ! ఇప్పటికిని నాకు భేద బుద్ధి యస్తమించలేదు. మీయొక్క క్షణిక

సంకల్పమున్నచో నాకది సర్వాత్మభావ మగునని నేనెఱుగుదును. స్వేచ్ఛగా మీ మనస్సు నందొక్క సంకల్పమైన నుండ జాలదని నేనెఱుంగుదును. ఈశ్వరుడే మీ మనస్సునందట్టి సంకల్పమును బుట్టింప సమర్థుడు. ఇట్టి ద్రావిడ ప్రాణాయామ విధమేల యని ప్రశ్న రావచ్చును. ఈశ్వరుడే స్వయముగా నను గ్రహించక మఱొకనికి సంకల్పము పుట్టించుటకేల ప్రయాస పడవలెను? నిజమే యీ రహస్యము పుణ్యాత్ములెఱుగదగినది. అవతారు పురుషుడు జాగరూకుడై యుండగా గాని స్వయముగా చేయడని సిద్ధాంతము. అందువల్లనే తమ మనస్సునందట్టి సంకల్పము బుట్టించుట కీశ్వరుని నేను ప్రార్థించుచుంటిని.

ఇట్లు

మీ జన్మాంతర సోదరుడు.

చూడగా నాయన వినతిని మహర్షి మన్నించారనే చెప్పాలి. పరోక్షంగా జూచిన మహర్షి సంకల్పమే నాయన.

## (ఆ) వంటలవాడు

నాయన నన్ను వంటలవాణ్ణి చేసారు అనేవారు భగవాన్. "చత్వారింశత్" అనే గ్రంథంలో నాయన నివేదనిలా ఉంటుంది.

శ్లో॥ నరపశూని మానహమితాడయన్ ।
పరశి వౌదనం వితనుషేపచన్ ॥

[మనుష్యులనే ఈ పశువులందు గల అహంకారమును గొట్టి పరమశివునకు అన్నము వండుచున్నావు].

అహంకార నాశనముద్వారా ఈశుని దర్శన సౌలభ్యం కల్గుతుంది గావున మహర్షి అటువంటి అహంకారమును తొలగింపజేయు

యున్నాడను భావం పై శ్లోకంలో ఉంది. శిరసిలోగూడ అటువంటి వంటలపని ఒక స్త్రీ గావించు చున్నదట. ఆమె ఎవరో తెలుసు కుందామా ?

ఆనందాశ్రమం, శిరసి
ది. 15-7-1931.

భగవన్, పుణ్యశ్లోకా,

ఇక్కడ భగవంతుని కృపచే నందరు కుశలము. ఈప్రాంత ములో సంతత వర్షముల వలన దినములు మందగిల్లెను. అయినను భగవత్ప్రేరితమైన నొక శక్తిచే పాకము గావింపబడిన మా యంత రంగములు తీవ్రముగానే యున్నవి. ఎచ్చటను సూర్యప్రభ గోచరించుటలేదు. అయినను ఎండలోనున్నట్లుంటిమి. మా యీపాక మందు ముఖ్యమైన వంటవాడు భగవంతుడని మేము మరువలేదు. భగవంతుని యీ పాచక వృత్తి జీతము లేనిది. ఈ కర్మలో నొక స్త్రీ గూడ తమకు సహాయ మొనర్చుచున్నది. ఆమె యెవరు ? మదోద్ధతిచే గర్వితులైన రాజుల దర్పమును త్రొక్కిన షష్ఠావతార పురుషుడైన భగవంతుని తల్లియైన రేణుక. సకలమును ప్రేరేపించు యజమాని యొకడు భక్తులపైని, సర్వము తెలిసిన జ్ఞానులపైని కూడ గలడు. అతడీపాచకునిద్వారా శీఘ్రముగా చేయించుచు పక్వమైన అన్నమును భుజించుగాక.

ఇట్లు, నరరూపమైన
పక్వాన్నము.

## (ఇ) సంవత్సరాది ఆశీస్సులు :

ఆనందాశ్రమం, శిరసి.

14-4-31.

భగవన్ దహరశయా,

మా సంవత్సరాది వందనములు స్వీకరించి మమ్మాశీర్వచనములతో వృద్ధిబొందించ గోరుతున్నాను. తమకరుణచే మాకీ సంవత్సరము జయ మంగళ ప్రదమగు గాక ! నాథా ! తపస్సు పరిపక్వమై, అహంకారము నశించి, సహజస్థితియందు స్థిరమై, యింద్రియ సమూహ మంతయు భగవదాయత్తమై యుండగా సర్వము సాధింపబడినట్లు నేను తలంచు చుంటిని. విజ్ఞానాత్మనిష్ఠ నాకు మూలనిష్ఠకు మార్గము జూపుగాక. తమ కరుణసన్నిధియందే సర్వాభీష్ట సిద్ధి పూర్ణమొందునని నేనెఱుగుదును. అట్టి శుభకాలము నకై ప్రతీక్షించుచుంటిని. ఈజను డిప్పుడు దూరములోనున్నను, తమ చిత్త సామీప్య మందున్నవానివలె ప్రకాశించుగాక. ప్రభో ! మీరెప్పుడూ నా హృదయమందే శయనించుచున్నారు. నేనెప్పుడూ మీ పాదముల యొద్దనే శయనించుచుంటిని. మీరు నాకు నియోగించు ప్రభువులు. నేను మీకు కార్యదాసుడను.

ఇట్లు అన్ని విధములా మీవాడైన

వాసిష్ఠుడు.

## (ఈ) అళగమ్మకు శ్రద్ధాంజలి :

ఆనందాశ్రమం, శిరసి.

9-6-31.

భగవన్ ! లీలామానవా,

శ్రీమాత (అళగమ్మ) యొక్క మహాపూజాదినము లందు మా వందనములను స్వీకరింపవలెను. మునులను రక్షించు శ్రీరాము

నకు కౌసల్య వలెను, యోగవిద్య నుపదేశించిన శ్రీకృష్ణునకు దేవకి వలెను, ఆ కౌమార బ్రహ్మచారియైన పరశురామునకు రేణుకవలెను, సర్వభూతముల కభయమొసగిన శాక్యమునికి (బుద్ధునకు) మాయాదేవి వలెను, భక్తుల పాపములను భరించిన మనుష్యకుమారునకు (క్రీస్తునకు) మేరీవలెను, ఈ గుణములన్నింటితో గూడి పూజ్యులైన మిమ్ములను లోకహితము కొఱకు, అవిద్యాంధకార ధ్వంసము కొఱకు, కువాదులను దూర మొనర్చుటకు, సత్యమును బోధించుట కొఱకెవర్తె కనెనో, సుందర ప్రియురాలైన ఆసౌంద ర్యాంబకు నా నమస్కారములు. ఆమె యధిష్ఠాన మెంచిన మాతృ భూతేశ్వరీ భగవతికి నా నమస్కారములు.

• • • •

సుందరుని కుసుమ పత్రముందినది. దాని పరిమళముచే నా శ్రమము పరిమళించు నట్లయ్యెను. దాని ననుసరించి భగవంతుని సందేశము నెఱక పరచిన లేఖయు చేరెను. నాయంతరాత్మకు ప్రశాంతము చేకూరెను. కపాలియొక్క సద్దర్శన భాష్యము చాలవఱకు పూర్తియయ్యెను.

ఇట్లు, శ్రీ రమణభాగవత చరణధూళిధారియైన
వాసిష్ఠుడు.

## 19. భక్తి లేఖావళి

నాయన వ్రాసిన "సద్దర్శనము" రమణాశ్రమమునందు అనేకమంది పండితుల నాకర్షించినది. అయినప్పటికి అందు కొన్ని శ్లోకములు మూలమునకు సరిపోలేదని కొందరు మహర్షి దృష్టికి తీసుకొనిరాగా, భగవాన్ నాయన వ్రాసిన భావాన్ని సమర్థించారు. ఈ విషయమును సుందరకృష్ణ వాసిష్ఠ డనువాడు నాయన

కెటీంగించగా అతని సంతోషమునకు మేరలేదు. వెంటనే తన కృతజ్ఞతలను దెల్పుతూ మహర్షికి లేఖ వ్రాసారు నాయన.

ఆనందాశ్రమం, శిరసి
ది. 2-6-1931.

భగవన్, దీనబంధో

భగవంతునిచే నుపదేశింపబడిన యర్థమును సుందరకృష్ణ వాసిష్ఠుడు పత్రము ద్వారా తెలియజేసెను. అందువల్ల మా సంశయములు నివృత్తమయ్యేను.

"పరిచ్ఛిన్న భావము యొక్క అభావము ముక్తునకును, ఈశ్వరునకు నొక్కటే" యనిన మీ వాక్యము మా యిచ్చటి సందేహములనన్నింటిని తొలగించెను. జగత్తున కధికారియై యీశ్వరుడు గలడు. ముక్తపురుషునకు వ్యక్తిత్వము కలదు. వారి యనుభవములు సమమై, భావాభావ శూన్యమై యుండును, ఇది మీవచనము నుండి మాకు స్పష్టమయ్యేను. దీని వలన మా సద్దర్శనము దృష్టి, సృష్టి సంవాదము కవకాశమిచ్చుచున్నదనుపల్కు పక్షము ఖండిలపబడెను. ఆ జవాబు సద్దర్శనము లోనే కలదు.

ఇట్లు, మీ చరణకమలభ్రమరమైన
గణపతి.

## సద్దర్శన భాష్య రచన (నివేదన)

ఆనందాశ్రమం, శిరసి
ది. 7-4-31.

భగవన్, పారాశర్యా,

భగవత్కటాక్షము వలన మేమందర మిచ్చట క్షేమముగా నుంటిమి. వత్స కపాలిచే సద్దర్శన భాష్యము ప్రారంభింపబడెను.

మూల గ్రంథము యొక్క గౌరవము వలన దానికి భాష్యమను పేరు నేనే సూచించితిని. విమర్శించగా సద్దర్శన మతి గంభీరమై యున్నదని కపాలి యనెను. అది మీచే రచింపబడినప్పుడే దాని గాంభీర్యము నాకు తెలిసినది. ఆ గ్రంథము మితమైనను, గొప్పవైన తత్త్వ యోగ శాస్త్ర రహస్యములకు సూత్ర ప్రాయమై యొప్పును. పరమత ఖండన మించుకయు లేదు. అట్లయినను నితరుల ధోరణి విచిత్రముగ పూర్వపక్షము చేయబడెను. అందున్న యుక్తులు పండిత పామరులకు భయులకు హృదయము నంటును ఇందు ప్రమాణ గ్రంథ మేదియు గైకొనబడకున్నను వేదసార సంగ్రహమువలె ప్రకాశించుచున్నది. దీని వివరణముచే భాష్యకారుడు ప్రతిఘటింప వలసినది మిగుల కలదు. నూత్నముగా తెలియదగినవియు గలవు. అయినను భాష్యమతి విపులముగా నుండరాదు. విషయములు విడువ దగినవికావు గనుక, ప్రాముఖ్యమయినవి నిరూపించవలసి యున్నవి. ఈ భారము సర్వము నిర్వర్తించుటకు భగవంతుని నిరుపమాన కటాక్షలేశమున్నచో కపాలి సమర్థుడు కాగలడు.

నేను 'ప్రచండ చండీ త్రిశతీ' యను చిన్ని స్తోత్రమును రచించితిని. అందొక స్తబకము రంగారాయుడు వ్రాసికొని వెళ్ళెను. ఇప్పుడింద్ర సహస్రము నారంభించితిని. నా యీకర్మ తుది ముట్టుటకు రమణునిదే భారము.

ఇట్లు, రమణ భాగవతుడైన
వాసిష్ఠుడు.

ఆనందాశ్రమము, శిరసి.
1-7-1931.

భగవన్ మహాశయనా!

"సద్దర్శన భాష్యమునకు శుద్ధప్రతులు రెండు తయారయ్యెను. ఒకటి యీ దినమందు ఆశ్రమమునకు బంపబడుచున్నది. మీ చరణ దర్శనోత్సుకులై విశ్వనాథ, రంగరాయులీ దినమందే బయలుదేరుచున్నారు. కొద్ది రోజులలో తమ సన్నిధి చేరగలరు. ఇక్కడ వర్షాకాల మారంభమయ్యెను. మోటారు శకటములో వర్షమున నది తడసిపోవునను భీతిచే వారిచేతికిచ్చి పంపలేదు. పోస్టుద్వారా పంపబడుచున్నది. కపాలి భాష్యము నాకమిత సంతోషము కలిగించెను. ఇది భగవంతుని హృదయమును గూడ స్పృశించునని నేను విశ్వసింతును.

ఇట్లు మీ చరణబంధువైన,
గణపతి.

## అచంచల గురుభక్తి, ఈశ్వరభక్తి మరియు దేశభక్తి (నివేదన)

తన తపస్సునకన్నా నాయనకు దేశముపై అత్యంత ప్రేమ గలదు. గాంధీమహాత్ముడు దేశసేవకై కర్మయోగమును జేబట్టిన, నాయన సమాజసేవకి, జ్ఞానవృద్ధికి, తపస్సాధనను చేబట్టి, తన తపస్సును ధారపోసెనని చెప్పవచ్చును. భక్తి ప్రాధాన్యమును గమనింపుడు.

ఆనందాశ్రమము, శిరసి.
5-5-1931.

భగవన్, మాయా మానుషా,

ఇచ్చటంతయు నిర్మలముగా నున్నది. ప్రభో! నా స్థితిని కొంచెము తమ చరణ సన్నిధిని నివేదించుకొనుటకు నే నుత్సాహ

వచ్చుచుంటిని గొప్ప ఆనందమును పరమలక్ష్యముగా కొందఱెంచు దురు. నిరతిశయయోగసిద్ధి ముఖ్యలక్ష్యమని మఱికొందరు తలం తురు. సుఖ దుఃఖాతీత స్థితి ఇంకను కొందఱికి లక్ష్యమగుచున్నది. కొందఱు మృత్యు విజయమును గొప్పదందురు. నేను మాత్రము కామోపశాంతి కమనీయ లక్ష్యమని తెలియుచుంటిని. నిస్సారము లైన కొన్ని కామము లుపశాంతి నొందెను; కొన్ని యనుభవింప బడి శాంతి బొందెను. దూరము జేయబడి మఱికొన్ని యుపశాంతి గావింపబడెను. సారమున్నదో లేదో కాని నాకొక్క కామ్యము మాత్రముండిపోయెను. దానిని నిషేధించుటకు శక్తిలేదు; దూర ముగా పొమ్మనుట కిచ్ఛలేదు. నా కష్టములో భగవంతుని సహా యమును యాచించుచుంటిని. ఆ నాకోర్కె భగవంతునకు తెలి సియే యుండును. (దేశక్షేమ కామ్యమిది)

ఇట్లు,

"......................."

ఆనందాశ్రమము, శిరసి.
22-7-1931.

భగవన్ ! భక్తవత్సలా,

మంత్ర జప మహిమ వీక్షించబడెను; యోగసారము విలో కించ బడెను; శాస్త్రసారము విపులముగా విచారింపబడెను. ఏకాగ్రా లోచనలో తపస్సాచరించబడెను, కుండలినీ శక్త్యుల్లాసము పరీ క్షింపబడెను; 'అహమ్' యొక్క జన్మస్థలము నిరీక్షించబడెను; మౌన ముచే ప్రకృతి పాక మన్వీక్షింపబడెను; భేద భావము దూరీ కృతము గావింవబడెను; విషయ సంగము నిరాకరింపబడెను. అట్లయినను, నేను తృప్తి జెందలేదు. ఇప్పుడింక భక్తిచేతనే తృప్తి

బొందగోరుచుంటిని. ఆ భక్తికి మూడుస్థానములున్నవి. ప్రథమ స్థానము భగవాన్ మహర్షి, ద్వితీయ స్థానము భగవానింద్రుడు, తృతీయ స్థానము భగవతి మాతా భారతభూమి.

ఇట్లు మీ చిరకాల భక్తుడైన
గణపతి.

భక్తి, జ్ఞాన యోగములకు ప్రత్యక్ష ప్రమాణములుగా నిల్చే నాయన లేఖలు అనేకములు గలవు. అందు కొన్ని మాత్రమే ఇందు ఉదహరింపబడినవి.

—×—

## 20. తనువు పరిమితం, తపశ్శక్తి అపరిమితం

శ్లో॥ తవ శక్తిఘురీపతనం బహిరద్భుత వృష్టిరివ ।
ఇద మంతరనంతబలే మదిరారస పానమివ ॥

[ఓ దేవీ, నీశక్తిపాతము బాహ్యమున (శిరస్సుపై) పడు నప్పుడు అద్భుతమైన వర్షపాతమువలె నుండును అంతరమున (లోపల) అది మద్యపానవలె మత్తును కలిగించును.].

— ప్రచండ చండీ త్రిశతీ.

• • • •

"ధ్యానము విరామములేక విద్యుత్ పాతమువలె సాగవలెను. దానినే, సమాధి లేక కుండలినీశక్తి యనెదరు" మహర్షి పల్కిన మాటలివి. కావ్యకంఠులవారికి కపాలమోక్షము జరిగినప్పుడు వారి తలపై ఆముదము వ్రాసి తాపమును శాంతింపజేసిన మహర్షి "వారి నాదుకొనుటకు నేను ఉన్నాను. మరి నాకెవరున్నారు" అన్నారట.

అనగా జ్ఞానులయందు, జ్ఞానమార్గమునగాని, మంత్రమార్గమునగాని ఆత్మసిద్ధి చెందిన తరువాత అంతర్లీన శక్తిపాతము అపారమనునది దెలియుచున్నది.

"మూర్ధ్ని ఆధాయాత్మనః ప్రాణం ఆస్థితోయోగధారణామ్" అనుగీతా వాక్యము కూడా ఈ విషయమును ప్రకటించు చున్నది. మూలాధారమునుండి బ్రహ్మరంధ్ర ద్వారమున తైజసశక్తి ప్రతి క్షణము అంతర్బాహ్య విహారము చేయుచుండును. కుండలినీ విద్యను సాధించిన యోగి ఈ శక్తి విహారమును తన ఊపరి దమనము దెలియునట్లు దెలియగలడు అనునది ఈ గీతావాక్యము యొక్క తాత్పర్యము, కుండలినీ విద్యాధికారిణీ యైన ప్రచండ చండి యొక్క స్వరూప వర్ణనము, తత్త్వము దెలియజేస్తూ నాయన "ప్రచండ చండీ త్రిశతి" యందు స్వానుభవమును కూడా తెలియజేస్తారు. అనంతశక్తి ప్రవాహలహరిని అనుభూతం చేసుకొన్న యోగికి పరిమిత శరీరం ప్రతిబంధకమే అవుతుంది.

శక్తిపాత ఝరికి అలవాటు పడ్డ నాయన శరీరానికి ఉప్పు, పులుపు, కారంతో కూడిన వంటకాలు సరిపడేవికావు. ఆశ్రమంలో అతనిని చూడడానికి వచ్చిన భక్తులు ఏవేవో ప్రసాదాలు తెస్తూ ఉండేవారు. ఒక ప్రక్క వయోభారం పెరుగుతూ ఉండడంతో శరీరం ఈ సేవలను తట్టుకోలేకపోతోంది, అతిమూత్రవ్యాధి లక్షణాలు గానవచ్చాయి. ఇన్ని ఉన్నప్పటికి నాయన తనశరీరావస్థను ఎవ్వరికీ చెప్పేవారుకాదు. అయితే ప్రచండ చండీ త్రిశతిలో అతను వ్రాసిన కొన్ని శ్లోకాలు పరిమిత దేహంలో అతను పడుతూన్న బాధల్ని తెలియజేస్తాయి.

శ్లో॥ సహతా మిద మంబవపు స్తవనాట్య మపారజవం ।
బహిరంతర శత్రుసహం భజతాం బహుళంచబలమ్ ॥

[తల్లీ ! నీశక్తిపాత నాట్యవేగమును ఈ దేహము సహించు నట్లు చేయుము. అంతశ్శత్రువులను (కామాదులు) బహిశ్శత్రువులను సహింపగల బలమును దానికి ఇమ్ము].

శ్లో॥ పృథివీచ సహేత నతే తటిదీశ్వరి నాట్యజవం !
కరుణాయది దేవి న తే వపుషా మిహకానుకథా ॥

[విద్యుద్రూపదేవీ, నీనాట్యవేగమును భూమికూడా సహింప జాలదు. కాగా నీదయలేనిచో ఈ మానవ దేహమెట్లు సహించును.

శ్లో॥ వార్ధకేన బలకాంతి హారిణా ధారణేన కటుకార్యకారిణా
గ్రస్తమేత మధునా పునః కురుతాత్రిణదే యువకవ
త్పదాశ్రితమ్ ॥

[దేహము వార్ధక్యముచే బలహీనమగుచున్నది. నీ పాదముల నాశ్రయించిన ఈ దేహమునకు యౌవనము ప్రసాదించిన గాని నీశక్తి విలాసలహరిని ధరింపజాలదు].

ఆనందాశ్రమ వాసము నాయన కంతగా పడలేదు. ఏకాంత సాధనకు, సాహిత్యాది చర్చలకు అచట అనుకూలముగా నున్నప్పటికి ఆహార విషయంలో శిష్యులు అందించే ప్రసాదాలను నాయన స్వీకరించలేకపోయారు. అతనికి దగ్గఱుండి సేవచేయగల సమర్థత కుటుంబానికీ ఉంది. ఒకవైపు తన తండ్రి పరిస్థితిలా ఉండగా మరియొకవైపు గ్రామమునందు కరువు కారణముగా పంటలు నష్ట మొందినవి. అటువంటి సమయములో కొన్ని భూముల నమ్మి వేసిరి. కుళువే వాతావరణం నాయన కనుకూలంగా యుండుటచే, శిరసి నుండి అతనిని కుళువే తీసుకుని వచ్చారు.

తనయుని సేవలో నాయన స్వస్థత పొందారు. కోడలు రాజేశ్వరి మామగారి ఆహారనియమాదులను దగ్గఱుండిచూసుకునేది.

1932 నుండి 1934 వఱకు కుళువేలో ప్రశాంతమైన జీవనం గడిపారు నాయన. ఆ సమయములోనే "దశమహావిద్యాది సూత్రావళి" అనే సూత్ర కావ్యాన్ని వ్రాశారు. పరాశక్తి యొక్క పది అవతారము లకు చెందిన తాత్త్విక దర్శన గ్రంథమిది. అందు చెప్పబడ్డ మంత్రాలన్ని నాయన స్వయముగా దర్శించి వ్రాసినవే "పూర్ణ" నవలను కూడా సంస్కృతంలో వ్రాయనారంభించారు.

మహదేవునకు వరుసగా ఐదుగురు ఆడపిల్లలు కల్గి ఇద్దరే బ్రతుకుటచే మగపిల్లడు పుట్టాలని నాయన అతని భార్య రాజేశ్వరికి ఇంద్రమంత్రాన్ని ఉపదేశం చేసారు తరువాత వరసగా నల్గురు జన్మించి ముగ్గురు బ్రతికినారు. వార ముగ్గురూ మగపిల్లలే.

నాయన ఆరోగ్యం కుదుట పడగానే మరల అతను ఆనందా శ్రమానికి వస్తె బాగుండుననే తలంపు శిష్యులలో కలిగింది. ఆశ్ర మాన్ని వృద్ధిచేస్తే బాగుండుననే తలంపుతో చందాలు వసూలు చేయడం ప్రారంభించారు. కొందరు శిష్యులు. తనకై ధనము నార్జించుట నాయనకు రుచించలేదు. ఆశ్రమానికి వెళ్తే మరల ఆరోగ్యం ఎలా ఉంటుందో అని భయం మహాదేవునికి కలిగింది.

నాన్నగారు ! మీకు వార్థక్యం వచ్చింది. ఆరోగ్యం మును పటిలా లేదు. మన ఇంటికి మరం పోతే మంచిది. గ్రామంలోనే తోటలో మీకు చిన్ని ఆశ్రమం నిర్మిస్తాను. మిమ్మల్ని దగ్గఱుండి చూసుకుంటేనే మాకు సంతృప్తి. కలువరాయికి పోదాం. నామాట మన్నించండి" అని వేడుకున్నాడు తనయుడు.

భవితవ్యం తెలిసిన నాయన కుమారుని ముఖాన్ని చూసారు. పితృభక్తి అందుకానవచ్చింది. తనయుని విన్నపాన్ని మన్నించారు. ఒక శుభముహూర్తాన కలువరాయి బయలుదేరారు వారు.

# 21. పిలుపు వచ్చింది

శ్లో॥ పాహి వా పశుపతే ! జహీహి వా జీవనం తవపదో:

సమర్పితం ।

దేహివా విముఖతా ముపేహివా ప్రార్థయే కిమపినాథ!

నాపరమ్ ॥

[ఓ పశుపతీ ! నీవు నన్ను రక్షించుము లేక విడువుము. నా జీవితము మాత్రము నీ పాదార్పితము. నీవు కరుణించినను లేకున్నను నేను నిన్నేమియు కోరను.]

—శివ శతకము.

గణపతిముని.

• • • •

పూర్వము గోదావరీ నదీ తీరాన ఒక రామభక్తుడుండే వాడట. అతనికి రాముడొకనాడు కలలో కల్పించి "నీవు రేపు పయనమై నావపై భద్రాద్రికి రమ్ము, త్రోవలో నీకు పుష్పక విమానమును పంపెదను. దాని నెక్కితివేని వైకుంఠమునకు రావచ్చును" అన్నాడట. మర్నాడు ఉదయం భక్తుడు అతి సంతోషంతో భార్యకీ విషయం చెప్పాడు. మూటాముల్లూ సర్దుకుని ఇరువురూ భద్రాద్రికి బయలుదేరారు. భక్తుడు శ్రీరామ చరణార్పిత మనస్కుడై సమాధిలో నుండగా భార్య పుష్పక విమానం ఏదిశనుండి వస్తుందో అని ఎదురు చూస్తున్నది. గోదావరీనదిని సగందూరం దాటగానే ఆకాశంనుండి దిగుతూ పుష్పక విమానం వచ్చింది. "అదిగో విమానం వచ్చిందండి! అంటూ మూటలు సర్దుతోంది భార్య. "అలాగా" అని రామనామస్మరణతో విమానం ఎక్కేసాడు భర్త. మూటల్ని కడుతూన్న భార్య పాపం! తేరు

కునే లోపల విమానం ఎగిరిపోయింది, ఎంతటివారలైనా విషయాసక్త మనస్కులకు మోక్షము దూరమే కదా!

ఈశ్వరానంద డోలాయమాన చిత్తుడైన నాయనకి ఇది శిరసియని, ఇది కలువరాయి అని భేదము లేదు. అంతటా బ్రహ్మమునే జూచే జ్ఞానులకు ప్రదేశ భేదమును దెలియునా! భగవన్! మీ దర్శనం కోసం రైలెక్కి రెండు రోజులు ప్రయాణం చేసి వచ్చాను" అని ఒక భక్తుడంటే మహర్షి "నీవు ఎప్పుడో ఇక్కడికి వచ్చావు. రెండు రోజులుగా ప్రయాణం చేసినది నీ శరీరం మాత్రమే" అన్నారు. అలా వుంటుంది జ్ఞానుల దృక్పథం. వారికి బంధుప్రీతి ఉండదు. 'మిత్రప్రేమ' పుత్రవాత్సల్యము, అనేవి వారికి వర్తించవు. వారినుండి సర్వదా ప్రవహించేది కారుణ్యరసా స్రవంతి మాత్రమే.

చాలాకాలం తరువాత నాయన కలువరాయి రావడంతో అచటి బంధుమిత్ర వర్గం చాలా ఆనందం చెందారు. ముఖ్యంగా నాయన అచటనే ఉంటారనే వార్త వారికి ప్రీతి కలిగించింది. కలువరాయి వాస్తవ్యులైన "అయ్యల సోమయాజుల" కుటుంబమునందు పుట్టిన అవతార పురుషుడతడు. అటూ, ఇటూ ఏడు తరములు ఆతనిచే తరిస్తాయి. అటువంటి మహనీయుడు గ్రామానికి వచ్చాడంటే సంతోషముండదా మరి! చుట్టుపక్కల గ్రామముల నుండి కూడా తీర్థ ప్రజవలె జనులు రాసాగారు. నాయన విశ్రాంతికి భంగం కలగకుండా, వచ్చినవారు నిరాశ చెందకుండా అందరినీ సముదాయించి, సంతోషపరచి పంపడం మహాదేవునికి పరీక్ష అయింది. అయిననూ ఓర్పుతో వచ్చిన వారిని ఆదరించాడతడు.

గ్రామానికి రెండు ఫర్లాంగుల దూరములోగల మామిడి తోటలో నాయన నివాసమునకని రెండు గదులతో కుటీరము

నిర్మించుటకు మహదేవుడు ఏర్పాటు చేయుచుండెను. భాద్రపద శుద్ధ పంచమినాడు అనగా 14-9-1934 నాడు అందు ప్రవేశించుటకు నాయన నిర్ణయించారు. ఇంతలో విశాఖపట్నమునందు ఆంధ్ర విశ్వ విద్యాపరిషత్కళాశాల వారి వార్షికోత్సవములు నిర్ణయింప బడినవి. నాయనగారు దగ్గరలోనే ఉన్నారని తెలసిన కార్యవర్గం వారు వారికి ప్రత్యేక ఆహ్వానమును పంపుతూ అతని ఉపన్యాస మును ఏర్పాటు చేసారు. మన మాజీ రాష్ట్రపతి అయినటువంటి సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు అలనాటి వైస్ ఛాన్సలర్‌గా పని చేయుచున్నారు. వారు నాయన శిష్యుడైన సర్వేపల్లి నరసింహం గార్కి బంధువు. నరసింహంద్వారా గణపతిముని కీర్తి ప్రతిష్టలను అతను వినియున్నారు. వేలూరులో తన చిన్నతనంలో నాయనను జూచియున్నారు. కుమారుడైన మహదేవునకు సంస్కృత పాఠం చెప్పునప్పుడు తాను కూడ వినుచుండేవారు. నాయనను మరల దర్శించవచ్చునని అతను సంతోషించారు.

పరిషత్తు ఉత్సవములు కడురమ్యముగా జరిగాయి. నాయన 'మహాభారత' విమర్శకు చెందిన ప్రవచనములు వరుసగా రెండు రోజులిచ్చారు, "మహాభారత కథ వేదకాలము" నాటిది. కథా పురు షుల పేర్లు ఋగ్వేదమునందు కలవు. పాండవులకు ప్రపితామహు డైన శంతనుడు ఋగ్వేద సూక్తకర్తయైన దేవాపికి కనిష్ఠసోదరుడు. చంద్రగుప్తునకు 158 తరముల వెనుకటివాడు శ్రీకృష్ణుడు. వేదము లందు చెప్పబడిన భారతగాధను పౌరాణికులుమార్చి విశ్వాధ్యక్షుడు మహేంద్రుడు కాగా ఆ స్థానములో విష్ణువును దెచ్చిరి. ఇంద్రుని నీచకధలతో భ్రష్టునిగా చిత్రించి యతనికి పర్జన్య (మేఘాధిపతి) స్థానమును కల్పించిరి". ఈ విధముగా నాయనజెప్పిన గంభీరమైన ఉపన్యాసము విమర్శలకు కడు ఉత్సాహము కలిగించినది. మహా

మహాత్మైన తాతా సుబ్బారాయుడు శాస్త్రిగారు, కాశీనాథుని నాగేశ్వరరావు గారు మొదలైన వారు సభకు విచ్చేసిరి. నాగేశ్వరరావు నాయన ఉపన్యాసమును ఆంధ్రపత్రికయందు ప్రచురించినారు.

గణపతిముని మహనీయులు విశ్వవిద్యాలయమున నుండి నచో ప్రాచీన విద్యాపరిశోధనాశాఖ యభివృద్ధి జెందునని రాధాకృష్ణయ్య దలచి దక్షత వహించుమని నాయనను వేడుకొనిరి. అందులకు నాయన నవ్వుతూ "దక్షతా ! ఎవరు ఎవరికి దక్షుడు" అని ఆధ్యాత్మికంగా జవాబిచ్చారు. ఇదివరిలో కలకత్తా విశ్వవిద్యాలయంలో కూడా పదవి నిస్తామని కోరగా నాయన నిరాకరించి యున్నారు. తాపసులు పదవులకు, ఐహిక బంధాలకు అతీతులు, కాని విమర్శకుల యభిలాష ననుసరించి భావితరముల వారికి ఉపయోగపడునని "భారత చరిత్ర పరీక్ష" యను విమర్శనాత్మక గ్రంథాన్ని వ్రాసారు.

కలువరాయిలో నాయన ఉన్నారన్న వార్త తెలసి ఖర్గపురము నుండి మరువాడ ప్రసాదరావు దంపతులు వచ్చిరి. నాయన పినతండ్రి కుమారుడైన సూర్యనారాయణ శాస్త్రికి అల్లుడితడు. బహు మాటకారి. లౌక్యుడు. ఏవేవో పూజలుచేసి గ్రహపీడితుడై అశాంతి చెందియున్నాడు. నాయనను ఖర్గపురము తీసుకుని వెళ్ళిన తన గ్రహ బాధలు వదలునని శాంతి దొఱకునని దలచాడు.

అందుచే నాయనను ఖర్గపురము తీసుకుని వెళ్తానని పట్టు బట్టాడు. మహాదేవుడు, సింహాలు (శివరామశాస్త్రి కుమారుడు) వద్దని ఎంత నచ్చజెప్పినా వినలేదు. తాను జాగ్రత్తగా నాయన ఆరోగ్యాన్ని కాపాడుతానని, కనీసం రెండు నెలలైన నాయన తన ఇంట్లో ఉండాలని పట్టుబట్టాడు. అతని భార్య చిట్టిపిల్ల తన

యింటికి రమ్మని పదే పదే నాయనను బ్రతిమిలాడింది. ఈవింత బలవంతం నుండి ఎలా బయటపడాలో మహాదేవునకు తెలిసింది కాదు. నాయనకు ఆదరణీయమైన వాతావరణం 'శిరసి' లో ఉండేది. ఆరోగ్య కారణంగా తాను అతనిని కలువరాయి తీసుకుని వచ్చాడు. ఆశ్రమం కూడా తోటలో నిర్మించారు. ఆశ్రమ ప్రవేశానికి ముహూర్తం కూడా పెట్టారు. అందుచేత ప్రసాదరావు వినతికి ససేమిరా వీల్లేదన్నాడు.

కాని శరణార్థులను రక్షించే మనస్తత్వం నాయనది. ప్రసాదరావు పిలుపులోని ఆంతర్యం తెలుసు వారికి, తనయుని మనో వ్యథ కూడా గ్రహించారు. కొద్దిసేపు కండ్లు మూసుకుని నిట్టూర్పుతో "సరే పిలుపు వచ్చింది. వెళ్ళివస్తాను" అన్నారు.

14-9-1934 నాడు సింహాలు తోడురాగా ప్రసాదరావు దంపతులతో ఖర్గపురానికి బయలుదేరారు నాయన. విరక్త హృదయుడయ్యాడు మహాదేవుడు. భవిష్యత్తు తెలిసిన ఆత్మ స్వరూపులను బంధించుట ఎవరి తరము ?

## 22. అనుగ్రహ వీక్షణము

శ్లో॥ ముధాక్షి పస్యద్రిసుతే ! కటాక్షాన్ ।
కైలాస కాంతార మహే రుహేషు ।
ఇతః కిరేషత్ తవనాస్తి హానిః
సిధ్యత్యభీష్టంచ సమస్త మస్య॥

[అమ్మా ! పర్వత పుత్రీ ! కైలాస ప్రాంతములనున్న అరణ్యముల యందుగల వృక్షములపై బ్రసరించి నీ అనుగ్రహ పూరితమైన చూపులు వ్యర్థములగు చున్నాయి. వాని నించుక

మాపై ప్రసరింపజేయుము అందుచేత నీకు హాని లేదు కదా, ఈ వ్యక్తియొక్క యభీష్టమంతయును సిద్ధించును.]

—ఉమా సహస్రము.

• • • •

అది హిమాచల పర్వత ప్రాంతము. ఎత్తైన కైలాశ శిఖరము మంచుతో నిండినదై నిర్మలముగ గానవచ్చుచున్నది. శివపార్వతీ వాసస్థలమైన శిఖర రాజము భారతావనికి కిరీటమై, భారతీయులు శాంతి కాముకులని చాటుచున్నట్లు గానవచ్చుచున్నది. ఆదిశంకరుల ఆధ్యాత్మిక తత్త్వ వికాసమునకు, మునిపుంగవుల నిర్మలాంతఃకరణ సాధనమునకు, అచటినుండి ప్రసరించుచున్న పరమేశ్వరీ వీక్షణములే కారణమని అనేవారు గణపతిముని.

అటువంటి పవిత్ర శిఖరాగ్రమున ఒక మునిపుంగవుడు సూర్యదేవున కర్ఘ్యము నిచ్చుచున్నాడు. సమీపమున మరియొక భక్తుడు ఆ దృశ్యమును తిలకించుచున్నాడు. ఉన్నట్లుండి ముని భక్తుని వైపు జూశాడు. అతనిని చేయి చాచుమన్నాడు. అతని దోసెట్లో కొంత నీటిని జారవిడచి అనుగ్రహ దృష్టితో అతనిని తరింపజేసాడు.

నాయన చరిత్రను వ్రాసిన గుంటూరు లక్ష్మీకాంతం అనే సదాచారునకు పది సంవత్సరాల క్రిందట వచ్చిన కల యిది. కలలో కనిపించిన పుణ్యపురుషుడే తన గురువైన బాగుండునని నిజ జీవితంలో అతను తారసపడాలని భీష్మించి కూర్చున్నాడు. లక్ష్మీకాంతం "జ్ఞానానంద భారతి" యను పేరుతో తురీయాశ్రమంగైకొన్న శ్రీ ఆకెళ్ళ సూర్యనారాయణగారి అల్లుడు. నాయన ఖర్గపురం చేరుకున్న రోజులతో తన గురువు తనకు కనిపిస్తాడనే విశ్వాసంతో కలకత్తాలో నివసిస్తున్నాడితడు.

ఖర్గపురంలో నాయన మరువాడ ప్రసాదరావు ఇంట్లో బస చేసారు. ఆ సమయానికి కంచికామకోటి పీఠాధిపతియైన శ్రీచంద్ర శేఖరేంద్ర సరస్వతి అచట మకాం చేసియున్నారు. వారిదర్శనార్థం నాయన బయలుదేరారు. పంచ, కండువా ఖఫినీ ధరించేవారు నాయన. భోజన సమయంలోకూడా బట్టలు విప్పే అలవాటు లేద తనికి. ముఖ్యంగా కపాలమోక్షమయిన తరువాత మడి, తడి ఆచారా దులకు స్వస్తి చెప్పారాయన. జగద్గురువుల దర్శనానికి ఎవ్వరూ వెళ్ళినా పైన చొక్కా ఉండరాదు. పట్టు పంచ అవసరము. నాయన అతి సామాన్యంగా బట్టలతో వెళ్ళగానే అతనికి ప్రవేశాన్ని నిషే ధించారు అనుచరులు. అయితే దూరంనుండి నాయన ఆగమనాన్ని చూచారు జగద్గురువులు. వెంటనే తనే లేచి నాయన వద్దకు వచ్చి తను భుజముపై గల శాలువను నాయనకు కప్పి స్వాగతం పలు కుతూ లోనికి తీసుకునివెళ్ళి ఆసనంపై కూర్చోపెట్టారు. తరువాత పండిత సభ నేర్పాటుచేసి నాయనయొక్క సాహిత్య తపస్సీమల యందలి ప్రగతిని స్తుతించారు. నాయన కృతజ్ఞతతో అంబికా గీత పారాయణతో జయగానం చేసి గురువులకు పాదాభివందనం చేసారు. ఈ పరిచయంతో నాయన ఘనత పురజనులకు తెలిసింది. వేదుల రామమూర్తి, సింహాచలము, ఆకెళ్ళ పార్వతీశము జయంతి జగన్నాథము, సోమయాజుల సూర్యనారాయణ మొద లగు పురప్రముఖులు వారి శిష్యులయ్యారు. Indian Institute లో నాయన గంభీరమైన ఉపన్యాసం ఇచ్చారు. ఆ ప్రసంగాన్ని విన్న నేమాని సూర్యనారాయణ అను కలకత్తా వాసి నాయనను కలకత్తా రావలసినదిగా ఆహ్వానించాడు. ఫలితంగా 24-11-1934 నాడు అతను కలకత్తా చేరుకున్నారు. వారి బస గుంటూరి లక్ష్మీ కాంతం ఇంట ఏర్పాటు చేసారు.

అంతగా నాయన పరిచయం ఎవరికీ లేనందువల్ల, నాయనని తోడ్కొని వచ్చిన సంజీవరావు అను వ్యక్తి తప్ప మిగిలిన వారందరు తమ తమ ఆఫీసులకి వెళ్ళియుండిరి. కావున నాయనను మొదటిసారిగా ఆదరించిన వ్యక్తి లక్ష్మీకాంతంగారి భార్య సూరమ్మ. మధ్యాహ్నం లక్ష్మీకాంతం ఇంటికి చేరుకుని, గదిలో కూర్చున్న నాయనను ఒక్కసారి చూసాడు. అతని గుండె ఝల్లుమన్నాది. శరీరం వేడెక్కి చమటలు పోసాయి. ఆశ్చర్యం ! తనకు హిమాద్రి శిఖరాన కలలో కనిపించిన గురు స్వరూపమే యతడు. కొంతసేపు వరకు కలయో, నిజమో తెలియని పరిస్థితి ఏర్పడింది. తరువాత తేరుకొని మెల్లగా నాయనను సమీపించి నమస్కరించి కుశల ప్రశ్నలు వేసాడు.

కలకత్తాలో నాయన రమణోపదేశ ప్రచారానికి నాంది పలికారు. అచట గల తమిళ, మళయాళ, ఆంధ్ర సంఘమువారు నాయన ఉపన్యాసములను ఏర్పాటు చేసారు. తన స్వీయ చరిత్రను గూడ నాయన వారలకు తెలియజేసారు. "జగత్తు, యుగములు, అవతారములు, వేదములు" ఇత్యాదులపై విపులములైన భాష్యములతో భక్తుల సందేహములను తీర్చెడివారు. చాలామందికి రమణ గణపతుల చరిత్ర, మహాత్మ్యము తెలిసికొనే అవకాశం దొరికింది. ప్రతిదినము కాంతం ఇంట సత్సంగ కార్యక్రమం ఉండేది. "ఇంద్రాణీ" మంత్రోపదేశం చాలామందికి చేసారు.

నాయన సహచర్యంలో కలకత్తా వాసులు ఆధ్యాత్మిక పురోగతిని చెందారు. నాయన ఆహార నియమాదులలో సూరమ్మ ప్రత్యేకమైన శ్రద్ధతీసుకునేది. కాంతం ఇంట్లో నాయన ప్రశాంతంగా కాలం గడిపారని చెప్పవచ్చు.

తనకి కలలో కనిపించిన గురువు హిమాచలమున తపస్సు చేసిన వాడు, నాయన హిమాచలమునకు చెందిన యోగియేనా అనే సందేహం కాంతానికి కల్గింది, ఒకరోజు అతను నాయనను సమీపించి "మీరు హిమవత్పర్వత శిఖరమున నెప్పుడునూ తపస్సు చేయలేదా ?" అని అడిగాడు. నాయన నెమ్మదిగా "నేనక్కడ నుండి వచ్చినవాడనే, అక్కడ నా తపః స్థలమును నీవు జూచితివి కదా!" అని తన యనుగ్రహ వీక్షణమును అతనిపై ప్రసరింప జేసెను. అందలి రశ్మి కాంతమును అంతర్ముఖుని జేసినది.

నాయన చరిత్రను వ్రాసి, అతని గ్రంథములనేకములను తెనిగించిన ఈ మహనీయుడు అతని యనుగ్రహ వీక్షణములే అందులకు గారణము అని దెలియజేసి యున్నారు.

ఖర్గపురములో నాయనకు ఆశ్రమ నిర్మాణానికని ప్రయత్నాలు చేశారు శిష్యులు. కలకాత్తాలో ఉన్నవారిని 1935 ఆగష్టు మూడవ వారములో ఖర్గపురం తీసుకుని వచ్చి 1–9–1935 వినాయక చవితినాడు, నాయనవద్దని వారించిననూ వినకుండా నింపురాలో కొత్తగా నిర్మింపబడ్డ ఆంధ్ర పాఠశాలా భవనమునందు అతనినే గణపతిగా కూర్చోబెట్టి ఆహ్వాన, విసర్జనలతో పూజచేసారు. అలా పూజ చేయుట దోషమని తలచారు కొందరు.

ఆగ్రహమొచ్చినా. ఆనందమొచ్చినా భక్తులు భక్తులే. వారిని సమదృష్టితో జూచుటయే ఉత్తమ పురుషుల లక్షణము. వారి పూజలను సంతోషంతో అందుకున్నారు నాయన.

— X —

# 23. మహా నిర్వాణము

శ్లో॥ యో౽న్తః సుఖో౽న్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవయః ।
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో౽ధిగచ్ఛతి ॥

[ఏ పురుషుడు సర్వాంతరాత్మయందే సుఖము కలిగిన వాడగునో, ఆత్మయందే రమించువాడగునో మరియు ఎవడు ఆత్మయందే జ్ఞానము కలవాడో. అట్టివాడు, (యోగి) బ్రహ్మానందమును పొందినట్లే.

– శ్రీమద్భగవద్గీత.



తనయునకు తనయుడు కలిగాడనే శుభవార్త వినగానే నాయన ఖర్గపురమునుండి బయలుదేరి కలువరాయి చేరుకున్నారు. మనుమడికి "పురందరుడు" అని నామకరణం చేసారు. ఖర్గపురములో ఆశ్రమ నిర్మాణమునకు స్థలం దొరికింది, ఖర్గపురవాసులు నాయనను రావలసినదిగా తొందరచేసారు, 21–9–35 నాడు మరల ఖర్గపురానికి బయలుదేరారు నాయన.

డిసెంబరు నెలలో శంకుస్థాపన జరిగినది. ఆ ఉత్సవానికి కలకత్తానుండి లక్ష్మీకాంతంతోబాటుపలువురువచ్చిరి."ఆశ్రమ నిర్మాణం కాగానే వస్తాను" అనిచెప్పి కాంతంతోబాటు కలకత్తా వెళ్ళిపోయారు నాయన. అచట పూర్వ కథను 30 ప్రకరణాల వరకు వ్రాసారు. "విశ్వమీమాంశ"కు తాత్పర్యం వ్రాసి ముగించారు. భారత చరిత్ర పరీక్ష కొంతవరకు సాగింది. ఈ లోపల ఆశ్రమ నిర్మాణం పూర్తి అయిందని నాయనను తోడ్కొని పోవుటకు ఖర్గపురవాసులు వచ్చారు.

25-4-1936 నాడు ఆ శ్రమ ప్రవేశం చేసారు నాయన. అతని పరిచర్యకై సింహాలు కలువరాయి నుండి వచ్చి చేరెను. సోమయాజుల సూర్యనారాయణగారి ఇల్లు సమీపములో ఉండుటచేత మధ్యాహ్న భోజనం వారి ఇంటినుండి వచ్చుచుండెను. ప్రతీ దినము ఇరువురికి భోజనము పంపుట సూర్యనారాయణకి కష్టమయ్యెను. ఫలితంగా సింహాలు ఊరియందు వార భోజనములు చేయుచుండెను. ప్రతి శనివారము ఆశ్రమములో శిష్యులు హోమము సల్పుచుండిరి. తరువాత నాయన ప్రవచనం క్లుప్తంగా ఉండేది.

శిష్యుల నివాసములు దూరంగా ఉండేవి. వారభోజనం చేసే సింహాలు భోజనానికని దూరంగా వెళ్ళివచ్చే సరికి సమయం చాలేదికాదు. ఫలితంగా నాయన ఒంటరి వారయ్యారు. ద్రవ పదార్థాలు అతనికి హితంగా ఉండేవి. అన్నం, కూర, పప్పు ఇత్యాదులు అతను తినలేకపోయేవారు. కానీ ఈ విషయం అతను ఎవరికీ చెప్పలేదు. ఎలాగోలాగ వచ్చిన ఆహారంతోనే సరిపెట్టుకొనేవారు. శరీరం వేడిచేసి చంకలో సెగగడ్డ లేచింది. నిజానికది "డైబటిస్ కర్ బంకిల్". మామూలు పుండని వైద్యం చేసారు. తగ్గినట్లు కనిపించింది గాని తగ్గలేదు. అతి మూత్రవ్యాధి కూడా కనిపించసాగింది.

"నేనిక్కడ మూడుమాసాలుంటాను" అన్నారొకనాడు సూర్యనారాయణతో. అతనికి అర్థంకాలేదు. "తరువాత ఎక్కడికి వెళతారు" అని అడిగాడు. "నాచే ప్రణీతమైన గ్రంథములను ముద్రించి ప్రకాశింప జేయుటకు వెళ్తాను" అన్నారు. ఆ మాటల్ని చమత్కారంగా భావించాడాశిష్యుడు.

"నాయనా ! మీ జాతక చక్రం కావాలి" అన్నాడు మాణిక్య మనే శిష్యుడు. "ఊ! ఊ! అందులో మారకదశ పట్టింది చూడు" అన్నారు నాయన. అతనికామాటలులోని వాస్తవం తెలియలేదు.

"నా దివ్య శరీరం సుఘటితమై, స్థూల సంబంధమును వీడి నాకు వశమై యున్నది సిద్ధ పురుష ప్రాప్తి కానున్నది" అన్నా రొకనాడు.

21-7-1936 నాడు నాయన చాల నీరసంగా కనిపించారు. భోజనం చేసి మంచముపై పరుండిన తరువాత లేవలేకపోయారు. వైద్యుడు నీరసమధికమైనదని చెప్పి గ్లూకోజ్ పట్టుమన్నాడు. కాని నాయన మంచినీరైన ముట్టలేదు. అది జూచి కలత చెందిన సూర్యనారాయణ మహాదేవునకు తంతి పంపించాడు. లక్ష్మీకాంత మునకు ఫోనులో విషయాన్ని తెలియజేసాడు.

ఇరవై రోజులనుండి నాయన జిహ్వ గరుకుతేరుటవల్ల అతను సరిగ్గా మాట్లాడలేకపోయేవారు. ఈ విషయంకూడ ఎవ్వరికీ తెలియ లేదు. మరియు పట్టించుకోలేదు. వైద్యుడు కూడా ఇది గమనించి నట్లు లేదు.

22-7-1936 సాయింత్రానికి మహాదేవుడు ఖర్గపురం చేరు కున్నాడు. కలకత్తానుండి కాంతముకూడా భార్యతో గూడి వచ్చి యుండెను. నాయనకు పండ్లరసము కలిపి త్రాగించిన త్రాగి వారలనుజూచి చిరునవ్వు నవ్వారు "ఎలా ఉన్నారు నాన్నగారూ!" అని కండ్లనీళ్ళు నిండఅడిగాడు తనయుడు. నాయన ప్రక్కనున్న కాగితము కలము తీసికొని "మీరు (దేవము, కాంతము) ఇప్పుడే వచ్చితిరి కనుక మీకీ దిన మాటవిడుపు" అని వ్రాసారు.

మర్నాడు మధ్యాహ్నము ఒంటిగంటయినది. పండ్ల రసమును ద్రావి నాయన కొంతబలం తెచ్చుకొని లేచారు. వరండాలోనికి వెళ్ళి యల్పాచమన క్రియ చేసికొని, బట్టలు మార్చుకున్నారు. మరి కొద్ది సేపటకి పెద్ద వర్షము కురిసినది. పెక్కు చోట్ల పాక కురిసెను. ఆశ్రమ మెక్కడ తుడిచినట్లు లేదు. అది జూచి కాంతము "యీ పాక మీకు యుక్తముగా లేదు. నీరసము తగ్గువఱకు పార్వతీశ మింటికి మారిన బాగుండు"ననెను. నాయన వెంటనే "రేపు శనివారము మధ్యాహ్నము రెండున్నర గంటల కిక్కడనుండి వెళ్ళుటకు బాగుండు"ననెను. అందలి భావమెవ్వరికినీ దెలియలేదు. తరువాత లక్ష్మీకాంతము కలకత్తా వెళ్ళిపోయెను.

25-7-1936 ఉదయం నాయన చాల ఉత్సాహంగా కనిపించారు. ఉదయాన్నే రెండు సుఖ విరోచనము లగుటచే శరీరము తేలికబడినది. కాని వెన్నెముక నుండి శక్తి ప్రవాహము శిరమున కధిరోహించుట ప్రారంభమైనది. మధ్యాహ్నము ఒంటిగంటకు శిష్యులు వచ్చిరి. రెండుం పావు వఱకు హోమము సల్పిరి. నాయనయు మంచము దిగి హోమ మంత్రముల చదువుచుండ ఆలకించారు.

సమయము రెండు గంటల ముప్పది నిముషములు. నాయన మంచముపై పరుండి కండ్లు మూసికొనిరి. తలపగులుదేరి శీర్ష కపాలములు విడుపడినవి. మహాదేవుడు దుఃఖము నాపుకోలేక "నాన్నగారు! నాకేమి చెప్పెదరు" అన్నాడు. పోవుచున్న ప్రాణము నొక్క క్షణము నిల్పి "జపధ్యానాధికం దైవతారాధనం మహామనీః (జపధ్యానాదులు, దేవతారాధనములు బహుదొడ్డవి నిత్యం చేయదగినవి") అన్నారు. సహస్రారమునుండి ప్రాణ తేజము అంబరమునకు ప్రయనించినది.

మహాకవి, మంత్రద్రష్ట, యోగసమ్రాట్, మహాఋషి, మహాతపస్వి అయిన వాసిష్ఠ గణపతిముని భౌతిక దేహమును వీడి పరమేశ్వర అంక పీఠమును చేరుకున్నవారై అనామయ పదము నొందారు.

అరుణాచలమునందు ఆ దినమంతయు మహర్షి గంభీరమైన మౌనముద్ర వహించారు. మర్నాడు తంతి రాగానే "నాయన పోయారా ? ఎవటికి పోయెదరు. ఇక్కడే ఉన్నారు" అని అంటూ అటుపైపు తిరిగి కండ్లు తుడుచుకున్నారు.

• • • •

## 24. అంజలి

శ్లో॥ శ్రీమత్ సర్వజ్ఞ కల్పః సకలగుణ నిధిః పూజనీయః
పరమాత్మా
సాక్షాత్ విద్యేశ వాచస్పతిరివ సకల శ్రౌత తత్వార్థ వేత్తా ।
అంతేవాసీ మహర్షేః రమణ భగవతో రాజయోగీ తపస్వీ ।
వాసిష్ఠః శ్రీ మునీంద్రః జయతి గణపతి కావ్యకంఠః
కవీంద్రః ॥

[సర్వజ్ఞ కల్పుడు, అన్ని గుణములకు నిధి, పూజనీయుడైన పరమాత్మ, సాక్షాత్తు వాచస్పతి, అన్ని శృతులు తత్వార్ధమును దెలిసినవాడు, భగవాన్ శ్రీ రమణ మహర్షి అంతేవాసి, రాజయోగి, తపస్వి, కవీంద్రులు అయిన కావ్యకంఠ గణపతి మునీంద్రులకు జయమగు గాక.]

—దైవరాత గజానన.

ధర్మసంస్థాపనకు, సంస్కృతీ పరిరక్షణకు ఋషి సూత్రధారి. ఆర్యులు అటువంటి ఋషికుల సంతతికి చెందినవారు. కళంకిత

మవుతున్న వేద సంస్కృతికి మరల ఉత్తేజం కల్గించాలని ఉద్య మించిన ఋషి పరంపరలో కడపటి వారు గణపతిముని. వారి జన్మ వెనుక దేవ రహస్యం దాగి ఉంది. శ్రీ రమణ-గణపతుల సమిష్టి జీవన రహస్యం "తపస్స"నే పదానికి నిర్వచనం. వారిది జన్మాం తర బాంధవ్యం. వేద సంస్కృతియందు చెప్పబడిన గురు-శిష్య పరంపరకి అద్దం పడుతుంది వారి జీవితం.

తపన ద్వారా ప్రారంభమయ్యే మానవ జీవితానికి 'తపస్సు' పరమావధి తన యందలి అంతర్గత శక్తిని జాగృతం చేసి, తన స్వరూప నిష్ఠయందు నిలబడిన వాడే నిజమైన మానవుడు. అతడే నిజమైన దేశభక్తుడు. తన్ను తాను తెలుసుకొన్ననాడే నిస్వార్థమైన దేశసేవ సాధ్యమవుతుంది. సాంఘిక అసమానతలను దూరంచేసి, స్త్రీ పురష సమానత్వంతోబాటు దేశం ఆర్థిక, సాంఘిక, ఆధ్యాత్మిక సీమలలో పురోభివృద్ధిగాంచి, నిత్య నూతన స్వాతం త్ర్యాన్ని సమాజం పొందాలంటే, ప్రతి ఒక్కరు తమవ్యక్తిత్వ ఔన్నిత్యానికి "తపస్స"నే సాధన ద్వారా కృషి చేయక తప్పదు. 'ఓం' అనే శబ్దం అనంతమైన శక్తులకు మూలం. స్పష్టమైన అవ గాహనతోనూ, అంతర్లీనమై ప్రకాశించే ఆత్మతేజంతోను పలికే ఏమాటకైనా ఫలించే శక్తి ఉంటుంది. నేడు కనిపించే బాహ్య విజ్ఞాన మంతా అనేకమంది మహనీయుల అంతర్ విద్యాలయం నుండి వెలువడినదే. ఈ సత్యానికి దర్పణం పడుతుంది నాయన చరిత్ర.

ఆది శంకరులవారి బోధ కళా చాతుర్యాన్ని నాయనలోను, మౌన తత్వాన్ని మహర్షిలోను మనం గమనించవచ్చు. తాను దేవ దూతనని చాటి చెప్పారు నాయన. "అతను నడుస్తూ ఉంటే దేవతలు

పాడులు తీరి వారి కవిత్వగానం విని ఆనందిస్తూ ఉంటారు. అని అనేవారు భగవాన్. వాచస్పతి నాయన. మౌని శ్రీ భగవాన్. కాని "ముని"గా నాయన 'మహర్షిగా'గా శ్రీ రమణులు చలామణీ అగుట విశేషం.

దేశక్షేమానికి నాయన తపస్సు చేసారన్న సత్యం వారి సాహిత్యంలో మనకి కానవస్తుంది. సాంఘిక. రాజకీయ వ్యవస్థలలో అలనాటి మహిళల పాత్రను తెలియజేసే చక్కని తెలుగు నవల "పూర్ణ". అయితే నాయన ఈనవలను సంపూర్ణంచేయలేకపోయారు. కాని అతని కుమారులు వాసిష్ఠ మహాదేవ శాస్త్రిగారు ఈ నవలలోని పాత్రలను కొన్నింటిని తగ్గించి, "సత్యప్రభ" పేరుతో ఈ నవలను పూర్తిచేసారు. అలనాటి ఆంధ్రమహావిష్ణువు కాలంలోని సంస్కృతికి దర్పణమిది.

అరుదైన 'కపాలభేద' సిద్ధిని పొంది 13 సం॥లు జీవించి అపురూప వ్యక్తిత్వాన్ని ప్రకటించిన ఈ మహాఋషి జీవితం ఆధ్యాత్మిక సాధకులకు ఆదర్శప్రాయం అని చెప్పక తప్పదు.

అతను వ్రాసిన వేదాంత గ్రంథాలు నిత్య నూతన జ్ఞాన దీపికలు. మంత్రగ్రంథాలు ఉపాసనా సంహితలు. పరమేశ్వరుడైన ఈ మహనీయుని నిత్య స్మరణం చేస్తూ, వారి గ్రంథాలను పఠించి మదించి మనయొక్క జీవన విలువలను పెంపొందింప జేసికొనుట మన కర్తవ్యం. అదే వారికి మనం అర్పించే శ్రద్ధాంజలి.

శ్లో॥ జయతు భరతక్షోణీ ఖణ్డం విషాద వివర్జితమ్
జయతు గణపస్తస్య క్షేమం విధాతు వ నాముని: ।
జయతు రమణస్తస్యాచార్యో మహర్షి కులాచలో
జయతు చ తయోర్మాతా పూతా మహేశ విలాసినీ ॥

[భారత ఖండము దుఃఖశూన్యమై వెలయుగాత ! ఆభారత ఖండమునకు క్షేమము నొనర్పగోరిన మునియగు గణపతి వెలయుగాత (జయించుగాక) ఆగణపతిమునికి ఆచార్యుడును, మహర్షి కులశ్రేష్ఠుడును, అగు రమణుడు వెలయుగాత ! ఆ గణపతి-రమణులకు మాతయు, పూతయు, అగు మహేశ్వర కుటుంబిని వెలయుగాత !



ఇతి శ్రీ గురుచరణార్పణం.

శ్రీ శారదా పవర్ ప్రింటింగ్ వర్కు్స్, భట్నవిల్లి, చిన్న వీధి,
అమలాపురం మండలం, తూర్పుగోదావరి జిల్లా.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 24 | Chnscious | Conscious |
| 4 | 12 | ప్రశ | ప్రశ్న |
| 10 | 1 | కాదల్చి | కదల్చి |
| 11 | 17 | నేర్సరుచుకొని | నేర్పరుచుకొని |
| 16 | 10 | నంస్కారి | సంస్కారి |
| 18 | 15 | మనస్పు | మనస్సు |
| 24 | 20 | మలిమ్లుచై । | మలిమ్లుచైః |
| 24 | 21 | నృప | నృపః |
| 35 | 7 | బాలకుడై | బాలకుడైన |
| 37 | 3 | తపస్చు | తపస్సు |
| 38 | 17 | విశాలాకి | విశాలాక్షి |
| 46 | 24 | చెప్సెను | చెప్పెను |
| 68 | 7 | దయాపతి | దయావతి |
| 68 | 22 | ఏకాదళానాం | ఏకాదశానాం |
| 88 | 20 | పరిమహంస | పరమహంస |
| 89 | 15 | వాడు | వారు |
| 97 | 4 | కింత్య | కింత్వ |
| 97 | 7 | వత్సరస్యైకదా గౌరీ | గౌరీ |
| 97 | 18 | హిడంబ | హిడింబ |
| 99 | 3 | దిగును | దిగువ |
| 99 | 4 | విశేషములవ | విశేషములను |
| 99 | 18 | ధ్యాయషి | ధ్యాయసి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 101 | 11 | పరాభవ | పరాభవ |
| 103 | 14 | జేసికొన | జేసికొని |
| 106 | 11 | పశ్యన్తి | పశ్యన్తీ |
| 130 | 5 | శోణగిరే | శోణగిరౌ |
| 143 | 4 | ఋక్కులను | ఋక్కులను |
| 146 | 9 | వసీష్టుని | వసిష్టుని |
| 146 | 14 | కూచా | కూడా |
| 153 | 7 | శిష్య | శిష్య |
| ,, | 13 | పాఠశాల | పాఠశాల |
| ,, | 22 | వివరిచారు | వివరించారు |
| 154 | 8 | శ్రీనివాశాస్త్రి | శ్రీనివాసశాస్త్రి |
| 161 | 5 | నిస్వారత | నిస్వార్ధత |
| 169 | 16 | నీపు | నీవు |
| 172 | 1 | దరీయసీ | గరీయసీ |
| 177 | 19 | ఆయాతి | ఆయాతీతి |
| 180 | 16 | అటుపంటి | అటువంటి |
| 182 | 1 | పాట | పాటు |
| 183 | 23 | రూవగతా | రూపగతా |
| 194 | 10 | కుమారుడ | కుమారుడు |
| 197 | 12, 13 | యనుగ్రగహింతో | యనుగ్రహంతో |
| 200 | 15 | నాయనసు | నాయనను |
| 210 | 1 | జపి | జంపి |
| 226 | 14 | సుప్రుత్రేణ | సుపుత్రేణ |
| 231 | 26 | యుటోక్కర్ | యుటోక్కళ్ |
| 232 | 15 | నాటి | నుండి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 344 | 9 | మెండిన | మొండిన |
| 349 | 14 | వర్షపాతవు | వర్షపా[illegible] |
| 350 | 6 | బ్రిహ్మ[illegible]ంద్ర | బ్రి[illegible]ంద్ర |
| 350 | 19 | తద్భావోద్రేక | తద్భా[illegible] |
| 351 | 14 | ఫడతేదు | పడతే[illegible] |
| 356 | 24 | ఇంటో | ఇంట్లో |
| 362 | 11 | ప్రరం[illegible]ము | ప్రరం[illegible] |
| 367 | 8 | పరమా[illegible] | పర[illegible] |
| 367 | 17 | ప్రికాశించే | ప్రికా[illegible] |

———